నెల్లూరి రాఘవకృతి

# యాదవ రాఘవ పాండవీయము

౧, ౨, ౩, ౪ ఆశ్వాసములు

ఆనందజ్యోత్స్నా టీకావిలసితము



టీకా కర్త, ప్రకాశకులు :

విద్వాన్ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి. ఎం.ఎ.పి.ఓ.ఎల్.

హైదరాబాదు.



శ్రీ రాజరాజేశ్వరస్వామి వేములవాడ.

# శ్రీ రాజరాజేశ్వరి రాజేశ్వరులకు విద్వత్కవిరాజు జోహార్లు

శా॥ ఎందేని న్నిను హృద్గుహాంతరమున । స్నెవ్వేళధ్యానించి క
న్వింపౌసార్ధ విశుద్ధదేహమున సా । ధ్విన్ శ్యామరాజేశ్వరిన్
బిందుర్ధమ్మున రక్తశుక్లతను ప । ర్వేందు ప్రభాచిత్కళల్
చిందన్ గాంచుత మాదుహృత్కమలముల్ । శ్రీరాజరాజేశ్వరా॥

శా॥ లేంబుల్వాడన సుప్రసిద్ధమయి శ్రీ । ల్మీరన్ కలల్నిండ హే
రంబాద్యన్యులు క్షేత్రపాలురకు మేల్ । రంగంబు కైలాస సా
మ్యంబై విద్యల పెన్నిధానమయి యా । మ్నాయార్థముల్బానువా
సింభాస్వద్భువదీయ దివ్యతలముల్ । శ్రీరాజరాజేశ్వరా॥

శా॥ అందాలై కనువిందులై రుచులమే । లందాల కాలంబమై
విందుల్సంధ్యల శేషనాగఫణము । ల్వీప్పారత్రైలోక్యచిం
తాదుస్సహ్యము మానసాశ్రమము నమం । దానందసంవేద్యమై
చిందుల్ ద్రొక్కుచు నిల్వుమోయినటరాట్ । శ్రీరాజరాజేశ్వరా॥

శా॥ జోహార్లన్గొనుమోయిదేవనినుమె । చ్చుల్మీరఁ గీర్తించియే
కల్హారమ్ములు యిచ్చితినొనిఁ । గాంక్షించి ప్రోద్యత్కృపా
సౌహార్దమ్ములు నాకుఁ గూర్చి కృతిక । చ్చమ్మాకృతిన్దీర్చితౌ
చిహ్నంబియ్యది యంజలింతుఁగొనుమో । శ్రీరాజరాజేశ్వరా॥

# ఉపోద్ఘాతము

పూర్వ రచయితలు

శ్లేషకు భారవి కిరాతార్జునీయము 15 వ సర్గమాఘుని శిశుపాలవధ. హర్షవర్ధనుని నైషధీయ చరితమున పంచనళీయ సందర్భము. క్రీ. శ. 8 వ శతాబ్ది కవిరాజు రాఘవ పాండవీయము — సంస్కృతము. క్రీ. శ. 11 వ శతాబ్ది వేములవాడ భీమకవి రాఘవ పాండవీయము-తెనుగు (ఇపుడు కానరాదు) క్రీ. శ. 16 వ శతాబ్ది పింగళి సూరనార్యుని రాఘవ పాండవీయము. (ఉపలభ్యము)

ఇవియే లభ్యమగు తొలి ద్వ్యర్థికావ్యములు. ఇవి క్రమముగా మూడు, నాలుగు, అర్థముల కావ్యములకు దారితీసినవి. నాడు వినువారి కలిమి,వినోదార్థము బయల్వెడలినవి.

అట్టి అనేకార్థ గ్రంథములలో ప్రస్తుత యాదవ రాఘవ పాండవీయమును రచించిన నెల్లూరి వీరరాఘవ కవి యొకడు 1717 ప్రాంతమువాడు. తొలిసారిగా ఈ కృతి అముద్రిత గ్రంథ చింతామణి సంపాదకులచే 1886 లో ముద్రితము. పునర్ముద్రితము కాలేదు.

వీరరాఘవ కవి చేతిలో నెంత లెంతలు సంస్కృత పదములును వెన్న ముద్దల వలెఁగరగి సమాసములు జతుకాష్ఠములవలె నిచ్చవచ్చిన తీరున వంగియు విఱిగియు చెప్పినట్లు నడచినవా యనిపించును.

ఇట్టి రచనమును "ఆనంద జ్యోత్స్నసహిత మొనర్చి వెలువరించిన విద్వత్కవిరాజ, కవి కులశేఖర, ఆచార్య సరిపెల్ల విశ్వనాథశాస్త్రి, ఎం. ఏ. గారి యుద్యమము మనసార శ్లాఘింపఁ దగినది.

నానార్థ కావ్యములకు వ్యాఖ్యానము రచించుట సాధారణ కార్యము కాదు. వ్యాఖ్యాతకు కృతికర్త కున్నంతటి భాషాస్వతంత్రతయు, శాస్త్ర సంప్రదాయాభిజ్ఞతయు, పురాణ కథా విజ్ఞాన కుశలతయు, సుసూక్ష్మ సమన్వయ దీక్షతయుం గలిగి అసాధారణ మగు వ్యుత్పత్తి చేకుఱినంగాని యీ వ్యాఖ్యావిరచనము నెఱవేఱునది కాదు.

శ్రీ శాస్త్రిగారు పరిపూర్ణ పరికరాను బంధముతో పరమోత్సాహముతో ఈ టీకా రచనమునకుఁబూనుకొని నిర్వహించుట ఆంధ్రప్రబంధ పాఠకులకుఁ బరమోపకారకము.

నందినీ మందిరము
రామనగర్
వాల్తేరు
15-8-59.

ఇట్లు
శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారు
ఆంధ్ర విశ్వకళాపరిషత్ పండితులు.

# ఇతర పండితుల అభిప్రాయములు

శ్రీయుతులు శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు.

"పూజ్యమిత్రులు శ్రీసరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారు స్వీయ వ్యాఖ్యానముతోఁ బ్రకటించిన యాదవ రాఘవ పాండవీయమును స్థాలీపులాక న్యాయముగాఁ బరిశీలించితిని. శాస్త్రిగారు వ్యాఖ్యామృతముచే గ్రంథమును సుజీవింపఁజేసిరి. ప్రాచీన విద్యావైభవము సన్నగిల్లిన యీ కాలమున నిట్టి త్ర్యర్థికావ్యమునకు వ్యాఖ్య వ్రాయుటకుఁ గంకణము గట్టుకొని సమర్థతతో నిర్వహించిన శాస్త్రిగారిని లోకమభినందింపక తప్పదు.

డాక్టరు బి. రామరాజుగారు

గురు పాదులు నన్నభిప్రాయడుగుట కేవలము శిష్యవాత్సల్యముచేత నేనిందుకు సాహసించుట వారిపైగల భక్తిచేత, అరువది నాల్గు (నేడు అరువది తొమ్మిది) వత్సరములు పైబడినను కలము దింపని ధీరులు, సుప్రసిద్ధ పండితులు వారి ప్రతిభా పాండిత్య వ్యుత్పత్తుల కియ్యది తార్కాణము. ఈ కార్యమునకై ఆంధ్ర దేశము వారి కెంతయు ఋణపడి యున్నది.

**Dr. C. Ramalinga Reddy. Vice-Chancellor Andhra University. Dear Mr. Visvanathasastry.**

Your annotated edition of "Yadava Raghava Pandaviay-am" with commentary is an excellent production, in fact indispensable both to the scholar and the general reader. Yadava Raghava Pandaviya is unique in Telugu Literature and not at all easy to construe. I hope you will be able to complete the work and earn the gratitude of Telugu world.

Yours sincerely
Sd/C. R. REDDY.

**Prof. M. Venkatarangayya. Dear Mr. Sastry.**

I heartily congratulate you in bringing out a scholarly edition of Yadava Raghava Pandaviya with a learned commentary on it. You have done a real service to students of Telugu Literature.

**Late Pandit Malladi Suryanarayana Sastri Garu.**

Your Kamavilasa ranks as an original creation. Your Lalitha Sataka is a relegious book to a critical eye, a type to be immitated by poets to give shape to their thoughts. It is replete with the central thought of the Sakta Philosophy, a poem to be read with care as a text book. Your Saura Purana, the Triple Kavya with commentary and the Madras University Readership lectures when printed, will be master pieces in Telugu literature.

శుభమస్తు, అవిఘ్నమస్తు.

అగ్రబిందు పరికల్పితాననాం అన్యబిందు రచిత స్తనద్వయీాం
నాదబిందు రశనా గుణాస్పదాం నౌమి తే పరశివాం పరాం కలాం.

# గురుయశశ్చంద్రిక

## త్ర యీ

శా. శ్రీ విద్యా పర భోగ భాగ్యములు నిస్సీమ ప్రసారంబుగా
నే విన్యాస వచః పరంపరలలో నిచ్చా విలాసంబులై
భావించన్ రుచి మీర సత్ఫలము సంపాదించఁగానౌనా యా
శ్రీ విఖ్యాత కృపా కటాక్షములు మా చిన్మూర్తులన్ బ్రోచుతన్. 1

ఉ. ఏలిన నీ విలాసములు నించు కలార్ద్రి మయూఖ మాల మే
లేలిన నీ కటాక్షములు హ్రీంమతి చారుతరమ్ము ధ్యానమం
దేలిన మూర్తి రంజిత మహిన్ రుచిరార్ధము శాంకరమ్ము మ
మ్మేలుత శాంత ముజ్జ్వల మహీనము శబ్ద విరామ సుస్థితిన్. 2

ఉ. శ్రీ కలనా విధాన విభుసీమల సాత్త్విక మంత్ర తంత్ర వి
ద్యా కమనీయ కల్పము లహార్య పథమ్మున నిల్పఁజాలు సు
శ్లోకము నక్షత్రా హారము శుద్ధ పదమ్మగు విద్యగూర్చి రా
యా కుల పూర్ణ విత్తముల కంజలి గూర్చెద భక్తి యుక్తులన్. 3

## ఆ ము ఖ ము

### కు ళ క ము

చ. నలువది వత్సరమ్ములయె నాటికిఁ నేటికి నాటుకొన్న మేల్
తలఁపు మహోజ్జ్వలార్థ మది ధారణ సన్మతి నిల్చియుండె నా
వలచిన జ్యోత్స్నికున్ రుచిరభావము నూల్కొన నుత్సహించి నా
యలఘు మహాత్మునిన్ గృతికి హారి మనోహరుఁ జేసి మించుచున్. 4

గీ. విజయనగరమ్ము విద్యలో విరిసె యశము
అం దదికె నరవింద మరందమద్ది

భాగ్యనగరాన పరిణతి ప్రాభవమ్మొ
నిత్తు రంగయామాత్యున కెత్తుకట్టి. 5

## సంగ్రహ కవివంశము

గీ. కలరు దొరలన్న విఖ్యాతిఁ గాంచినారు
వారు సరిపెల్లవారు నవ్వారి వాస
మాపకీరుసాహెబుపేట యగును గ్రామ
మది విశాఖమండలములో నలరియుండు. 6

*పంచపాది :*
గీ. విజయనగరసంస్థానమ్మొ వితరణమున
విద్యలకుపెద్ద గజపతుల్ వీరు క్షత్రి
యులును ఆనందగజపతి యురుమనము ని
రతము నన్నదాత యల నారాయణుండు
నిలచె 'నిరతాన్నదాత' నా వలపులొలయ. 7

గీ. అన్నదానమున కలరి యాగజపతి
యిచ్చె గ్రామమ్మొ "దొర" బిరు దిచ్చె తోన
నేటికిని వారు 'దొరలె' యం దేటిదరిని
పంటభూములు బంగారుపంట పండు
నాదుముత్తాత నారాయణాఖ్యుఁ డగును. 8

క. ఆనారాయణు తనయుల
లో నారయ నగ్రజుండు లోకజ్ఞుండున్
మానోన్నతుడును వేంకట
చైనాఖ్యుఁ డలరు కుమార సమచరితుండై. 9

గీ. వేంకటచయను సుతులు కన్వెందువారు
సుతచతుష్టయమున నగ్రజుననుజుండు
నాదుతండ్రి దత్తాత్రేయ నామధారి
యగును నన్వర్థమయ్యాది తగినచరిత. 10

గీ. త్యాగియు తపస్వి యప్పన్న వ్యావహార
నామమున గురుదీక్ష•సన్న్యాసి సమత

నియమమున సదాశుచియును నిగ్రహమున
హరియును సదోపవాసియై వరలు ఘనుడు. 11

గీ. ఆతపస్వి సంతానము నన్నపూర్ణ
గర్భసంభూతి తొలి జాతకలితుఁ డేను
సుతులలో సోదరుం డొండు జూడ గలఁడు
తనయపంచక మలరు సంతానవతులు. 12

గీ. ఏను విశ్వనాథుడను విజ్ఞానధనుఁడ
జాయ వేంకటలక్ష్మి నా చాయతోడు
వెలయు నభిమానమున భద్ర తలఁపులోన
తనయ, సుతుఁడు దత్తాత్రేయుఁ డనయ మిర్వు
రాదరమ్మున చనవు పరాప్రసక్తి. 13

గీ. నలువురు సుతలతో భద్ర నమ్మియుండ
ధవుని సూర్యనారాయణుఁ దవిలియుండ
చెలఁగి కృష్ణసుభద్రలు చేరియుండ
నిట్లు మేనయల్లుం డ్రిర్వు రెంతొ సక్తి
ననుసరించంగ మేముంటి మనుపమాప్తి. 14

గీ. అనుజుఁడై సత్యనారాయణాఖ్యుఁ డలరి
సతియు సంతానముం దాను సర్వసమత
కలన నాచూడ్కి పాలనఁ గాంచియుండె
లక్ష్మణుం డన్నయాజ్ఞ మెలంగినట్లు. 15

గీ. జాయ కలిమిలేముల నాదు చాయ యగుచు
నండ యిచ్చిన నెవ్వారి నాదరించి
యెందు నౌగాదు నాక నాయందు భక్తి
నల్ప; కామేశ్వరియగు ననల్పరక్తి
ధర్మదీక్షాపరత్వంబుఁ దాల్చికతన
నుంటి మంటిని కృతకృత్య మున్నతంబు
కలదు లేదన కిచ్చు నా వలఁపుగాంచి
కామితార్థంబు కనుసన్న కాంతయామె
భాగ్యవంతుఁడ దాన భవమ్ము పండె. 16

# కావ్యసంతానము

సీసమాలిక :

ఏదేవి కృపఁగాంచి యే కావ్యకుసుమాల
నాదేవి నర్చించి తాసుమాల
మాలికారూప నామము లిందుఁ బొందింతు
భావినిర్ణయము సంభావ్య మద్ది
తొలుదొల్త రచియించె లలితాఖ్యశతకమ్ము
కామవిలాసమ్ము శ్యామకరుణ
వయసునల్వదినాఁడు పల్కించె పరదేవి
భావనానల్ప ధారావహమ్ము
శతమున నర్ధమ్ము సాగిపోయిననాడు
పంచపంచాశత వర్షకలన
మొదటియాశ్వాసమ్ము సదయత నొదవించె
త్ర్యర్థికావ్యముటీక ఆంధ్రజ్యోత్స్న౨
యంతంత శ్రీదేవి యందించె నాంధ్రాను
వాద భాగవతమ్ము వచనసరణి
కల్పనాత్మకమైన కావ్యచిన్మూర్తులు
ఖండిక లాంధ్రాంగ్ల కావ్యమాలి
కలు పెక్కు వెలయించె కలపరావాక్కల్మి
పంచకన్యా నాకవనము లనుచు
నర్థార్థినై నీదు నాజ్ఞానుసరణాన
త్ర్యర్థి పూరించ నాధర్మమయ్యె
దాని నీ కారుణ్యధారాప్తి సౌభాగ్య
సుశ్రీల తులతూగు సుకృతి కిత్తు
వేంకటరంగయ వేంకమాంబాంచిత
విమల విన్యాస నిర్వేలరతికి

గీ. నంబ దయమీఱ నందుకొ మ్మాదరమున
భక్తిభావంబు నీపదపద్మమంద
నీదు భక్తు లీదంపతుల్ నాదుగురులు
మొనసి సద్గురుపంక్తికై మోడ్పు గొనుఁడు.

## కృతిపతి వంశావతరణము

చ. కలఁడు గదా విరించి కలకాలము లోకములన్ సృజింపఁగాఁ
బలువురు మానసోద్భవులు భవ్యులు గౌతముఁ డందు దిట్ట యా
కలిమిని గౌతమాన్వయ మఖండము వర్ధిలె లోకమందు నం
దలఘులు పావనుల్ విభు లహర్పతి తేజులు పుట్టిరెందఱో. 18

ఉ. నెల్లూరి మండలమ్మున నట నీటగు 'మామిడిపూడి' పండితుల్
తల్లజు లాత్మవేదమున తద్‌జ్ఞులు యజ్వలునౌట వారికిన్
జెల్లుతమంచు నిచ్చెను విజేత సదాశివరాయ లట్టి మే
లెల్లల వంశమందు జనియించెను మత్కృతి భర్త పెంపునన్. 19

గీ. సూత్రమగును నాపస్తంబమా త్రయిని య
జుస్సగును గౌతముఁ డగును జుమ్ము గోత్ర
వర్ధనుఁడు 'పుమారు' ద్రవిడ వంశ మలరు
గ్రామ నామమ్మె యింటిపేర్గాగ వెలసె. 20

గీ. ఎందు మామిడి పూడివా రిందుసములు
కీర్తి చంద్రికల్ దిశలెల్ల మూర్తిగనుట
గలశవారాశి గోత్రంబు వెలయుపొంకె
జన్మగాంచిన వారెల్ల చంద్రులగుట. 21

గీ. రామకృష్ణమాచార్యు లే రసికు తాత
సమ్మత మ్మాది పరమ వైష్ణవమతమ్ము
వేదములతోడ వ్యవహారవిదులు వార
లిహపరమ్ము లక్షీద్వంద్వ మెనసె ఖ్యాతి. 22

గీ. ఆ పితామహి సావిత్రి అమలచరిత,
రామకృష్ణుని సావిత్రి వామ గాంచె
తనయు నొక్కని ; బుధుడు సద్ధర్మవిదుఁడు
వేంకటేశ్వరాచార్యులు వేద మరసె. 23

గీ, మధ్యవర్తిగా వ్యవహార మత్సరమ్ము
మాన్చు తగవరి దక్షుఁడు క్షమకు నుదధి

రాణ సత్పురాణపరత రమ్యరసన
ఆ రమణి ధీరు నర్ధాంగి నరసమాంబ. 24

గీ. వీరి కుదయించె జ్యేష్ఠుఁడు విజయశీలి
బుధుఁడు వేంకటరంగయ పుణ్యరాశి
అనుజుఁ డగు రామకృష్ణయ్య న్యాయవాది
వీరి కనుజ సావిత్రి సావిత్రి నిజము. 25

## బాల్యయౌవనముల విద్యావిలాసము

ఉ. కొండొక కాలమేఁగఁగను కూర్చిన మామిడిపూడి వీడి వే
రొండొక గ్రామమా 'పురిణి' నొప్పె నివాసము బాల్యమందె త
న్మండలమాయె నెల్లూరియ మచ్చిక నక్షర మభ్యసించు స
న్మండన మేడులై దగును నాఁటికి నవ్విధి విద్యకా కృతుల్. 26

చ. ఉపనయనమ్ముఁ జేసిరి గురూక్తిగ నేడవయేట నెన్మిదా
నుపనయ గర్భవత్సరము నొక్కట నంతకు వత్సరద్వయం
బుపచితమాయె సంస్కృతము నూర్జిత వేదము సంప్రదాయ గు
ప్తపదము సంవిదార్యపద భక్తిపరత్వము చిత్త మత్తగన్. 27

గీ. నవనవోన్మేషమతి గాంచి యవల నాంగ్ల
విద్యకు మదరాసు తరలి సద్యశమ్ము
క్రమముఁ దప్పక యుత్తమాక్రాంతపదము
నిల్పుకోఁగల్గె రంగయ నిశ్చలముగ. 28

గీ. పచ్చయప్పకళాశాల నచ్చపుటస
మార్జనము నేసి, మెట్రికు, యఫ్. యె. యు బి. యె.
యం. యె. యిరువదేండ్లేగకే నన్ని టబ్బె
మొదటితరగతి ప్రఖ్యాతపదము ముదము. 29

గీ. అందు చారిత్రభాగాన నబ్బురముగ
విశ్వవిద్యాలయోన్నత శశ్వ దమల
పద్మము గాంచెను బుధులు శబాసనంగ
కూర్మి కల్యాణకృద్వీరగురుగుణమ్ము. 30

చ. బహుమతులందె పెక్కులు విభావనసేయఁగ మెచ్చువచ్చు నా
యహమిక కెత్తుపెట్టఁగ రనర్ఘము కేవల మెన్న సాటిలే
దహరహ ముత్సవమ్మగు నహార్య మనల్పము హాసభావముల్
విహరణ మాశలందినవి వేంకటరంగయ కీర్తిచంద్రికల్. 31

## వివాహము

గీ. అరయ పండితవంశ మల్లాడివారు
వారి వీనులవిందుగాఁ జేరవచ్చె
విబుధ వేంకటరంగయ విమలయశము
నలరి యిడె వెంకమాంబ నర్ధాంగిగాగ. 32

గీ. వేంకమాంబిక కరము నిరంకుశముగ
రంగయామాత్య గుణ గజో త్తుంగచరిత
నడుప మంచి జంటను గూర్చె నలువ నేటి
కనెడు కీర్తి గడించె లోకమున నజుఁడు. 33

సీ. సావిత్రి వేదమ్ము సంస్కృతి యాచార
సమ్మతు లేయార్యు సరసగతులు
కుల గౌరవమ్ములు గోత్ర మౌజ్జ్వల్య మ
కుంఠిత మేసూరి గుణగణమ్ము
లెదిరి యోర్వని ధార మది గరంచెడి స్వాదు
వాగ్ధాటి యేబుధు వలపుకృతులు
నిత్య సత్యవ్రత నియమ లక్ష్యార్థమ్ము
సార్ధక్య మేమంత్రి సన్మతమ్ము
గీ. లనఁగ మామిడిపూడి వంశాబ్ధి చంద్రుఁ
డలరు వేంకటరంగయ యర్థిజనుల
కల్పకము వేంకమాంబిక కామితార్థ
మరసి కూర్పఁగ నిచ్చు లనన్యమతిని. 34

ఉ. వేంకటరంగయార్యుఁ డిలఁ బెక్కిటఁ బెన్నిధి యేఁబదేండ్లుగాఁ
బొంకము మీరి యున్నతులఁ బొంగెడి స్థానము లాక్రమించి ని

శ్శంకత పాత్రధారణము శాంతము సాగగ ముఖ్యపాత్రకే
యంకితమాయె నర్హత యనర్ఘ పదమ్ముల కాలవాలమై. 35

ఉ. ఆయతి వేంకమాంబిక పరాంబిక శుద్ధి శుభవ్రతమ్ములే
ఈయమ యంజలించు వనితాయత యుద్యమ రంగవల్లికన్
ధ్యేయము లాకె యత్నములు హేలఁగ గాన మనంగ రుచ్య మా
ప్యాయము సభ్యతాధ్వర మపారము చక్క నుపన్యసించెడిన్. 36

గీ. భాషణము లెన్ననగు బుధతోషణములు
సూక్తి వైచిత్రి దివ్య విస్ఫూర్తిఁ గాంచు
వినుత గుణసాంద్ర విమల శ్రీ వెంకమాంబ
కార్య దీక్షాధ్వరమ్మున కంజజాత. 37

సీసము-అష్టాపదము :

ఆచార్యవర్యుఁడై అర్థశాస్త్రము సార
మాంధ్రుల కందించె నతులఫణితి
పలుకళాశాలల వశ్యవాగర్థముల్
బహుముఖస్తుత్యమ్ము మహము పంచె
ప్రాధాన్యపదమున బహుకళాశాలల
భాగ్యరేఖలు దిద్దె భవ్యగతుల
విజయనగర భాగ్య విస్తారసీమల
మంత్రియై ప్రఖ్యాతిమై నెసంగె
మద్రాసు ఆంధ్ర బొంబయి విశ్వవిద్యాల
యోత్తమోత్తమపద మత్తఁజాలె
సభల సంస్థల నిల్పి సర్వతోముఖకార్య
నిర్వహణమ్మున నిండు చూపె
పుత్ర సప్తకముతో పుత్రికా త్రితయమ్ము
యం. యేలు నుద్యోగ మందఁ గనిరి
మనుమలతోడ సన్మతులతో తులతూగఁ
తూగెడు గురుగేస్తు తులయెవండు

గీ. వీరు పలు శిష్యులను గన్నవార లెందు
కృతులు రచియించి కృతులంది కీర్తిగనిరి

దీర్ఘ మాయువు సంపదల్ తిరములగుత
నిండుగ పరదేవి కరుణ మెండుకొనుత. 38

ఉ. దృష్టఫలోదయప్రభలఁ దేల్చు గురూక్తుల నేలుకొన్న వి
స్పష్టము శ్రీకరాన్వితము సమ్మద మోద విశాల తుందిల
మ్మష్ట సుధార్ద్రమూర్తముల హార్యము లుజ్జ్వల ధీపదమ్ము ల
న్విష్టము మీదు సచ్చరిత వేంకటరంగయ మంత్రిసత్తమా! 39

ఉ. హేల త్రయీపరమ్మగు మహీయస నిస్తుల ధీవిశాలతల్
జాలెడు లౌకికార్ణవము జ్ఞానము నేకత నేకరించి మే
లేలు పదమ్ములం గనిన యిద్ధచరిత్రము విశ్వవిద్వ దు
ద్వేల సభా ప్రణాళికల వెల్గులు దిద్దిన కీర్తి నెంచెదన్. 40

శా. శ్రీ కామేశు పరాకలాద్యుతులు నిస్సీమోజ్జ్వ లామోద రే
ఖాకారమ్ముల మూర్తిమంతమగు సాక్షాత్తత్వ సౌభాగ్యముల్
ప్రాకార ప్రతిగుప్తరక్షయయి దీర్ఘాయుష్య మారోగ్యముల్
చేకూర్చున్ కృతి పంచధా కృతులకున్ లీలాక్షి మాలా ప్లుతిన్. 41

ఉ. శక్తివిలాసచిహ్నముల సాయముఁగాంచిన మూర్తిసత్వముల్
శక్తులు స్వీయకార్యము లసాధ్యము సాధ్యముగాగఁ దీర్చఁగన్
వ్యక్తమహాబలాకృతులు వల్లభు లెందును తద్రసద్యుతుల్
భక్తుల వేంకమాంబికను వేంకటరంగయ నోముగావుతన్. 42

ఉ. వారలసంతతిన్ సురవిభాన్విత మానస సాంద్రసంతతిన్
శారదచంద్రచంద్రికల సౌరభ మాగిన శుభ్రసంతతిన్
భారతభావ సువ్రతుల భారవహార్ణవమంథరమ్ములన్
స్వైరవిహారధీరులను శాంభవి ప్రోచుత కామధేనువై. 43

ఉ. మాత తనుద్యుతుల్ సుతుల మాతులనాకృతి సొంపునింపుతన్
మాతకటాక్షమాలికలు మత్కృతిభర్త గృహమ్ము లక్ష్మియై
వీతపరాగవల్లరిగ వేల్లితమై రుచిరార్థజాతమై
నేతగ ఖ్యాతపద్మమున నిచ్చలు నేగగ వెంటనంటుతన్. 44

ఓం తత్సత్

★



త్ర్యర్థికిఁ టీక వ్రాయంగ ధైర్యమున్నె ?
తలఁకు తలఁపున నిల్చిన లలితపదము
హాసరుచు లలముకొనఁగ నడుగువైతు
వినయవినమిత మస్తకమునకు నంజ
లించి, కృతిపతికి శుభము లెంచి మించి.



శ్రీ

మదన

గోపాలవరప్రసాద

లబ్ధ సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య

సర్వంకష చతుర్విధ కవితాబంధుర రచనా

ధురంధర సరసశబ్ద నాటకాలంకార సర్వస్వ

విజ్ఞానధౌరేయ సుజన విధేయ

బుధజనస్తోత్రపాత్ర, కాశ్యప

గోత్ర పవిత్రాపస్తంబసూత్ర,

నెల్లూరి రంగయామాత్య పౌత్ర,

వీణావేంకటపతిపుత్ర

వినయగుణభాస్వర

రాఘవ

ప్రణీతంబయిన యాదవ

రాఘవ పాండవీయమను నీ

ప్రబంధరాజ శిరోరత్నము ఒడయరు

వీరనాగయ్య, పూండ్లరామకృష్ణయ్య

వీరలచే లేఖక ప్రమాదజనిత దోషంబులు

లేకుండం బరిష్కరింపంబడి, నెల్లూరియం

దేర్పడియుండు సరస్వతీ తిరువేంక

టాచార్యులవారి శ్రీమత్సరస్వతీ

నిలయ ముద్రాక్షర

శాలయందు

ముద్రింపం

బడిన

ది.

1–3–86

1886

# అముద్రిత గ్రంథచింతామణిపై మచ్చ వేంకటపతి అభిప్రాయము

పంచచామరము :

అమేయపండితేంద్రులార యాశతో గొనుండు, శ్రీ
రమాసతీశ సత్కృపా విరాజమానవై భవా
ప్రమేయ వీరనాగయాఖ్య రామకృష్ణసూరిరా
డముద్రితప్రబంధ నిర్ఝరాచ్ఛ రత్నపత్రికన్.

ఇందు ముద్రింపబడిన గ్రంథము
మిత్రవిందాపరిణయము మిశ్రప్రబంధము
కుందుర్తి వేంకటాచలపతి కవి ప్రణీతము.

శ్రీ శ్రీధరాయనమః

# యాదవ రాఘవ పాండవీయము

[ త్ర్యర్థిప్రబంధము ]

## ప్రథమాశ్వాసము

### అవతారిక

శా. శ్రీ వైదర్భి వివాహవేదిక విరించి స్థాణు శక్రాది బిం
బావిర్భావ సమస్తభూషణ మణీహార ప్రభాహారియై
యావేళన్ దెర మాయదోయ నిజ విశ్వాకారతన్ దోఁచు స
ద్భావం బెన్న వెలుంగు కృష్ణుఁడు కృపన్ బాలించు మమ్మెప్పుడున్.

ఇందు రుక్మిణీకల్యాణ ఘట్టము వర్ణితము.

శ్రీ - శోభాయుక్తమైన; వైదర్భి - రుక్మిణీకాంత; వివాహ వేదిక - పరిణయ మండపమున ; విరించి - బ్రహ్మ ; స్థాణు - ఈశ్వర ; శక్ర-ఇంద్ర ; ఆది - మొదలయిన దేవతలయొక్క ; బింబ - ప్రతిబింబములు, రూపములు ; ఆవిర్భావ - పుట్టిన, ప్రతిఫలించిన ; సమస్తభూషణ - సర్వాభరణముల యందలి ; మణీ+హార+ప్రభాహారియై - మణుల కాంతులచే మనోహరమయిన; ఆవేళన్- ఆ వివాహ సమయమున; తెర+మాయ+దోయ - వధూవరుల మధ్య నున్న తెర తీసివేయగా; వేడుక చూడవచ్చిన వారలెల్లరకు - నిజ-స్వీయ ; విశ్వాకారతన్+తోఁచు - సర్వ దేవమయుండను భావము స్ఫురింపఁజేయు ; సద్భావంబు+ఎన్న+వెలుంగు - చక్కని తలంపు లెక్కించగా ప్రకాశించు ; కృష్ణుఁడు - కృష్ణపరమాత్మ ; మమ్ము+ఎప్పుడున్ - సర్వులను సదా ; పాలించు - రక్షించుగాత.

సీ. గురుతర కాశ్యపగోత్ర సంభవుఁడను
సురుచిరాపస్తంబ సూత్రయుతుఁడ
మహిత నెల్లూరి రంగమంత్రికిఁ బౌత్రుఁడ
కృతియైన వేంకటపతి నియోగి
కిని మంగమాంబకు తనయుఁడ వీరరా
ఘవ నామ విఖ్యాతి గలుగువాఁడ
సర్వజ్ఞమూర్తియౌ సర్వేశు భజియించి
తత్ప్రసాదాసాదిత ప్రసిద్ధ

గీ. కవితఁ గలవాఁడ ఘనకావ్య కరణ వివిధ
బహుళ పరికర లక్షణ పారదర్శి
నుభయ భాషల బహుకృతుల్ సభలు మెచ్చ
ఘటనఁ జేసినవాఁడ సత్కవుల దయను. 2

తా. సూ. రాఘవకవి వంశాదికము, విద్యావైశద్యము లిందు వర్ణితములు.

గురుతర, కాశ్యప, గోత్ర, సంభవుఁడను - గొప్పదయిన కాశ్యప గోత్రమున జనించినవాఁడ; సురుచిర.... యుతుఁడ - అపస్తంబ సూత్రము; మహిత.... పౌత్రుఁడ - ఘనుడు నెల్లూరి రంగమంత్రికి మనుమడ; కృతియైన...తనయుడ - ప్రబంధకర్తయైన నియోగి ప్రభువయిన వెంకటపతి మంగమాంబల కుమారుడు; వీర...వాఁడ - వీరరాఘవుడని కీర్తిగాంచినవాడ; సర్వజ్ఞ...భజియించి - సర్వజ్ఞుడయిన శంకరు నారాధించి; తత్ప్రసాదాసాదిత - ఆ యీశ్వరు ననుగ్రహమున సంపాదించిన; ప్రసిద్ధ కవిత గలవాడ - కవితాసంపద గలవాడ; ఘనకావ్య - గొప్ప ప్రబంధములను నిబంధించుటకు; కరణ - హేతువులయిన; వివిధ...పారదర్శి - పలువిధములగు పరికరముల సంపూర్ణముగా నెఱింగినవాడ; సత్కవుల దయను - కవిపుంగవుల యనుగ్రహమున; సభలు మెచ్చ - సహృదయు లౌనన; ఉభయభాషల - సంస్కృతాంధ్రముల; బహు కృతుల్ - పెక్కు కావ్యములు; ఘటన+చేసినవాడ - రచించినవాడ—ఇట్లని కవి తన్నుగూర్చి చెప్పుకొనెను.

చ. అలర వసుంధరా పరిణయంబు తదుత్తర భాగ కావ్యమున్
వెలయఁగఁ జెప్పినాఁడనన వేఱె మదీయ విధంబు దెల్పఁగా
వలయునె శ్లేషచిత్రముఖ వైఖరులన్ రచనాప్రపంచమం
దుల నెవ రెట్లు సెప్పినను దోడనె సెప్పఁగనేర్తు నట్టులన్. 3

అలర - ఖ్యాతిమీర; వసుంధరా + పరిణయము - శ్రీ మహావిష్ణువుతో భూదేవికయిన వివాహమంగళ కావ్యము; పూర్వోత్తర భాగములుగా; వెలయఁగ చెప్పినాడ - దిగంతవ్యాప్తము కాగా రచియించితిని; అన మదీయ విధంబు - నా శక్తిసామర్థ్యములు; వేఱె+తెల్పగా+వలయునె - వివరించి చెప్పనేల? రచనా ప్రపంచమందుల - కవితాలోకమున; ఎవరు+ఎట్లు+సెప్పినను-ఎవరేరీతిని నుడివినను; శ్లేష, చిత్రముఖ, వైఖరులన్ - శ్లేషకావ్యము, చిత్రకావ్యము, నాటక ప్రబంధాది భేదముల ఎవరే విధమున రచించినను; తోడనె+అట్టులన్+సెప్పగ నేర్తు - వెంటనే అవలీలగా ఆ విధమున రచించ నేర్తును.

వ. అని దెలియం బలికి,

తన్నుగూర్చి కొంత వివరించి,

శ్లో. శ్రీ కృష్ణాయ నమో నమో భగవతే సత్యస్వరూపాయ తే
గోవిందాయ నమో నమో మధుజితే చిన్మూర్తయే బ్రహ్మణే
శ్రీ గోపీజనవల్లభాయ చ నమ స్స్వానందరూపాయ తే
స్వాహేశార్కసుధాంశుబింబమహితాంచజ్జ్యోతిషే తే నమః. 4

శ్లోకమున కృష్ణుని పలునామముల కీర్తించి ధ్యానించెను.

భగవతే - అష్టైశ్వర్య సంపన్నుడు ; సత్యమే స్వరూపము; గోపీజనమనోహరుడు; మధువను రాక్షసుని సంహరించెను. చిత్ - జ్ఞానమూర్తి; పరబ్రహ్మ; ఆనందరూపుడు ; స్వాహా+ఈశ - స్వాహాపతి, అగ్ని ; అర్క - సూర్యుడు; సుధాంశుబింబ - చంద్రుడు; సూర్యచంద్రాగ్నులతేజములకు ప్రకాశము నిచ్చు స్వయంప్రకాశ జ్యోతిర్మూర్తి.

శ్లో. శ్రీంకారాం త్రిపురాం పరాపరమయీం హ్రీంకార బీజాత్మికాం
మాయాకుండలినీం గుణత్రయమయీం క్లీంకార తారాత్మికాం
ప్రాసాద ప్రణవత్రయీం పరశివాం కూటత్రయీం చిన్మయీం
ప్రాసాదాది విలోమ షోడశిమయీం విద్యాత్మికాం చింతయే. 5

"శ్రీం హ్రీం క్లీం ఐం సౌః ఓం హ్రీం శ్రీం
కఏఈలహ్రీం హసకహలహ్రీం సకలహ్రీం
సౌః ఐం క్లీం హ్రీం శ్రీం".
ఇది షోడశి యను మనురాజము.

ఈ మంత్రముయొక్క ఉద్ధారము పై శ్లోకమున వివరించబడినది. సద్గురు ముఖమున సరహస్యముగా నియ్యది తెలియంబడవలెను. ఆషోడశి లలితాపరమేశ్వరి సంవిన్మయి.

| | |
|---|---|
| శ్రీ హ్రీం క్లీం ఐం సౌః - ప్రాసాదపంచకము | 5 |
| ఓం హ్రీం శ్రీం - ప్రణవత్రయము | 3 |
| కఏఈలహ్రీం హసకహలహ్రీం సకలహ్రీం - కూటత్రయము. | 3 |
| బీజములు 45 - ఇది పంచదశిమంత్రము. | |
| ప్రాసాదాదివిలోమపంచకము - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం | 5 |
| బీజములు 28...సంజ్ఞషోడశి | 16 |

శ్రీవిద్యాప్రపంచమున గురుముఖమున ఈమనురాజము సంప్రాప్తించిన పూర్ణదీక్షయందురు.

*పంచాక్షరీ సీసము :*

వన్య వనావని వాయ్వన శశివయ
 న్మన్యుమన్మాయ నమశ్శివాయ
మాన్యనామానూన మనునవనోన్నేయ
 మాయాశయాయ నమశ్శివాయ
నానావిమానీశ మౌనీన నవమనో
 మననమేయాయ నమశ్శివాయ
మనుమానవేశాను మానావమానాన్య
 మన్నయనాయ నమశ్శివాయ
గీ. మాని మానావనాయ నమశ్శివాయ
మాని వినయ నయాయ నమశ్శివాయ
మాశివానునయాయ నమశ్శివాయ
మాశివానునయాయ నమశ్శివాయ. 6

పంచాక్షరి - శివమంత్రము - 'నమశ్శివాయ'
ఓంకారము ప్రణవము - సర్వమంత్రములకు శిరస్సు.
"ఓం నమశ్శివాయ" మనురాజము శివపరము.

ఓం - నమః - శివః - య చతుర్థ్యంతము : శివునికొఱకు నమస్కారము అని కవి నమస్కృతి.

వన్య+వన+అవని - అగ్ని, జలము, భూమి; వాయ్వనశశివయత్ (వాయ్వి శశివియత్ - ఇట్లు సవరించినగాని భావము గోచరించలేదు) వాయువు - గాలి ; ఇన - సూర్యుడు ; శశి - చంద్రుడు ; వియత్ - ఆకాశము ; మన్యుమత్ - అహం కారయుతుడు - పురుషుడు ; నమశ్శివాయ - శివునకునమస్కారము. మాయ - పైన వివరించిన అష్టమూర్తి; మాయ - మకారరూపాయ; నమశ్శివాయ - శివునకు నమస్కారము. మాన్య - పవిత్రమైన ; పూజింపదగిన ; నామ+అనూన+మను - సహస్రనామములనేయొక్క నామమైన సాటిలేనిమంత్రము ; నవన - రక్షణకై ; ఉన్నేయ - ఆత్మోద్ధరణకై కాగా ; మాయాశయాయ - మకారరూపమయిన ; ఆశయము - భావముగల శివునకు నమస్కారము. నానా+విమాన+ఈశ -

సమస్తదేవతలయొక్క : మౌని+ఇన - మునిశ్రేష్ఠులయొక్క ; నవ - నూత్న విలాసములతో కూడిన ; మనో+మనన+మేయాయ - మనసునధ్యానించుమూర్తి; నమశ్శివాయ - శివునకునమస్కారము. మను - మనువులు ; మానవేశ - రాజులు; అనుమాన - అనుమతిప్రమాణమున ; అవమాన - రూపించుటలో క్రిందికిదిగిన (నిర్గుణమునుండి సగుణము ఒకమెట్టు క్రిందుకదా) అన్యమత్ - రూపాంతరముగొన్న, వికృతిగన్న ; నయనాయ - చూపుకలవాడా : తాత్పర్యము ధ్యానించుటలో నిల్చినరూపము సత్యేతరము. ఆ కన్నుగాంచినది వికృతి, అట్టి శుద్ధసత్వమూర్తి శివునకు నమస్కారము. మాని+మాన+అవనాయ - భక్తరక్షణతత్పరుడు శివునికి నమస్కారము. మౌని, వినయ - నయాయ - ఋషిహృదయములనిండు కొన్న భక్తిచే ఆకర్షింపబడిన శివునకు నమస్కారము. మా - లక్ష్మి ; శివ - పార్వతి, ఇరువురకు భజనీయుడు శివునకు నమస్కారము. మా+శివ+అను+నమాయ - ఇరువురిచే నమస్కరించబడే శివునకు నమస్కారము.

సీ. శ్రీ నిలయోల్లాసు దీనావన విలాసు
        నరిదరకరధీరు నవితధీరు
    సత్యైక్య రతిశీలు సాధు సజ్జనలోలు
        సర్వజ్ఞతాఖ్యాతి సాంద్రభూతి
    శ్రుతిహారి సంభాషు శ్రితజన పరిపోషు
        పరమహంస విచారు పాపదూరు
    గురుకవిబుధవంద్యు గుణవజ్జనానంద్యు
        జిష్ణు సమాఖ్యాతి చిత్రనీతి
గీ. గుణ గణానంత మణిరాజు కోమలాత్మ
    వితత శుచి సుకుమారు నిర్విఘ్నకర్త
    యనుచు హరిహరాజేంద్రార్క హస్తిముఖ కు
    మార చంద్రాగ్ని వర్ణ్యుల మదిని దలంతు. 7

శ్రీ నిలయమున - లక్ష్మీస్థానమున ; ఉల్లాసు - ప్రకాశించువాడు ; దీన+అవన+విలాసు - దీనజన రక్షణమున బద్ధకంకణుడు ; అరి+దర+కర+ధీరు - శంఖచక్రముల ధరించిన పరాక్రమశాలి ; అవిత+ధీరు - వృధకాని ధైర్యశాలి - ఎదిరిలేనివా డనుట, హరికి విశేషణములు ; సతి+ఐక్య+రతి+శీలు - దాక్షాయణీ ప్రియుడు ; సాధు+సజ్జన+లోలు - భక్తసులభుడు ; భక్తులన నాసక్తి మెండు;

సర్వజ్ఞతాఖ్యాతి - సర్వజ్ఞుడని పేర్వడసినవాడు; సాంద్ర, భూతి - దట్టమయిన విభూతిచే నొప్పువాడు, ఐశ్వర్యయుతుడు - ఈశ్వరుడు, హరుడు ; శ్రుతి+హారి+సంభాషు - పలుకులు మనోహరములైన వేదములు ; శ్రితజన+పరిపోషు - ఆశ్రితజన రక్షకుడు; పరమహంస విహారు - హంస వాహనమున విహరించువాడు పరమహంసలు ఋషులచే పరిశీలించబడువాడు కావుననే వారు బ్రహ్మవేత్తలయిరి; పాపదూరు - అనఘుడు, అజుడు, బ్రహ్మ ; గురు, కవి, బుధ, వంద్యు - బృహస్పతి, శుక్రాచార్యులు ; బుధ - సజ్జనులకు, దివ్యులకు; వంద్యుడు - వందనీయుడు ; గుణవత్+జన+అనంద్యు - సజ్జనులచే కొనియాడ బడువాడు ; జిష్ణు సమాఖ్యాతి - జిష్ణుఁడను నామాంతరము కలవాడు ; చిత్రనీతి - స్వర్గపాలనమున చిత్రమయిన నీతి కలవాడు ఇంద్రుడు ; గుణ+గణ+అనంత+మణి - సహస్ర కిరణములనే సద్గుణ గణముచే నొప్పువాడు-అర్కు, సూర్యుడు; రాజు+కోమలాత్ము-చల్లనిచంద్రుడు ; వితతశుచి - సదాశుచి - అగ్ని ; సుకుమారుని - దేవసేనాని, కుమారస్వామిని ; నిర్విఘ్నకర్త - గజముఖుని, ఆయా విశేషణములచే, ఖ్యాత నామములచే ; హరిహర అజ ఇంద్ర అర్క హస్తిముఖ కుమార చంద్ర అగ్ని - వర్ణ్యుల వర్ణించబడిన దేవతామూర్తులను ; మదిని+తలతు - హృదయమున ధ్యానింతును.

శా. శ్రీ తేజోమయు బ్రహ్మ నెంచి ప్రకృతిన్ జింతించి నారాయణున్
చేతః పద్మముఁ జేర్చి శంభుఁ గని వాణీనాథుఁ జర్చించి య
బ్జాతాగార నుతించి శైలతనయన్ బ్రార్థించి వాగ్దేవతన్
ధ్యాతన్ జేసి గజాస్యుఁ గొల్చుచుఁ బ్రబంధంబున్ నిబంధించెదన్. 8

ఈ యీ దేవతలను సేవించుకొని ప్రబంధంబున్ + నిబంధించెదన్ - కావ్యము వ్రాయ సమకట్టితిని అని కవి చెప్పుకొనుచున్నాడు. ఆ దేవతల పట్టిక ఈ పద్యమున పేర్కొన్నదియ్యది.

తేజోమయుడు అవ్యక్తుడు బ్రహ్మ ; ప్రకృతిన్ - మాయాశక్తిని చింతించి; నారాయణున్ - హరిని ; చేతఃపద్మము చేర్చి - హృత్పద్మమున, మనసున నిల్పి ; శంభు గని - హరిని దలచి ; వాణీనాథు - అజుని ధ్యానించి ; అబ్జాత+ఆగార - కమలాలయను, లక్ష్మిని స్తుతించి ; శైలతనయన్ - అంబను, పార్వతిని వేడుకొని; వాగ్దేవతన్ ధ్యాతన్+చేసి - సరస్వతీ ప్రార్థనము గావించి ; గజాస్యు - విఘ్నపతిని ; కొల్చుచు - పూజించుచు, ప్రబంధంబున్ ; నిబంధించెదన్ - కావ్యము వ్రాయఁబూనుదును. కావ్యకర్త ప్రార్థన.

వ. అని యివ్విధంబున నిష్టదేవతానమస్కారంబును, సుకవిపురస్కారంబును, మఱియునుం గుకవితిరస్కారంబును గావించి, యుదంచిత విరించి చంచలాంగనాంచిత కవితాప్రపంచసంచరదభంగబుధపుంగవ హృదయంగమంబును, విభావానుభావ సాత్వికభావ సంచారీ భావ సముదయ సముజ్జృంభిత సుభగంభావుక గంభీర సముల్లస దసదృశ రసరంగ దుత్తుంగాభఙ్గ భంగీతరంగిత ప్రాణబంధ ప్రతీయమాన ధ్వనివిజిత విభ్రాజమానంబును, సకలాలంకారాలంకృతంబును, ఓజస్సౌకుమార్యప్రసాద మాధుర్యతా ముఖ్యగుణ చిరత్నరత్నరంజకంబును, పురాకృత పుణ్యాతిశయ పరిలబ్ధ భాగ్య ప్రవర్ధమాన నిరుపమాన ప్రతిభా విశేష పరిచిత నిఖిల విద్యా విజ్ఞానాత్మిక కారణద్వయ విజృంభమాణ నిర్దోష మధురతర వచన రచనా సరస విచిత్రాభినవ శబ్దార్థయుగళమూర్తికంబును, రసాశ్రయీభూత చతుర్వృత్తి విలసితంబును, అనుపమానంబును, అసాధారణ నిర్నిరోధక మేధానిదాన విమల బోధాతిశయ విధా ధురా ధౌరేయ కవిరాజ రాజరాజ సేవనాయోగ యోగ్యంబునగు నొక్క మహాప్రబంధంబు నిబంధింపఁ దలంచి, యురుతర ప్రధాన పురుషోత్తమఖ్యాతి పుణ్యకథాగవేషణమనీషావృత్తి క్షణమాత్రంబు చింతించి, బ్రహ్మరంధ్ర సరోవరాంతర వదాత ద్వాదశాంతాఖ్య సహస్రదళ కమల కర్ణికామధ్య విద్యమాన హృద్య చంద్రసూర్యాగ్ని బింబాంతర విద్యోతమానాంగుష్ఠప్రమాణ హిరణ్మయాకార నిరుపమ నిరవద్య నిర్లేప నిరవధిక నిరాధార నిరీహ నిత్యసత్య జ్ఞానానందాత్మక పరమ పురుష ప్రత్యంగ విమర్శనా వినిశ్చలీభూత ధారావాహిక జ్ఞానాత్మక ధారణవశగతిన్ బరవశమతిన్ దృఢంబుగా ముహూర్తమాత్రంబు ధ్యానంబు సేయుచున్న సమయంబున భాగవత రామాయణ భారత కథా ప్రసిద్ధ యాదవ రాఘవ పాండవీయంబు సభంగాభంగ శ్లేష చిత్రవ్యంగ్య చమత్క్రియాసందర్భ విభ్రమంబున సర్వత్ర యశ్లేషచిత్రంబుగాఁ బ్రబంధంబు నిబంధింపం దలంపు వొడమినంత నంతర్ధ్యానంబు చాలించి, మనంబున సకలాంతర్యామియు, సర్వనియామకుండును, బుద్ధిప్రేరకుండగు గోపాల బ్రహ్మంబు నియోగంబని నిశ్చయించి యివ్విధానంబున నుభయలోక క్షేమంకరంబును, ఇష్టదేవతాప్రియంకరంబును, యశఃకారణంబును, పూజాకరంబును, లాభాపాదనంబును, ఆనందావ

హంబును, విదగ్ధతాహేతుకంబును, ప్రియోపదేశ సమాన భాసమానం
బును నగునని విచారించి, యీ యాదవ రాఘవ పాండవీయంబు,
మిశ్రకావ్యంబును, చంపూప్రబంధంబునుగా నాంధ్రభాష నిబంధింప
నిశ్చయించి, గ్రంథకారక పరిజ్ఞానంబునకై తదాదియందు మదీయ
పూర్వవంశానుక్రమపూర్వంబుగా మద్విధంబు వివరించెద. 9

ఉదంచిత - ఉత్తమమయి; విరించి+చంచల+అంగన - సరస్వతీవిలాస విలసితమైన; కవితాప్రపంచమున; సంచరత్ - విహరించే; అభంగ - నిశ్చలులైన; బుధపుంగవ - విజ్ఞులకు; హృదయంగమంబును - అహ్లాదమునిచ్చునదియు; విభావ...విభ్రాజమానంబును - ఉత్తమకావ్యపరికరముచే సమగ్రసముల్లసితమైనదియు; సకల+అలంకార+అలంకృతంబును - శబ్దాలంకార అర్థాలంకార శోభితంబును; ఓజస్సు, సౌకుమార్యము మొదలగు సుగుణములచే నొప్పునదియు; నిరుపమాన+ప్రతిభామూర్తికంబును - సాటిలేని ప్రతిభావిశేషమున మూర్తిగాంచినదియు; చతుర్వృత్తివిలసితము, కవిరాజరాజరాజసేవ్యము; అగు మహాప్రబంధంబు నిర్మించబూని, పరమపురుషుని అచంచలయుక్తి క్షణము ధ్యానించుసమయమున త్ర్యర్థిగర్భితము పుణ్యకథావిలసితము యాదవరాఘవపాండవీయంబు నిబంధింప తలంపుకలుగ, ధ్యానంబుచాలించి; అయ్యది ఇష్టదైవము గోపాలబ్రహ్మంబు నాజ్ఞయని నిర్ణయించి; కావ్యప్రయోజనములనెన్ని, శ్రేయస్సునుకోరి, గద్య పద్యాత్మకంబుగా నాంధ్రభాష కావ్యము రచించ నిశ్చయించి, భావివారలకు గ్రంథకారక పరిచయముకొఱకు మదీయ (రచయితరాఘవునిదైన) పూర్వవంశానుక్రమ పూర్వకంబుగా నా కులగోత్రాదులు వివరింతుననెను.

## కవి వంశానుక్రమణిక

క. చతురాస్యునకున్ గలిగెను
జతురాస్యుఁడునా మరీచిపంజ్ఞు డతనికిన్
సుతుఁడై జనించెఁ గశ్యపుఁ
డతనికిని జరాచరంబు లన్నియుఁ బొడమెన్. 10

చతురాస్యుడు - బ్రహ్మ; ఆతనికి అవరబ్రహ్మయో యన మరీచిజనించె - మానసపుత్రుడు; ఆ మరీచికి కశ్యపుఁడుపుట్టి ప్రజాపతియయి చరాచరమును సృజించెను.

క. గోత్రామరజన కోకిల
చైత్రాగమమై సమస్త జగదంచిత చా
రిత్రంబు వెలయు కాశ్యప
గోత్రంబు సుధీగణేయ గుణచిత్రంబై. 11

భూలోకమున కాశ్యపగోత్రము - గుణచిత్రము, సుధీగణేయము, అంచిత చారిత్రము - చక్కనికీర్తినిగాంచి; లోకములోని ఇతరవంశములకెల్ల శ్రేష్ఠమై; ఆ గోత్రమున జనించు నమరకోకిలములకు - దివ్యజనకోకిలములకు; చైత్రాగమము - వసంతాగమమై, సంతోషజనకస్థానమై కాశ్యపగోత్రము వెలయు - ప్రకాశించెను.

మ. అల గోత్రంబున సంభవించి సకలార్య స్తోత్రపాత్రంబులై
యిల వర్ధిల్లిరి కొండలాహ్వయుఁడు సాహిత్యజ్ఞుఁ డా వేంకటా
చల సంజ్ఞుండునునాఁగ నిర్వు రమర శ్లాఘ్యోన్నతిన్ వారిధిన్
జలజారాతియు కౌస్తుభాఖ్యమణియున్ జన్మించు చందంబునన్. 12

అలగోత్రంబున - ఆ కాశ్యపగోత్రమునపుట్టి; సకల ...వర్ధిల్లిరి - సమస్త సుజనస్తోత్రములకు అర్హులై కొండలుడును సాహిత్యవేత్త వేంకటాచలపతియు ఇరువురుయశోదయులై; వారిధిన్ - క్షీరసాగరమున; జలజ+అరాతి - పద్మములకు వైరి చంద్రుడును, కౌస్తుభమాణిక్యము ప్రభవించినట్లు జనించి ప్రఖ్యాతిగనిరి.

క. లలిత యశోధనులై తగు
నల ఘనులకుఁ బాకనాట నలరెడు నెల్లూ
రలఘులకు రాజధానిగ
వెలయుం బాంధవ గణంబు వినుతు లొనర్పన్. 13

ఈ మహాత్ములకు పాకనాటగల నెల్లూరు రాజధానిగా నలరారెను. వీ రా నెల్లూరున బంధుజనము స్తోత్రములకు పాత్రములై వసించిరి.

క. అందగ్రజుఁ డలరును గో
విందమనోహర పదారవింద మరందా
నందత్తుందిల చిత్త మి
ళిందుఁడు కొండన్న మదన లీలాకృతియై. 14

ఆ యిరువురిలో పెద్దవాడు, కొండన్న సుందరుడు గోవింద...పదారవింద-హరి సుందర పదకమలములయందలి మధువును గ్రోలి సంతసమున తేలియాడు మనస్సనే తుమ్మెద కలవాడు, గోవిందునియందు భక్తి కలవాడని భావము.

సీ. ఎవ్వని తండ్రిపే రిల దేశరాజువా
రన నింటిపేరు ము న్నమరఁ దెచ్చె
నెవ్వని సద్విద్య హెచ్చుగా వీణవా
రన నింటిపేరు ము న్నమరఁ గూర్చె
నెవ్వని కొమరుఁ డీ యిల పెద్ద వేంకట
పతిరాయలను దళవాయియయ్యె
నెవ్వఁడు గీత సాహిత్య విద్యల నేర్చి
దిగ్విజయంబున దేజరిల్లె
గీ. నెవఁడు ధవిణమలహరియు ధవళశంఖు
లాదిగా బిరుదుల నెల్ల నంది మించె
ప్రౌఢరాజులచే నిమ్మపండనంగ
నతఁడు నుతికెక్కెఁ గొండలాహ్వయుఁడు జగతి. 15

ఈ కొండన్న జనకుఁడు వంశము (ఇంటి) పేరు దేశరాజువారను ఖ్యాతిఁ గాంచె. (దేశ, రాజు - దేశమునకు రాజులు) కొండన్న విద్యాధికుడు. గాన విద్యా విశారదుండగుట వీణవారను నింటిపేరు వాడుకకు వచ్చె. కొండన్న కుమారుడు పెదవేంకటపతిరాయలను పేరి సేనాపతియై పేర్వడసె. సంగీత సాహిత్యములు రెంటను ప్రఖ్యాతిఁ గాంచి దిగ్దేశముల విజయపతాక చేపట్టెను. 'ధవిణమలహరి', 'ధవళశంఖు' ఈ బిరుదములు పొందెను. ప్రౌఢులైన రాజులచేతి నిమ్మపండు అని ఖ్యాతిగాంచె అనగా రాజు లితని నాశ్రయించి పాలన సమర్థులైరనుట. ఇట్టి ఖ్యాతిఁ గన్నవాఁడు కొండలుడు. కొండలుడు మంత్రి యని ముందు వర్ణితము.

క. ఆ కొండల మంత్రీంద్రుఁడు
రాకేందునిభాస్యయైన రంగమయందున్
శ్రీకరమతి వితరణ వి
ద్యా కల్పకు వేంకటాచలాధిపుఁ గనియెన్. 16

ఆ కొండల ప్రభువు; రాకేందునిభ+ఆస్య - పున్నమచందురుని బోలిన వదనముకల, రంగమ యను పతియందు; వితరణ+విద్యా+కల్పకు - ఔదార్య

మున, విద్యలో కల్పవృక్షమును బోలినవానిని; వేంకటాచలమను; అధిపు - ప్రాభవశాలిని తనయుని గాంచెను.

క. అల వేంకటాచలార్యుని
వలనన్ గృష్ణాంబయందు వాసిజెలంగన్
గలిగెను రంగన ధీరుం
డలఘు యశోహారి భూషితాఖిల దిశుఁడై. 17

ఆ వేంకటాచలార్యుడు కృష్ణాంబయను కాంతయందు నల్దిక్కుల వ్యాపించు కీర్తినార్జించిన రంగనయను మహాధీరుని సుతుని గాంచెను.

మ. అలఘు ప్రాభవ శక్తియుక్తి బుధవర్యాశ్చర్య సంధాన కౌ
శలుఁడై భాసిలు రంగనార్యుఁడు రమాసాధ్వీగతిన్ ధాత్రి వ
ర్ధిలు రామానుజఁ బెండ్లియాడి యల నారీరత్నమందున్ విశృం
ఖల వాగ్గీష్పతియైన వేంకటపతిన్ గాంచెన్ సమంచద్గతిన్. 18

రంగనార్యుడు, లక్ష్మినిబోలిన రామానుజమ్మను పెండ్లాడి; ఆమెయందు, విశృంఖల - విచ్చలవిడిగా, వాక్+గీష్పతి - బృహస్పతిని మించిన, వేంకటపతిని కనెను.

క. ఆ వేంకటపతి మంత్రి య
శో విశదిత దశదిశుండు శోభిత కవితా
శ్రీ వీణా విద్యాదుల
చే విశ్రుతిగాంచె రాజశేఖర నుతుఁడై. 19

ఆ వేంకటపతి రాజాధిరాజులు స్తోత్రముచేయ; కవిత్వమందు సంగీతమున వీణావాదనమున నేర్పరియై; యశోవిశదిత+దశదిశుండు - దశదిశల వెల్గించి కీర్తి వ్యాప్తము కాగా; విశ్రుతి+కాంచెను - ప్రఖ్యాతివడసెను.

చ. పిడచనగుంట చెన్నయకుఁ బ్రేయసియై తగు లక్ష్మమాంబకున్
బొడమి రమాకటాక్షమున భూపతి నేర్పునబోలి నేర్పుచే
నడరిన మంగమన్ బరిణయంబయి వేంకటపత్యమాత్యుఁ డీ
పుడమిని శేష శైలపతి పొల్పునఁ బొల్చె బుధాభినంద్యుఁడై. 20

ఆ వేంకటపతిమంత్రి; పిడచనగుంట చెన్నయకు ఆతని సతి లక్ష్మమాంబకున్ జనించిన తనయ మంగమను; పరిణయమయి - పెండ్లాడి; పుడమిని - ఈ

లోకమున ; శేషశైలపతి+వడువున - తిరుపతివేంకటేశ్వరుని పోలి ; బుధ+అభినంద్యుడై - విజ్ఞులచేకొనియాడబడుచు ; పొల్చె - మించెను.

శా. ఆ మంగాంబ సమస్త బంధుగుణ విద్యావజ్జనాశీర్వచో
భూమప్రత్యహ వర్ధమాన విభవాభోగస్ఫురత్కీర్తి కాం
తాముక్తామణిదామకాకృతి కనత్తారావళీనాయకో
ద్దామైణాంక వదాన్యతాగుణ మహత్తామాన్య సామాన్యయై. 21

ఆ వేంకటపతిజాయ మంగాంబ సమస్తబంధు - చుట్టములు ; గుణవిద్యావత్+జన - సద్గుణములు విద్యయుగల సుజనుల ; ఆశీర్వచః - ఆశీర్వాదములతో; భూమ+ప్రత్యహ+వర్ధమాన - గొప్పదియు, దినదినప్రవర్ధమానమగు ; విభవము+ఆభోగము - భోగభాగ్యములచేతులతూగుచు ; కీర్తికాంతా - యశోదేవత యొక్క ; ముక్తామణిదామక+ఆకృతి - ముత్యాలహారములో ; కనత్ - ప్రకాశించే; తారావళీ+నాయక+ఉద్దామ+ఏణాంక - నాయకమణి నక్షత్రములలో చంద్రునివలె ఉత్తమమణినిబోలిన; వదాన్యతాగుణ - ఔదార్యగుణముయొక్క ; మహత్తా - మహిమవలన ; మాన్య - పూజ్యురాలై ; సా+మా+అన్యయై - అపరలక్ష్మియోనానొప్పె.

క. భృంగపయోదమసార భు
జంగమకచ వేంకటపతి జాయామణిశ్రీ
మంగమ కరుణానిధి హృద
యంగమ కమనీయవాణియై రాణించెన్. 22

భృంగ - తుమ్మెద ; పయోద - మేఘము ; మసార - కస్తురివలె నల్లని ; భుజంగమ - త్రాచు; ఈ వీనినిబోలిన కచ - కురులుకలది ; వేంకటపతిజాయామణి - కాంతారత్నము ; శ్రీ మంగమ కరుణానిధి - దయాంతరంగ ; హృదయంగమ+కమనీయ+వాణి - ఇంపయి లలితమయిన పలుకులుకలది అయి ; రాణించెన్ - విలసిల్లెను.

క. ఆ వేంకటపతి వలనను
మావనితా సదృశయైన మంగమ యందున్
శ్రీ వెలయ మేము మువ్వురు
ధీవిశ్రుతి జననమందితిమి వినుతి దగన్. 23

ఆ వేంకటపతి లక్ష్మీసమానురాలయిన మంగమయందు, కవితో మువ్వురు సోదరులు జనించిరి.

క. వారలలో నగ్రజుఁడ ను
దారమతిఁ వీరరాఘ వాఖ్యానుఁడ నే
నా రామన వేంకట కృ
ష్ణారూఢాహ్వాయులు మత్ప్రియానుజు లరయఁ. 24

ఆ మువ్వురిలో పెద్దవాడు వీరరాఘవుడు. రామన్న, వేంకటకృష్ణుడునని ఇరువురుసోదరులు.

సీ. సకల మంత్ర రహస్య శాస్త్ర సర్వంకష
ప్రజ్ఞాధికస్ఫూర్తిఁ బరిఢవిల్లి
నిఖిల యోగ రహస్య నిరుపమ త్రివిధోరు
రాజయోగాభ్యాస రక్తిమీఱి
యాగమాంత రహస్య భాగోపనిషదర్థ
సర్వస్వ విజ్ఞాన సారమెఱిఁగి
నాటికాలంకార నానావిధ విశేష
రసభావ భేదముల్ పొసఁగ దెలిసి
ఆ. శబ్ది ముఖ్యశాస్త్ర సదసద్వివేకత
స్మృతి పురాణ వాస్తు రతి రహస్య
గణిత తురగ రత్న గజ పరిజ్ఞానత
నమరు వీరరాఘవాఖ్య కవిని. 25

ఈ కృతికర్త నెల్లూరి రాఘవకవి. ఈ సీసపద్యమున తన విద్యాసంపత్తిని, వివిధశాస్త్రపారంగతను వివరించుకొనెను. మంత్రశాస్త్రగ్రంథములు పెక్కులు చూచి, సరహస్యముగ ఆశాస్త్రమున సర్వంకషప్రజ్ఞ గాంచినవాఁడు, సర్వయోగ రహస్యములనెఱిఁగి సాటిలేని కర్మ, భక్తి, జ్ఞానయోగముల నభ్యసించి, త్రివిధయోగ ముల సారభూతమైన రాజయోగము నాశ్రయించి వన్నెకెక్కె. ఆగమరహస్యములు, ఉపనిషత్తులలోని విజ్ఞానసర్వస్వమున సారముఁ దెలిసి, అలంకారిక పరికరమగు నాటకలక్షణములు, అలంకార సముచ్చయము, రసములభావముల వివేచనముఁ గాంచి ; శబ్ది - ముఖ్య - శబ్దశాస్త్రము, వ్యాకరణము, ఛందస్సు, తర్కము ఇత్యాది శాస్త్రముల క్రమము తెలియగాంచి, స్మృతులు - మను, నారద, పరాశ

రాది స్మృతులు ; పురాణములు - మహాపురాణములు పదునెనిమిది ఉపపురాణములు పదునెనిమిది. (షేక్స్పియరు 36 నాటకములు రచించెనని ప్రతీతి. ప్రతిపురాణమున బహుభంగుల పలు నాటకముల సంపుటములయిన 36 పురాణములు వ్యాసుఁడు రచించెను.) వాస్తు - గృహవాస్తు శాస్త్రము; రతిరహస్యము - కామశాస్త్ర విజ్ఞానము అమరు - సేకరించుకొన్న ; కవి-మహాకవి శాస్త్రకవి; తాను ఈ నెల్లూరి వీరరాఘవుడు; అమరు - ఒప్పును.

క. నానా విధావధానము
లా నృపనీతియును భరత మాహాత్మ్యాదుల్
మానుగ నిచ్ఛాలిపియును
మానితముగ గల్గు గోపనంబును మఱియున్. 26

నానా...అవధానములు - అష్టావధాన, శతావధాన, సహస్రావధాన, నేత్రావధాన ఇత్యాదులు ; నృపనీతి - రాజనీతి ; భరత మాహాత్మ్యాదుల్ - భరతముని నాట్య ప్రసంగము ; ఇచ్ఛాలిపి - లిపులు స్వయము కల్పించి; గోపనము - ఒరులకు తెలియకుండ దానిని రహస్యముగ కాపాడుట—ఇంకను.

క. ప్రాకృత ముఖ షడ్భాషల
వ్యాకరణంబులును దెలుఁగు వ్యాకరణంబుల్
ప్రాకట సాముద్రికమును
వీకన్ జ్యోతిషముఁ జాపవిద్యావిధమున్. 27

షడ్విధప్రాకృతముల వ్యాకరణములు; సంస్కృతమున నవవ్యాకరణములు కలవని ప్రతీతి ; తెలుఁగు వ్యాకరణములు - నన్నయ, మొదలగువారు రచించినవి ; ఇంకను హస్తసాముద్రికము, జ్యోతిషము; చాప - విలువిద్య.

క. సాంగముగ దెలిసి మును యో
గాంగీకార మతి నిశ్చలానుభవాప్తిన్
బొంగియు నియోగవృత్తిఁ బొ
సంగి జెలంగితిని సరస సాహిత్య నిధిన్. 28

పైన వివరించిన విద్యలెల్ల, సాంగముగ+తెలిసి-సరహస్యముగ పూర్తిగా వశ్యపించి ; యోగ+అంగీకారమతి - యోగానుభవమున, స్థిరచిత్తము వడసి ; నియోగవృత్తి+పొసంగి - రాజగౌరవములంది; సరస సాహిత్యనిధియై - రసవంతమయిన సాహిత్య సంపత్తి కలిగి ; చెలంగితిని - పేరుగాంచి మించితిని.

సీ. శతలేఖినీపద్యసంధానచాతురీ
ఘటికాశతగ్రంథకరణపటిమ
ఆశు ప్రబంధ బంధాది క్రియారూఢి
సంకరోష్ఠ్య నిరోష్ఠ్య చాటుకలన
విస్తర మాధుర్య వివిధ చిత్రస్ఫూర్తి
పాదమాత్రాన్య త్రిపాదఘటన
వ్యస్తాక్షర విమిశ్ర బహుపద్య గుంభన
మచల జిహ్వాదిక ప్రచుర రచన
గీ. బహుజన మనోంతర స్థిత బహు విధార్థ
బహు సమస్యాప్రపూర్తియు బహు విభేద
సకల విషమ సమస్యాది సంవిధాన
మమరఁగూర్తును నెఱి రాఘవాఖ్య కవిని. 29

శత...చాతురీ - శతావధాన సామర్థ్యము ; ఘటికా...పటిమ - గంటకు నూరు పద్యములు చెప్పగల శక్తి ; ఆశు...రూఢి - ఆశుకవితా సంపత్తి ; సంకరోష్ఠ్య, నిరోష్ఠ్య - పఫబభమ ఈ అక్షరములు లేకుండను, కొంత సాంకర్యము గను పద్యము అల్లుట; చాటు - చాటు ధారాయుతములు ఒకపాద మిచ్చిన మిగిలిన మూడు పాదములు పూరించుట; ఇంకను బహుభంగుల చమత్కార జనకములగు చిత్ర ప్రబంధరీతులు సమస్యాపూరణాదులు కూర్చుట తెలిసిన వాడను వీరరాఘవు డను సత్కీర్తిగన్న కవిని.

క. పంచాశచ్చాటు కథా
చంచత్కృతులను రచించి సత్కవి పూజా
సంచిత కీర్తిని దగు సా
ధ్వంచితుఁడను వీరరాఘవాఖ్య నియోగిన్. 30

ఏబదికి మించి చాటు కావ్యములు రచించి సత్కవియన్న కీర్తిని గాంచి, సాధుసజ్జన పూజితుడనై యొప్పిన నియోగిని, వీరరాఘవుడను.

చ. అవునన కావ్యపఙ్క్తి పది యర్థములన్ రచియింపనేర్తు స
త్కవుల దయన్ శిరీష కవితా మృదుతా మహితార్య వైఖరిన్
భువినటులైన సత్కథల మూఁటి నొనర్తును బాలబోధకై
తివిరి బహుత్వమందు నల త్రిత్వము పర్యవసానమౌటచేన్. 31

సహృదయులు, అవునన - తలలూప ; సత్కవులదయన్ - సుకవుల ఆదర మున ; కావ్యపంక్తి - ఒక వాక్యమున ; పది.... నేర్తు - దశవిధములగు అర్థ సంపత్తి కూర్చగల్గుదును, ఆ యర్థముల పొందిక, మాధుర్య మృదుత్వాదిగుణములు చెడకుండురీతిని గూర్తును. నాశక్తి అట్టిది. అయినను, బాలబోధకై - బాలుర అనగా సామాన్య పాఠకలోకముకొఱకు; సత్కథల మూటిని-భారతభాగవతరామా యణముల కథలు మంచివి గుణవిలసితములు, ఈ మూటిని ఒకే కావ్యపంక్తిని సమకూర్తును. లోకమున త్రిత్వమున - మూర్తిత్రయమున ; త్రయీ - వేదముల బహుత్వము - బహుదేవతాత్వము ; బహుత్వము - సర్వవిజ్ఞానము ; పర్యవసాన మౌటచేన్ - కూర్చబడియుండుట హేతువుకాగా బాలబోధకై త్ర్యర్థి రచింతును.

వ. అని మదీయ విధంబు తెలియంబలికి తాదృగ్విధ గ్రంథ గ్రథన సామ ర్థ్యంబు లేకుండినను గోపాలబ్రహ్మ వరప్రసాదాసాదనంబును, మద్గురు జనాజ్ఞాబలంబును, బుధజనానుగ్రహంబును, త్రిశుద్ధిగా నవలంబించి, శుచివిశద ప్రదేశంబున సుఖాసీనుండనై, యిష్టదేవతా స్మరణంబును, సరస్వతీ ప్రార్థనంబును, విఘ్నేశ్వరార్చనంబును గావించి, వారల యనుగ్రహంబున నిర్విఘ్నంబుగా గ్రంథ పరిసమాప్తియగుంగాక యని ప్రార్థించి యాత్మగతంబున.

ఇట్లు మదీయ విధంబు - నా జననాదికము విద్యాసంపత్తి వివరించి ; తాదృశ...లేకుండినను - అట్టి త్ర్యర్థి సమకూర్చు ప్రౌఢిమ లేకున్నను ; గోపాల ...ప్రసాదంబును-గోపాలపరబ్రహ్మోపాస్తిచే నలవడిన శక్తిని ; మద్గురు...బలం బును - గురుప్రసాదబలంబును ; బుధ...గ్రహమును - పండితులదయయు ; త్రికరణశుద్ధిగా ఆలంబనముగొని;శుచి ...ఆసీనుండనై - నిర్మలమగు ఆసనమున కూర్చుండి, ఇలువేల్పును ప్రార్థించి, శారదను గణపతిని కొల్చి, వారల అను గ్రహంబున - ఆదివ్యుల కరుణచే నిర్విఘ్నము - అగుగాక - ఏ అడ్డంకులులేకుండ గ్రంథసమాప్తి చేకూరుగాత ! అని ప్రార్థించి ఆత్మగతంబున - తనలో.

సీ. ఒకచోట శబ్దార్థ యుగళ చమత్కార
సందర్భ గర్భిత చతురవృత్తి
యొకవంక నకలంకితోదయధ్వనిముఖ్య
మొకవంక వాచ్యార్థ యోగవిభవ

మొక చక్కిఁ జక్కని ప్రకటిత శ్లేషోక్తి
యొక చక్కని సభంగయుత పదాప్తి
యొకదారి పదవాక్య నికరగవ్యంగ్యంబు
నొకదారి బహుళార్థ యోగగమ్య
గీ. మొకట పూర్వాపరాన్వయ యోగగతుల
నొకట నేకార్థవైభవ ప్రకటయుక్తి
సరస గుణములు విలసిల్ల సరసరీతి
వృత్తుల రసప్రబంధంబు విస్తరింతు. 32

ఈ సీసపద్యమున, రచయిత రౌచికుఁడై మూఁడర్థములు పొసగించుటకై, తాననుసరించిన సమాస ఘటనమును గూర్చి ప్రసంగించెను. ఒకచోట - ఒక సమాస పదమున శబ్దచమత్కారము, అర్థచమత్కారము ఉభయము కూర్చనోపు, ఒకచోట ధ్వని ప్రధానముగా, మఱియొక్కచోట వాచ్యార్థ వైభవమును, వేఱొక చోట సుగమమగు శ్లేష ప్రకటనము. అన్యత్ర *అభంగయుత* పదాప్తి *అభంగ శ్లేష*, *సభంగ శ్లేష* ఇత్యాదికము *పదవ్యంగ్యము*, వాక్యవ్యంగ్యము. ఇంకొక తావున బహ్వర్థయోగము - అనేకార్థసంపత్తి, పూర్వాపరాన్వయము. ఏకార్థ వైభవము కావ్యత్రయమునకు సమానార్థకముగ సరళ సమాసగతి *గుణములు*, *రీతులు*, వృత్తులు, *రసములు* సరస విలాసితములుగా త్ర్యర్థిని విస్తరింతు ననెను. ఇందలి పదముల పూర్తి వివరణము కావ్యాలంకార గ్రంథసముచ్చయమునఁ గాంచ నగును. ఇట వివరించుట టీకాదృష్టిలో నంతప్రయోజనము కాదు.

వ. అని దెలియం బలికి సమాహిత చిత్తుండనై.

ఇట్లు తన వృత్తాంతమంతయు తేటతెల్లముచేసి నిశ్చలచిత్తుండై.

సీ. ఏ ధన్యు పదసేవ నీశుండు చేయుట
వ్యోమకేశాహ్వయ మొనరఁ దెల్పు
నే ధన్యు పదతోయ మీశుండు దాల్చుట
గంగాధరాఖ్య సంగతియె దెలుపు
నే దేవు సర్వదేవేశతౌన్నత్యంబు
సర్వ రక్షణకార్య సరణిఁ దెలుపు
నే మహామహు సద్గుణామేయ విస్ఫూర్తి
సర్వప్రధానత సరళిఁ దెలుపు

గీ. నతఁడు చెలువొందు శతధృతి హరిహయాగ్ని
శమన నైఋతి జలపతి శ్వసన ధనద
హరి శశి సుర కిరీట రత్నాంశు దీప
రాజినీరాజితాంఘ్రి నారాయణుండు. 33

శ్రీమన్నారాయణుండు, సర్వదేవతా ప్రధానమూర్తి యని ఇందు వర్ణితము. శ్రీనారాయణదేవు సేవించుటచే ఈశ్వరుఁడు వ్యోమకేశుడయ్యె. విష్ణుపద వారి తలఁదాల్చుట గంగాధరుండునాఁ బరగె. సర్వరక్షకుండగుట నారాయణదైవము సర్వదేవేశుఁడయ్యె. సాటిలేని సద్గుణములతో తులతూగుటచే సర్వ ప్రధానుఁ డయ్యె. ఆ నారాయణు పాదపద్మములకు ఇంద్రాది అష్టదిక్పాలుర, సూర్యచంద్రాదుల శిరముల కిరీటములయందలి రత్నములు నీరాజితములయ్యె. (వారెల్లరు నారాయణు పదముల సాష్టాంగపడినవారే) అట్టి నారాయణుడు సర్వదేవతాగ్రసరుడు. దేవతలకును దేవత.

## షష్ఠ్యంతములు

క. ఏతాదృశ బహు మహిమ
ఖ్యాతగుణవ్రాతమణిగణాంభోనిధికిన్
భూతాంతర జీవమణి
ప్రోతాయత సూత్రరూప పురుషాత్మునకున్. 1

ఇట్టి మహిమలు కలవాఁడు, ఉత్తమ గుణరత్నాకరుఁడు, సర్వభూతాంతర్యామి, పటమునకు ఓతప్రోతములవలె సర్వజీవ చైతన్యము, పురుషసంజ్ఞితుఁడు, నారాయణుఁడు, గోపాలబ్రహ్మము.

క. నాగాహిత నాగాహిత
నాగాహిత కేతువదన నవ తల్పునకున్
నాగాహిత నాగాహిత
నాగాహిత హరణ భరణ నమనోన్నతికిన్. 2

ఈ పద్యమున క్రమాలంకారము కలదు. కేతువదన నవతల్పునకున్ ధ్వజము - ముఖము - కోమలమయిన శయ్య ; నాగ+అహిత - పాములకుశత్రువు గరుడుడు, హరి గరుడధ్వజుడు ; నాగ - గజములకు ; అహిత - అరి - సింహము నృసింహావతారమున హరి సింహవదనుడు ; నాగ - పాతాళవాసులయిన పన్నగ

ములకు ; ఆహిత - సదా ఇష్టుడు - శేషఫణీంద్రుడు ఆదిశేషువు నవతల్పముగా గలవాడు ; నాగ+ఆహిత - గజేంద్రునకు అరి మకరము, ఆమకరమును ; హరణ- చంపి గజేంద్రుని విడిపించిన ఉన్నతునకున్ - మహితునకు - కొండలకు ; అహిత - శత్రువు ; వజ్రి - ఇంద్రుడు దేవేంద్రుని - రాక్షససంహారముచేసి; సదా భరణ - రక్షించువాడు ; నాగ+అహిత - గరుడుడు ; ఇంద్రుడు వీరలను నమన - నమ్రులుగాజేసిన ; ఉన్నతికిన్ - మహితునకు - గరుడగర్వభంగము చేసినవాడు ఇంద్రుడు-గోపకులు తనకు ఉత్సవము కృష్ణు నుపదేశమున చేయకపోగా పుష్కలావర్తమేఘములను బ్రేరేపించి కుంభవృష్టిగురిపించ, గోవర్ధనగిరినెత్తి వారలను రక్షించ ఇంద్రుడు గర్వము విడచి గృష్ణుని క్షమించప్రార్థించును. ఆ తీరున ఇంద్రుని గర్వమడచి నమ్రునిగా నొనర్చెను.

క. గోపాయిత గోపాయిత
గోపాయిత వినుత గోత్ర గుణమణి ధృతికిన్
గోపాహిత గోపాహిత
గోపాహిత మద విభేద గురుబల ధృతికిన్. 3

గోపాయిత - గోగోపకుల రక్షించుటకై ; గోత్రధృతి - గోవర్ధనగిరిధారి యని వినుతిగన్న ధీరునకు ; గోపాయిత+గుణ - బ్రహ్మగోవులను, గోవత్సములను, గోపకులను హరించగా నొక వత్సరము ఆయా గుణవిలసితుడై సర్వులు తానె యయిన ధీరునకు; గోపాయిత+మణి+ధృతికిన్ - గోకులమును అరిష్టములనుండి రక్షించుటకై ; మణి - స్యమంతకమణిని చేగొన్న అక్రూరుని భీతి వాపి నగరమున నిల్పెను. ఆ విధముగా మణిని రక్షించిన తనవారిని కాపాడిన ధీరునకు ; గోప+అహిత - గోకులము శత్రువుల ; మద+విభేద+ధృతి - మద మడంచిన బలశాలి ; గోప+ఆహిత+గురు+ధృతికిన్ - గోకులమునకు మిత్రుడు గురువు అయిన ధీరునకు ; గోప+ఆహిత+బల+ధృతికిన్ - గోపకులమునకు మిత్రుడు బలము అయిన ధీరునకు.

వ. సద్భక్తి సమర్పితంబుగా నే రచియింపంబూనిన భాగవత రామాయణ భారతకథా ప్రసిద్ధమగు యాదవ రాఘవ పాండవీయంబను మహా ప్రబంధరాజ శిరోరత్నంబునకు కథా క్రమం బెట్టిదనిన. 4

★

## కథాప్రారంభము

ఆ. శ్రీల కిరవు బహుళ సితభానుకులులకు
నాటపట్టు సజ్జ నాస్పదంబు
మహి నయోధ్యకాంతి మధురసాలోజ్జ్వల
నాఁగపురి దనర్చు నవ్యలీల. 1

సూచన : టీకాక్రమము సౌకర్యమునకై యాదవ పాండవ రాఘవీయమని మార్చబడినది.

యాదవ : శ్రీలకు+ఇరవు - సంపదలకు స్థానము ; బహుళ+సిత+భాను+కులులకున్+ఆటపట్టు - పలువురు చంద్రవంశపు రాజులకు ఉనికిపట్టు ; సజ్జన+ఆస్పదంబు - సుజనులకు చోటు ; మహిన్ - భూలోకమున ; కాంతిన్ - తేజమున ; అయోధ్య - జయింప నలవికానిది ; సాల+ఉజ్జ్వల - ప్రాకారములచే శోభావంతమైనది ; మధుర+నాగ+పురి - మధుర అనే పట్టణము ; నవ్యలీల - నూత్న విలాసములతో ; తనర్చు - ఒప్పు.

సంగ్రహ. తా : చంద్రవంశజు లయిన యాదవులకు ముఖ్యపట్టణము మధురానగరము కలదు.

పాండవ : (భేదించిన తావులే సూచింతును. కడమ సమానము) మధుర - ఇంపైనది, చూడచక్కనిది ; నాఁగ+పురి - హస్తినాపురము (కురుపాండవులకు రాజధాని) ; నవ్యలీల+తనర్చు - ఒప్పును.

సం. తా : చంద్రవంశజులైన కురుపాండవులకు రాజధాని హస్తినాపురము కలదు.

రాఘవ : బహు+లసిత+భానుకులులకు - విఖ్యాతి గాంచిన సూర్యవంశ క్షత్రియులకు ఆటపట్టు ; మహిన్+అయోధ్య+నాగ+పురి తనర్చు - అయోధ్య యను పట్టణము కలదు ; కాంతిన్ ; మధుర+సాల+ఉజ్జ్వల.

ఉ. ఆ పురి శూరసేనుఁడన హారి మహఃపరిభూత దారుణా
లాప విరోధిపక్ష్మీరథుఁ డాతతసత్త్వు డుదారదానధా
రా పరిశోభిహేతి ధృతరాష్ట్రుఁడు దా విలసిల్లు సర్వథా
శ్రీపతి రాజమౌళి మణిదీధితి రాజిత పాదపద్ముఁడై. 2

యాదవ : ఆ పురి - ఆ మధురా పట్టణమున; శూరసేనుడను పేరు గల రాజు, యాదవ ప్రభువు ; హారి - హరించువాడు, ఈతిబాధల నణచు ; మహః - పరాక్రమముచే ; పరిభూత - నిర్జించఁబడిన; దారుణ+ఆలాప - విననహ్యము కాని సింహనాదములు గల ; విరోధి+పంక్తి - శత్రుసంఘము కలవాఁడు ; రథుడు - రథికుడు ; ఆతత+సత్త్వుడు - మహాబలశాలి ; ఉదార+దానధారా+పరిశోభి - వదాన్యుడు గాన సంతతము ధారాదత్తమయిన దానముల నొసంగుటచే విలసిల్లువాడు; హేతి+ధృత+రాష్ట్రుడు - ఖడ్గబలమున రాష్ట్రభారము నిర్వహించువాడు ; తాన్ - ఆ శూరసేనుడు; సర్వధాత్రీపతి - సమస్త రాజులయొక్క ; రాజ+మౌళి - అనర్ఘమగు కిరీటముల యందలి; మణి - రత్నములయొక్క ; దీధితి+రాజిత+పాద పద్ముడై - కాంతులచే నీరాజనమీయబడిన పాదపద్మములు కలవాడై ; విలసిల్లు - ఒప్పును.

సం. తా : ఆ మధురానగరము రాజధానిగా శూరసేనుడను యాదవ ప్రభువు, తక్కుంగల రాజులను, సామంతులుగా నేలుకొని పరిపాలించుచుండెను.

పాండవ : ఆ పురి - ఆ హస్తినాపట్టణమున ; శూరసేనుడు - శూరులు గలసేనావారము కలవాడు ; హేతి - ఖడ్గధారి ; ధృతరాష్ట్రుడు అనే కురురాజు ; విలసిల్లున్ - ఒప్పును. (కొదువ యాదవార్థముతో సమము.)

రాఘవ : ఆపురి - ఆ అయోధ్యానగరమున శూరసేనుడన...విరోధి - పైపక్షములతో సమము ; పంక్తిరథుడు - దశరథుడు ; సూర్యవంశపురాజు కోసల దేశాధిపతి ; ఆతతసత్త్వుడు... పాదపద్ముడై - పై పక్షములతో సమము.

చ. అవని యయాతివంశభవుఁ డాతత శాంతనవాత్మ చాపబా
ణవిముఖితారిశూరుఁడు జనస్తుతిసాంద్రుఁడు భూరిసత్త్వుఁడై
ప్రవిమల నీతియుక్తిని మరాట వరాట కిరాట లాట భో
టవసుమతీశులెల్ల తను డగ్గరిగొల్వ ధరిత్రి నేలుచున్. 3

యాదవ : అవని - భూలోకమున ; యయాతివంశభవుడు - సూర్యచంద్ర వంశములకు యయాతి యను సమాన నామధారి మూలపురుషుడు కలడు ; ఆ శూరసేనుడు యయాతి వంశమున బుట్టినవాడు ; ఆతత+శాంత+నవ+ఆత్మచాప బాణ+విముఖిత+అరి - సాటిలేని శాంతమనే విశిష్టమయిన ; ఆత్మ - స్వీయ; చాప బాణ-విల్లమ్ములచే (శాంతముతో నొప్పు ఆత్మయే విల్లమ్ములుగా) మోఘీకృతమైన శత్రువర్గముకలవాడు ; శూరుడు - వీరుడు ; జనస్తుతిసాంద్రుడు - అతిశయముగ

లోకులచే కొనియాడబడువాడు ; భూరిసత్త్వుడై - గొప్పబలముకలవాడై ; ప్రవిమల+నీతి+యుక్తిని - మాలిన్యములేని రాజనీతి ననుసరించినవాడై ; మరాట... గొల్వ - మరాటవరాటాదిరాజులు సామంతులై తన్ను సేవించ ; ధరిత్రిన్+ఏలుచున్ - భూమినిపాలించుచు.

పాండవ : యయాతివంశజుడైన ధృతరాష్ట్రుడు ; ఆతత-గొప్ప ; శాంతనవ - భీష్మునియొక్క ; ఆత్మ+చాప+బాణ+విముఖిత+అరి - వింటిబలమున శత్రువులను నిర్జించినవాడు ; శూరుడు...ధరిత్రినేలుచున్ - పై పక్షముతో సమము.

రాఘవ : దశరథుడు...ధరిత్రినేలుచున్ - యాదవపక్షముతో సమము.

గీ. సుబల నందన జయలక్ష్మి ప్రబలి తనకు
కరము సహధర్మిణీ ఖ్యాతి గారవింపఁ
దత్సహాయత బంధుమిత్రతఁ దనర్చి
యర్చితాతిథి వసుదేవుఁడనఁగ వెలయు. 4

యాదవ : సుబలనందన - పరాక్రమమునకు సుతకాననే జయలక్ష్మి - విజయలక్ష్మి...సహధర్మిణీఖ్యాతిగారవించ - స్వీయకాంతవలె ప్రేమించ ; తత్సహాయత - ఆజయలక్ష్మి సహాయమున ; బంధుమిత్రత తనర్చి - చుట్టములతో స్నేహితులతో విలసిల్లి ; అర్చిత+అతిథి - అతిథివర్గమును పూజించుచు ; వసుదేవుడు+అనగ+వెలయు - కుబేరుడోయన విరాజిలు.

పాండవ : ఆ ధృతరాష్ట్రుడు; సుబలనందన - గాంధారియు ; జయలక్ష్మి-విజయలక్ష్మియు ; ప్రబలి తనకు సహధర్మిణీ ఖ్యాతి గారవించ - ప్రియకాంతలై తన్ను సేవించ ; ఆ కాంతల సహాయత బంధు....వెలయు - యాదవపక్షముతో సమము.

రాఘవ : దశరథుడు వెలయు - యాదవపక్షముతో సమము.

క. ప్రతిపాలితావని పరా
జితదనుజుఁడు నిజగురూక్తి జెల్లఁగ జనస
మ్మతి పాండువరాభిఖ్యను
వితతంబుగ దిశలనెల్ల వెలయంబరగెన్. 5

యాదవ : ఆ శూరసేనుడు ; ప్రతిపాలిత + అవని - తన రాజ్యమున; పరాజిత+దనుజుడు - రాక్షసులను నిర్జించి ; నిజ, గురు, ఉక్తి, చెల్లగ - గురు

వాక్యానుసారము ; జనసమ్మతి - ప్రజానుకూలముగ ; పాండు, వర, అభిఖ్యను - అనఘుడను కీర్తి ; వితతంబుగ+దిశలనెల్ల వెలయన్ - సకలదిక్కుల వ్యాపించ; పరగెన్ - విరాజిలెను.

పాండవ : ఆ ధృతరాష్ట్రుడు పుట్టంధువు గాన, భీష్మరక్షితముతోపాటు, అనుజుడు పాండురాజు పాలనమున రాజ్యము సుభిక్షముగా నుండె ; — ప్రతిపాలిత, అవనిప రాజి+తత్+అనుజుడు - సామంతులుగా జేయబడిన; అవనిప+రాజి - రాజసముదాయము గలవాడు, ఆతని తమ్ముడు: నిజగురూక్తి చెల్లగ - అన్న ఆజ్ఞలు చెల్లించుచు ; జనసమ్మతి - ప్రజానుమతిని ; పాండువర+అభిఖ్యను - పాండురాజు అను పేరు ; వితతంబుగ... పరగెన్ - ప్రఖ్యాతిగా దిశదిశల వ్యాపించ విరాజిలెను.

రాఘవ : ఆ దశరథుడు.... యాదవ పక్షముతో సమము.

వ. మఱియు నతండు దిగ్విజయార్థంబై జైత్రయాత్ర వినోదంబుగా కదలి చని.

మూడు పక్షములకు సమము—శూరసేనుడు, పాండురాజు, దశరథుడు.

సీ. మహిప్రసిద్ధుల కుంతి మద్రేశ్వరుల బాలి
కల ననుత్తమజయా కలితరమల
సిద్ధకల్యాణుడై చేపట్టి మన్నించి
యుచితాప్తి దనయాజ్ఞ నుండఁజేసి
మగఁటిమి గోసల మగధ కేకయ భూప
తుల సుకుమారుల కలసిమెలఁగ
దను గోరువారల దగపరిగ్రహబుద్ధి
గైకొని పాలించి కరుణనిలిపి
గీ. చతురుదధి వలయిత ధరా చక్రమందు
తనదు భూరిప్రతాపంబు ఘనతనించి
సకల సద్గుణయుక్తి స్వస్థానమందు
వెలసె నారాజు శూరాఖ్య విశదముగను. 6

యాదవ : ఆ శూరసేనుఁడు ; మహి+ప్రసిద్ధుల - లోకమున విఖ్యాతులయిన ; కుంతి+మద్ర+ఈశ్వరుల - కుంతలదేశ, మద్రదేశాధిపతులను ; బాలి కలన - యుద్ధమందు ; ఉత్తమ+జయ - గొప్పగా గెల్చుటచేత ; ఆకలిత - పొంద

బడిన ; రమల - విజయలక్ష్మల ; సిద్ధకల్యాణుఁడై - మాంగల్యశోభాన్వితుఁడై ; చేపట్టి - మన్నించి ; ఉచితాప్తిన్ + తన + ఆజ్ఞన్ + ఉండన్ + చేసి - రాజనీతిని పాటించి, తనకు ఆజ్ఞానువర్తులుగా చేసికొని, సామంతులుగా చేసికొని; మగఁటిమి- తన పరాక్రమమునకు మెచ్చువచ్చి; కోసల, మగధ, కేకయ, భూపతుల, సుకు మారుల - ఆయా దేశపు రాజసుతులు, తను + కలసి + మెలఁగ + కోరువారల - తనతో మైత్రి పాటించ కూడియుండగోరు ఆ రాచకొమరుల, తగ + పరిగ్రహ బుద్ధిన్ + కైకొని - వారి కోరికలు మన్నించి; పాలించి + కరుణనిలిపి - అనుగ్రహము పేర్మి తనకు సామంతవర్గమున నియమించి రక్షించి ; చతుః + ఉదధి + వలయిత + ధరాచక్రమందు - నాలుగు సముద్రముల మధ్యనున్న భూమండలమున ; తనదు + భూరి + ప్రతాపంబు + ఘనత + నించి - తన గొప్ప బాహుబలము కీర్తియు వ్యాపించ; సకల సద్గుణయుక్తి - సుగుణముల కాశ్రయమయి ; స్వస్థానమందు - తన రాజధాని యయిన మధురానగరమున ; శూరాఖ్య + విశదముగను - శూరుడను పేరు దశదిశల వ్యాపించ ; ఆరాజు + వెలసె - ఆతడు విరాజిల్లె.

సం. తా. మధురానగరమున శూరసేనుడు తక్కుంగలరాజులనెల్ల సామం తులుగా జేసికొని ఖ్యాతిగాంచి రాజ్యము పాలించుచు సుఖముగా నుండెను.

పాండవ : కుంతిమద్రేశ్వరులబాలికలన్ - ఆరాజుల కుమార్తెలు కుంతి మాద్రి అనువారలను (ధృతరాష్ట్రునిపేర పాండురాజు రాజ్యము చేయుచున్నవాడు గాన — పాండురాజును హస్తిపురిపాలకునిగా గ్రహించవలెను) తన విఖ్యాతిగాంచి తన్ను కామించినవారిని పరిగ్రహబుద్ధి - భార్యలుగా గ్రహించి. కొదువ యాదవ పక్షముతో సమము ; అన్య రాజలోకమును జయించి సామంతులుగా నొనర్చి రాజ్యమున ఖ్యాతి వహించి సుఖముగా నుండెను.

రాఘవ : మహీ...నుండఁజేసి - ఈ రెండుపాదములు యాదవ పక్షముతో సమము. 3 వ పా : మగటిమి కోసల, మగధ, కేకయ - భూపతుల - సుకుమా రుల (కుమారి, కుమారులు) కౌసల్య, సుమిత్ర, కైకేయి యను వారలను - పరి గ్రహబుద్ధి - భార్యలుగా గ్రహించి; కొదువ యాదవ పక్షముతో సమము. దశ రథుడు మహాశూరుడను ఖ్యాతిగాంచి సుఖముగా నుండెను.

వ. అప్పుడు అంత.

క. శూరకుమారుఁడు ధీరుఁడు
వారితరిపు శౌర్యహారి వసుదేవుఁ డతం

డారూఢిగ వరియించెను
గీరాజిత కీర్తిదేవ కిన్నర వినుతన్. 7

యాదవ : శూరకుమారుడు - ఆ శూరసేనుని కొడుకు; ధీరుడు - ధైర్యశాలి; వారిత - రిపు - హారి - ఎదిరి పరాక్రమము నడంచినవాడు; వసుదేవుడను పేరు గలవాడు; గీ - వాక్కు - బుద్ధిచే; రాజిత - ప్రకాశించునది - బుద్ధిమంతురాలు అను; కీర్తి - ఖ్యాతిగన్న; దేవకిన్ - నరవినుతన్ - దేవకియను పేరుగల కాంతను; జనుల పొగడ్తలకు దగినయామెను; ఆరూఢిగ - వరియించెను - పెండ్లియాడెను.

పాండవ : శూరకుమారుడు - పరాక్రమమున కుమారస్వామిని పోలినవాడు; ధీరుడు, వారిత, రిపుశౌర్యహారి - వీరుడు, ఎదిరిలేనివాడు, వసుదేవుడు - అతండు - కుబేరుడోయన నొప్పు ఆ పాండురాజు; గీ - రాజిత - కీర్తిన్ - దేవ - కిన్నర - వినుతన్ - దేవతలచే కిన్నరులచే నుతింపబడే వాగ్విలసితమయిన కీర్తికాంతను; ఆరూఢిగ - వరియించెను - దిగంత వ్యాప్తముగా చేపట్టెను.

రాఘవ : శౌర్యమున కుమారస్వామిని; సంపదల కుబేరుని పోలిన యా దశరథుడు దిగంత విఖ్యాతిగాంచిన కీర్తికాంతను చేపట్టెను.

గీ. ఎంచ జనపతు లాతఁ డూరేఁగిపోవ
ప్రీత కుంతియు ధీర మాద్రియును గాన
గనఁగ దేవకామితకీర్తి తనయగరిమ
గలసి చనుదేర నాఖేట కలితమతిని. 8

యాదవ : దేవకిని వివాహమాడిన యనంతరము అతడు - ఆ వసుదేవుడు: ఆఖేట కలితమతిని; - ఆఖేటము - వేట; ఖేటము - గ్రామము, పరిసర గ్రామములు పల్లెలు చూచువేడుక; ప్రీత - కుంతియు - ఇష్టమయిన; కుంతము - ఈటె; బల్లెము; చేతబూని ; ధీరమ - అద్రియు - ధైర్యసంపదచేత కొండను బోలిన యాతడు. దేవక + అమిత + కీర్తి + తనయ - ఉగ్రసేనుడు యాదవరాజు ; అతని సోదరుడు దేవకుడు, ఆ దేవకుని కుమార్తె - దేవకి ; దేవకునియొక్క గొప్ప కీర్తి—యశస్సు—ఆ కీర్తియే యన నొప్పుతనయ - కుమార్తె దేవకి ; గరిమ + కలసి + చనుదేర - ఆ వసుదేవుని వెంట ఘనత యొప్పార కూడిరాగా ;ఆ నూత్న దంపతులు ఊరేగిపోవ - ఉత్సవముగా బయలుదేరిపోవుచుండ. (ముందు పద్యముతో నన్వయము)

పాండవ : ఎంచ జనపతులు - రాజలోకము కొనియాడుచుండ ; ఆఖేట+కలితమతిని - వేట తమకమున ; ప్రీత+కుంతియు+ధీర మాద్రియు - ప్రియురాలు కుంతీదేవి, ధీరురాలు చిన్నభార్య మాద్రియును; కానన్+కనగ-అరణ్యము చూచు వేడుక ; దేవ+కీర్తిత+కామిత+నయ+గరిమ - దేవతలు కోరి కీర్తించే నీతి మహిమాతిశయమున ; కలసి+చనుదేర - ఆ ఇరువురు కాంతలు తన్ను గూడిరా ; ఆతడు - ఆ పాండురాజు ; ఊరేగి+పోవ - పురివిడిచి వేటకై అరణ్య ప్రదేశము లకు బయలుదేరి పోగా—

రాఘవ : ఆ దశరథుడు రాజలోకము కొనియాడ ఇష్టమైన బల్లెము చేబూని కొండవంటి ధైర్యము గలవాడు గాన దివ్యులు కొనియాడి కీర్తించే రాజనీతి యతిశయమున వేట తమకమున నరణ్యప్రదేశములకు బయలుదేరి పోయెను.

సీ. ప్రబలుఁ డాకంసగోత్ర విరాజియైన నా
        రాజపుత్రుండు సారథియునగుచు
  సప్రియపరిజన సంగతితోఁబుట్టు
        వేడుక రథముపై విడిసి కాంచ
  రాజమార్గంబునఁ దేజంబుగాఁబోవ
        దేవతల్ గనుఁగొని దివ్యవాణి
  వినవచ్చె నెమ్మది వెఱపును బెంపుచు
        దేవకిన్నరనుతిఁ దివిరికరము
గీ. భవతమాసార సమవనిఁబుట్టి వేగ
  శీతలోచ్చైచ్ఛ్రిత నాగమ సీమ గదల
  నపుడ శంబరోన్నతి దెగటార్చసాగ
  నంత నాఖేట సంభ్రమం బమరె మిగుల. 9

యాదవ : ప్రబలుడు-బలవంతుడు; ఆ కంస+గోత్ర విరాజి+అయిన+ఆ రాజపుత్రుడు - కంసుడను పేరు గల వంశవర్ధనుడయిన, ఆ రాకుమారుడు (దేవకి పెదతండ్రి ఉగ్రసేనుని కుమారుడు వరుసకు అన్న) సారథియున్+అగుచు - రథము నడుపుచుండ ; స+ప్రియ+పరిజన+సంగతి - ఇష్టసఖులతో కూడి; తోబుట్టు - సోదరి దేవకి; వేడుక...విడిసి కాంచ - ఉల్లాసముగా రథమున గూర్చుండి వింతలు చూచుచుండ ; రాజమార్గంబున - పెనువీధి ; తేజంబుగాన్+

పోవ - ప్రభావంతముగ నేగుచుండ; దేవతల్+కనుగొని - దివ్యులు చూచి; దివ్యవాణి - దేవతలు నుడివిన ఆకాశ భాషితము; వినవచ్చె - కంసుని చెవులకు సోకినది; తత్ఫలమా కంసుని, నెమ్మది - అంతరంగమున; వెఱపును + పెంపుచు - భయము నాపాదించగా; వినవచ్చెను. అంత నా కంసుడు తివిరి+ క్రమము - పట్టుదలతో; దేవకిన్+నరనుతిన్ - జనము కొనియాడు ఆ దేవకిని - అపుడ - తక్షణమే; శంబర+ఉన్నతి - రాక్షస క్రౌర్యమున; తెగటార్చ సాగ; చంపజూడ; భవ+తమ - పుట్టి అధికమయిన; ఆసార - జడివానవంటి కన్నీరు; పమ+వనిన్ - విశాలమయిన ఎదదనంటి; పుట్టి వేగ - జాలుగా ప్రవహించి; శీతల + ఉచ్చైస్తన + అగమ + సీమ + కదలన్ - చల్లని చనుగట్టులపై జారగా అంత + ఆ ఖేట + సంభ్రమంబు - ఆ దృశ్యము గాంచుచున్న పల్లీజనముల కలకలము; అమరె+మిగుల - హాహాకారములు మిన్నుముట్టెను.

పాండవ: ఆకన్ - ఎదిరి నాగుటకై, శత్రునిరసనమునకై; సగోత్ర+ విరాజియై - ధనుర్ధారియై; ప్రబలుడు+ఆ రాజ+పుత్రుడు - మహావీరుడా రాకొమ రుడు పాండురాజు; సారథియున్ + అగుచు - స్వయము రథము నడుపుచు; సప్రియ+పరిజన+సంగతి - ప్రియపతులు కుంతీమాద్రులు సఖులతో రథమున నుండి వేడుకలు చూచుచుండ; రాజమార్గంబున+తేజంబుగా+పోవ - పెనువీథి ప్రభావంతముగా నేగుచుండ; దేవతల్+కనుగొని+దివ్యవాణి వినవచ్చె - దివ్యులు గాంచి నుతించిన పలుకులు వినవైనవి. భవతమ+ఆసార+పమ+వనిన్ పుట్టి+ వేగ - జడివానవలె బాణపరంపర లా యరణ్యమున వ్యాప్తములై; శీతల+ఉచ్చై స్తన + అగమ + సీమ - చల్లని ఉన్నతములైన కొండ నెత్తమ్ముల నెగజిమ్మ; అపుడ+శంబర+ఉన్నతి+తెగటార్చ+సాగ - ఆ తీరున కరుణమాలి జంతువు లను చంపుచుండ; అఖేట+సంభ్రమంబు+అమరె+మిగుల - వేటకలకలము హెచ్చసాగెను.

రాఘవ: వేట తమకమున దశరథుడు విల్లమ్ములు చేబూని అరణ్య ప్రదేశమున జంతువులను వేటాడసాగెను. (పాండవపక్షముతో సమము) సప్రియ+ పరిజన+సంగతి - ఇష్టులు పరివారము కొలదిమందితోడరా.

మ. కరియానోన్నతి మాయఁగా హరివలగ్నాభావిలాసంబు చిం
దరగాఁగ న్మృగలోచనాంచ దతిసౌందర్యంబజ న్జిత్రకా
యరమల్ దూలఁ జలోరుసత్కదళికాయానంబు మించంగ భా
స్వరనాగారి కలాపవేణికల సౌభాగ్యమ్ములన్ బాయఁగన్. 10

యాదవ : (దుఃఖసముద్రమున మున్గియున్న దేవకి యవస్థ ఇట వర్ణితము.) కరి+యాన+ఉన్నతి+మాయఁగా - గజగమనవిలాసము సడలగా ; హరి+వలగ్న+భా+విలాసంబు+చిందు+అరగాఁ - సింహము నడుమువంటి సన్నని నడుముయొక్క కాంతిపై భవముయొక్క ప్రసారము - అందము నశించి పోఁగా ; మృగ+లోచన+అంచత్+అతి సౌందర్యము+అఱఁ - లేడి కనుల వంటి కన్నుల అందము లేకపోఁగా ; చిత్ర+కాయ+రమల్+తూలఁ - అద్భుత మయిన శరీర సౌందర్యము చెదరిపోఁగా ; చల+ఊరు+సత్+కదళికా+యానంబు+మించన్+కన్ - భయమున అరటిబోదెలవంటి తొడలు మిక్కిలి కంపించగా ; భాస్వర+నాగ+అరి + కలాప+వేణికల + సౌభాగ్యమ్ములన్ + పాయఁగన్ - సోగలై నెమిలిపింఛమువంటి కచభరము అందమునశించ ; (ముందు పద్యముతో నన్వయము.)

పాండవ : కరి - ఏనుగు ; హరి - సింహము ; మృగ - లేడి ; చిత్ర కాయ - విచిత్రమయిన మచ్చలు - చారలుకల శరీరముకలది - చిఱుతపులి ; కదళిక - ఒకజాతి లేడి ; నాగారి+పాములపగ - నెమిలి ; కొదువవిశేషణములు ఆయా జంతువుల కన్వయించి - అరన్, అఱన్, తూలన్ - ఇత్యాది క్రియాపదము లతో సమాప్తిచేసిన, వేటతమకమున పాండురాజు ఆయా జంతువులను వేటాడి చంపెనని భావము.

రాఘవ : పాండురాజువలె దశరథుడును అరణ్యమున ఆయా జంతువు లను చంపెనని భావము.

క.ం ఆయట విజృంభమాణత
వాయక కడన(క) క్రన్ప్రకోప పావకకీలా
త్యాయత జాలావృతితో
సాయకవినిహతినిఁబూనె సమయన్జేయన్. 11

యాదవ : ఆ+అట - అచ్చో ఆ కంసుడు; విజృంభమాణత+వాయక - తన ప్రయత్నము మానక; కడకన్ - తమకమున, ప్రకోప+పావక+కీల+అతి+ఆయత+జాలావృతితో - క్రోధాగ్ని జ్వాలలు విస్తరించ: సాయక+వినిహతిని+పూనె+సమయన్+చేయన్ - ఖడ్గధారకు బలిచేయ నుంకించెను.

పాండవ: ఆ పాండురాజు క్రోధము పెచ్చుపెరుగ బాణపాతమున క్రూరమృగముల నింకను వేటాడసాగెను.

రాఘవ : దశరథుడును పాండురాజువలె వేట చాలించక అరణ్యమున జంతువులను హింసించసాగెను.

సీ. అటు పటుమతి మృగవ్యాసంగరతిగోర
శంబర పరవిగ్రహంబులందు
క్షితిపతి విబుధదంపతులు దాహంబున
దమకుమారోదయ మమరఁగలుగ
నంపవేగంబున సొంపులు బెంపగా
నొగి వారి నొప్పింప నొడఁబడుటను
పదరి యాతఁడు వారిఁ జెదరకుండగ నడ్డ
పెట్టుచు నటుముంచు నట్టి రవము
గీ. తో నిశిత సాయకనిహతిఁ ద్రుంగఁగూల్చె
మత్త సారంగగతిదోఁప మరలుకొనఁగ
నాత్మభవుల సన్నియమంబు ననుసరింప
గనుచు వారియ్యవని యట్లు గాకపోనె. 12

యాదవ : అటు+పటుమతి - ఆతీరున కంసుడు పట్టుదలతో; శంబర+పర+విగ్రహములందు - విగ్రహము - శరీరము; మాయా దేహధారులయిన దేవకీ వసుదేవులయందు: మృగవ్యాసంగ+రతి+కోర - వేటకాని క్రౌర్యము చూప; క్షితిపతి+విబుధ+దంపతులు - దివ్యాంశ సంభవులయిన దేవకీ వసుదేవులు: (వీరు పూర్వభవమున అదితి కశ్యపులు;) దాహంబున - తాపమున; తమ+కుమార+ఉదయము+అమర+కలుగ - తమకు సుతుడుదయించిన వెంటనే, సొంపులు+పెంపగా+అంప+వేగంబున - అక్షణమే ఆచిన్నిబాలుని పుట్టిన వానిని పుట్టినట్లుగనే; కంసునికి; ఒప్పింపన్+ఒడఁబడుటను - అప్పగించ నంగీకరించినను; పదరి+అతడు+వారిన్+చెదరక+ఉండగన్+అడ్డుపెట్టుచు - కోపించి వారిని పోనీక నిర్బంధించుచు; అటు+ముంచునట్టి+రవముతో - వారు బిట్టు మొరలిడి; మరలు+కొనగన్ - వెనుదిరుగ; మత్త+సారంగ+గతి+తోప-మదగజమువలె; సాయక+నిహతిన్ - ఖడ్గపాతమునవోలె; త్రుంగన్+కూల్చె - నేలబడవై చె. ఆత్మభవులు+అసన్నియమంబున్+అనుసరింపన్+కనుచువారు - జన్మతో సంక్రమించిన చెడ్డ గుణముల పాశముల చిక్కినవారు; అవని+అట్లు కాకపోనె - ఇహమున - ఆతీరున సంచరించకుందురా ! రాక్షసాంశభవుడు కంసుడు తన రాక్షస స్వభావమునేయనుస రించునుగాని సన్మార్గగామి యెట్లు కాగలడు ? కాలేదనుట —

పాండవ: పాండురాజు అరణ్యమున క్రూరసత్వముల వేటాడుచు నర ణ్యమున కుంతీ మాద్రులతో విహరించుచుండ; అటు+పటుమతి+క్షితపతి - వీరుడా పాండునృపాలుడు; విబుధ+దంపతులు - ఋషిమిధునము; (కిందము డను ఋషి ఆ అరణ్యమున, లేడి మిథునము రతిసక్తమైయుండ గాంచి, ఆసక్తి మెయి తపస్సంపన్నత తానును భార్యయు లేళ్ళరూపమును ధరించి రమించు సమయమున, మృగములేయను భ్రాంతి పాండురాజు బాణమేసి ఆ జింకమిధునమును గొట్టుటయు ననంతర మాముని యాతని శపించుటయు ననుగాథ ఇందును ముందు పద్యములలోను వర్ణించబడినది.) శంబర+పర+విగ్రహములందు+మృగ+ వ్యాసంగ+రతిన్+కోర - శంబరము - ఒక విధమగు జింక - లేళ్ళు రతిసంగతి నుండ గాంచి, తమకు+మార+ఉదయము+అమరన్+కలుగన్-తమకు మన్మథ వికారము జనించగా; ఆ లేళ్ళవలె భోగించ కోర్కె యొదవి అట్లు సక్తిమెయి నుండ; పాండురాజు దూరమునుండియే మృగమిథునమునుగాంచి అంపవేగంబున- ఒడబడుటను - బాణపాతమున నా లేళ్ళను చంప నిశ్చయించి, పదరి+ఆతడు+ వారిన్+చెదరక+ఉండగన్+మరలు + కొనగన్ + అడ్డపెట్టుచు - లక్షించి ఆ మృగములను విడువక; అటు ముంచునట్టి రవముతో-గుణధ్వని పిక్కటిల్ల; నిశిత+ సాయక+నిహతిన్+త్రుంగన్+కూల్చె - బాణమేసి కొట్టెను; ఆత్మభవుల —కాక పోనె=పూర్వజన్మ కర్మబద్ధమయిన జీవి కర్మానుసారము ప్రవర్తించక యుండ జాలడు.

రాఘవ : (రామాయణపరముగ వైశ్యదంపతులు వారి కుమారుడు శ్రావ ణుని శబ్దవేదియయిన దశరథుడు బాణముచే గొట్టుటయు అనంతరము వృద్ధుడగు వైశ్యుడు దశరథుని శపించుటయు నిత్యాదిగాథ వర్ణితము.) క్షితిపతి - దశరథుడు; అటుపటుమతి - దృఢచిత్తమున; శంబర+పర - జలాశయముల నీటికై సంచ రించు; విగ్రహములందు - జంతువులయందు; మృగవ్యా+సంగ+రతిన్+ కోర - వేటాడదలంచి అరణ్యమున సంచరించుచుండ; విబుధ+దంపతులు - అంధులు శ్రావణకుమారుని తలిదండ్రులు; దాహంబున - దప్పిగొని; తమ కుమారు - శ్రావణుని; ఉదయము+అమర+కలుగన్ - తెలవారగా; జలము తెచ్చుటకై. వేగంబున+అంపన్+ఒడబడుటను - పోవననుమతించ; పదరి+ ఆతడు - వెంటనే శ్రావణుడు వెదకి జలాశయముచేరి; వారిన్ - నీటిని; చెదరక+ ఉండగన్+అడ్డము పెట్టుచు - కుండతేలిపోకుండ నీటనదిమి; ముంచునట్టి రవ ముతో - నీరుముంచ గలగలమని శబ్దముకాగా; తోన్ - ఆ శబ్దమువిని; శబ్దభేది

దశరథుడు ; మరలుకొనఁగ - తిరిగిపోకుండ ; మత్తమాతంగగతి+తోప - జలాశయమున తొండముతో గజము నీరు త్రాగుచున్నదని భ్రమించి ; నిశిత+సాయక+నిహతిన్ - క్రూరశరప్రయోగమున ; త్రుంగన్+కూల్చె - పడగొట్టెను. ఆత్మభవుల...కాకపోనె - పూర్వకర్మఫల మనుభవించక తప్పదు. పాండురాజు నట్లే దశరథుడు శాపమునకు గురియగును.

వ. అయ్యెడ.

ఆ సమయమున.

క. సాయకహతి దెగి హా తా
తా యనఁగ బ్రజావిలాప మాలించి మనం
బాయెడ భగ్గునఁ గలగఁగఁ
బాయని శౌర్యాఖ్యగలుగు పార్థివుఁ డలరెన్. 13

యాదవ : సాయకహతిన్ + తెగి - కంసుని హింసకు పాల్పడి దేవకి హా తా తా యనఁగ - తండ్రి నెలుగెత్తి పిలచి దుఃఖించ; ప్రజా, విలాపము, ఆలించి - కూతుకుయ్యాలించి; మనంబు+ఆయెడ+భగ్గున+కలగగ-హృదయముమండగా; పాయని+శౌర్యాఖ్య+కలుగు+పార్థివుడు+అలరెన్ - శౌరియను కీర్తిగాంచిన ఉగ్రసేనుడు అలరెన్—ఆడరెన్ (దిద్దుబాటు) తొట్రుపడెను.

పాండవ : మృగరూపములు విడిచి స్వరూపములందిన మునిదంపతులు దెబ్బతిని విలపించ పాండురాజు వారల విలాపమాలించి దీనుడయి యటకేగెను.

రాఘవ : దశరథుడు మనుజవిలాప మాలించి మనసుకలగ నా శ్రావణుడు పడియున్న ప్రదేశమున కేగెను.

వ : మఱియునుం బశ్చాత్తాపంబునఁ దత్ప్రజన్ జేరి తద్వర్తనంబెఱింగి.

యాదవ : ఆ ఉగ్రసేనుడు కంసాదులున్నచోటికేగి అటనడచిన వృత్తాంతము తెలిసికొని మిగుల ఖిన్నుడై —

పాండవ : పాండురాజు నేలబడియున్న కిందమఋషిదంపతుల కడకేగి ఖిన్నుడై —

రాఘవ : దశరథుడు శ్రావణుని సమీపించి చూచి తన యకార్యకరణమునకు చాల విచారించి—

క. ఆయంబు తెగిన యాబలు
గాయంబున నసువులూడఁగా రోఁజుచిలన్
గూయుచుఁ బొరలెడి యాజన
మాయెడ భూవిభుఁడుగాంచి యతిదుఃఖితుఁడై. 14

యాదవ : ఆయెడ - ఆ ప్రదేశమున; భూవిభుడు - రాజు, ఉగ్రసేనుడు; ఆయంబు+తెగిన - ప్రాణము లెగిరిపోవునట్టి ఆ+బలు+గాయంబున - ఆ పెద్ద పుండుచే (అన్న అవమానించుటొకటి. పుట్టిన పుత్రులను పుట్టినట్లే యొప్పింతు నన్న పతివాగ్దానము రెండు సతికి మానని వ్రణములే); అసువులు+ఊడగా-ప్రాణ పోకడకాగా; బ్రదికియు చచ్చినంతపనికాగా; రోఁజుచు+ఇలన్+కూయుచు - ఆయాసపడుచు విలపించుచు పుడమిపై; పొరలెడి - దొరలెడి; ఆ జనమును– ఆ కుమార్తెను; కాంచి - చూచి; అతి దుఃఖితుడై - మిగుల విచారించి——

పాండవ : ప్రాణపోకడకు హేతువయిన బాణఘాతమున వేదన సహించ లేక భూమిపై పడి ఆయాసపడుచున్న ఆ మునిదంపతులను జూచి పాండురాజు మిగుల విచారించుచు.

రాఘవ : దశరథుడు నేలబడి పొరలాడు శ్రావణుని గాంచి మిగుల విచారించి,

క. ఏను ప్రజ భద్రముగఁ గని
గానక నొప్పించితగునె కలుగరె ధరలో
నీనింద కిటులపాలుగ
హా నను జేయంగవలెనె యవ్విధి కకటా! 15

యాదవ : ఉగ్రసేను డిట్లు విలపించెను. ఏను+ప్రజ+భద్రముగన్+కని కానక+నొప్పించితిని - అయ్యో ప్రజలను కాపాడవలసిన నేను కనులు గల్గియు అంధునివలె రక్షించలేక ఆపదపాలు సేసితిని ; అగునె+కలుగరె+ధరలో - భువి నెందరు పుట్టి గిట్టలేదు ; ఆ విధికి+అకటా - కట్టిడి విధాత ; హా+ఈ నిందకు+ ఇటు+పాలుగ+నను+చేయంగవలెనె - నన్నిట్టి అపనిందపాలు చేయనగునా అని చింతపడును.

పాండవ : పాండురాజు ఉగ్రసేనుని వలెనే ప్రజాపాలన తత్పరుండనైన నేనీ యకార్య మొనరించితి. విధి యిట్టి అపనిందకు నన్ను పాలుచేసి వంచించె నని దుఃఖించెను.

రాఘవ : దశరథు డదేవిధమున నరహత్య గావించినందుకు విలపించును.

వ. అని గుందుచున్న నతండు,

మూడిటికి సమము.

చ. అనదల బాలురన్ ఘనుల నంధుల వృద్ధుల సాధులన్ దపో
ధనులను బుణ్యవర్తనుల ధార్మికులన్ బధిరాంగహీనులన్
మనసిజ మోహితాత్మకుల మానుల బంధుల జీవులన్ వృథా
హననముజేయ రౌరవములందురు వారికి భూసురోత్తమా. 16

యాదవ : ఉగ్రసేనుడు వసుదేవు ననునయించు క్రమము. అనదల... మానుల...జీవులన్ - సుగమము. ఇట్టి వీరల నెల్లరను వృథాహననము+చేయ - అకారణముగ హింసించ ; భూసురోత్తమా - భూదేవోత్తమా వసుదేవా ; వారికి - అట్టి క్రూరులకు ; రౌరవములు+అందురు - రౌరవాది నరకములే గతియని పెద్ద లందురు.

పాండవ : మునితో ననుచు పాండురాజు పశ్చాత్తాపము.
రాఘవ : దశరథుని పశ్చాత్తాపము శ్రావణునితో నన్నది. సమము

క. అజ్ఞానకృతములైన న
నుజ్ఞాకృతములయిన సుతనుద్విజగురుగో
విజ్ఞానాన్యాకృతులన
భిజ్ఞులు ఘనపాపమనరు విగ్రహముగతిన్. 17

మూడిటికి సమము : అజ్ఞాన+కృతములైన - తెలియక చేసినను; అనుజ్ఞాకృతములయిన - తెలిసిచేసినను; సుతను - స్త్రీ; ద్విజ - బ్రాహ్మణ: గురు - వృద్ధుడు, దేశికుడు; గో - గోవు; విజ్ఞాన+అన్య+అకృతులన్ - వెలిగా తెలిసి యొనర్చిన యకృత్యములు, హింసాకాండ; అభిజ్ఞులు - నీతిజ్ఞులు, విగ్రహము గతిన్ - విరోధులపట్ల; పాపము+అనరు - అఘ మనరు - అకార్యమనరు.

ఆ. ఇంటికొరకు నొకరియింటిని నూరికై
యూరు దేశమునకు నుడుగవలయు
దనకునాపదైన తత్సర్వమును మాన
వలయుననుచు మనువు వచనమమరు. 18

(మనుస్మృతి శ్లోకమున కనువాదము)

యాదవ: వసుదేవునితోడ ఉగ్రసేనుని పలుకులు—ఇంటికొరకు+ఒకరి - దుష్టాంగము ఖండించి శేషాంగమును రక్షించుకొన్నట్లు, వంశమును రక్షించుకొను నిమిత్తము దుర్మార్గుని విడువవలయును; ఊరికై - గ్రామము నిమిత్తము; ఇంటిని - గృహము త్యజించవలయును; దేశక్షేమమునకు అవసరమైన ఊరు విడచివేయవలెను; తనకున్+ఆపద+అయిన - తనకే ముప్పువచ్చిన; పైన వివరించిన వన్నియు శంకలేక విసర్జించవలెను, ఈ తీరున మనువు తన స్మృతిలో ధర్మశాస్త్రమున వచించెను.

పాండవ: మునిదంపతులతో తన యకృత్యమునకు తన్ను నిందించుకొనుచు పాండురాజన్న వాక్యములు.

రాఘవ: దశరథుడు నదేతీరున శ్రావణునితో నన్న వచనములు.

క. అనివార్యమేని యందఱ
కును నొక్కట హింసరాఁగఁ గొందఱివిడువన్
ఘనమగు నఘమనిబలుకరు
మనమున నిదినమ్మి సేత మహిపతికగునే. 19

యాదవ: అనివార్యమేని - తప్పనిసరి అయిన; అందఱకును+ఒక్కట+హింసరాగ - కలవారలెల్లరకును ఆపద సంభవించిన; కొందఱి+విడువన్+ఘనమగు - కొంతమందిని విడిచి తక్కినవారిని రక్షించుకొనవలెను: అఘమని+పలుకరు - పాపమనరు; మనమునన్+ఇది నమ్మి సేత - దీనిని విశ్వసించి, ఆతీరున ఆచరించుట; మహిపతికి+అగునే - నృపాలునకు తగునా - తగుననియే భావము.

పాం. రా: పై యర్థముతో సమము.

వ. అని మఱియు నతండు.

మూడిటికి సమము.

క. తమకనుసరిగాఁ గనుఁగని
నమహాత్ములు పెద్దలును ఘనవ్రతులు సముల్
సములంధకు లుండఁగఁ ద
త్పముఖమునను బోవకుండ దైవంబణఁచెన్. 20

యాదవ : తమకు+అనుసరిగా-పెద్దలమార్గమున నేగువానినిగా; కనిన+మహాత్ములు - నన్నెంచిన ఘనులు ; పెద్దలు, ఘనవ్రతులు ; సముల్ - శములు, శాంతియుతులు : సములు - సమత - సమభావము కలవారు ; అంధకులు - యాదవులలో నుగ్రసేనుని పూర్వులు ; (యదు, భోజ, అంధక, కుకుర ఇత్యాదులు యాదవులకు చెందిన వంశమువారు) ఉండగన్ - తమ వంశీయులు పలువురు పెద్దలుండ ; తత్+సముఖమునకు+పోవక+ఉండ-వారి సమక్షమునకు పోజాలని యవస్థకు ; దైవంబు+అణఁచెన్ - దుర్విధి నన్నీడ్చెను ; కుమారుడు కంసుడు చెలియలిని చంపునంతటి యధమాధమ కృత్యమున కొడిగట్టగా తానేరీతి వృద్ధులను చూడజాలుదునని ఉగ్రసేనుడు వసుదేవునితో పరిసరజనముతో ననెను.

పాండవ : పాండురాజు (ధృతరాష్ట్రుడు పుట్టంధువుగాన) తమ+కనుసరిగా - తమకు చక్షువుగా (పాండురాజు అన్నకు తానే కన్ను); కనిన+మహాత్ములు - ఎంచినఘనులు - ఇత్యాది విశేషణములు కురువృద్ధులకని యన్వయము వారి యెదుటకు తానెట్లు పోనేర్తునని, పాండురాజు పశ్చాత్తాపము.

రాఘవ : తన చెంతకు వచ్చిన దశరథునిగాంచి బాణహతివేదన సహించుకోజాలక శ్రావణు డాతని కిట్లనుచున్నాడు. 'రాజా, దుర్విధి నన్నీగతికి తెచ్చెను. నా తలిదండ్రు లంధులు. వారికి నేనే కన్ను సర్వమున్నూ. వారి చెంతకు నేను పోజాలని దురవస్థకు కట్టిడి దైవము నన్ను బలిచేసె' అని విలపించెను.

శా. వారింపెచ్చిన వంశహానియును దుర్వ్యాపార బాధాగతుల్
చేరన్ రావిటుసేయు మావిధియిదే సేవింతు వీక్షింపు మా
త్మారూఢ వ్యథపాపు నాహృదయశల్యం బొయ్యనన్ బాపవే
స్వారాజ్యస్థితి నిల్వఁజేయఁగల భవ్యస్వీకృతిన్ బోయెదన్. 21

యాదవ : ఉగ్రసేనుడు అనుచరులతో నన్నవాక్యము. వారిన్+తెచ్చిన-పెద్దలు కులవృద్ధులయిన అంధకుల నిటకు రావించుడు. వారు వచ్చిన ఈ అకృత్యము నివారించనగును. వంశహానియు - కులనాశనము ; దుర్వ్యాపారబాధాగతుల్-ఈ పాపము, హింసాకాండ ; చేరన్ రావు - సంభవించవు ; ఇటుసేయు మావిధియిదే వీక్షింపుము - చూడుడు ఇపుడు మీరు చేయవలసిన కార్యమిది, సేవింతు - ఆవృద్ధులను కొల్తును ; ఆత్మ+ఆరూఢ+వ్యథ+పాపు+నా హృదయశల్యంబు+ఒయ్యనన్+పాపవే - నా మనస్తాపము తొలగించి శాంతి చేకూర్చుడు; స్వారాజ్యస్థితి+నిల్వన్+చేయగల+భవ్యస్వీకృతిన్+పోయెదన్ - రాజ్యము సుభిక్షముగా

నుండనిండు; ఈ అసత్కార్యము నిలచిన సుఖములు పడయగలము; (ప్రజయు తాను నని భావము)

పాండవ : పాండురాజు అనుచరులతో నిట్లనుచున్నాడు. మీరు హస్తిపురి కేగి కురువృద్ధుల నిటకు తోడితెండు; వారలు విధించిన ప్రాయశ్చిత్తము ననుస రింతు. మనశ్శాంతి యొదవును. నేనిక రాజ్యమునకు పోజాలను. ఇట తపోవృత్తి నుండి మోక్షమునకై యత్నింతు ననెను.

రాఘవ : శ్రావణ కుమారుడు దశరథునితో నన్న వాక్యములు. రాజా! నా తలిదండ్రుల నిటకు తెమ్ము. వారిని తుదిక్షణములలో సేవించుకొందు. అనంత రము హృదయమున నాటిన ఈ నీ బాణమును తీసివేయుము. స్వర్గము చేరి సుఖింతు ననెను.

క. అనివారిత గమనంబునఁ
జనిపలికెను బావనాత్మ సలుపనవారి
న్నను బాపాత్ము బ్రజాహం
తను శిక్షించికొనుఁ డుగ్రదండ్యుఁడ ననుచున్. 22

యాదవ : పావనాత్మ - పూజ్యుడా, వసుదేవుడా; యనుచు, అనివారిత + గమనంబున+చని - త్వరితగతి నేగి యతని పదముల బడి; అవారిన్+సలుప+ నను - అమితమయిన; పాపాత్మున్ + ప్రజాహంతను - పాప మొనరించితిని, ప్రజలను పీడించితిని; (కుమారుడు కంసు డొనర్చుచున్న యకృత్యము తనదికా భావించి యనుచున్నాడు); ఉగ్రదండ్యుఁడను-ఎటువంటి కఠిన శిక్షకైనను పాత్రు డను; నను+శిక్షించుకొనుఁడు - మీకు తోచిన యట్లు చేయుడు అనెను.

పాండవ : అచుచరులను హస్తిపురి కనిపి పాండురాజు మునిదంపతుల పదములబడి పాపిని హంతకుడను నన్ను మీకు తోచిన యట్లు శిక్షించు డని విలపించెను.

రాఘవ : దశరథుడును పాండురాజు వలెనే వృద్ధులు, అంధులు అయిన శ్రావణుని తలిదండ్రులకడ కేగి జరిగిన వృత్తాంతము వారలకు తెల్పి తన తప్పిద మునకు వగచుచు తన్ను తోచినట్లు దండించుడని దీనముగా ప్రార్థించెను.

చ. చనువుగ నప్పగించితను జాతివిభేదమనీష తెంపు బెం
పున నొనరించుటల్ దెలుపఁ బొక్కుచు చూడఁగ రోయ దాపునం

దను దగఁ జేర్చి తన్ను దగ దండనజేయుఁ డుదార లోకయు
క్తి నిగనఁగా నటన్న నతిఖేదభవోగ్రత నాతఁ డిట్లనున్. 23

యాదవ : చనవుగన్+అప్పగించి, అల్లుడుగాన అనురాగమున అనున యించుచు; తనుజ – కుమారుడు కంసునియొక్క; అతివిభేద+మనీష+తెంపు+పెంపున+ఒనరించుటల్+తెలుపఁ+పొక్కుచు – అతిదుఃఖమున ఆతడొనర్చిన సాహసమునుబేర్కొనుచు దుష్టమతియనుచు; చూడఁగ+రోయ+దాపు+నందను-ప్రక్కనున్నకొడుకుమొగముచూడ నసహ్యించుకొనుచు; తగఁ+చేర్చి+తన్ను+తగ+దండనచేయుఁడు – ఆ కుమారుని తనతోపాటు వారివద్దకు చేర్చుచు మమ్ము శిక్షించుడు; తార+లోకయుక్తిని+కనఁగాఁ+అటన్న – మీకుతోచిన వడువున నిర్ణయించి దండించుడనగా; ఆతడు – ఆ కంసుడు తండ్రిమాటకు నియ్యకొనక; అతి+ఖేద+భవ+ఉగ్రత – విచారము క్రోధము పెనగొన ; ఇట్లను— ముందు పద్యముతో నన్వయము—

పాండవ : పాండురాజు మునిదంపతుల పదములబడి తను+జాతి+విభేద+మనీషి – శరీరము మృగముగాన నిజమునకు మృగమిధునమే యవి భ్రాంతిగొని; తెంపు+పెంపు+ఒనరించుటల్+తెలుపఁ – ఈ సాహస మొన రించితిని—యజ్ఞానవశముననని వివరించుచు వేడుకొనగా; పొక్కుచు+చూడగ+రోయఁ ః ఆ మునిమిధునము దుఃఖించుచు నాతని మొగముజూడ నసహ్యమున తిరస్కారభావము చూప; దాపునన్+తనున్+తగన్+చేర్చి – వారి చెంతకేగి ; తన్ను+తగ+దండనచేయుడు – నన్ను మీకుతోచినట్లు శిక్షించుడు అనగా నాముని దుఃఖము క్రోధము అతిశయించ నిట్లనెను.

రాఘవ : దశరథుడు పాండురాజువలెనే యనెను. గజమని బాణమేసితి. తెలిసిచేయలే దీ యకార్యము. మీకు తోచినయట్లు దండించుడని యా శ్రావణుని తలిదండ్రుల పదములబడి తన్ను తెల్పుకొని దుఃఖించెను. కొదువ పాండవార్థ ముతో సమము.

సీ. పూని తెంపొనరించి జ్ఞానహీనత నయో
దారయోగసుఖంబు తగునె చెఱుప
నుర్వి నష్టమ తనయోత్తమాయోగంబు
చేతను బంధమోచితుఁడ వగుదు
వనుచు మహాశాపహతిని కారావృతి
నొనరించి తెలియగా నుడివి యపుడ

హృదయశల్యమువాయ కదిసి పైతామహ
స్థానంబు సతిగూడి సౌఖ్యమందె
గీ. దాన నాతఁడు సంతతి తనకుఁ గలుగు
నె యికనని సంభ్రమమహాత్మ నిలువనిది ప్రి
యాత్మలకుఁ దెలియఁబలికి యార్యజనము
జేరి పురినుండ నెస్స నాచింత బెంప. 24

యాదవ : కంసుడు తండ్రినిచూచి ఇట్లనుచున్నాడు. పూని+తెంపు+ ఒనరించి - సాహసమున; జ్ఞానహీనత - తెలివిమాలి; నయ+ఉదార+యోగ సుఖము - రాజనీతిననువర్తించుటవలని భాగ్యము; తగునె+చెఱుప - ధ్వంసము చేయ న్యాయమా, కాదనుట; (తండ్రితో నిట్లనుచు వసుదేవుని చూచి) ఉర్విన్+ అష్టమ+తనయ+ఉత్తమ+అయోగంబు+చేతను - ఆకాశభాషితము ననుసరించి నీ ఎనిమిదవ గర్భజాతమువలన నాకు మృతియగుట ఆ ఉత్తమ గర్భజాతమును నా కొప్పించినతోన చంపుదును : ఆ అయోగము - లేకపోవుట, ఆ సంతానము నీకు నాచే చంపబడి లేకపోగా; బంధమోచితుడవు + అగుదువు - కారాగార నిర్బంధము తొలగిపోగలదు అని నుడువుచు; మహా + ఆశా + అపహతిని - వివాహమయి సుఖములు బడయగల మనుకొన్నవారి ఆశలు సుఖస్వప్నములు అంతరించగా; కారావృతిన్+ఒనరించి - బందినుంచి; తెలియగా నుడివి - ఆ నిర్బంధము తొలగిపోవగల మితియును తెల్పి; అపుడ + హృదయశల్యము వాయ - అట్లు ఆ దేవకీ వసుదేవులను నిర్బంధమున నుంచి శాంతి యొదవ; కదిసి+పైతామహస్థానంబు - రాజ మందిరమున కేగి; సతిగూడి+సౌఖ్యమందె - కాంతతో శంకదక్కి ఆనందమున నుండెను; దానన్ - ఆ హేతువుచే; ఆతడు - ఆ వసుదేవుడు; సంతతి + తనకున్ + గలుగునె + ఇకన్+అని - ఇట్లు కంస హస్తము కానున్న భావిసంతతిని గూర్చి విచారించి తనకిక సంతానము ఎట్లు నిలచును అని యనుకొనుచు; సంభ్రమ+మహా+ఆత్మ+నిలువ - హృదయము పలువిధముల భ్రాంతియుతము కాగా: ఇది+ప్రియ+ఆత్మలకు+తెలియఁ+ పలికి - ఈ వివరములు ఇష్టులకు ప్రియురాండ్రకు తెల్పి, ఆ కాంతలను; ఆర్య జనము చేరి+పురిఁ+ఉండ+నెస్స+నా+చింత+పెంప - సన్నిహితు లెల్లరకు పురికేగి వృద్ధసేవల నుండ గోరుచు; తన యిరువురు భార్యలను జూచి వారలతో వదేరీతి పురికేగి వృద్ధుల సేవించుచు నుండుట లెస్సయనును.

పాండవ : ముని బాణహతి వ్యధనొందుచు పాండురాజుతో నిట్లనెను; పూని+తెంపు+ఒనరించి+జ్ఞానహీనతన్+అయో+దార+యోగ+సుఖంబు+తగునె+చెఱుప - రాజా అవివేకివై ఈ తీరున సాహసించి జాయాసంగసుఖము పాడుచేసితివి. ఇది అన్యాయము ; కావున ; ఉర్వి - ఇహమున ; నీవుకూడ నా వలెనే ; నష్ట+మత - మఱుగుపడినశాస్త్రము - రహస్యశాస్త్రము - కలాశాస్త్రము ; తత్సంబంధమయిన+నయ - ఆ కలాశాస్త్రవిధులు ; అద్దాని+ఉత్తమ+అయోగంబు+చేతను - దాని సుఖములు లేకుండుటచే —రతిసుఖసమయమున ఆ క్షణ మననే : బంధమోచితుడవు+అగుదువు - భార్యతో రతిగోరి చేరిన యా క్షణము ననే మృతినందుదువు — రతిసుఖము నీకు లేకపోవుగాక యని శాపము నిచ్చెను; అని మహాశాపనిహతి+నికార+అవృతిన్+ఒనరించి-శపించి కోపమున ముఖము వికృతముకాగా ; హృదయశల్యమువాయ - కొంతవడికి శాంతియొదవ ; కదిసి - సౌఖ్యమందె - తనువులువిడచి తానును కాంతయు స్వర్గతినందిరి. పాండురా జాశాపవిధినాలించి తనకిక సంతతి కల్గుట కల్లయని తలంచి కాంతలతో "మీరు హస్తిపురికేగి వృద్ధసేవల కాలము గడపుట మంచి"దని నుడివెను.

రాఘవ : శ్రావణుని తండ్రి వృద్ధుడు కుమారుని దరికి చేర్చుకొని విల పించుచు ; జ్ఞానహీన - మూర్ఖుడా; దశరథుడా; పూని తెంపొనరించి - సాహసించి; తనయ+ఉదార - చెఱుప - కుమారునివలన సౌఖ్యము మంటకల్పితివి ఇది నీకు తగదు ; ఉరు+వినష్టమ+తనయ+ఉత్తమ+అయోగంబుచేతను+బంధమోచితు డవు+అగుదువు - నీవు సుతులు దూరముననుండ చనిపోవుదువు - ప్రాణావసాన సమయమున కుమారులు దరిలేని యవస్థకు చిక్కి దుఃఖించుచు నావలెనే మర ణింతువని శపించెను. అనుచు+మహాశాప...సౌఖ్యమందె - ఇట్లు శపించి ఆ ధిక్కారమున శాంతివడసి తానును సతియు దేహములు విడిచి స్వర్గమున కేగిరి. అంత దశరథుడు తన కంతకు పూర్వము సుతులు లేరుగాన ఇట్లయినను తనకు సంతానము కలుగునని సంతసించి ఆ సువార్త కాంతలకు నిష్టజనులకు తెలుప వలెనను సంభ్రమ మొదవ పురికేగెను.

గీ. ఆత్మనొప్పమనిన గుంతి యగ్రమహిషి
సురుచిరోహిణి మహిమాద్రి సుందరాంగి
సరసవర్తించి నిలువఁగ సమ్మతమున
నందవనముననుంచి యానందమొందె. 25

యాదవ : ఆత్మన్+ఒప్ప+మనిన - తన యిష్టానుసారము బ్రదికిన - సేవించిన; కుంతి+కుంతము కలవాడు. వసుదేవుని అగ్రమహిషి - పెద్దభార్య; సురుచి - కాంతిగలది; రోహిణి - రోహిణి అను పేరుగల సుదతి; మహిమ+అద్రి - ధీర, కొండవంటి స్థైర్యము కలది. అచంచల సుందర+అంగి - చక్కనిది; సరస వర్తించి; నిలువగ - తన సరసనున్న యా కాంతను; సమ్మతమున - ఆమె నొప్పించి; నందవనమున - మిత్రుడయిన గోపకుడు నందుని రక్షణకై పంపి యట గొల్లపల్లెనుంచి; ఆనందము+ఒందె - సంతసించె.

పాండవ : ఆత్మన్+ఒప్ప+మనిన - అనుకూలవతులయి చరించు; కుంతి+అగ్రమహిషి - పెద్దభార్య కుంతీదేవి; సురుచి+రోహిణి+మహి - రోహిణి. కాంతిగల నక్షత్రము ఆకాశమున కలయది; ఈ కాంతిగల నక్షత్రము మహి - పుడమి నడయాడునది - భూలోకమున నున్న రోహిణీ నక్షత్రము వంటిది; మాద్రి - చిన్నభార్య మాద్రియను పేరుగలది; సుందరాంగి - చక్కనిది; సరస+వర్తించి+నిలువ+సమ్మతమున - తన సేవల సరసనుండ కాంక్షించ; అంద+వనమున - ఆ అరణ్యమున తనతో నుండుట కంగీకరించి; ఆనందము+ఒందె - సంతసించె.

రాఘవ : దశరథుడు తన అగ్రమహిషి కౌసల్య సురుచి రోహిణి మహిమాద్రి సుందరాంగి - కౌసల్యకు విశేషణములు, సరస...సమ్మతమున - అనుకూలముగ తన సేవలనుండ; అందు+ఆవనమున - ఆ అంతఃపురమున; ఉంచి+ఆనందము+ఒందె-ఆమెతో కాలము వినోదముగా వెళ్ళించుచు సంతసించె;

క. గిరులన్ బోలెడి కరులన్
హరులన్ ధేనువుల కాంచనాంబరమణులన్
ధరణీసురులకు నొసఁగెను
గురుపాతక నిగళబాధ కోటులు వీడన్. 26

యాదవ : వసుదేవుడు ఆ కారాగారమున దేవకితోనున్నవాడై; గురు+పాతక+నిగళబాధ + కోటులువీడన్ - పూర్వజనికృత పాపపంకమనే సంకెలలు విడిపోవు నిమిత్తము ; గిరులన్—ధరణీసురులకున్ + ఒసగెను - గజములు, అశ్వములు, గోవులు, బంగారము, వస్త్రములు, రత్నములు, బ్రాహ్మణులకు దానమొసంగెను.

పాండవ : పైవిధముననే పాండురాజు పాపపరిహారమునకై దానములు చేసెను.

రాఘవ : దశరథుడును తానొనర్చిన ఘనపాపమునకు పరిహారముగా భూసురులకు దానములిచ్చెను.

వ. మరియును——

క. ధర చతురంగబలంబుల
తరుణులు మణిచేల దాస ధాన్య ధనసము
త్కరము ప్రియాగ్రభవాజ్ఞా
పరతంత్రములై చెలంగఁ బ్రమదావృతుఁడై. 27

యాదవ : రాజులను నిర్బంధించు కారాగారములు, విశాలమందిరములు, పూలతోటలమధ్య స్వేచ్ఛావిహారముల కనువైనవిగానుండును. కాని వారు పరిమిత ప్రదేశములు దాటిపోరానివిగా రక్షకభట పాలితములైయుండును. ఆ హేతువుచే దేవకీవసుదేవుల స్వీయచరితముల కేయాటంకములును లేవు. కాగా ఆ వసుదేవుడు ప్రమద - సతిదేవకితో; ఆవృతుఁడై - కూడినవాడై; కాలముగడపుచుండెను. రాజ్యము తత్సంబంధమయిన సంపత్తు——చతురంగ——సముత్కరము - రథగజ తురగపదాతివర్గము, దాసదాసీజనము, మణిచేలములు - రత్నములు, వస్త్రములు, ధాన్యరాసులు, కోశాగారము సర్వము; ప్రియ+దేవకియొక్క అగ్రభవ - అన్న కంసుని; \ఆజ్ఞాపరతంత్రములై + చెలంగన్ - ఆజ్ఞానువర్తనములై చెల్లుచుండ; తాను దేవకితో దినములు వెళ్ళించుచుండెను.

పాండవ : పాండురాజు; రాజ్యమున సర్వము; ప్రియ+అగ్ర - భవ - తనఅన్న ధృతరాష్ట్రుని; ఆజ్ఞా——చెలంగన్ - అధికారమునకు లోబడి వర్తించ, తాను అరణ్యమున ప్రమదావృతుడై - కుంతీమాద్రులతో నుండెను.

రాఘవ : దశరథుడు మంత్రులపై రాజ్యభారముంచి కాంతాసంగతి నంతఃపురమున నుండెను.

సీ. కరణబద్ధాంధుల కళనంటి చిత్రంపు
నాదభేదములును మోదమూని
సాత్వికోదయముల సరసతల్ గని మీరి
మతిగరంగఁగ నైక్యగతినిఁజేరి
పలుచాళిజేర్చుచు నెలతఋక్కలనుగూర్చి
యధరచ్యుతామృతం బానియాని

యూర్పులబెంపుచు నేర్పులమించుచు
నాత్మజాలోకనాయత్తవృత్తి

గీ. నంచితామేయసంయోగ సంచితోరు
నిరుపమానంద సందోహ నీరనిధిని
నోలలాడెను మిక్కిలి యుత్సవముగ
పూర్వసంచితపుణ్య సంపూర్తి కలిమి. 28

యాదవ : ఈ పద్యము రతికి, యోగరతికి సమన్వయించ నగును. వసుదేవుడు దివ్యాంశసంభవుడు, జ్ఞాని, అవతార పురుష దాతనికి సుతుడై జన్మించనున్నాడు. నిర్బంధమున నున్నను కాంతాసక్తుం డగుచు ఆత్మజ్ఞాన సము పార్జనము మరువలేదనుటకు 'యోగోవా భోగోవా' అని సమన్వయించుటకా యనున ట్లిందు సమాసములు ఘటితము లయినవి. కరణ+బద్ధ+అంధుల+కళల+ అంటి - కలయికయం దింద్రియములు చౌశీతిబంధముల నొకట, కొన్నింట, నిబద్ధములు ఆనందమున అంధములు ; కళాస్థానములల - గళము, చుబుకము, చెక్కిలి, బాహుమూలము, ఉరోజములు, ఊరువులు, ఇత్యాదులు, కళాస్థానములు వాటిని తాకుచు ; చిత్రంపు + నాదభేదములును + మోదము + ఊని - గళరవాది (పావురా పల్కులు) నాదము లుప్పతిల సంతసించుచు; సాత్త్విక+ఉదయముల - కంపము, స్వేదము ఇత్యాది సాత్త్విక భావములు జనించ ; సరసతల్+కని+మీరి - రసోన్ముఖత గాంచి, హెచ్చుగ ; మతి+కరంగగ - హృదయము ద్రవించగా ; ఐక్యగతిని+చేరి - ఒండొరులు కలసి ; పలు+చాళి (వాళియ)+చేర్చుచు - మల్ల బంధములకు వలె పెనకువ కలియుచు ; నెల+తక్కులకు+కూర్చి - నఖక్షతముల గురుతు లుంచుచు ; అధర+చ్యుత+అమృతంబు+అని+అని - అధరచుంబన మునవైన అమృత మాస్వాదించుచు ; ఊర్పులల+పెంచుచు - రతిశ్రమవలని నిట్టూర్పు లతిశయించ ; నేర్పుల మించుచు - కళావిలాసముల యంచలి చమ త్కృతులకుం జొక్క ; ఆత్మజ+ఆలోకన+ఆయత్త+వృత్తిల - సుతునిగాంచ తమకించు చిత్తవృత్తితో ; అంచిత + అమేయ - ఒప్పిదమయి తులలేని ; సంయోగ+సంచిత+ఉరు+నిరుపమ+ఆనంద+సందోహ+నీర+నిధిని - కల యికవలన జనించిన గొప్పది, సాటిలేనిది అయిన సంతోషాతిశయ సముద్రమున;. పూర్వ+సంచిత+పుణ్య+సంపూర్తి+కలిమి - పురాకృత పుణ్యఫల భాగ్యమున ; మిక్కిలి + ఉత్సవముగల - అతిశయించిన విలాసమున ; ఓలలాడెను - మునిగి

తేలెను. ఇందమరిన పదములు యోగమునకు వర్తించు విధము పాండవార్థమున ముందు కాననగును.

పాండవ : పాండురాజు అరణ్యమున శాపభీతి కాంతలను భోగదృష్టి గనక పరిచర్యలకు తృప్తిపడుచు యోగాభ్యాసమున కాలము గడపుచుండెను. కరణ+బద్ధ+అంధుల+కళ్ళ+అంటి - బాహ్యదృష్టి మరలించు నిమిత్తము, అంతరింద్రియ సంచారము నరయుఔాంటె నాసారంధ్రములు, కందోయి, శ్రుతి పుటములు నంగుళుల బంధించి యా యదనున విననగు; చిత్రంపు+నాదభేదము లను+మోదము+ఊని - చినిచినీ, ఘంట, శంఖ ఇత్యాది దశవిధనాదము లాలించి పంతసించి ; వాయుబంధమున నభ్యాసమున క్రమముగా, సాత్వికోదయముల సర సతల్+కని-కంపము, స్వేదము, రోమాంచము, స్తంభము ఇత్యాది దశవిధ అవస్థ లను మీరి ; మతి - చేరి - హృదయము ద్రవించి ధ్యానైక్యతను గాంచి : యోగ సంప్రదాయసిద్ధమయి క్రిందుగా; చ్యుత-జారిన, స్రవించిన, అమృతమునాస్వాదించి; ప్రాణాయామాభ్యాసమున తొలియవస్థయందయిన శ్రమజనితమయిన నిట్టూర్పులు మించ, నేర్పున - అభ్యాసవశమున యుక్తిగని కుంభకము నలవర్చుకొని ; ఆత్మజ వృత్తి - ఆత్మసాక్షాత్కారమునకు యత్నించుటలో ; పూర్వ...కలిమి - పూర్వ పుణ్యవిశేషమున ; అంచిత...నీరనిధిని - సాటిలేని ధ్యానధ్యేయములకు ఐక్యత వలని ఆనందసాగరమున ఓలలాడెను - మునిగితేలెను.

రాఘవ : దశరథుడు వసుదేవునివోలె కాంతలతో రతుల తేలియాడెను. యాదవార్థముతో సమము.

వ. మరియు నవ్విభుండు.

మువ్వరికి సమము.

ఉ. ఆవనవృత్తిబూని హృదయంబు కుదుర్పడ బుద్ధి నొక్కటన్
త్రోవలు రెండుజెందుచు నెరుంగుచు శక్తులమూటి యోగ స
ద్భావచతుష్కమున్ దెలిసి ధారణతంత్రములైదు జూచి ష
డ్భావగుణాళిగాంచి యెదుటంగని సప్తనిజాంగ చక్రముల్. 29

మూటికి సమము. ఆ+వన+వృత్తి (వనము - ఇల్లు, అరణ్యము) గార్హస్థ్య వానప్రస్థ ఆశ్రమముల ధర్మములు పాలించుచు (రాజధర్మము-యోగధర్మము) హృద యంబు+కుదుర్పడ - శాంతిగని ; బుద్ధిన్+ఒక్కట - లక్ష్యమందేకాగ్రతగాంచి ; ఆత్మావలోకన పరత్వమున మనోబుద్ధులేకమై నిలువ; త్రోవలు+రెండు+చెందుచు-

రాజ్యపాలన దక్షతయు ; గృహమేధిధర్మము ; యోగరతిధర్మము నాశ్రయించి ; ఎరుంగుచున్ + శక్తులమూటి - ప్రభుమంత్ర ఉత్సాహశక్తులను గుర్తించుచు - ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులను పరిశీలించుకొనుచు ; యోగ+సద్భావ+చతుష్కముల్ + తెలిసి - యోగసాధన కనువగు సాధన చతుష్టయ సంపత్తి గని — నిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము, శమాదిషట్కసంపత్తి, ముముక్షుత్వము — రాజపరముగా నుపాయ చతుష్టయము - సామ దాన భేద దండములు - గమనించి ; ధారణతంత్రములు + ఐదు + చూచి - రక్షాపరికరములు రాజ్యమును ధరించునవి - కోట, కోశము, సేన, మంత్రి, మిత్రుడు - పూర్వరంగ మయిన యమ నియమ ఆసనములుకాక, ప్రాణాయామ ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధు లయిదు నిల్పుకొని ; (ధారణతంత్రములు) ; షడ్భావగుణాళి + కాంచి - యోగపరము సమాధిషట్కసంపత్తి — శమము, దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము — రాజపరముగా సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధీభావ, సమాశ్రయములు ; సప్తనిజ + అంగ చక్రముల్ + ఎదుటన్ + కని - స్వామి అమాత్యుడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము, ఇవి రాజ్యసప్తాంగములు, సప్త + అంగ + చక్రముల్ - మూలాధారాది సహస్రారాంతము - మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, షట్చక్రములు - వీని కుపరి నిలచిన సహస్రారము. (ఇట్లు నిజాంగ చక్రములు సప్త).

క. కీలించి హరిని నెమ్మది
బాలింపుచు నచలభక్తి భాస్వద్వృత్తిన్
జాలించి వ్యసనజాలము
నాలింపుచుఁ బుణ్యకథల నాతఁడు సలిపెన్. 30

మూడింటికి సమము. వారుముగ్వురు - వసుదేవుడు. పాండురాజు, దశరథుడు. నెమ్మది + హరిని + కీలించి - విష్ణునియందు భక్తి నిలిపి ; భాస్వత్ + వృత్తిన్ - ఆ సద్భావమును; అచలభక్తి + పాలింపుచు - నిశ్చంచలయుక్తి ఆలక్ష్యము రక్షించుచు - నిల్పుకొనుచు; వ్యసనజాలము + చాలించి - వైషయికముల యందు సక్తివిడచి: పుణ్యకథలన్ + ఆలింపుచు - సత్కథా విశేషములు వినుచు; ఆతడు + సలిపెన్ - ఆతడా నియమమును పూనెను.

వ. ఆ సమయమున —

చ. సరసిజసంభవేంద్ర సురసన్మునిముఖ్యులు విష్ణుఁజేరి దు
ర్భర సురవైరి పఙ్క్తిముఖ భంగమొనర్చి వధించి సర్వభూ
భరము హరించి ప్రోవుమని ప్రార్థనఁజేయ సురల్ సహాయులై
ధరజనియింపుఁ డందఱును దానుజనించి హరింతు దుష్టులన్. 31

యాదవ : సరసిజ సంభవ - పద్మభవుడు - బ్రహ్మ; ఇంద్ర - సురరాజు దేవేంద్రుడు: సుర+సన్ముని+ముఖ్యులు - దేవర్షి పుంగవులు; విష్ణున్+చేరి - వైకుంఠమునకేగి హరిని దర్శించుకొని; దుర్భర+సుర+వైరి+పంక్తి - క్రూరులు రాక్షసమూకల; ముఖభంగము+ఒనర్చి; వధించి - సంహరించి; సర్వభూభరము+హరించి+ప్రోవుము+అని+ప్రార్థనన్+చేయ - భూదేవియొక్క బరువు చుల్కన చేసి రక్షించమని వేడుకొనగా; సురల్+సహాయులై+ధర జనియింపుడు+అందఱును - దేవతలు మీరెల్లరు మీమీ అంశముల భూలోకమున పుట్టుడు; తాను - నేను - హరియనుట; జనించి+హరింతు+దుష్టులన్ - రాక్షస సంహార మొనర్తును; కృష్ణుడై జనించి కంసాది అసుర సంహార మొనర్చెను. సురలు గోపకులైరి,

పాండవ : శిశుపాలాది దుష్టరాక్షస సంహారమునకై దేవతలు పాండవులు వారిపక్షమువారునై జనించిరి—కడమసమము.

రాఘవ : దుర్భర సురవైరి - దేవతలకు శత్రువు; పంక్తిముఖ - రావణాసురుని; ముఖభంగము+ఒనర్చి+వధించి - సంహరించి - కడమసమము. సురులు వానరులై జనించి హరి యవతారమైనరామునికి సహాయపడి రాక్షసకుల నాశన మొనరించిరి.

క. అని హరి సురులను బనిచిన
మునుకొని వారలు విరాజమూర్తులును మహా
వనిలో సుమనోహరులై
జనియించిరి బలముగలిగి జనసత్వములన్. 32

యాదవ : మహావనిలో బృందావనమున గోపకులమున సురలు మహాబలులై జనించిరి.

పాండవ : హరిపనుపున సురలు పాండవులై పాండవపక్షమువారై భువి జన్మించిరి.

రాఘవ: నరులై వానరులై సురలు హరియాదేశమున భూలోకమున జననముగాంచిరి. (అవనిలో వనిలో—నరులై వానరులై)

వ. అంత నక్కడ—

మూడింటికి సమము: ఆ మధురలో; ఆ అరణ్యములో; ఆ అయోధ్యలో;

గీ. చాల నారాజు తన పూర్వజన్మమందు
తగిన పుణ్యంబు సేయమి దాను సుతుల
బడమిఁ గనలేక మౌను లపుత్రులకును
గతులు లేవని పలుకుట మతిని దలఁచి. 33

యాదవ: చాలన్+ఆరాజు - వసుదేవుడు; తన పూర్వజన్మమందు - గతజన్మలో; తగిన+పుణ్యంబు+సేయమి - సుకృతముసేయలేదుగాన; తాను+సుతుల+పుడమి+కనలేక - సంతానహీనుడయ్యె; మౌనులు - ఋషులు; అపుత్రులకును - సుతులుకననివారికి; గతులు+లేవని+పలుకుట+మతిని+దలచి - సద్గతిలేదనుటను మనసునదగుల చాల విచారించి—

పాండవ: పాండురాజు—కడమసమము.

రాఘవ: దశరథుడు—కడమసమము.

చ. కులగురు ధర్మవర్తన నకుంఠితకీర్తి నరుంధతిన్ మహో
జ్వలసతి నేలునట్టి గుణజాయ సమున్నతిజాయమాన నీ
తుల దగునట్టి యా సుమతితో సుతపస్తుతుఁ డా ప్రజేశుఁ డా
కులమతి వేధగాంచి పలుకున్ సుతహీనత దైన్య మెప్పుడున్. 34

యాదవ: కులగురు - రాజపురోహితు; ధర్మవర్తన...సుమతితో - చరితలో, యశస్సున, మహాపతివ్రత అయిన అరుంధతి భర్త వశిష్ఠుని మించిన ఆ సుమతితో - బుధునితో; సుతపస్తుతుడు - తపస్విజనముచే కొనియాడబడువాడు; ఆ ప్రజేశుడు - రాజు వసుదేవుడు; ఆ కులమతి+వేధగాంచి - వికలుడై బాధపడుచు; సుతహీనత+దైన్యము+ఎప్పుడుఁ - సంతులేమి దీనుడై; పలుకున్ - ఇట్లనును.

పాండవ: నయవర్తనమున, కులగురు వశిష్ఠుని కాంత మహాపతివ్రత గుణవతి, సద్వంశసంజాత ఆ అరుంధతిని పోలిన కాంత కుంతినిగాంచి ఆ సుదతితో సంతులేమి దైన్యమున ఇట్లనుచున్నాడు.

రాఘవ : దశరథుడు కులగురువు వశిష్ఠునితో నిట్లనుచున్నాడు.

చ. చదివితి నెల్లవేదములు శాస్త్రములన్, ధృతి భూసురేంద్రులన్
విదితముగా జయించితి నవీన తపోవ్రత దానధర్మ సం
పద దగురీతి జేసితి నభంగత నీదగు ప్రోపుగాంచితిన్
దుది సుతహీన దీనత ననున్ వెతగుందఁగఁ జేసె నేమనన్. 35

యాదవ : వసుదేవుడు సుమతి గురునితో నిట్లు వాపోవును. వేదశాస్త్రములు పఠించితి; రాజుల నెల్లరను సామంతులుగా జేసికొంటిని; తపమొనరించితిని; వ్రతనియమము పాటించితిని ; ధానధర్మములొనరించితిని ; నీయాజ్ఞానువర్తియై మననేర్చితిని; తుదకు సంతానహీనుడనై బాధపడుచుంటిని. విధినేమందును అని విచారించును.

పాండవ : నీదగు ప్రోపుగాంచితిన్ - నీవంటి పతిశీలను చేపట్టితిని. కొదువ సమము.

రాఘవ : కులగురువు వశిష్ఠునితో దశరథుడు దీనముగ తన సంతానహీనతను గూర్చి విచారించును.

క. ఆతనుక్రీడలఁదగు స
త్సుతులన్ గనలేని తనకు శుభము లవేలా-
చతురాస్యభవ సుఖంబన
సతమున మరియొకటి గలదె సద్గతి గలదే. 36

యాదవ : సుమతి గురునితో వసుదేవుని వాక్యము. ఆతను+క్రీడలన్+తగు+సత్+సుతులన్+కనలేని+తనకు - బాల్యక్రీడల నొప్పు చిన్న కొమరులను కని ఆనందించు భాగ్యము లేని తనకు ; శుభములు+అవి+ఏలా - తక్కుంగల సంపత్తుతో పనియేమి ; చతురాస్య+భవ+సుఖంబు+అన - బ్రహ్మానంద సౌఖ్య మనునది ; సతమున - శాశ్వతమైనది ; మరియొకటి కలదె - సత్సంతాన భాగ్యమే బ్రహ్మానంద సహోదరము—దానిని మించిన భాగ్యము అన్యము లేదు ; దానిని మించి సద్గతి+కలదే - సుగతియు వేరొకటి లేదు.

పాండవ : ధర్మశీలయయిన సతియందు సంతానము వడయు భాగ్యము, మునిశాపమున తనకు లేదని విచారించును.

కొదువ సమము.

రాఘవ : దశరథుడు తనకు సంతులేమి తెల్పుకొనుచు గురునితో నిట్లనెను. యాదవార్థముతో సమము.

గీ. కాన వేడెద పితరుల ఘనఋణంబు
బాయఁగాఁ దగ దేవరన్యాయముగను
సుతులఁగనసేయ దయసేయు శుభచరిత్ర
యనవరతము నీప్రాపంది యగునె సెడగ. 37

యాదవ : వసుదేవుడు సుమతి గురునితో నిట్లనెను. ధర్మయుక్తి సుతులను గని పితరుల ఋణముతీర్చుకోవలెను. శుభచరిత్ర - సువ్రతుడా ; వర న్యాయముగను - వరప్రసాదమున ; సుతులఁ+కనసేయ+దయసేయు - వ్రత మేదేని యుపదేశించి సంతానమువడయు నుపాయముతెల్పుము; అనవరతము+నీప్రాపు+అంది+సెడగఁ+అగునె - సదా నిన్ను సేవించు నేను దుర్గతిపాలు కారాదుగదా.

పాండవ : పాండురాజు సతియైన కుంతితో ఏ దేవతనైన ఆరాధించి సుతప్రాప్తికి మార్గ మరయుమని బోధించును. పతివ్రతవు, సాధ్వివి, నిన్ను చేపట్టి నేను దుర్గతిపాలు కారాదనెను.

రాఘవ : దశరథుడు కులగురువు వశిష్ఠునితో ననెను. యాదవార్థముతో సమము.

క. పరపురుషుల సంగతినే
గర మతినింద్యతను జెందగాదగునే మీ
శరణంబందియును సుతను
పరిహారణం బింతకన్న బరమశుభ మగున్. 38

యాదవ : మీ శరణంబు+అందియును - మీ ప్రాపుకాంచియు ; పరపు+ఋషుల సంగతి - ఋషిసమాజమున ; కరము+అతి నింద్యతను+చెందగాఁ+తగునే - నిందపాలు కారాదు గదా ; పరపురుషుల సంగతి - అన్యులు మానవ సమాజమున సుతహీనుని చుల్కనసేతురు ; అటుల కారాదుకదా ; అటుల నింద పాలగుటకన్న; సుతను+పరిహరణంబు - దేహత్యాగము; ఇంతకన్న ; పరమ+శుభమగున్ - చాలమేలు.

పాండవ: కుంతి పతితో ; మీశరణంబందియును-నీవంటిపతిని వడసియు; పరపురుషుల సంగతిఁ - పతిశీలము అన్యుల నాశ్రయించి సంతానము వడయు టతిహీనముకదా, అంతకన్న చావు మేలనును.

రాఘవ : దశరథుడు వశిష్ఠునితో ననెను. యాదవార్థముతో సమము.

సీ. అనిన నా బుధపూజ్యుఁ డనియె నీకేటికి
మది విచారముజెంద మనుజవరులు
మును నివ్విధంబున ననపత్యులై యుండి
ధరణిదేవులవల్ల ధర్మయుక్తి
పుత్రకామేష్టిని బుత్రులఁ బడసిరి
నీవు నీసద్వృత్తి నియమమొప్ప
నటుజేయ గలుగుదు రాత్మజులన నవ్వి
ధానంబునకు పితృస్థానమంది

గీ. చిన్ననా డుండగ నజఋషిప్రణీత
మగు సుమంత్రోపదేశ మిం దమరియుండు
నందు కెవరి రావింతు ప్రత్యక్షముగను
దెలుపుమన నాత్మఁ దగనెంచి పలికె నతడు. 39

యాదవ : అనినన్ + ఆబుధపూజ్యుడు + నీకు + ఏటికి + మది + విచారము + చెందన్ + అనియె - ఆ సుమతి వసుదేవునితో ననుచున్నాడు. నీవు విచారించ పనిలేదు; మనుజవరులు.... బుత్రులఁ బడసిరి - రాజులు పూర్వము నీవలెనే సంతానము లేనివారై; ఇహమున దేవతల వలన, విధ్యుక్తముగా పుత్రకామేష్టి నొనర్చి సంతానము గనిరి. నీవు - నీసద్వృత్తి నియమము + ఒప్పన్ + అటు + చేయన్ - దివ్యమయిన నియమసంపత్తు నీకు గలదు. మనసును నియమించి నీవే వేల్పునయిన నర్చించిన ; కలుగుదురు + ఆత్మజులు - కుమారోత్పత్తి కాగలదు ; అన వసుదేవుడు ; ఆ + విధానంబునకు - అమరియుండు - బాల్యమున తండ్రి సమక్షమున నున్నయపుడు బ్రహ్మర్షులు తెల్పిన విధి యొందు గలదు. కావున నేదేవతను ధ్యానించి యాతని యనుగ్రహము వడయుట యుక్తమో తెల్పుడని యా గురుని వేడ నతండు.

పాండవ : కుంతి పరపురుష సంసరణ మధర్మమన పతి యామె కిట్లనును. పూర్వము పరశురామునివలన ధరణి క్షత్రియ రహితముకాగా, రాజపత్నులు ; ధరణిదేవులవల్ల ధర్మయుక్తి - సద్ధర్మమనియే భూసురులను సేవించి సంతానవతు లయిరి. నీవును అటులచేయుట న్యాయమన, పతికి కుంతి యిట్లనెను. అవ్విధానంబునకు... అమరియుండు - బాల్యమున పుట్టింటనున్న యపుడు ; అజఋషి -

బ్రహ్మర్షి నారదుని కృపచే కలిగిన ఉత్తమమంత్రమహిమ కలదు. ఆ మంత్ర ప్రభావమున నేదేవతనైన ప్రార్థించి ప్రత్యక్షముచేసికోగలను. కావున ఏదైవ ముమ ధ్యానించి రావించనగునో తెల్పుదని పతిని వేడెను.

రాఘవ : దశరథుని ప్రార్థన మాలించి కులగురువు వశిష్ఠు డాతని కిట్లనియె. పూర్వము ప్రభువులు సుతునిగోరి పుత్రకామేష్టినిజేసి సంతానవంతులైరి. ఇంతకుమున్ను బ్రహ్మలోకమున (వశిష్ఠుడు బ్రహ్మమానసపుత్రుడు) ఋషిసమాజ మున విన్నవిధి నేనెరుంగుదును. ఆ యజనము చేయవలెనన దాని కేయే యేర్పా టులు గావించవలె నెవరిని రావించవలె నుపదేశించుడని గురునివేడ వశిష్ఠుడాతనికి ట్లుపదేశించెను.

గీ. హరి దయాశాలి సమవర్తి యఖిలపుణ్యుఁ
డవని సురముఖ్యుఁ డార్తార్తి హారి హారి
సరస శాంతకాంతుఁ డతని సంయమాత్మ
న త్తపోవృత్తి దెమ్ము ప్రత్యక్షలీల. 40

యాదవ : గురువు వసుదేవునితో; హరి - శ్రీవిష్ణువు ; దయాశాలి - కరుణాసముద్రుడు; సమవర్తి - పక్షపాతము లేనివాడు; అఖిలపుణ్యుడు - పుణ్యాతి శాయి; అవని+సురముఖ్యుడు - దేవతాగ్రసరుడు; ఆర్త+ఆర్తి+హారి - శరణా గతుల దుఃఖములను పరిహరించువాడు; హారి - మనోహరుడు; సరస, శాంత, కాంతుడు - శాంతరసమన్వితుడు ; సంయమ+ఆత్ముడు - నిగ్రహానుగ్రహ సమ ర్థుడు : ఆ+తపోవృత్తి - నీ వ్రతనియమమున ; ప్రత్యక్షలీల - సాక్షాత్కరించు కొని ఆ శ్రీమహావిష్ణువును, తెమ్ము - ధ్యానించిపొందుము.

పాండవ : పాండురాజు కుంతితోనిట్లనెను. సమవర్తి - యమధర్మరాజు, కొదువపదము లాతనికి విశేషణములు. నీ మంత్రమహిమవలన ఆతనిప్రసాదమున సుతుని పొందుమని యుపదేశించెను.

రాఘవ : వశిష్ఠుఁడు దశరథునితో ననెను. సరస+శాంత+కాంతుడు+ సంయమ+ఆత్ముడు - ఇంద్రియనిగ్రహముగల మహామతి శాంతాదేవిభర్త ఋష్య శృంగుడు అతనిని పూజించి రావించుమని యుపదేశించెను.

క. అని తన యజనార్థము నా
తనిమతి దగగూర్చి సవనధర్మక్రియ న

మ్ముని మంత్రకలన జేసెను
వినయము నియమంబు మీఱ. విధ్యుక్తగతిన్. 41

యాదవ : గురువాక్యానుసారము వసుదేవుడు; తనయ+జన+అర్థము - సంతానము కాంక్షించి, సవనధర్మక్రియన్ - యజ్ఞవిధానమున; తనమతితగన్+ కూర్చి - మనసును నియమించి ; అమ్మునిమంత్రకలన - సుమతి యుపదేశానుసారము హరిని ధ్యానయుక్తి చిరము స్మరించెను.

పాండవ : కుంతి దుర్వాసునివలన గాంచిన మంత్రబలమున సుతునపేక్షించి యముని ప్రార్థించెను.

రాఘవ : యజ్ఞమును చేయబూని (పుత్రకామేష్టి) వశిష్ఠుని యాదేశానుసారము శాంతాకాంతు ఋష్యశృంగుని రావించి యథావిధి యజ్ఞముచేసెను.

చ. హరి యపు డద్వయైన జతురాకృతులన్ నిజమాయ తోడుగా
ధర జనియింపఁగాఁ దలఁచి దస్రమరుద్యము లగ్రగాములై
యరుగ సురల్ భజింపఁగ ననంత మహోదరసారయుక్తిను
ర్వరకును జేరఁ దద్యుతి విభావ సుజాతుఁ డొకండు దోచుచున్. 42

యాదవ : అపుడు - వసుదేవుడు నిశ్చలభక్తి తన్ను ధ్యానించ, హరి - శ్రీమహావిష్ణువు; అద్వయైన - (బలరామకృష్ణులుగా జనించనుండియు) భేదము లేని (స్వాంశమేగాన) చతుర+ఆకృతులన్ - శృంగారమూర్తులై నిజమాయ తోడుగా+వారి జన్మకుముందు సప్తమ గర్భము విష్ణుమాయ యశోదకు జనించి వ్యత్యస్తముగా అష్టమగర్భము ఇట దేవకికి కృష్ణుండట రోహిణికి ఇంచుకముందు బలరాముండుగా నావిర్భవించ యశోదతనయ నాహరించి కృష్ణునామెవద్ద నునిచి వసుదేవుండు రాగా శిశురోదనము విని చారులు కంసునకుఁ దెలుప నాతడు త్వరిత గతి నటకేగి తనయుడుగాడు కోడలని దేవకిచూప నందు కియ్యకొనక నాబాలను నేలవైచి కంసుడు కొట్టె. క్రిందపడక మాయ అష్టభుజదుర్గ అయి అంతరాళమున నిల్చి నీ మృత్యువు అన్యత్ర పెరుగుచున్నాడని విన్పించి మాయమాయెను. ఇది విష్ణుమాయ ముందుగా జన్మించి జరిపిన వృత్తము) ఈ తీరున హరి ధర+జనియింపన్+తలచి - భూమి కవతరించ నిశ్చయించి; దస్ర - అశ్వినీదేవతలు; మరుత్ - వాయువు; యమ - దక్షిణ దిగధిపతి, యమధర్మరాజు; అగ్రగాములై ముందుసాగుచు తన్ను కొలిచిరా ; సురల్ భజింపఁ - తక్కుంగల దేవతలు

సేవించుచు రాఁగా ; అనంత+మహా+ఆదర+సారయుక్తి - ఆదిశేషువు మహా ప్రీతితో+ఉర్వరకునుజేర - ఇలకు చనుదేర (అనంతుడు బలరాముడయి జన్మించును) తత్+ద్యుతి - ఆ తేజస్సును, విభావ - లక్షించ; సుజాతుడు+ఒకండు+తోచుచున్ - ఒక మహాపురుషుడు ఆ దేవకీ వసుదేవులయెదుట ప్రత్యక్షమయి (ముందు పద్యముతో నన్వయము)

పాండవ : అపుడు - కుంతి, పతి యాదేశానుసారము యమధర్మరాజును ధ్యానించగా; దిక్పాలురకెల్ల పెద్ద ఇంద్రుడు వారి; అద్వ+అయిన స్వాంశమే సత్యమున కభేదమయ్యె: చతుర+ఆకృతులన్+తానుగాక నల్గురుగా—పంచపాండవులనుట, దస్ర - ఆశ్వినులు - నకుల సహదేవులు, మరుత్ - వాయుసంభవుడు, భీముడు; యములు - యమాంశ ధర్మరాజు (వెనుక కన్వయము) ధర్మజ, భీమ (ఇంద్ర) అర్జున నకుల సహదేవులు ఇట్లు తానుగాక అంశజాతములు చతుర నాలుగయిన; ఆకృతులఁ - రూపముల ; ధర జనియింపఁగాఁ+తలచి - ఇల పుట్ట బోవ; అనంత+మహా+ఆదర+సారయుక్తి (దర భయము) మహా+దర+సారయుక్తి - మహా భయభక్తులతో భజింపఁగ - సేవించుచు రాగా; తద్యుతి+విభావజాతుడు+ఒకండు+తోచుచుఁ - ఆ దేవతాప్రభువయిన ఇంద్రుని ముఖ్యాంశము మహాతేజము లక్షించగా నొక మహాపురుషుడయి ధర్మమూర్తి కుంతికి ప్రత్యక్షమయి (తనయుండయ్యెను. పాండవులలో నగ్రజుడు కుంతీ పుత్రుడు ధర్మరాజు యముని యంశముగా నుదయించెను).

రాఘవ : అపుడు, హరి - శ్రీ మహావిష్ణువు; అద్వ+అయిన - స్వీయాంశమును విభజించి చతుర+ఆకృతులఁ - నాలుగు రూపములుగా (రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు) నిజమాయ...చేరఁ - విష్ణుమాయ యనుగమింప సురలు సేవించుచురా ; తత్+ద్యుతి—తోచుచుఁ - ఆ మహాతేజస్సు ఒక మహా పురుషుడుగా యజ్ఞవేదిక నావిర్భవించి ——

క. కలుషము లెడగా బాయస
కలశము లాలించనిచ్చి ఘనవర మనియెన్
గలయఁగ ననుగ్రహించితి
గలుగు బ్రజ పరిగ్రహాత్మ గతమగు దీనన్. 43

యాదవ : కలుషములు + ఎడగాఁ + పాయ - పాపములు నీడిపోగా సకల+శములు+ఆలించఁ+ఘనవరము+ఇచ్చి+అనియెఁ - (పూర్వ వృత్తాం

తము—అదితి కశ్యపులు తప మొనర్చి విష్ణుని ప్రసన్నునిగా జేసికొన హరి యనుగ్రహించి యపుడు తానే వారికి తనయుడుగా జనింతు ననెను. ఇపుడు హరి ప్రత్యక్షమయి ఆనాడు తా నిచ్చిన వరముననే యిపుడు తాను వారికి తనయుడుగా ప్రభవించనుంటను తెల్పెను) ఋషులెల్లరు విన వరమిచ్చితి ననెను. కలుగు ప్రజ - సంతానము ప్రాప్తించును. ఈనా డిపుడే నా తేజస్సు నీ కాంతా గర్భమున నావిర్భవించు ననెను.

పాండవ : ఆ ధర్మమూర్తి కుంతికి పాండురాజునకు ప్రత్యక్షమయి అటనున్న ఋషులు విన నీకు సుతుడ నగుదునని వరమిచ్చి యంతర్హితుం డయ్యెను.

రాఘవ : ఆ యజ్ఞవేదిక హరి యావిర్భవించి, కలుషములు+ఎడగాన్ - పాపము లంతరించ ; పాయస+కలశము - యజ్ఞపాయసముతో నిండిన పాత్ర ; లాలించన్+ఇచ్చి-ప్రేమపూర్వకముగ దశరథునకునొసంగి; కలయగన్+అనుగ్రహించితి+ఘనవరము+అనియెన్ - నీకుసంతసించి, వరమిచ్చితి; ఈ పాయసము ప్రియకాంతలకిమ్ము ప్రజదీనన్ పరిగ్రహాత్మగతము + అగున్ - ఈ పాయసము స్వీకరించుటచే నీ పత్నులు సంతానవతులగుదురనెను.

సీ. తగఁబల్కి యప్పుడు తదనుభవంబునఁ
బొలుపొంద పుణ్యగర్భుండు నాఁగ
నదితి కశ్యపపుత్రుఁ డగు వామనుండన
బుట్టినవెనక నీ భూమిఁ గావ
బలవిక్రమంబుల బరగిన సంతతి
బుట్టు సంతోషంబు బూను నాత్మ
ననుచు వేడుకమీఱ ఘనతదాత్మస్థాన
మున నిల్చి పొల్చిన ముదితమతిని
గీ. నర్చితాతిథి (దితి) వసుదేవుఁ డా ప్రజేశుఁ
డాథిజెందక పాయస మగ్రలీల
వసుధ లోకైకసుందరి పట్టమహిషి
బిలువగాబంచి దయనేసి కలసిమెలగ. 44

యాదవ : ఈనాడు దేవకీవసుదేవులు గతజని అదితికశ్యపులు. వారలా హరిప్రసాదమున కొన్నిజన్మ లా హరినే తనయునిగా బడయుచువచ్చిరి. ఒకజని

పుణ్యగర్భుడని జనించె. మరుజన్మమున వామనుండయ్యె (వామనావతారమున బలిని నిగ్రహించె) ఇపుడు (హరి దేవకీవసుదేవులతో) బలవిక్రమంబులకు+పరగినసంతతి - మహాబలులు వీరులు అయిన సంతానము; పుట్టు - జనించు; సంతోషంబు....పొల్చిన - ఆనందమున నుండుడని వారికి గాన్పించి తెలుప ననంతరము; ముదిత+మతిని....సమగ్రలీల - వసుదేవుడుసంతసించి వసుధ.... కలసిమెలగ - పట్టమహిషి దేవకిని చేరబిలచి సుఖంబుగనుండెను.

పాండవ : కుంతికి పాండురాజునకు యముడు పొడగట్టి భూభార హరణార్థము హరి దాల్చిన వామనాది అవతారములను దెల్పి ఇపుడు భూభార హరణార్థమే బల విక్రమ సంతతివారల కొదవునని వినిపించెను. పాండురాజు చాల సంతసించి కుంతితో ప్రియాలాపము లాడుచు సుఖంబుగ నుండెను.

రాఘవ : దశరథుడు యజ్ఞపురుషుని యనుగ్రహమును వడసి హరి యంశమున తనకు బలులు వీరులు సుతు లుదయింతురని విని సంతసించి పట్ట మహిషి కౌసల్యతో సుఖముగ నుండెను.

గీ. ధరణిపతి తోచి తనరిన తత్కళత్ర
దౌహృదాంశభాగముల సద్గతిగనుఁగొని
నినిదెను సుమిత్ర కులసమాన నివసతి సు
కాంత రోహిణి కలమాయ గర్భమమర. 45

యాదవ : ధరణి+పతి - భూకాంతుడు - హరి; తోచి+తనరిన - ప్రత్యక్షముకాగా; తత్+కళత్ర+దౌహృద+అంశభాగముల - హరియంశములు బలరామకృష్ణ భావముల; సద్గతి+కనుగొని - ఉత్తమ సంతాన భాగ్య మలవడ; సుమిత్ర+కుల+సమాన+నివసతి సుకాంతరోహిణి - హితుడయిన నందకులమున నివసించియున్న వసుదేవుని అగ్రమహిషి రోహిణి; అలమాయ గర్భము+అమర+నినిదెను - గర్భము ధరించెను.

(దోహిణి - రోహిణి యని దిద్దుబాటు.)

పాండవ : మంత్రబలమున నాహూతుండై, ధరణి - భూమి కవతరించి; పతి+తోచిన - యమధర్మరాజు ప్రత్యక్షముకాగా నాతని వరప్రసాదమున; సుమిత్రకుల+సమాన+నివసతిన్ - యముడు సూర్యతనయుడు - మిత్రకుల - సూర్యవంశము. సుకాంత+రోహిణికి+అలమాయగర్భము+అమర - సద్యోగర్భమున ఆ సూర్యపుత్రుని యంశమున గర్భము నిలువగాంచెను.

రాఘవ : ఆ తీరున యజ్ఞకుండమున పాయసకలశము ఇచ్చి ధరణి+పతి - శ్రీ మహావిష్ణువు ; తోచి+తనరిన - ప్రత్యక్షముకాగా ; గర్భదోహదాంశ భాగములు ఆ దశరథుని కాంతల గర్భముల నాక్రమించి నిలువ కౌసల్యాది కాంతాత్రయము గర్భములు దాల్చిరి.

వ. అట్లున్న నమ్మహీవల్లభ వల్లభాజనంబునకుఁ దదుదయంబున గర్భం బావిర్భవించు నవసరంబున.

ఆ తీరున ఆ వసుదేవుని పత్నులు, పాండురాజ మహిషి కుంతి దశరథ పత్నులు గర్భములు దాల్చియున్న సమయమున.

చ. అరుదుగ ధర్మయుక్తిని ననంతమహాదర సార సంగతిన్
హరి యపు డద్వయైనఁ జతురాకృతిరీతి నుదార సత్య సం
గర నరనాథ యోషిదురు గర్భపరిభ్రమ విభ్రమంబునన్
బరగరహించెమించెఁ బ్రతిపక్షజనక్షణ దుర్నిరీక్ష్యుడై. 46

యాదవ : హరి - శ్రీమహావిష్ణువు ; అపుడు+అద్వ+అయిన - భేదములేని ధర్మయుక్తిని ; అనంత+మహా+ఆదర+సారసంగతిన్ - అనంతుడు శేషనాగముయొక్క అంశ బలరాముడు ఆతనితో కూడినవాడై ; చతుర+అకృతిన్ - సుందర రూపముల (రామకృష్ణులుగా) ; ప్రతిపక్ష జన+దుర్నిరీక్ష్యుడై - శత్రువులకు చూడ సహ్యముకాని రీతిని; ఉదార....విభ్రమంబునన్ - వసుదేవుని కాంతల యుదారగర్భ పరిభ్రమణ విలాసమున ; పరగ+రహించె+మించె - మిగుల నతిశయించి ప్రకాశించెను.

పాండవ : ధర్మయుక్తిని - యమధర్మరాజు నంశమున ; హరి - ఇంద్రుడు తానుగాక ; చతురాకృతి - నాల్గు రూపములుగా ప్రభవించనుండి తొలుచూలు ధర్మవుగా ఆ పాండురాజు పత్ని కుంతి గర్భమున మిగుల ప్రకాశించెను.

రాఘవ : భూభార హరణార్థమయిన—ధర్మయుక్తిని - ఆతని వాగ్దానము కలిమి ; హరి - విష్ణువు ; అనంత+మహా+ఆదర+సారయుక్తి - భూదేవి భార. హరణమును ప్రీతిఫలముగా ; అద్వ+అయిన+చతుర+అకృతిరీతి - నిజమునకు స్వాంశమే అయిన నాలుగు రూపములుగా నవతరించ తలచి; (రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులుగా) ప్రతిపక్ష+జన....అరివర్గముయొక్క ; క్షణ - కనులకు; దుర్నిరీక్ష్యుడై - చూడసహ్యముకాని కాంతితో; ఉదార—విభ్రమంబునన్ - దశరథ

ధర్మపత్నుల గర్భభ్రమణ విలాసమున; పరగరహించె మించె - అతిశయముగ ప్రకాశించెను.

మ. ధరణీచక్రభరంబు బూనఁదలఁచుఛ్ దండింపఁగా నెంచు న
ద్ధరసత్యాగమహీన చోరపరులఛ్ దున్మాదఁగాఁ జూచు భా
సుర రాజాహిత వీరకోటిహరి తేజోగుంభితాగణ్య సుం
దరగర్భోన్నతి రాజకాంతల సమున్న శ్రీమనం బయ్యెడఛ్. 47

మూడింటికి సమము: గర్భమున నున్న శిశువు గుణములు తల్లి మనసున పొడసూపునని బుధు లందురు. భూభార హరణార్థము హరి దశావతారముల దాల్చుచుండుట పురాణసిద్ధము. ఆ హరి గర్భమున నుండుటచే దశావతార కృత్యములు తలపించుచున్నదీ పద్యభావము. దేవకీ రోహిణులు—రాజకాంతలు వారి సమున్నత్+శ్రీ మనంబు - ఉదార శోభాన్విత భాసురంబయిన వారి మనముల నిట్టి భావములు కలవారైరి—క్రమము పాటించబడలేదు; ధరణీ—పూనన్+తలఁచున్ - భూచక్రభరము మోయ నూహించు—కూర్మ రూపమున, శేషనాగ రూపమున; ఉద్ధర+సత్య+ఆగమ+చోరపరులన్ - వేదములను, ధరను హరించిన పెల్లగించిన చోరుల రాక్షసుల; దండింపగాన్+ఎంచున్ - మత్స్యావతార, వరాహావతార రూపమున శిక్షింపదలంచు; భాసుర+రాజ+అహిత+వీరకోటిన్ - ధర్మప్రభుతకు శత్రువు లయిన శూరులను, క్రూరులను; తున్మాదగాన్+చూచు - చంపగానెంచు; నృసింహ రామత్రయావతార రూపమున శిక్షించ తలపెట్టుమ; హరి తేజోగుంభిత+అగణ్య + సుందర + గర్భ + ఉన్నతిన్ - విష్ణునంశమున (పాండవ పరముగా ఇంద్రు నంశాంశములుగా); గర్భధారణ చేసిన రాజకాంతల - రోహిణి దేవకీకాంతల, కుంతీమాద్రుల, కౌసల్య, కైక, సుమిత్రల; సమున్నత+శ్రీమనంబు - ఉదార శోభాన్వితమయిన మనస్సులు, ఆ సమయమున అటువంటి గర్భస్థ శిశురూపమున నున్న విష్ణు అంశ సంబంధమయిన భావముల కలవారైరి.

క. ఉచ్చస్థ గ్రహపంచక
మెచ్చన్ సక్షేత్ర కేంద్ర హితగతి గ్రహముల్
పొచ్చెంబులేక మెరయగ
నచ్చుగ నభిజిన్ముహూర్త మగు శుభవేళన్. 48

మూడింటికి సమము. పంచగ్రహకూటము విరోధములులేక సమైత్రి గలిగి స్వక్షేత్రమున కేంద్రమున అనుకూలములయి కూడిన అభిజిన్ముహూర్తమున మంగళప్రదమయిన శుభసమయమున—

మ. జననాథాగ్రణి యగ్రభార్యకును భాస్వత్కాంతి పుత్రుండు సం
జననంబందె నజాతశత్రుఁడన శశ్వద్ధర్మతఁ ధర్మరా
జన సత్యంబున రామచంద్రుడన దివ్యద్భవ్యనీతిప్రయు
క్తిని సద్బుద్ధిబలుండనంగ భువినెంతే సద్గుణశ్రేష్ఠుడై. 49

క్రమాన్వయము :

మూడింటికి సమము. జననాథాగ్రణి- రాజాధిరాజయిన(రాజోత్తముడయిన), వసుదేవుని, పాండురాజు, దశరథుని, అగ్రభార్యకును - పట్టమహిషికి - రోహిణి, కుంతి, కౌసల్యలకు; (ఇట క్రమము వ్యత్యస్తమయ్యె) సద్బుద్ధి బలుండన - బలరాముండను పేరుగల; అజాతశత్రుడు, ధర్మనంశముగాన ధర్మరాజన: సత్యవ్రతంబున రామచంద్రుడన, భువిన్+ఎంతే సద్గుణశ్రేష్ఠుడై - పై ముప్వురు కుమారులు ఉత్తమగుణ విలసితులై - భాస్వత్కాంతి - వర్చస్సుగల పుత్రుండు - కుమారుడు; సంజననంబందె - పుట్టెను.

వ. అయ్యవసరంబున,

ఆవేళ —

మ. చెలఁగెఁ నిర్జరదుందుభిధ్వనులు మించెఁ దేవతాలాస్యముల్
మెలఁగెఁ జల్లనివాయువుల్ సురభులై మింటఁ బ్రసూనావళుల్
విలసిల్లఁ గురిసె న్పయోధులు సముద్వేలంబులై పొంగె ది
క్కులు తెల్వొందనరారె మేఘములు నిర్ఘోషించె మంద్రధ్వనిఁ. 50

మూడింటికి సమము. ఆ తీరున బలరామ ధర్మజ శ్రీరామచంద్రుల జనన సమయమున ఆకాశమున దేవదుందుభి ధ్వనులు మ్రోఁగె; అచ్చరలాడిరి; సురభులై+మింటన్+చల్లని వాయువుల్+మెలఁగె - సువాసనలతో మందమారుతమువీఁచె; ప్రసూనావళుల్+విలసిల్లన్+కురిసెన్ - పూలవర్షము కురిసె; పయోధులు+సముద్వేలంబులై+పొంగె - సప్త సముద్రములు తీరములెగయ పొంగె; దిక్కులు+తెల్విన్+తనరారె - దెసలు తెలుపారె; మేఘములు+మంద్రధ్వనిన్+నిర్ఘోషించె - జలధరములు గంభీరముగ నినదించె. పైన వివరించినవన్నియు శుభ చిహ్నములు లోకకల్యాణ సూచకములు.

చ. మఱియుఁగనెఁ బ్రమోదగరిమఁ గొమరు న్విభుకాంతసన్మనీ
శ్వర గురుతంత్రమంత్ర జపసత్కృతి సన్నిహితాగ్రభామరు

ద్వర కరుణానుయోగమునఁ దత్సుతుఁ డాజిని భీమసేనుఁడై
గురుతుగఁ బేరుగాంచు ధరఁగూల్చు సురారులనంచు నెంచఁగన్. 51

యాదవ: రోహిణి సుతు బలరాముని గాంచ నందుడు మునుల యనుమతిని మంత్రజపాది శాంతి సత్క్రియలు ; సన్నిహిత-సమీపవర్తులయిన ; భూసురుడ్+ వర+కరుణ+అనుయోగమున ; భూసురుల కరుణవలన ; జరిపించెను. వారు ఆ సుతుడు మహావీరుడై రాక్షసుల సంహరించునని దీవించ విని సంతసించెను.

పాండవ : కుంతీదేవి ; గురుమంత్రజపమున వాయుదేవుని ప్రార్థించగా, ఆత డామెకు ప్రత్యక్షమయి వరప్రసాదమున భీమసేనుడను కుమారునొసంగి వీరుడు క్రూరరాక్షసుల సంహరించునని తెల్పి, అంతర్హితు డయ్యెను...కుంతి ఆనందమున నోలలాడెను.

రాఘవ : యాదవ పక్షముతో సమము. రోహిణీకాంతవలె కౌసల్య అగ్ర సుతు రామచంద్రుని గన దశరథుడు మంత్రజపాది శాంతిక్రియలు జరిపించి భూసురుల కరుణవడసి యా సుతుడు శూరుడు రాక్షసకుల నాశకుండు కాగలడని విని సంతసించెను.

వ. అప్పుడది విని హితగతిని.

ఆ వార్తలు విన్న యనంతరము.

తే. సుబల తనుజాతమున నోజ సురలుమెచ్చ
నాగ నగరమందుగనియె నందనాప్తి
నిల శతైకసంఖ్య నుదుట యెన్ని యేర్ప
రించినట్టుల విభు ప్రియరీతిమించ. 52

యాదవ : సుబల + తనుజాతమునన్ - ఆ బలరాముని జననముతో ; ఓజ - క్రమముగా ; సురలుమెచ్చ - దేవతలు కీర్తించ, నాగ - కొండ ; నగరము- పురము ; కొండపల్లెలు - గోకులముల ; ఇల+శత+ఏకసంఖ్య+నూర్లకుమించి దివ్యాంశజాలు ; విభుప్రియరీతి మించ- వసుదేవునకు హరికి, ప్రీతిజనకముగా; నుదుట+ఎన్ని+ఏర్పరించినట్టుల - విధి పూర్వము నుడివినట్లు హరి భూభార హరణార్థముదివ్యులు ప్రార్థించ వారికిచ్చిన వరానుగుణముగ; నందన+ఆప్తి -వీర సంతానము; ఇల - భూదేవి ; కనియె- కాంచగల్గె ; హరియంశమున బలరామునితో పాటు మహావీరులు దివ్యులు గోకులమున గొల్లకాంతలకు సుతులై జన్మించిరి.

పాండవ : విభు+ప్రియరీతి+మించ - ధృతరాష్ట్రునకు సంతోష మతిశ యించునట్లు ; కుంతి ధర్మజ భీములను గాంచెనన్న వార్త విని ; సుబల+తనుజా తనువ - సుబలరాజు కూతురు గాంధారిగర్భమున ; సురలు మెచ్చ ; నాగ+నగర మందు - హస్తిపురియందు ; నూట ఒక్కమంది కుమారులను కౌరవులను, సుతు లను గాంచెను.

రాఘవ : ఆ శ్రీరామచంద్రమూర్తి కౌసల్య గర్భమున జననము కాగా, అదే సమయమున సురలు తమతమ అంశముల హరియానతి కొండకోనల వానరులై శతాధికములు మహావీరులు జన్మించిరి.

క. కనదుర్యోధన దుశ్శా
సన దుర్ముఖ దుర్ధరాఖ్య సంతతిఁదగువా
రిని బుణ్యజనమ్ముల పే
ర్మిని నుగ్రదశల పనుపడ ప్రేయన్దరుగన్. 53

యాదవ : భూసురులు బలరాముడు ; దుర్యోధన - యుద్ధమున సులభ ముగ జయించరానివారు ; దుశ్శాసన - సులభముగ శిక్షించరానివారు ; దుర్ముఖ - ముఖమున క్రౌర్యము చూపట్టువారు ; దుర్ధర - వేగము సహించరాని దుష్టులు ; ఇట్టి పుణ్యజనమ్ముల సంతతి పేర్మిన్ - రాక్షస సంతతియొక్క వృద్ధిని ; ఉగ్ర దశం+పనుపడ+ప్రేయన్+తరుగన్ - ఆయా సంతతులయొక్క భీకరస్థితివి ఖంకించగల సంతతి యని భూసురులు తెలియం బలికిరి.

పాండవ : నాగలోకవాసుల యంశాంశములు దుర్యోధన దుశ్శాసనాదులు జన్మించి హస్తిపురమున వృద్ధిగాంచుచుండిరి.

రాఘవ : రాక్షససంహార కారకుండు రాముండు అయోధ్యలో పుట్టి పెరుగుచుండెను.

వ. అని యవనిసురవరు లెరుంగఁ బలికి రనంతరంబున, నట్టి శుభ లగ్నంబందు.

కావ్యత్రయమునకు సమము.

చ. ప్రమదమెలర్పఁగాంచె నలరాజ ద్వితీయలతాంగి దేవకీ
రమణి మనోజ్ఞవాణి పతిరంజనశీల యశోభిరామ స
త్క్రమపృథ గీరితస్తుత విరాజిత సద్గుణపాళి కైక యు
త్తమనరునిన్సదా భరతుఁబ్రథితాహ్వాయు గృష్ణుదివ్యునిన్. 54

యాదవ : అలరాజద్వితీయ+లతాంగి - ఆ వసుదేవుని రెండవభార్య; దేవకీ+రమణి - దేవకీదేవి: మనోజ్ఞ+వాణి - మధురముగ పల్కునది. పతి+రంజన+శీల - పతివ్రత, యశః+అభిరామ - వ్యాప్తమయిన కీర్తికలది; సత్క్రమ. సద్వర్తనచే; పృథ - పలువిధముల, గీః - వాక్యములచే ; ఇతః+స్తుత - అతిశయ మయిన స్తోత్రములచే; విరాజిత - ప్రకాశించునది; మంచి నడవడిక కలదగుటచే పలువురు పలువిధముల స్తుతించ నొప్పునది; సద్గుణపాళిక+గుణరత్నపేటిక; ఏక - కేవలుడయిన; ఉత్తమనరున్ - పురుషోత్తముని. భరతున్+ప్రథిత+ఆహ్వాయు - భరత - పాలన దక్షుండను సార్థకనామము కలవాడు—హరి త్రిమూర్తులలో పాలించు శక్తి విలసితుడు; దివ్యునిన్ - దివ్యాంశ సంభవుని, కృష్ణుని - కృష్ణపరమాత్ముని; బాలభావముగన్న కృష్ణుని, ప్రమదము+ఎలర్పన్+కాంచె - ముదముతో కనెను.

పాండవ : అలరాజ ద్వితీయ - పాండురాజు పత్ని - కుంతి (ద్వితీయ - భార్య); లత+అంగి - తీగవంటి అంగము - శరీరముకలది; దేవ+కీర+మణి+మనోజ్ఞ+వాణి - దివ్యశుకోత్తమము - దివ్యశుకము - చిలుక పలుకులవంటి; ఇంపయిన వాక్కులుగలది; పతిరంజనశీల, యశోభిరామ; సత్క్రమ - సత్ప్రవర్తనకలది; పృథ - కుంతి, గీః+ఇత+స్తుత+విరాజిత - దివ్యుల పొగడ్తలచే భాసించునది; సద్గుణ - ప్రథితాహ్వాయు యాదవ పక్షముతో సమము; కృష్ణ+దివ్యునిన్ - ఇంద్రునంశమువానిని అర్జునుని, ప్రమదము+ఎలర్పన్+కాంచెన్ - సుతుని గనెను.

రాఘవ : అలరాజ+ద్వితీయ+లతాంగి - దశరథుని రెండవభార్య సద్గుణపాళి; కైక - కైకయను పేరుగల కాంత, కృష్ణ - నల్లనివానిని కర్మవీరుని; దివ్యున్ - దేవాంశసంభూతుని (ఆదిశేషు నంశము భరతుడు) భరతున్ - భరతుడను పేరుగలవానిని సుతుని గనెను. (కొదువ యాదవార్థముతో సమము.)

క. నరకిన్నర వసుదేవులు
పరమయశః పాండురాజ పార్థివులు మనో
హర దశరథ వరమంత్రులు
గురుసమ్మద మంది రపుడు కుంభినియలరెన్. 55

యాదవ : దేవకి కృష్ణునిగాంచగా; నరులు, కిన్నరులు, వసువులు, దివ్యులు మహాకీర్తి విలసితులయిన బ్రహ్మ, విష్ణు, రుద్ర, గరుడ, బృహస్పతి మొదలయినవారెల్లరు సంతసించిరి. కుంభిని - భూదేవి; అలరెన్ - ఉత్సహించెను.

పాండవ : అర్జును జన్మమునకు నరులు కిన్నరులు, వసువులు, సురులు, పాండురాజు, నృపాలురు, స్వర్వాసులెల్లరు, భూదేవియు సంతసించిరి.

రాఘవ : భరతుని జననమున నర...పాండుర+అజ ...హర ; యాదవార్థముతో సమము ; దశరథ+వరమంత్రులు-దశరథుడు, సుమంత్రాదిమంత్రులు; గురువమ్మదము - మహాసంతోష సముద్రమున తేలియాడిరి. కుంభిని+అలరెన్-భూదేవి సంతసించెను.

వ. అంత.

చ. క్షమమహిమాద్రి యానృపుని సాధ్వి ద్వితీయసుమంత్ర పూజ్య య
ట్లమరఁగఁగాంచె నాతనయులయ్యెడ బొల్చిరి దివ్యమూర్తులై
యమరభిషగ్వరుల్ బొడమినట్టులుగాఁ గవగా మనోజ్ఞులై
క్రమమున నన్నదమ్ములకు రాజిలఁగూరిమి జోడులై తగన్. 56

యాదవ : క్షమ+మహిమన్+అద్రి - మహత్తరమయిన ఓరిమికలది కావ; అగుణమున అద్రి - కొండవంటిది ; ఆ నృపుని సాధ్వి+ద్వితీయ - ఆ వసుదేవుని రెండవభార్య దేవకి ; సుమంత్రపూజ్య - భర్త హరిపదభక్తివలన పవిత్రురాలు; అట్లు+అమరగన్+కాంచె - కృష్ణునారీతిని కనెను ; ఆ తనయులు+ఆయ్యెడ ; దివ్యమూర్తులై - ఆ రామకృష్ణులు, దివ్యరూపముల ; అమర... అట్టులుగా - దేవవైద్యులు అశ్వినీదేవతలే జన్మించిరో యన్నట్లు; కవగా - జంటగా ; మనోజ్ఞులై - చూడచక్కనివారై ; క్రమమున - జోడులై+తగన్ - అన్నదమ్ములకు ప్రేమాతిశయముప్పతిల ; సదావిడువక - పొల్చిరి - ఒప్పిరి.

పాండవ : క్షమ+మహి - ఓర్పునందు భూదేవి ; ఆ నృపుని ద్వితీయ సాధ్వి - ఆ పాండురాజు రెండవభార్య ; మాద్రి - మాద్రి అను పేరుగలది ; సుమంత్రపూజ్య - కుంతీదేవి ఉపదేశించిన మంత్రమునుపొంది పవిత్రురాలయినది; అశ్వినీదేవతల వరప్రసాదమున, వారే తమ అంశముల జన్మించినవారువోలె నకుల సహదేవులను వారు (ముందు పద్యమున పేర్కొనబడినవారు) ప్రీతి గదుర, విడువక, కవలై పొల్చిరి - ఒప్పిరి.

రాఘవ : క్షమ+మహిమ+అద్రి+నృపునిసాధ్వి ద్వితీయ - ఆ దశరథుని కాంత - సుమంత్ర - సుమిత్ర ; పూజ్య - పవిత్రురాలు ; లక్ష్మణ శత్రుఘ్నులను కవలగాంచెను. కొదువ పై యర్థముతో సమము.

తే. రామకృష్ణులనంగను భూమయుక్తి
ఘనత లక్ష్మణ శత్రుఘ్ను లనఁగజెలిమి
నకుల సహదేవులనువారు ప్రకటలీల
రామభరతులనఁగఁబొల్చి ప్రేమఁదగిరి. 57

ఆ కవ లాయానామములచే నొప్పిరి — సుగమము. త్ర్యర్థముల సమము. యాదవ, రాఘవ, పాండవ, రాఘవార్థముల క్రమాన్వయము కవలు.

సీ. అంత నందయశోద యాత్మజసుఖమున
గనుటను హరిమాయఁ గనక దాన
నఖిలంబుమఱచిన నాపూజితాతిథి
వసుదేవుఁడాత్మజుఁ బొసఁగనునిచి
తత్ప్రజఁగొని తెచ్చి తగఁజూప బావన
తవిరోధిజంపు బాధలకుఁదప్పి
చనఁగననుచువేడ్క సద్బుధులెన్నఁగ
నందతద్భార్య లానందమంది
తే. వరసుత భ్రాంతిచేఁబెంచ వారికపుడు
జాతకర్మ నామకరణ సత్క్రియాదు
లతఁడుదేర్చె వసిష్ఠ గర్గాతిశాయి
మునిపురోహిత జనులచే మొదటిరీతి. 58

యాదవ : అంత - అనంతరము; నంద+యశోద - గోకులమున, నందునికాంత యశోద ; ఆత్మజ+సుఖమునన్+కనుటను - సుఖముగా ప్రసవించి కుమార్తెను గాంచగా ; హరి మాయన్+కనక - విష్ణు మాయచే ఒడలెఱుంగక యుండ ; అట మధురలో దేవకి కృష్ణుని గాంచగా ; ప్రత్యక్షమయిన హరి యాదేశమున వసుదేవుడు, ఆ బాలుని గొంపోయి యశోదప్రక్క నిడి (అర్ధరాత్రి యమున దారి యీయ, ఆదిశేషువు కాపాడుచు కూడరాగ వసుదేవుడు గోకులమున కేగి యశోదప్రక్కను కృష్ణునుంచి అట శిశువుగా జన్మించిన యోగమాయను దెచ్చి దేవకికీయ, అనంతరము కారాగార సంబంధమయిన రక్షకృతులు తనకున్న నిగళములు తిరిగి యథాపూర్వము నిలువ నపుడు శిశువు రోదించ కావలివార లేగి కంసునికి దెలుప నాతడు వచ్చి 'అన్నా బాలుడుకాడు. బాలయిది' యన్నను వినక దేవకి యొడినుండి కన్యను బలాత్కారముగా గైకొని నేలపై వైచి కొట్ట నా యోగ మాయ మింటికెగసి అష్టభుజయయి యా మూర్తినితో నీ మిత్తి అన్యత్ర పెరుగు చున్నాడని తెల్పి అంతర్ధానము కాగా, నంత దేవకీ వసుదేవులపై కినుక మాని

వారలను నిర్బంధమునుండి తొలగించి వారి గృహమునకు బంపి యనంతరము వెదకి వెదకి పుట్టిన శిశువులను జంపమని పూతన, అఘాసుర శకటాసురాదులను బంపించెనను పురాణ గాథ యనుసంధించుకోవలెను) తత్ర్వజ-శిశురూపి యయిన యోగమాయను ; కొనితెచ్చి తగన్+చూప - పావనత కంసునకు సత్యవాక్కల్మి నొప్పింప ; విరోధి+చంపు+బాధలకు+తప్పి - కంసుని హింసకు లొంగక ; చనగ - మింటి కెగసిపోగా ; వేడ్క+సద్బుధులు+ఎన్నగ - సురలు భూసురులు కీర్తించ ; అట - ఆనందకులమున ; తద్భార్యలు - యశోదయు ; వసుదేవు నగ్ర మహిషి రోహిణియు ; వరసుత భ్రాంతిచేన్+ఆనందమంది - బలరామ కృష్ణు లిర్వురు స్వీయ సంతానముగా సంతసమునఁ బెనుచుచుండ ; ఆ రామకృష్ణులకు, వందుని యాదేశమున - ఆ పూర్వాచారము ననుసరించి ; వసిష్ఠగర్గ+అతిశాయి - వసిష్ఠగర్గాది మునుల యుపదేశమున ఇష్టులయిన పురోహితులచే ; నామకరణ సత్క్రియాదులు - నామకరణము, చౌలము, ఉపనయనము మొదలయిన సత్క్రియలు ; అతడు - ఆనందుడు ; తేర్చె - జరిపించెను.

పాండవ: అంతన్+అంద - ఆ అరణ్యమున; పాండురాజు యశః+ఉదయ+ఆత్మజ+సుఖమునన్+కనుటను - కీర్తి విస్తారమున భాసించు కుమారులనుగాంచి, మునులే నీ కుమారులు విరోధుల బాధలకు లొంగక వీరులయి వన్నెకెక్కుదురనగా, సంతసించి, వరప్రసాదమున సద్యోగర్భమున గాంచిన యా కుమారులను, సంప్రీతి సాకుచు ఆముని పురోహితుల యాదేశమున నామకరణాది సత్క్రియలు జరిపించెను. తత్+భార్యలు+ఆనందమందిరి - కుంతీ మాద్రులు మోదమలర - ఆ సుతులను పెంచిరి,

రాఘవ: అంతన్+అంద - దశరథుడా అయోధ్యలో విష్ణునంశమున రామాదుల సుతులగాంచి, వసిష్ఠాది ముని పురోహితులీ సుతులు అరుల జయించి ప్రఖ్యాతి గాంతురన విని ముదమున పెంచుచు, కాంతలానందమంద, నామకరణాది సత్క్రియలు జరిపించెను.

ఆశ్వాసాంత ముక్తపదగ్రస్త మత్తేభము

మ. భువనావన్య సమాన మానసలసత్ప్వాజాత్త సన్మాన, మా
నవతీరత్యవమాన మానవదనూన ప్రేమసంధాన దా
నవనిర్మూలన భానభానవకులానందైక సంధాన దా
నవ రామూల్యవిమాన మానవజగన్నానావతారాంకనా. 59

(పైపద్యము దశావతార సూచకము)

భువనా - జలము - తత్సంబంధమయిన అవతారములు మత్స్యకూర్మములు ; వన్య - వన - అరణ్యసంబంధి వరాహ నారసింహావతారములు; సమాన+మానస - అచంచలమయిన మనస్సుతో గురువు శుక్రాచార్యు లెంత చెప్పినను వినక ఆడితప్పనను దృఢచిత్తమున ; లసత్+ప్రకాశించు ; పూజ+ఆత్త - పూజ్యభావమున ; అతిథినర్చించు సంకల్పముతో ; సన్మాన - గౌరవము పొందిన ; హరి - వామనావతారము ; మానవతీ+రతి+అవమాన+మాన - అభిమానమున తల్లి నవమానించిన క్షత్రియజాతముల ముయ్యేడుమారులు వధించిన పరశురామావతారము ; సద్+అనూన+ప్రేమ+సంధాన - సత్యవాక్పరిపాలనశీలుడు; దాశరథి - రామావతారము ; దానవ నిర్మూలన - రాక్షససంహారము నిమిత్త మవతరించినవాడు ; భానభానవ+కుల+ఆనంద+ఏక+సంధాన - చంద్రవంశ్యులైన యాదవపాండవకులముల కానందదాయకులు బలరామకృష్ణులు ; దాన+వర+అమూల్య+విమాన - అహింసా పరమోధర్మః అనునదియే ముఖ్యసిద్ధాంతము ; బౌద్ధధర్మము. బుద్ధావతారము. మానవ+జగత్+నానా+అవతార+అంకనా - మానవలోకమున నానావతారముల ధరించిన గోపాలకృష్ణ బ్రహ్మమునకు.

పాదాంతోదస్త పాదాద్యంత యమక సింహావలోకన
ముక్తపదగ్రస్త కందము.

క. భువనాకర వరభవనా
భవనాకాధిపదిగీశ భాసురనవనా
నవనానాజగదవనా
దవనాశన భరితసర్వ ధరణీభువనా. 60

భువన + ఆకర + వర + భవనా - పదునాలుగు లోకములకు ఆధారభూతమయిన శ్రేష్ఠమయిన లోకము—వైకుంఠము (నివాసముగా) గలవాడా ; భవ - శుభులు, సత్తామాత్రులయిన ; నాకాధిప - స్వర్పతి-ఇంద్రుడు ; దిక్+ఈశ - అష్టదిక్పాలురు ; భాసుర - ప్రభావయుతులు ఇతర దేవతావీకమువారిచే ; నవనా - నుతింపబడువాడా ; నవ+నానా+జగత్+అవనా - నూతనముగా సృజింపబడే బ్రహ్మాండములనెల్ల రక్షించువాడా ; దవ+నాశన - అరణ్యము-సంసారారణ్యమును నశింపజేయువాడా ; భరిత+సర్వ+ధరణీ+భువనా - సర్వభూభారమును భరించువాడా.

పంచచామరము.

పరాపరాపరాపరాగ్ర భాగభాగసిక్షతా
ధరాధరాధరాధరారి తాగతాగతాశ్రితా
కరాకరాకరాకరారి కాండకాండకార్ముకా
చరాచరాచరాచరాభ శారశారదాయశా. 61

పరా, అపరా, పరాపరా+అగ్ర+భా+గసిక్షతా ఇహము+పరము, పరాత్పరము— ఇట్లు భాసించే ప్రకృతి ముఖమున భా - ప్రకాశించే, గసి - ముల్లు - శల్యము దానిని క్షతా - నశింపజేయువాడా ; భవహరణా అనుట; ధర+అధర+ధరాధర - భూమి, పాతాళము, అంతరాళము, ఇందు అరితా+గతా - శత్రువులకు చిక్కిన; ఆగతా - వచ్చిశరణన్నవారికి; ఆశ్రితా - రక్షకుడా; శరణాగతత్రాత — కర+అకర+కరాకర - కర-కిరణము-జ్ఞానము అకరము - అజ్ఞానము ; కరాకరము - జ్ఞానాజ్ఞానస్థితి, అరి - శత్రువులు-లోకకంటకుల శిక్షించుటకై కాండకాండకార్ముకా - పుంఖానుపుంఖములు బాణములతోడి ధనువు కలవాడా— అజ్ఞానధ్వాంతమోహా అనుట— చర+అచర+చరాచర - జడము, అజడము, జడాజడములుగా; ఆభ - ప్రకాశించే; శార - చిత్రకాంతులకు, శార - కాంతిని ; దా - ఇచ్చువాడను యశా - కీర్తిగన్నవాడా; తేజసామపితేజస్వీ; భాసమానప్రపంచమునకు సర్వమునకు వెలుగునిచ్చువాడా.

మాలినీ వృత్తము.

వలభిదుపలనీలా వల్లవీబృందలోలా
కలితకనకచేలా గంధనాగేంద్రఫాలా
విలసదవనలీలా విశ్వసంస్తుత్యశీలా
సలలితగుణజాలా సప్తతాళీవిఫాలా. 62

గద్యా

ఇది శ్రీ మదనగోపాల వరప్రసాదలబ్ధ సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్య సర్వంకష చతుర్విధ
కవితాబంధుర రచనాధురంధర సరసశబ్ద నాటకాలంకార సర్వస్వ విజ్ఞానధౌరేయ
సుజనవిధేయ బుధజన స్తోత్రపాత్ర కాశ్యపగోత్ర పవిత్రాపస్తంబసూత్ర
నెల్లూరి రంగయామాత్య పౌత్ర వీణా వెంకటపతిపుత్ర
వినయగుణభాస్వర రాఘవకవీశ్వర ప్రణీతంబైన
యాదవరాఘవ పాండవీయమందలి
ప్రథమాశ్వాసము
సంపూర్ణము

వలభిత్+ఉపల+నీలా - బలభిత్—బలారి—ఇంద్రుడు; ఉపలము - రత్నము, ఇంద్రనీల మాణిక్యము ; అట్టి నీలా - శ్యామలవర్ణము గల దేహకాంతి కలవాడా శ్యామసుందరా !

వల్లవీబృందలోలా - గోపికలయందు సక్తుడయినవాడా గోపికావల్లభా!

కలిత+కనక+చేలా - పచ్చని పట్టుపుట్టము ధరించినవాడా పీతాంబరధారీ!

గంధ నాగేంద్రపాలా (పాలాఅని దిద్దిన మకరినుండి కరిని రక్షించినవాడా) గొప్ప పర్వతమునకు శిరమున ధరించినవాడా గోవర్ధన గిరిధారీ !

విలసత్+అవన+లీలా - ఆశ్రితరక్షణమే విలాసముగా గలవాడా! (శ్రితజన పాలా)

విశ్వ+సంస్తుత్య+శీలా - లోకములు నుతించే శుభకరలీలలు ప్రకటించు వాడా !

స+లలిత+గుణ+జాలా - మంగళప్రదము లయిన గుణసముదాయముచే కూడినవాడా గుణరత్నాకరా !

సప్త+తాళీ+విశాలా - సప్తతాళములు పడగొట్టినవాడా రామావతారమున సుగ్రీవుని నమ్మికకై ఏకబాణమున ఏడు తాటిచెట్ల నేసినవాడా !

### *లోకాంత గద్యం*

ఇతి శ్రీ షోడశాంత రాజరాజేశ్వరీ కలోపహిత శ్రీ సత్యానందనాథ గురుప్రసాదలబ్ధ సరస కవితాధురంధర సుజనవిధేయ వాధూలసగోత్ర పవిత్ర శ్రీమదాపస్తంబ సూత్ర మహాన్న ప్రదాత నారాయణప్రపౌత్ర వేంకటచయన పౌత్ర దత్తాత్రేయపుత్ర అన్నపూర్ణా గర్భశుక్తి ముక్తాఫలాయమాన వేంకటలక్ష్మీపనాథ విద్వ త్కవిరాజ కవికులశేఖర తంత్ర సాహిత్య కలాప్రపూర్ణ ప్రాచ్యసాహిత్య విద్యాప్రవీణ విద్వాన్ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి యం. యె. ప్రణీతంబైన ఆనందజ్యోత్స్నా వ్యాఖ్యాన సహిత యాదవ రాఘవ పాండవీయమున ప్రథమాశ్వాసము సమాప్తము.

నెల్లూరి రాఘవకృతి

# యాదవ రాఘవ పాండవీయము

౨ ఆశ్వాసము

ఆనందజ్యోత్స్నా టీకావిలసితము



టీకా కర్త, ప్రకాశకుడు :

విద్వాన్ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి ఎం.ఏ.పి.ఓ.ఎల్.

హైద్రాబాదు.



శ్రీ రాజరాజేశ్వరస్వామి వేములవాడ.

## శ్రీ రాజరాజేశ్వరీ రాజేశ్వరులకు విద్వత్కవిరాజు జోహార్లు

శా॥ ఎందేని న్నిను హృద్గుహాంతరమున । న్నెవ్వేళ ధ్యానించి క
న్విందౌ సార్థ విశుద్ధదేహమున సా । ధ్విన్ శ్యామరాజేశ్వరిన్
బింద్వర్థమ్మున రక్తశుక్లతను ప । ర్వేందు ప్రభాచిత్కళల్
చిందన్ గాంచుత మాదుహృత్కమలముల్ । శ్రీరాజరాజేశ్వరా॥

శా॥ లేంబుల్వాడన సుప్రసిద్ధమయి శ్రీ । ల్మీరన్ కలల్నిండ హే
రంబాద్యన్మ్యులు క్షేత్రపాలురకు మేల్ । రంగంబు కైలాస సా
మ్యంబై విద్యల పెన్నిధానమయి యా । మ్నాయార్థముల్బానువా
సింభాస్వద్భవదీయ దివ్యతలముల్ । శ్రీరాజరాజేశ్వరా॥

శా॥ అందాలై కనువిందులై రుచులమే । లందాల కాలంబమై
విందుల్పంధ్యల శేషనాగఫణము । ల్విప్పారత్రైలోక్యచిం
తాదుస్సహ్యము మానసాశ్రమున మం । దానందసంవేద్యమై
చిందుల్ ద్రొక్కుచు విల్వుమోయినటరాట్ । శ్రీరాజరాజేశ్వరా॥

శా॥ జోహార్లన్గొనుమోయిదేవనినుమె । చ్చుల్మీరఁ గీర్తించియే
కల్హారమ్ములు గూర్చి యిచ్చితివొనిర్ । గాంక్షించి ప్రోద్యత్కృపా
సౌహార్దమ్ములు నాకుఁ గూర్చి కృతిక । చ్ఛమ్మాకృతిన్దీర్చితే
చిహ్నంబియ్యది యంజలింతుఁగొనుమో । శ్రీరాజరాజేశ్వరా॥

# ఉపోద్ఘాతము

పూర్వ రచయితలు

శ్లేషకు భారవి కిరాతార్జునీయము 15 వ సర్గ మాఘుని శిశుపాలవధ. హర్షవర్ధనుని నైషధీయ చరితమున పంచనళీయ సందర్భము. క్రీ. శ. 8 వ శతాబ్ది కవిరాజు రాఘవ పాండవీయము — సంస్కృతము. క్రీ. శ. 11 వ శతాబ్ది వేములవాడ భీమకవి రాఘవ పాండవీయము–తెనుగు. (ఇపుడు కానరాదు) క్రీ. శ. 16 వ శతాబ్ది పింగళి సూరనార్యుని రాఘవ పాండవీయము. (ఉపలభ్యము)

ఇదియే లభ్యమగు తొలి ద్వ్యర్థికావ్యము. ఇవి క్రమముగా మూడు, నాలుగు, అర్థముల కావ్యములకు దారితీసినవి. నాడు వినువారి కలిమి, వినోదార్థము బయల్వెడలినవి.

అట్టి అనేకార్థ గ్రంథములలో ప్రస్తుత యాదవ రాఘవ పాండవీయమును రచించిన నెల్లూరి వీరరాఘవ కవి యొకడు 1717 ప్రాంతమువాడు. తొలిసారిగా ఈ కృతి అముద్రిత గ్రంథ చింతామణి సంపాదకులచే 1886 లో ముద్రితము. పునర్ముద్రితము కాలేదు.

వీరరాఘవ కవి చేతిలో నెంత లెంతలు సంస్కృత పదములును వెన్న ముద్దల వలెఁగరగి సమాసములు జతుకాష్ఠములవలె నిచ్చవచ్చిన తీరున వంగియు విఱిగియు చెప్పినట్లు నడచినవా యనిపించును.

ఇట్టి రచనమును "ఆనంద జ్యోత్స్నసహిత మొనర్చి వెలువరించిన విద్వత్కవిరాజ, కవి కులశేఖర, ఆచార్య సరిపెల్ల విశ్వనాథశాస్త్రి. ఎం. ఏ. గారి యుద్యమము మనసార శ్లాఘింపఁ దగినది.

నానార్థ కావ్యములకు వ్యాఖ్యానము రచించుట సాధారణ కార్యము కాదు. వ్యాఖ్యాతకు కృతికర్త కున్నంతటి భాషాస్వాంత్రతయు, శాస్త్ర సంప్రదాయాభిజ్ఞతయు, పురాణ కథా విజ్ఞాన కుశలతయు, సుసూక్ష్మ సమన్వయ దీక్షతయుం గలిగి అసాధారణ మగు వ్యుత్పత్తి చేకుఱినంగాని యీ వ్యాఖ్యావిరచనము నెఱవేఱునది కాదు.

శ్రీ శాస్త్రిగారు పరిపూర్ణ పరికరాను బంధముతో పరమోత్సాహముతో ఈ టీకా రచనమునకుఁ బూనుకొని నిర్వహించుట ఆంధ్ర ప్రబంధ పాఠకులకుఁ బరమోపకారము.

నందినీ మందిరము
రామనగర్
వాల్తేరు
15–8–59.

ఇట్లు
శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారు
ఆంధ్ర విశ్వకలాపరిషత్ పండితులు.

## ఇతర పండితుల అభిప్రాయములు

శ్రీయుతులు శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు.

"పూజ్యమిత్రులు శ్రీసరిపెల్ల విశ్వనాధశాస్త్రిగారు స్వీయ వ్యాఖ్యానముతోఁ బ్రకటించిన యాదవ రాఘవ పాండవీయమును స్థాలీపులాక న్యాయముగాఁ బరిశీలించితిని. శాస్త్రిగారు వ్యాఖ్యామృతముచే గ్రంథమును సుజీవింపఁజేసిరి. ప్రాచీన విద్యావైభవము సన్నగిల్లిన యీ కాలమున నిట్టి త్ర్యర్థికావ్యమునకు వ్యాఖ్య వ్రాయుటకుఁ గంకణము గట్టుకొని సమర్థతతో నిర్వహించిన శాస్త్రిగారిని లోకమభినందింపక తప్పదు.

డాక్టరు బి. రామరాజుగారు.

గురు పాదులు నన్నభిప్రాయమడుగుట కేవలము శిష్యవాత్సల్యముచేత నేనిందుకు సాహసించుట వారిపైగల భక్తిచేత. అరువది నాల్గు (నేడు అరువది తొమ్మిది) వత్సరములు పైబడినను కలము దింపని ధీరులు. సుప్రసిద్ధ పండితులు వారి ప్రతిభా పాండిత్య వ్యుత్పత్తుల కియ్యది తార్కాణము. ఈ కార్యమునకై ఆంధ్ర దేశము వారి కెంతయు ఋణపడి యున్నది.

**Dr C. Ramalinga Reddy. Vice-Chancellor Andhra University. Dear Mr. Viswanathasastry.**

Your annotated edition of "Yadava Raghava Pandaviayam" with commentary is an excellent production, in fact indispensable both to the scholar and the general reader. Yadava Raghava Pandaviya is unique in Telugu Literature and not at all easy to construe. I hope you will be able to complete the work and earn the gratitude of Telugu world.

Yours sincerely
Sd/C. R. REDDY.

**Prof. M. Venkatarangayya. Dear Mr. Sastry.**

I heartily congratulate you in bringing out a scholarly edition of Yadava Raghava Pandaveya with a learned commentary on it. You have done a real service to students of Telugu Literature.

**Late Pandit Malladi Suryanarayana Sastri Garu.**

Your Kamavilasa ranks as an original creation. Your Lalitha Sataka is a relegious book to a critical eye, a type to be imitated by poets to give shape to their thoughts. It is replete with the central thought of the Sakta Philosophy, a poem to be read with care as a text book. Your Saura Purana, the Triple Kavya with commentary and the Madras University Readership lectures when printed, will be master pieces in Telugu literature.

శ్రీ శ్రీధరాయనమః

# యాదవ రాఘవ పాండవీయము

[ త్ర్యర్థి ప్రబంధము ]

## ద్వితీయాశ్వాసము

క. శ్రీ ముదిత సత్యభామా
భామాయిత భూమ భూమ భాసురధామా
ధామాయితార్క సోమా
సోమాజ కృతప్రణామ శుభకరనామా.

కృతిపతి శ్రీ గోపాల పరబ్రహ్మమును గూర్చిన స్తోత్రము :

శ్రీ + ముదిత = స్వీయలీలా సౌభాగ్యములచే సంతోషపెట్టబడిన సత్యభామ జాయగా గలవాడా, భామా — భూమ = భూదేవి రెండవ భార్యగా కలవాడా, భూమ... ధామా = ప్రకాశించుటలో ఇట్లని వర్ణించరాని వైకుంఠము నివాసముగా గలవాడా; ధామా — సోమా = సూర్యచంద్రమండలములకు ప్రకాశము నిచ్చువాడా; సోమా — ప్రణామ = స + ఉమా, శివబ్రహ్మలచే నమస్కరించబడువాడా; శుభ — నామా = మంగళప్రదములయిన నామములు కలవాడా గోపాల పరబ్రహ్మమా. అజ = బ్రహ్మ

వ. అవధరింపుము వినుము—

క. ఆ దంపతు లావిధమున
నాదేవాంశజలనించు నాత్మజులను దా
మాదరములు మదిబొదలమ
హాదయలఙా బెంప బెఱిగి రతులితగతులన్. 1

యాదవ } దంపతులు = నందయశోదలు.
పాండవ } సమము — ధృతరాష్ట్రుడు గాంధారియు పాండురాజు.
రాఘవ } కుంతీమాద్రులును.
దశరథుడు ఆతని సతులు కౌసల్య కైకేయి సుమిత్రలును.

ఆ దేవాంశజలన్ + ఇంచున్ = దివ్యమహిమల కొలవాలము లయి సుందరు లయిన; ఆత్మజులను = కుమారవర్గమును బలరామ కృష్ణులను, నూర్వురు కురు కుమా

రులను, పంచపాండవులను, రామాది కుమార చతుష్టయమును; ఆదర — పొదలన్ = అతి ప్రేమతోనిండిన హృదయములు కలవారలయి వారల జననీ జనకులు; మహా — దయలన్ = కరుణాన్వితులయి, వాత్సల్యమున; పెంపన్ = రక్షించగా; పెరిగిరి — గతులన్ = దిన దిన ప్రవర్ధమానులయిరి.

వ. అయ్యెడనట్టి హరితేజోంశ సంభవంబై పరాక్రమ భాసురరిపు భీమ నామంబునన్ బరఁగిన తత్కులంతతిం బురోహిత జన సహితుండగు నగ్గోపతి కృతప్రయత్నుండై కాదికను గలిగియుండునెడ.

యాదవ<br>పాండవ<br>రాఘవ } సమము : యదుకుమారులు, కౌరవులు, రాఘవులు వీరలెల్లరును విష్ణు నంశమున బుట్టినవారు;

పరాక్రమ = మహాశూరులు.

ఈ విధమయిన కుమారవర్గమును ఆయా రాజులు నందాదులు. (గోపతి = రాజు)

కాది = క + ఆది (క = బ్రహ్మ) పుట్టినది మొదలు; కనుగలిగి = మిక్కిలి శ్రద్ధతో కంటికి రెప్పవలె రక్షించుచుండిరి.

క. తన గోపతి ప్రజగన మహి
మను పూతన వనగవాగ్ర మంజులగతిమున్
బెను పొందిన యాపగపులి
యన నుచ్చైస్స్తన కళంక మణఁగం దీర్చెన్. 2

యా. గోపతి = కంసుడు ఆకాశభాషితమును మనమున నిడుకొని కృష్ణుడు (తన్ను చంపగలవాడు) గోకులమున వృద్ధి నందుట తలంచి శిశుమారకురాలగు పూతన యను రాక్షసిని పంపిన విషయ మిట సూచితము.

వన + గవ + అగ్రము = గోసదృశమయిన ఆరణ్యక మృగము, గవయము. దాని నడకనుపోలిన మందగమనముతో పులి + అన = సింహమువంటి పూతన కృష్ణుని సమీపించి స్తన్యమిచ్చి ఆతనిచే మృతినందెను.

బలరాముడు యమున గర్వమడంచిన వృత్తము కూడ సూచితము = ఆపగ = నది.

పాండవ : వీరిపాలనమున నదులు పొంగి జనపదములను, పంటలను ధ్వంసము చేయు టాదిగాగల బాధలు లేక భూదేవి సుఖముగ నుండెను.

రాఘవ : దశరథుని పాలనమునను పై విధముననే భూమియు ప్రజయు సుఖములు గనిరి.

శా. అంతర్భ్రాంత వనాంతరాంతర కృతాంతాశాంత వాతాంకురా
హంతాక్రాంత నితాంత తాంత మృదువృంతానంత సంతాన శా
ఖాంత ర్దంతురకాంత పల్లవల తాంతాలోక చింతాకన
త్కాంతా స్వాంతము వింత వింతగ వసంతం బెంతయుఁ బొల్చినన్. 3

యా. పాం. రా. సమము.

కృతాంత + ఆశ = యమునిదిక్కు దక్షిణము అటనుండి విసరిన గాలి = మంద మారుతము — వసంతఋతువు ఆవిర్భవించినది.

సీ. సురసాల తరుజాల సురసాలవరలోల
సరసాలపనబాల హరివిశాల
మలసానిలశతాంగ దళసాకుల లవంగ
ఫలసారసుమచంగ వాసనాంగ
మతి మత్తసారంగ రుతదత్త భయభంగ
వితతోత్తమాపాంగ వృత్తిసంగ
ముదిత పంచమనాద గదితకోకిలవాద
విదితపాంథవినోద విదితమోద

గీ. మమల కాసారసారస హంసఖగగ
రుత్పట పటపటత్కార రోపచాప
రవపటహ మారజైత్రయాత్రావిలాస
భాసురము పొల్చె మధుమాస వాసరాళి. 4

మూడు కావ్యములకు సమము.

తరులు చిగురించినవి; చిలుకలు, చక్రవాకములు, కోయిలలు, తుమ్మెదలు చెలరేగినవి; సరస్సులలో బెగ్గురులు హంసలు విహరించినవి. వసంత ఋతుదినములు ఈ విధముగ అందగించినవి.

వ. అయ్యవసరంబున.

ఆ వసంతసమయమున

మ. అసురారాతి భవాతి భీతికలకం సారంభతన్ బాలకా
ర్యసుహృద్వృత్తి మెలంగఁ దెల్పగను విశ్వామిత్రమౌనీశుమా
నసముప్పొంగ నఘాదులేగ యజ నానంద క్రియల్ బెంప మౌ
ని సమాజంబులు నిండ్లలో నిలువఁ బూనెన్గామచారోన్నతుల్. 5

యా. రాక్షస సంహారి కృష్ణువలని భయమున కంసుడు పూతన మరణవార్తవిని.

విశ్వ + అమిత్ర = లోకులకు శత్రువులు. అఘాదులు = అఘాసురుడు మొదలైన వారు యజ్ఞయాగాదుల ధ్వంసము చేయుచు సంచరించ; భయమున మౌనిసమాజంబులు = తమ తమ గృహంబులయందే తలలు దాచుకొనిరి.

పాండవ: అసుర — భీతి + కలకన్ = రాక్షసులవలని (దుర్మార్గులను) భయము పోగొట్టి; పాలక + ఆర్య + సుహృత్ + వృత్తి = శిష్టజనుల ఇష్టానుసారము పాలన సాగించుచు పాండురాజు, విశ్వ + మిత్రము + ఔన్ + ఈశు = ప్రజలకు స్నేహితుడుగా ప్రభువు వర్తనము — పాలనము; మనములకు ఆనందమీయ; అఘము = పాపము; యజనా — పెంప = సత్కార్యము లతిశయించ; కామ — ఉన్నతుల్ = ఇష్టమువచ్చినట్లు స్వీయకార్యములు సాధించుకొనగల్గిరి.

రాఘవ: దశరథుని పాలనమున పై విధముననే సర్వము సుఖశాంతుల కాలవాలమయినది. రామలక్ష్మణులు తన యజ్ఞకార్యమున విఘ్నములు తొలగించగలరని విశ్వామిత్రుడు తలంచి వారిని కొనిపో అయోధ్యకు పయన మయ్యెను,

ఉ. ఆయతి రాజసోమ్య శకటాకృతి మీఱునితంబదేశమా
నాయనె యూరులచ్ఛపు ద్విజప్రకరావళి యానరోవర
శ్రీయుతి వేడ్కఁగాంచుచు విజృంభిత చిత్తభవోత్సవంబునన్
బోయిపురంబుఁజేరి యల పుణ్యజనుండొకరుండు నేర్పునన్. 6

యాదవ : శకటాసుర సంహారము సూచితము. పుణ్యజనుడు = రాక్షసుడు.

పర్వతములు, నదులు, గ్రామములు, బ్రాహ్మణ సముదాయమును చూచుచు;

పాండవ : ఆ పాండురాజు వనవాసముండి, పర్వతముల, వనుల విహరించుచు (పుణ్యజనుడు = పాండురాజు) ఆ వన విహారమున మాద్రి సౌందర్యము స్ఫురించ ఆశ్రమమునకు తిరిగి పోయెను, నితంబము = పిరుదులు; ఊరులు = తొడలు; ద్విజ + ఆవళి = పాలిండ్లు. నాభీ సరస్సు — ; చిత్తభవుడు = కాముడు.

రాఘవ : ఆ + యతి + రాజు = విశ్వామిత్రుడు. క్రమముగ పర్వతములు, వనములు గడచి అయోధ్య ప్రవేశించెను.

క. శ్రీరామ జలజపాణిని
జేరన్ గౌతుకము మెలఁగ జెచ్చెరనతఁడిం
పూరఁగఁ బాదాక్రాంతిగ
మీఱన్మిన్నంది వగలు మెయిమెయి వగలన్. 7

యాదవ : శ్రీరామ-పాణిని = శకటాసురుడు ఊయెలలో క్రీడించుబాల కృష్ణుని చేరి పై బడబోవగా; లీలగా పాదాక్రాంతిగ + మిన్నంది — వగలన్ = కాలితో ఎగదన్న దేహము ముక్కలయి ఆకసమున కెగసి దూరముగపడి మృతినందెను.

పాండవ : శ్రీ + రామ + జలజపాణి = కాంతమాద్రిని చేరి పాండురాజు, తన్నంగీకరించమని పాదముల వ్రాలి బ్రతిమాలెను. (శాపభయమున ఆమె వలదని బ్రతిమాలుట సూచితము)

రాఘవ : విశ్వామిత్రుడు అయోధ్య వీథులసాగిపోరా, శ్రీరామచంద్రుడు మ్రొక్క సంతసించి ఆబాలకుని దరికితీసి ఆదరించెను.

చ. అరుదుగ సంభ్రమ ప్రచలి తాత్మత తద్గురు ధీరకార్యముల్
పరగఁగఁగాంచి యొప్పమను బాలకుఁ దెల్పికవుంగలించి ని
బ్బరమగుఁ బ్రేమ గుబ్బతిలఁ బట్టెఁ బ్రియంబొనరన్ యశోదయా
వరగుణ రాజమౌనియత వాగ్గతకేళిని సౌఖ్యమందఁగన్. 8

యాదవ. యశోద శకటమును తన్ని కిలకిల నవ్వుచున్న బాలకృష్ణుని ఎత్తి ముద్దాడెను.

ఒప్ప + మను = ఏ ఆపదయు లేక సుఖముగనున్న బాలుడు.

పాండవ : ఒప్పము + అను = వలదనుచున్నను, మాద్రిని లాలించి ప్రియమార కౌగిలించి శాపవశమున మృతినందెను (పాండురాజు మృతి).

రాఘవ : ఒప్ప + మను = చక్కనివాడు శ్రీరామ చంద్రుడు విశ్వామిత్రుడు తనకు మ్రొక్కి నిలచిన రాముని ఆలింగనము చేసికొని భావి రాక్షససంహారము నిశ్చయించి ఆనందించెను.

మ. ఘనఘాభాసురుఁడొక్కఁడట్లు ప్రసుదైక స్పర్శనోద్వృత్తి పెం
పున స్వస్థానముఁ జేరబాలకునిఁ గొంపోవన్ విధిస్థేమ ద
త్తనయత్రాణ భరింప నగ్రజను జెంతన్ నిల్పఁగా వేద న
ష్ణను యాత్రాగతి కోర్చె రామ మన మయ్యాత్మేశు నిచ్ఛాగతిన్. 9

యాదవ : స్పర్శన+ఉద్వృత్తి = వాయుగుణము, తృణావర్తుని రాకసూచితము; అగ్రజను అన్న బలరాముడు మోయలేని భారముతోచి కృష్ణనొక బండపై నుంచి బలరాముని కాపుంచి యశోద గృహములోని కేగెను (ఆ సుడిగాలి కోర్వలేక) — తృణావర్తుడు వధించబడెను — బాలకృష్ణుని చేతచిక్కి)

పాండవ : అగ్రజను = కుంతిని; మాద్రి తనయత్రాణ = చిన్నకొడుకును సహదేవుని ఆమె కొప్పించి, పతితో సహగమనము చేసెను.

రాఘవ. విశ్వామిత్రుడు రాముని యజ్ఞ రక్షణార్థము తనతో పంప దశరథుని ఒప్పించెను. లక్ష్మణుడు రాముని ప్రార్థించి ఆతనితో ముని వెంట నేగ సిద్ధమయ్యెను.

ఆ. మేటిమగనిఁ జంపి మెయికొనితో నేగె
సదయ శోభిరామ జలజపాణి
యటులఁ జనిన యతని యంకగతుని బాలు
గాంచి తల్లి యుచిత గతిని మెలఁగె. 10

యాదవ : మేటి + మగడు = తృణావర్తుడు — వానిని హతమార్చి సుఖుడయియున్న తమ్ముని కృష్ణుని అంకముననుంచికొని యున్న బలరాముని గాంచి యశోద ఇరువురను లాలించెను.

పాండవ : మేటి చంపి = పాండురాజు మృతికి కారకురాలు మాద్రి సహగమనముచేయ, కుంతి సహదేవుని అంక + గతుని = ఒడినుంచికొని సాకెను.

రాఘవ : విష్ణువే పౌరుషమణచి బాలునివలె నాయెను. రాముడు తల్లికి నమస్కరించ ఆమె ఆతనిని దీవించెను. విశ్వామిత్రు రక్షణమున రామలక్ష్మణులు వెళ్ళిన అనంతరము వృద్ధజనము ఎట్లో కాలము వెళ్ళించిరి.

క. భాసుర జననీత మహా
భాపి స్వస్త్యయనయుక్తి బాలురు సనిర
య్యామర వర్ధనలీలలు
వాసిగ మహికరిపురికి వివర్ణతదోఁపన్. 11

యాదవ : రాక్షస సంహారము లొనరించుచు రామకృష్ణులు వ్రేపల్లెలో వృద్ధి కాంచుచుండిరి.

ఆ+సుర + వర్ధన+లీలలు = రాక్షస సంహారమున దేవతల సంతోష మతిశ యించెను. అరి + పురి = మధురలో, కంసాదులు భయమున వెలవెలపోయిరి.

పాండవ: ధృతరాష్ట్రుడు బ్రాహ్మణులను పంపి కుంతిని కుమార పంచకమును; కరి + పురికి = హస్తినాపురికి రావించెను. వారు వివర్ణము + తోప = దీనులయి ఏగిరి,

రాఘవ: రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంటనంటిపోవ ఆకార్యము రాక్షసులకు హానియు దేవతలకు వృద్ధియు సూచించెను.

ఉ. గౌరవలీలఁబెంచి యవి కారనవోద్ధృత చోరవృత్తి నిం
డారఁగ మీఱ గోమద బలాతి బలోజ్వల దారుమూర్తులై
వారలు సద్వ్రజాళికయి వారముసేయ విచిత్రవీర్య కో
దార మహోదరోన్నతినిఁ దాటకగాంచి రధర్మవర్తనన్. 12

యాదవ: అవికారత = అంతరమున ఏ వికృతియును లేక చోరవృత్తి = వెన్న దొంగిలించుట ఇత్యాదికము లొనరించుచు, ధర్మమునే అచరించుచు.

కాంచిర + ధర్మవర్తనన్ = ధర్మచరితమునే సాగించిరి.

సత్ = వ్రజాలి = వ్రేపల్లెలో వృద్ధులు, గొల్లలు, విచిత్ర — ఉన్నతిని = పౌరుష లీలలు ప్రకటించుచు.

పాండవ : పాండవులు; విచిత్ర — దాటక = ధృతరాష్ట్రి నాజ్ఞను అతిక్ర మించక;అధర్మవర్తనన్ = కౌరవుల కుటిల వర్తనములను కనిపెట్టుచు కాలముగడపిరి.

రాఘవ : విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు; బల+అతిబల = క్షుత్పిపాస లడంచు రెండు విద్యలు ఇచ్చెను. హింసాపరురాలు మాయాపాటవముకల

తాటకిని = ఆపేరుగల రాక్షసిని వనముల నేగువారు చూచిరి,

సీ, సారసాక్షుఁడజాత శత్రుఁడు బహుశోభి
రాముడు నాఁదగు రాజసుతుఁడు
దివ్యగోమదబలాతి బలాప్తి నవనీత
చోరమార్దవ వృత్తి గౌరవాప్తి

బూని పెంపుచు సుమిత్రానందనావాప్తి
సహజ తేజోయుతి సద్వ్రజంబు
లలర విచిత్ర వీర్యజ మహాదరకర
విజయోక్తి దాటక వినుతధర్మ
గీ. వర్తనను గాంచి గురుజన వాక్యరీతి
సుగుణ మూనినయమ్ములు మిగులఁబఱపి
యణఁచి దుర్మార్గవృత్తుల నఖిల జనులు
పాలముంచె ననంగను బరఁగెనంత. 13

యాదవ : రామకృష్ణులు తమ ప్రతాపాది సద్గుణములచేత.

నయము = నీతివర్తనమునను; సుమిత్ర + అవాప్తి = స్నేహితులకు ఆనందము కల్పించుచు.

పాలముంచెన్ + అన = రక్షించబడితిమని వారిని నుతించి ఆనందించిరి.

(సత్ + వ్రజాళి = గోకులమున వృద్ధజనము, లోకమున శిష్టజనులును)

యా } సుగుణము + ఊని + నయమ్ములు = సద్గుణములు, నీతివర్తనము.
పాం }

పాండవ: కురువర్గముతో కూడి ఆడుచు పాండవులు లోకుల మెప్పులు వడయుచుండిరి.

రాఘవ : రాముడు తాటకిని సంహరించెను.

సుమిత్ర — అవాప్తి = లక్ష్మణునితోకూడిన రాముడు గురు — రీతి = విశ్వామిత్రుని ఆనతి ననుసరించి.

సుగుణము + ఊనిన + అమ్ములు = వింటిత్రాటియందు మోపుంచి బాణములచే తాటకిని రాముడు సంహరించెను.

ఆ. మస్తుగొనుచు ధూర్త మార్గతఁ దత్ప్రిజ
మీఱనుంచవచ్చు మేటినణఁచి
గురు జపా(నా)గ్రవాస వరమంది వారలు
ప్రోవపాలు పెరుగు ద్రావి మివుల. 14

యాదవ : మస్తు + కొనుచు = పరాక్రమవంతులు రామకృష్ణులు గోపకామినులను తమ లీలలచే విసివించ, వారు యశోదతో వారిచేతలు తెల్పినను, తల్లిని సంతోషపెట్టుచు, పాలు, పెరుగు దొంగిలించుచు ఆనందించిరి.

పాండవ : భీముడు తన్ను బంధించిన దుర్యోధనాదులను తిరస్కరించి, స్వేచ్ఛ గొని అన్నకు తల్లికి ఆ వార్త తెల్పి వారిని ఆనందింప చేసి వారిచ్చిన మృష్టాన్న మారగించి సుఖముండెను.

రాఘవ : తాటకసంహారానంతరము ఋషికులమువారిచ్చు దీవనలు గ్రహించి, వారిచ్చిన రుచిరాహారము లందుకొనిరి.

వ. —అంత = అనంతరము,

సీ. సవన మహారంభ సరసక్రియాలీల
మించియతిశ్రేమ మెఱయఁ జేయఁ
బాటించి బలమునం దాటకాభూవర
తనయులు పుష్కర స్థానగతిని
కీలాల ధారలు చాల వర్షింపనా
గోపకుమారులు కూడికొండ
ములువెల్లువలుగప్పఁ గలయనొండొరు వారి
మారీచమాయను వారిరాశి
ముంచి తత్సుబాహుబలంబణచిగెలిచె
నరికి భీముఁడు రాముఁడు హరిసముండు
సుముఖగతిఁ దోచు సర్వలోకములు గాంచ
మాత మది విస్మయమునంద మగుడవెలసె. 15

యాదవ : కీలాలధారలు = నీటి జల్లులు; సుముఖగతి = నోటియందు రామ కృష్ణులు జలక్రీడల సర్వులను గెల్చిరి. కృష్ణుడు మన్నుతినెనని బాలురు పలుక అమ్మా చూడుమని నోరు తెరచి చూపి అందు పదునాల్గు భువనములు ప్రదర్శించి, అనంతరము మాయగప్పి బాలక్రీడల ఆమెకు సంతసము కల్పించెను.

పాండవ : దుర్యోధనాదులు నాగపాశములచే భీముని బంధించి నీట పడద్రోయ, వాటిని త్రెంచుకొని సుఖముగ తల్లివద్దకు వచ్చిన భీముని పరాక్రమము వర్ణితము.

రాఘవ : యాగ రక్షణ సమర్థులయిన రామలక్ష్మణుల బాణములకు సుబాహువు మృతినందెను. మారీచుడు సముద్రముల దూరమున పడవేయబడెను. కొదువ రాక్షసమూక నశింప చేయబడెను.

కీలాల ధారలు = రక్తధారలు.

మాత = ప్రమాత, విలువకట్టిన విశ్వామిత్రుని మది సంతసించె.

వ. అవ్విధంబున మఱియును.

గీ. సర్వతోముఖములతను సాఁగనీక
పాశలతఁ గట్టి జననీత భయమువాయ
ఱోలు చేర్చి తునియలుగా వ్రాలఁ బెంచెఁ
బేర్చె యమళార్జు నసమాఖ్య పృథులతరులు. 16

యాదవ: దుర్వాస మునిశాప వశమున గంధర్వులు రెండు మద్దిచెట్లుగా నయి గోకులమున నుండిరి. గోపకామినులు కృష్ణునిపై నేరములు మోపి ఆక్రందించ కృష్ణుని శిక్షించ తలచి ఱోటికి త్రాట ఆ బాలుని బంధించినది యశోదమ్మ. భయపడినవానివలె ఱోలీడ్చుకొనుచు మద్దులమధ్య ప్రవేశించి ఈడ్వ మద్దులు కూలినవి. గంధర్వులు శాపముతీరి తమలోకమునకు కృష్ణుని నుతించి ఏగిరి. (యమళ + అర్జునము = రెండు మద్దిచెట్లు.)

పాండవ : యమళార్జునులు = నకులసహదేవులు, అర్జునుడును, దుర్యోధనాదుల దుశ్చర్యలు అనాయాసముగ తిరస్కరించి సుఖముగనుండిరి.

రాఘవ : ఱోలు = విలాపము. రాక్షస సంహారమున లోకపీడ తొలగినది.

ఉ. ఆశరవృత్తి వారిడిన యట్టియనీతి గరంబు బాహులన్
బేశలలీలమాన్చె నలి భీముఁడు గావున నొడ్లు శక్తులే
నాశము వచ్చుచోటను క్షణంబును గాపురముందురే జనుల్
కౌశలియొందు చోటికరు గన్వలెఁగాకని పెద్దలాడఁగన్. 17

యాదవ : వృద్ధజనము పదేపదే ఆపదలు కలుగుచోట చిరము వసించరాదని బోధించ నందాదులు గోవులను గోకులమును తరలించి బృందావనికేగ తలంచిరి.

పాండవ : నిత్యము పాండవులకు తన కుమారులు బాధించుటను ఆలకించి విదురునితో ఆలోచించి ధృతరాష్ట్రుడు వారలను వారణాసికి బోయి అట నివసించమని పాండవులను పంపివైచుటకు నిశ్చయించెను.

రాఘవ : విశ్వామిత్రుని ఆశ్రమమున ఉన్నవారు నేటికి ఈ రాజకుమారుల వలన బ్రతికితిమికాక. కుసుమఫల భరితమగునది సురక్షితమగు ఇంకొక తావునకేగి ఆశ్రమము కల్పించుకొందమని నిశ్చయించిరి.

క. అమరన్ జనిరపుడు మహా
శ్రమహారి సమీరబాల చంచత్కీర
భ్రమరపి కసుమఫలదళ
విమలామ్ర ప్రముఖసాల బృందావనికిన్. 18

యాదవ : నందాదులు తమ సర్వస్వము తరలించుకొని బృందావనమునకు వెడలి పోయిరి. వ్రేపల్లెను విడచిరి.

మహా + శ్రమ + హారి = అతిశయించిన కష్టములను పోగొట్టునది.

పాండవ : సమీర — బృందావనికిన్ = మనోహరమగునది చిలుకలు, తుమ్మెదలు, కోయిలలు, పూలు, పండ్లు రసాలములు మొదలయిన వృక్షసముదాయముకల అరణ్య ప్రదేశములు మార్గమున చూచుచు కాశికేగిరి.

రాఘవ : విశ్వామిత్రుడు రామలక్ష్మణులను జనకుని పట్టణము మిథిలకు కొనిపోవుచు మార్గమున మనోహరము లయిన ఆశ్రమములు, వనములు చూపుచు పయనించెను.

సీ. పూర్వ మందరుండు పుణ్యశాలి కృపుండు
ఘనధర్మగుణయుక్తి కౌశికుండు
వరనీతి కలశజుం డరుదుగా మణిముఖ్యు
లతి ధృతినెంచఁగ మతులుగలుగ
గురువయి గాంగేయ పరిణత చాప వి
ద్యాక్రమమున నలయస్త్ర శస్త్ర
ములఁ బ్రయోగ విధులు తెలియఁగఁ జేసినఁ
బ్రేమాతి శయములు వృద్ధిఁజెంద
గీ. గోపబాలా వతంసముల్ గోపజాతి
రమ్యమూర్తులు గాంచి సంభ్రమ పడిరటు
వారు గోగణముల వర వత్సములను
బఱపి మునుమేప నేర్చిరి ప్రౌఢి మెఱయ. 19

యాదవ : భీష్మ ద్రోణ కృపాదుల నతిశయించిన అస్త్రశస్త్రాది విద్యాప్రభావము కల హరియే కృష్ణుడు. అతడే గురువుగా గోపకుమారులు ఆయా విద్యలు నేర్చి ప్రౌఢు లయిరి.

పాండవ : కలశజుండు = ద్రోణాచార్యులు కురుపాండవులు ద్రోణుడు విద్యా గురువుగా అస్త్రశస్త్రాది విద్యలయం దుత్తీర్ణులయిరి.

రాఘవ : రామలక్ష్మణులు; కౌశికుడు = విశ్వామిత్రుడు (కుశిక నందనుడు' ధనుర్విద్యా గురువు కాగా ఆ ధనుర్వేదమున పారంగతులయిరి.

వ. అటుగావున.

క. వత్సాకృతి మహిత దనుజు
నుత్సుకత నడఁచె నతఁ డరిహృదయుఁ డలరన్.
మత్సరి దుర్యోధన విచి
కిత్సాకర విజయదూఢి కేవలమెన్నన్. 20

యాదవ : అ + రిపు + ఉదయుడు = మిత్రులకు ఆనందము కూర్చుకృష్ణుడు. వత్స + ఆకృతి + మహిత + దనుజుడు = వత్సాసురుడు వానిని కృష్ణుడు సంహరించెను.

పాండవ : వత్సాకృతి + మహి + తత్ + అనుజున్ = ధర్మరాజు కొండికవాడు భీముని వాత్సల్యమున చేర పిలిచి దుర్యోధన — ఎన్నన్ = దుర్యోధనుని చంపివేయుదు నని క్రోధమతిశయించి ఉత్సహించువానిని; అడచె = సమయముకాదని అనునయించి ఆవేగము తగ్గించెను.

రాఘవ : రాముడు, మిత్రులకు, సజ్జనులకు సంతోషము; శత్రువులకు దుఃఖము ఆపాదించు సామర్థ్యము కలవాడు లక్ష్మణునితో అప్పడప్పుడు ఉద్రేక పూరితమయిన లక్ష్మణుని ఉత్సాహ వేగమును శాంతింప చేయుచు విశ్వామిత్రునితో వనములనుదాటి పోవుచుండెను.

సీ. అజితారిదరకర విజయోగ్రధర్మాతి
బలసార విఖ్యాతి ప్రబలులందు
మిగులఁగర్ణ కఠోరముగఁ బర్వఁ బాకాత్మ
వినతారి రాజిత దనుఁజుఁ డతఁడు
ప్రచురతేజంబున సచలోదయముఁ గన్న
యాదిలక్ష్మిఁ బరిగ్రహంబు సేయ
దలఁచెమున్నిత సుమంత్ర ప్రౌఢిమదదంబ
కాసమించఁగఁ గల్గినట్టి మేటి.

గీ. సంగర నిరూఢి సాధింప సాగకున్నఁ
గార్యసిద్ధిఁగా నేర్చునే గానఁ జేరి
విభవిరాధ కౌమారు డన్విధము నతఁడు
తత్ప్రికామవర్ధనమునఁ దనరు కతన. 21

యాదవ : కృష్ణుడు సాక్షాత్తు వైకుంఠుడు హరియే. రాధ పెంచినది కాగా, రాధ కౌమారుడన బరగియు రాధికాప్రియుడాయెను. బలులయిన రాక్షసులను సంహరించెను. పాకుడను రాక్షసుని చంపిన ఇంద్రునికి సోదరుడు అగు హరియే. క్షీరసాగర మథనమున జన్మించిన లక్ష్మిని వివాహము చేసికొన్న ఆ హరియే ఈ కృష్ణుడు; పూర్వము అదితి కశ్యపులు వారికిచ్చిన వరమున, వారే దేవకీ వసుదేవులయిరి. వారికి తనయుడయి హరియే కృష్ణుడుగా జన్మించెను.

పాండవ : భీముని తమ్ముడు అర్జునుడు — పాకారి = ఇంద్రుని అంశవలన కుంతికి జన్మించినవాడు; రాధేయుడు = కర్ణునకు ప్రతిద్వంద్వియగువాడు.

రాఘవ : రాముడు కృష్ణార్జులకువలె సాక్షాత్తు హరి అవతారము. కౌసల్యా గర్భమున భూభారహరణార్థము నాలుగురూపములుగా (రామాది సోదర చతుష్టయము) జన్మించినవాడు. లక్ష్మిఅంశము సీతను పరిణయ మాడగలవాడు. మునివెంట మిథిలకు వనములను దాటిపోవుచుండెను.

క. నెపమెన్నఁ బాక వృత్తిని
ద్రుపదగతి విపక్షహ్రాతిని తొలి కృష్ణుఁ డతం
డుపహరణము దోర్బలమున
నుపమను గురుదక్షిణాప్తి నొనరఁగ జేసెఁగా. 22

యాదవ : తొలికృష్ణుడు = నందకుమారుడు. బృందావనమున దక్షిణదిక్కున గల అరణ్యములనున్న రాక్షసులను సంహరించుచు విహరించెను — (దక్షిణాప్తి = దక్షిణ దిక్కు) విపక్షులు = అరులు; హ్రాతి = చంపుట. దోర్బలమున్ + అనుప + మను = వీర్యమున అరుల నిర్జించి బ్రదికినవాడు — జయశీలి అనుట.

పాండవ : తొలి + కృష్ణుడు = అర్జునుడు, (కృష్ణడనుట అర్జునునకుగల పది నామములలో ఒకటి)

గురుదక్షిణగా ద్రుపదుని నిర్జించి రథమునకు కట్టితెచ్చిన గాథ సూచితము.

రాఘవ : ఎదురుపడిన దుష్టుల శిక్షించుచు లక్ష్మణుడు వెంటరా, రాముడు విశ్వామిత్రునితో అడవులను దాటిపోవుచుండెను.

సీ. మును బ్రజానిర్బంధమున కోర్చి స్వపుఁడంపఁ
గనహీన విబుధారిఁ గపట వార
ణావతారచిత సద్భావ విచిత్ర ర
మ్యా బహుశాకామ ధామమునందు
వెఱఁగి యాయోగీశ్వ రేశుఁడ జాత శా
త్రవుఁడు గోపాలక తనయ వత్స
సహచర జననీత సన్మార్గగతిఁ జేర
చట యహీనక్రియా హారియగుచు

గీ. సరస కరుణామృత కటాక్ష ఝురులవారి
బ్రతికి విలసిల్లఁ జూచుచు బ్రహ్మ విస్మృత
పరమహోదారత న్మూర్తి భావకలన
మెలఁగెఁ దద్వన మేదినీ తలమునందు. 23

యాదవ: ఇందు బ్రహ్మ కృష్ణుని మహిమ తెలియగోరి బృందావనమునకు దక్షిణమునన్న అరణ్యముల దూరమున సంచరించు గోవులను సవత్సములుగను, గోపకుమారుల నెల్లరను హరించి ఒక వత్సరము తన లోకమున నుంచెను. నందకులమున వృద్ధులకును తలిదండ్రులకును తెలియబడకుండ తానే అందరకన్ని రూపులయి, గోవులు, దూడలు, గోపాలకులు తానే అయి సంచరించి విలాసము చూపిన గాథ సంవత్సరాంతమున బ్రహ్మ సంతసించి యోగేశ్వరేశ్వరుం డయిన గోపాల బ్రహ్మము నభినందించి తాను హరించినవి ఎల్ల ఆతని కొప్పించి తన లోకమున కేగెను.

బహుశ + అకామ + ధామము = సత్యలోకము, బ్రహ్మనివాస స్థానము (ముందు పద్యములతో గాథ పూర్తియగును.)

పాండవ : బహు + శాకా + ధామము = లక్క యిల్లు. విదురుని ఉపదేశమున ఒకరాత్రి ఆ ఇల్లు కాల్చి కాశీపురము విడిచి భీముని బలసహాయమున నిశదక్షిణ దిశారణ్యములలో ప్రవేశింతురు. (పాండవులు కుంతియు) ఇం దీ విషయము సూచితము.

రాఘవ : శ్రీరామచంద్రుడు ప్రాకృతునివలె మునివెంట నేగుచుండెను.

సీ. ఘనశతానంద గురు పరిగ్రహముఁ గాంచి
యాతఁ డా బాలకాది రూపానుయోగ
కలిత మహిమను వెలయును గలసి యచట
ప్రాచ్య దధి ముఖ్య దివ్యాన్న మారగించి. 24

యాదవ : శతానందుడు = బ్రహ్మ — కృష్ణుని మహిమకు ఆనందించి బ్రహ్మ గోగోప గణము తిరిగి ఇచ్చెను. ప్రతినిత్యము సంవత్సరముపాటు తానొక్కడే అన్ని రూపములు కైకొని అనుభవించిన చల్దులు వారితో కలసి ఆరగించెను.

పాండవ : శతానందగురుడు = వ్యాసులు. ఆతని యుపదేశానుసారము గ్రామముల బ్రాహ్మణ వేషధారులయి భిక్షాన్నమున కాలము గడపుచు క్రమముగా అరణ్యముల సంచరించుచు పోవుచుండిరి.

రాఘవ : విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో నేగి శతానందుని ఆతిథ్యము గ్రహించెను.

వ. ప్రొద్దుఁ బుచ్చుచుండి యనంతరంబున—

చ. విదుర జనోపదర్శిత నవీనగతిన్సహజాగ్ర భీమ దో
ర్మద బలసత్సహాయత ఖర ప్రతిభాసురకంట కచ్ఛిదన్
ముదిత మతిన్భజింపఁగన మున్నతిఁ జెందెను తాలసత్ఫలా
భ్యుదయ రతి\=న్ ప్రమోద జనతోరు పురస్థితి నద్భుతంబుగ\=న్. 25

యాదవ : బలరామ సహితుడయి కృష్ణుడు తాళవనము ప్రవేశించెను. అట ఖర = గర్దభాసురుని చంపిన వృత్తము — బలరాముడు వానిని చంపెను. అనంతరము తాళఫలములు సుఖముగ అనుభవించి విహరించిరి.

పాండవ : లాక్షాగృహ రహస్యము. తాను ఖనకునిచే త్రవ్వించి భూబిలమార్గము విదురుడు పాండవులకు చేర్పించెను. ఆ మార్గముననే లక్కయిలు కాల్చి వారలు సుఖముగ వెడలిపోయిరి.

తాల + సత్ఫల + అభ్యుదయ + రతిన్ = గొప్పదయిన శుభపరంపర కని ఆనందించిరి ఆ పాండవులు.

రాఘవ : ఏ ఆపదయు లేక విశ్వామిత్రు రక్షణమున ఆతడు చూపిన మార్గము రామలక్ష్మణు లనుసరించిరి.

మ. అతఁడంతఁ జన దుర్గ మోగ్రవశ మధ్యం బొక్కటఁ జొచ్చి యు
ద్ధతిఁ బోవంగన హీనదుర్విషహ వృత్తంబందిది యా భోగ ప
ద్ధతిఁ బెంచఁ జరియించు పుణ్యజన సేవ్యం బౌటఁ దత్ప్రీరణా
గతితోఁ బుట్టు నిజానుభావ మహిమల్ గన్పట్టు మోహోన్నతిఁ. 26

యాదవ : అహి + జన+దుర్విషహ + వృత్తము.

కాళియాహి సమాక్రాంతమయిన కాళింది మడుగు కృష్ణాదులు కాంచిరి. పుణ్య—బౌట = ఋష్యాశ్రమములుండుటవలన వారి ఆపద తొలగించ కృష్ణుడు తలపోసెను.

పాండవ : పుణ్యజనులు = రాక్షసులు. పాండవులేగుచున్న అరణ్యములు రాక్షసావాసములు. తోబుట్టు = హిడింబాసురుని చెలియలు హైడింబి. అన్నయు, తల్లియు వల్లె అన ఆమెను పరిగ్రహించి భీముడామె వలన ఘటోత్కచుని కాంచును.

రాఘవ : రాక్షసావాసములయ్యు వనముల మహిమాన్వితుడయిన రామునికి ఆనందదాయకము లాయెను.

గీ. గత నిజపదకమల పాళి కాళియాహి
తగను వరసతి ప్రాప్తిగాఁ దాను బోవఁ
బావని గతిని శ్రీరామ భవ్యకృష్ణ
మూర్తి భాస్వత్త నయయుక్తి ముదముఁ జెందె. 27

యాదవ : కృష్ణుడు హ్రదమున దూకి కాళీయు ఫణాగ్రముల నాట్యము చేసి హింసించి ఆతని భార్యల ప్రార్థనమును విని; హ్రదము విడిచి సముద్రమున దూర ద్వీపము నాశ్రయించ శాసించి మడుగు నిర్విష మొనరించెను.

పాండవ : భాస్వతీ + తనయ+యుక్తి = హైడింబికి సుతలాభ మిచ్చి భీముడు ఆమెను సంతోషపెట్టెను.

రాఘవ : పద — ఆహిత = పాదరజ స్పర్శచే శాపడియున్న అహల్య శాపము తీరిస్త్రీ ఆయెను. పావని=పవిత్రుడయిన గౌతము డీ సంగతి తెలిసివచ్చి రాముని నుతించి; వరసతిప్రాప్తిగా = చిరము శాప మనుభవించిన కాంతను ఆదరించి ఆమెతో తన ఆశ్రమమున కేగెను. శ్రీరాము డానందించెను.

సీ. రూఢి హిడింబాసురుఁడును ప్రలంబాఖ్య
మాయల మారీచు మద మణంచి
శ్రీరాముఁ డతఁడొప్పఁ జేరిహృత్తాపనా
శనగతిశుచి మునీశ్వరు భజింప
మహి విప్రవరచర్య మాధు కరోద్వృత్తి
సరసలీల లనేక చక్రసార
సవనపురస్ఫూర్తిఁ జరియింపుచునుగాంచి
సాఁగిజావక పుణ్య జనతఁబెంచి.

ఆ. వె. వ్రతము నిష్ఠగలుగు వనితల సద్యుక్తిఁ
గోరిపోయి రతుల సారమెంచ
వారిత గతి మించు వారి జాతాంగార
పర్ణ లీల లణంచి భంగపఱచి 28

యాదవ : అరణ్యముల ప్రలంబాసురాది నిశాచరులను చంపి ఋషులకు ఆనందము చేకూర్చిన బలరామ కృష్ణులను ఆశ్రమవాసులు ఆదరించి మృష్టాన్నము లిడిరి. అనంతరము వ్రత నిష్ఠలయ్యు వస్త్రములు తీరవృక్షమునబెట్టి జలక్రీడలాడు గోపికల వస్త్రములు హరించి వారిచే మ్రొక్కులంది వ్రతఫలమిచ్చిన వృత్తాంతము సూచితము.

పాండవ : వ్యాసు నుపదేశానుసారము అరణ్యములుగడచి పోవువారు ఏకచక్ర-పురమున మధుకర వృత్తి కొంతకాలముండి అట భీముడు బకాసురుని చంపి బ్రాహ్మణ కుటుంబము ఆపద వారించిన అనంతరము ఆ పురము విడిచి ముందుకు సాగిపోయిరి. ఒక రేయి అంగార పర్ణుడను గంధర్వుడు వీరిని ధిక్కరించ అర్జును డాతనిని నిర్జించి అనంతరము ఆతనిని మిత్రునిగా స్వీకరించెను.

రాఘవ : వ్రతులను, ఆశ్రమములను చూచుచు ఋషి వాటికల ఆశ్రమవాసు లిచ్చు భిక్షాన్నము లారగించుచు రామలక్ష్మణులు ఏ వికారములు లేక, అంగార + పర్ణ లీలలు పూచిన మోదుగుల సౌందర్యము కనుచు నియమవ్రతులయి సాగిపోయిరి.

క. సరస స్వయంవరగ సం
వరణ తపతి కథలు వినుచు పరమాగమ వా
క్కారణ పురోహిత గతిఁగని
గురు సహజామోద భావ గుంభిత వృత్తిన్. 29

యాదవ : తపతీ సంవరణుల స్వయంవర గాథలు వేదవిదుడు పురోహితుడు తెలుప విని రామకృష్ణులు సంతసించిరి. సూర్యచంద్ర వంశ్యులు ఇరువురును తాపత్యులు తపతి సూర్యుని పుత్రిక. సావిత్రికి చెలియలు. వశిష్టుడు తన మహిమచే సూర్యుని గతి ననుసరించి ఆతనిని మెప్పించి తపతిని సంవరణున కిప్పించెను. ఆకథ వినుచు ఇంద్రోత్సవము మాన్పించి కృష్ణుడు అన్న బలరాముని ఒప్పించి గోవర్ధనగిరికి ఉత్సవము చేయించును. ఇది కృష్ణుని మహిమను తెల్పు ఇంకొక గాథ.

పాండవ : పాండవులు అడవుల సంచరించుట విని వారు లాక్షాగృహదాహము నకుతప్పి సుఖ ముండుటకు సంతసించి వారి పురోహితుడు ధౌమ్యుడు వచ్చి, వారికి ద్రౌపదీ స్వయంవర వృత్తాంతము వినిపించి అటకేగుడని వారి కుపదేశించెను. పాండవులు సంతసించిరి.

రాఘవ : తపతీ సంవరణ స్వయంవర గాథ విన్పించి గాధిసుతుడు విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు సీతా స్వయంవరము సూచించి వారి ఉత్సాహమును ఇనుమడించును.

సీ. చనితత్పురస్థిర సర్వతోముఖవీథి
విలసిత శ్రీనేత విఖ్యాతిఁదనరి
తదవనీపద్రుపదగత నివాసప్ర
మోదజనకకలి తాదరమున
వరకర్ణశల్యాదు ష్ప్రాపకరణజయ
విఖ్యాతిమహిమాతి విభవమునను
నతుల శివకర ధర్మావలంబనంబున
తదురువిసారవ ర్ధనముచేతఁ.

తే. గీ. జెలఁగు నచలాత్మసంజాత శీతలాళి
తాతిగుణకృష్ణవ పకుంత లాళి వశ్య

కేళినొనరించె శ్రీరామ కృష్ణమూర్తి
విజయ సుసమాఖ్య నంబరా వృతిదముగను. 30

యాదవ : ఆ బాల వృద్ధము గోకులమును బృందావనము నుండి కొనిపోయి గోవర్ధనగిరి ప్రాంతమును రామకృష్ణులు చేరిరి. అంతయును ఆ విశాల ప్రదేశమును వితానమాలికలచే అలంకరింపచేసి గిరి ఉత్సవము చేయించెను. ఇది ఇంద్రునకు హృదయశల్య మయ్యెను.

పాండవ : కృష్ణనీ = ద్రౌపదిని, విజయుడు = అర్జునుడు మత్స్యయంత్రము నేసి ద్రౌపదిని చేపట్టెను. స్వయంవర మండపము పై విధమున అలంకృతమయి యుండెను. వర —దుష్ప్రాప = కర్ణాదుల కలవికాని దానిని.

రాఘవ : అచల + సంజాత = భూపుత్రి సీత శివ + కర + ధర్మావలంబనము = శివుని విల్లెక్కిడి భంగపఱచి సీతను శ్రీరాముడు వివాహమాడెను.

సీ. అపుడు భూమిసుర ప్రియాన్న దానసుతృప్తి
నమరివసిష్ఠకా ర్యాప్తి నలర
నతఁడంతతత్ప్రజ నంపించి తద్గురు
ప్రజలను పిలుపించ వారువచ్చి
యన్యోన్యపూర్వోక్త రాశిభాషణముల
గతసంశయంబున హితులగూర్చి
తద్గురు వ్యాసోక్తి తగు సంతసంబున
నుత్సవంబొనరించి యుచితలీల

తే. గీ. నన్నకును ననుజులకును నానలుగురి
కలతన దుహితల సమాన సానుభూతి
జాతలసదాప్త గోత్రస్వ జాతికెల్ల
నిష్టములునిండ నెసఁగెను తృష్ణగతిని. 31

యాదవ : అట గొల్లలు కొండకోన వేదికగా వేడుకలు చూచి విందులు ఆరగించిరి. రామకృష్ణులు తమ కులమువారి నెల్లరను మృష్టాన్నము లిచ్చి తృప్తిపఱచిరి. కొందఱు ఇంద్రోత్సవము భంగము కాగా ఏమి ముప్పు వాటిల్లునో అని భయము

వ్యక్తముచేయ; తనదు + హిత + లనమాన + సానుభూతి = ప్రియోక్తులు తెల్పి అభయమని భయము వాపి కృష్ణుడు వారల ఇష్టములు కూర్చి ఆనందమున నోలలాడించెను.

పాండవ : తల్లి వాక్యమును పరిపాలించి ద్రౌపదిని పాండవు లేవురును క్రమముగ వివాహమాడ నిశ్చయించి ద్రుపదునకు తెల్పిరి. (అమ్మా పండు తెచ్చితిమన అయిదుగురును పంచుకొనుడని కుంతి అనుట కారణము). ద్రుపదుని ధర్మ సందేహము పంచేంద్రోపాఖ్యానము వివరించి వ్యాసులు సంశయము తీర్చెను. అనంతరమే ద్రుపద మహారాజు తన కుమార్తె ద్రౌపదిని పాండవులు అయిదుగురికిని జ్యేష్ఠాను క్రమమున వివాహము నిర్వర్తింప చేసెను. తన దుహిత = కుమార్తె.

రాఘవ : జనక చక్రవర్తి రామునకు సీత నిచ్చి వివాహము గావించెను. తన సోదరుని కుమార్తెలు మాండవి, శ్రుతకీర్తి, ఊర్మిళ అను వారలను ఈయ నిశ్చయించి, వశిష్ఠులకును దశరథునకును వార్త లందించి బంధుజనములతో రావించి కల్యాణములు జరిపించెను.

మ. తులనాతీత పురస్థితో పవనులం దున్ వీథులందిద్ది నే
ర్పులరన్దీరిచి తోరణ ధ్వజవితా నాదుల్ సరుల్గట్టి యు
జ్జ్వల రంభాక్రముక ప్రకాండములు పా ర్శ్వప్రాంతభాగంబు లం
దులఁ బూన్పించి మణీవితర్దులను గ స్తూరీ సుగంధంబులన్. 32

యాదవ : ఇంద్ర విజయము కాదు తన విజయమని చాటి కృష్ణుడు అలంకారములు ఆ వన వీథుల ఆ గిరి ప్రాంతముల నేర్పరించెను.

పాండవ : ద్రుపదుడు తన పురము అటులనే అలంకారము చేయించెను.

రాఘవ : జనక చక్రవర్తియు మిథిలాపురమున అలంకారములురచియింపచేసెను.

మ. కలియంగా నలికించి పంచమణిరం గద్రంగవల్లీసమా
కలనన్ గాంచన సాలభంజికల ముక్తావిద్రుమస్తంభ సం
కలితాభ్రం లిహకాయమానములఁ జక్కఁగా జేసి చిత్రంబు విం
తలదీవ్యన్మణి కంబళాంతముల చెం తన్మంచె లన్నిల్పుచున్. 33

యాదవ : పాండవ : రాఘవ : సమము—ముప్వురు కృష్ణ ద్రుపద జనకులు అభ్రం లిహ = ఆకాశమును అంటు ఎత్తైన కాయమానములు = పందిళ్లు.

చ. వలసిన యుత్సవంబుల న పారముగాఁ బచరించి వేదవా
దలసిత హోమముల్బలివి ధానములన్గ్రహ శాంతులన్మహో
జ్జ్వలగతిఁజేయ విప్రులను బంచి బుధప్రవరాప్త బంధు పం
క్తుల బిలుపించి వస్తువులు తోరముగా సమకూర్చె వేడుకన్. 34

మూడర్థములు సమము. సుగమము. ముప్వురును హోమాదులు శాంతి క్రియలు వేదవాదులయిన బ్రాహ్మణులచే నిర్వర్తింపించిరి.

ఉ. చంచల లోచనల్కడఁగి సంపఁగినూనియ నించియున్న స
త్కాంచన రత్నచారుచష కంబులఁ జేకొని హంసలోయనన్
గొంచకఁజేరి దంపతుల కుందల యంటిరి రత్నకంకణో
దంచిత నాదముల్జెమట హారము స్గుచము ల్చెలంగగన్. 35

సమము—సుగమము. దంపతీ పూజలు చేయించిరి.

చ. కలపములంటి యుజ్జ్వలన ఖప్రకరంబుల గీఁటి మెల్లన
న్జలకములార్చిమైఁదుడిచి చల్వమడుంగులు గట్టి చక్కఁగాఁ
గలపములంటి రత్నమయ కాంచన భూషలుబెట్టి రొక్కటన్
వలనుగ మ్రోయు పంచవిధ వాద్యము లన్దివి పిక్కటిల్లఁగన్. 36

సమము—సుగమము.

క. ఆయెడఁ దననిరవధిక
న్యాయత దానక్రియలు స మవధానముతోఁ
బాయక యొనర్చి వివిధా
పాయాభావముగ విప్ర వర దంపతులన్. 37

సమము—సుగమము.

వ. ఉచిత గతిఁ గూర్చుండ నియోగించి :—

సీ. ఒక సైకతశ్రోణి యకలంక కాంచన
దివ్యపీఠమ్ములఁ దెచ్చి యుంచె
నొక దర్పణ కపోల సకల రత్నమ్ముల
కనకంపుఁ బళ్లెము ల్గడఁగి యుంచె

నొక కోక కుచకుంభ ప్రకట మాణిక్యాల
బంగరు గిన్నెలు పరగ నుంచె
నొక పక్వ బింబోష్ఠి చిలికి బంగరుగిండ్ల
గంగామృతము నించి కడకు నుంచె

ఆ. వె. నొక్క మెఱుఁగు బోఁడి చక్కని పాత్రాభి
ఘారమొనరఁ జేసె కౌశలముగ
నొక్క సరస వచన యూరుఁగాయలు పత్ర
భాజనముల నుంచె రాజితముగ. 38

సమము—సుగమము.

ఆ. వె. రాజహంస గతుల రాజబింబాస్యలు
చారు పాత్రికలను కూరగములు
వేరువేర నుంచి పేర్వేఱ వడ్డించి
రుభయ పంక్తులందు ప్రభలు సెలఁగ. 39

సమము—సుగమము.

చ. మఱియుఁ జెలంగి యంగనలు మంజుల సింజిత ముల్లసిల్లఁగా
బిరబిర మేటి యన్నములు పెట్టిరి బంగరు పళ్లెరమ్ములన్
వరుస నిలింప పంక్తికిన వారణగాసుధపెట్టు మోహినీ
తరుణి యనేక రూపములు దాల్చి నిజోన్నతిఁ దెల్పు కైవడిన్. 40

సమము—సుగమము.

మ. వడలుం దేసెతో లల్మనోహరము ల ప్పాల త్రిసాల్దోసె ల
ప్పడముల్గారెలు ఖర్జు కాయలును ల డ్వంబుల్సరెల్పూర్ణ ము
న్గడుముల్ తొట్టెలు సారెసత్తులు మఱుం గుంబువ్వలు న్పూరెలున్
వడియా లిడ్డెన పాలకాయలును నొ బ్బట్లుక్కెరల్పున్కలున్. 41

సమము—సుగమము.

మ. పరమాన్నంబులు పప్పులుఁ శిఖరులుఁ బచ్చళ్లు సూర్పిండులుఁ
బెరుగు న్పాలును నెయ్యి మీగడలు జున్వెన్నల్ రసాలంబులుఁ
జెఱుకున్పాల్ కలవంటకాల్ పనసలుఁ జీన్పక్కెరల్ పాఁగులుఁ
వరుగుల్ రేఁగులు ఖండ చక్కెరలు నం బళ్లజ్జులున్ జిగల్. 42

సమము—సుగమము.

శా. వేవ్వేఅన్నవ మోహనాంగులు సము ద్వేలాంగ నేత్ర ద్యుతు
ల్పర్వ న్బంగరు పళ్ళెరమ్ములను భా స్వల్లీలమైఁ దెచ్చి దృ
క్పర్వంబై తగి వేఱువేఱ నమర న్వడ్డించి రప్పంక్తికిఁ
సర్వాంగీణ సుగంధి గంధల హరుల్ సర్వాళలం జెందఁగాఁ. 43

సమము—సుగమము.

సీ. తన కర్ణముల సౌరు పెనుపొందుననుతీరు
చక్కిలాల్వడ్డించె సఖియ యోర్తు
తన యధరామృతం బునకు నీడను లీల
నాన బాల్వడ్డించె నబలయోర్తు
తన మధురాలాప మునకుఁ జోడను మాడ్కిఁ
దేనియల్వడ్డించెఁ దెఱవయోర్తు
తన చిన్ని చన్నుల కెనవచ్చుననురీతి
ద్రాక్షలు వడ్డించెఁ దరుణియోర్తు.

తే. గీ. తన మధుర గుణములఁబోలు ననెడు భంగి
కదళి ఫలముల వడ్డించెఁ గాంతయోర్తు
తన సరస సుందరతఁబూను ననెడు భాతిఁ
జూత ఫలములు వడ్డించె సుదతియోర్తు. 44

సమము—సుగమము.

క. చందన కుసుమాక్షతచయ
మందటికిని విభుఁ డొసంగి యగ్రజ పూర్వం

బందాపోశనము లిడియ
మందగతిఁ దారవోసె మంత్రోక్తులచేఁ. 45

సమము—సుగమము.

సీ. పణుతులు కొందఱు బంగారు తపిలెలఁ
డియ్యచారెత్తిరి నెయ్యమెసఁగ
బాలలు కొందఱు నీలంపు వెసలలఁ
బుల్లచారెత్తిరి పొలుపుమిపుల
వెలదులు కొందఱు వెండికుండల మజ్జి
గ రసమ్ములెత్తిరి సరసలీల
భామలు కొందఱు పచ్చలకలశాలఁ
బుల్ల గూరల నెత్తి రుల్లసిల్ల

తే. గీ. వజ్ర మాణిక్య నిర్మిత పాత్రములను
చారుఘనసార పాటీర నీరసార
చంపకేలాది పరిమళ శైత్యగాంగ
సలిల మెత్తిరి కొందఱు చంద్రముఖులు. 46

సమము—సుగమము.

వ. ఇవ్విధంబున చతుర్విధాహారములఁ దృప్తులై, మఱియుఁ గర్పూర తాంబూలాదుల, గంధ మాల్యాంబరాభరణాదుల, నుచిత క్రియలఁ బరితోషితులం జేసిన వారును, నుత్సవాంతంబున, నతనికి నమస్కరించి, యుచిత విధంబున, ననుజ్ఞఁగై కొని, ప్రమదా జన పరివృతులై నిజ నివాసంబునకుం జని, రట్లు లోకాతీత కార్యకరణంబున, నమానుష తేజంబునం, గృతకృత్యులై, చను నెడ,

సమము—సుగమము.

చ. పొడఁగని రోషభీణతఁ బొంగిన భూమి సురేంద్ర హంకృతిఁ
జడిగొను శర్కరాశుగర ఝుర్ఝర వృష్టిని మిత్ర బంధులఁ

సుడిగొనకుండ గోత్రధృతి సుస్థిరుఁడై యొనరించె రాముఁడా
తఁడు హరి విక్రమక్రమని దానమున న్విజయాఖ్యమీఁజగన్. 47

యాదవ : కృష్ణుని చర్యకు ఇంద్రుడు కోపించి పుష్కలావర్త మేఘములను పురికొల్పి కుంభవృష్టి కురియించెను. గోకులమువారు బాధపడి కలతనొంద గోవర్ధనగిరి తన కొనవ్రేల ఛత్రముగా నిల్పి ఆ భూరి వర్షబాధ తొలగించి వారిని రక్షించెను. ఎన్ని దినములు వర్షము కురిసెనో అన్ని దినములు అటుల రక్షించుచు ఆహారవిహారాదులు తన ప్రభావమున కల్పించి సుఖులను గావించెను. ఈ విధముగ ఇంద్రుని గర్వ మడంచి కృష్ణుడు చిద్విలాసము చూపెను.

పాండవ : రాజలోకము అంతయు తమ్ము రావించి ద్రౌపదిని బ్రాహ్మణునకిచ్చి అవమానించుటగా తలంచి ద్రుపదునిపై చెలరేగ వారి సంరంభము నంతయు అర్జునుడు భీము సహాయమున చిందర వందర చేసి ఓడించి మించెను.

రాఘవ : రాముడు శివు విల్లు విరిచి సీతను వివాహమాడి అయోధ్య కేగుచుండ మార్గమధ్యమున పరశురాముడు కోపించి అడ్డు తగులగా రాము డాతని విల్లెక్కిడి తేజము హరించి శాంతింప చేసెను.

శా. అంతస్స్మితి నిరస్త భార్గవ కుమా రాద్యంత వృత్తాంతము
భ్రాంతిస్థాహిత కోటిచే వినియము ప్రాప్తిన్దగన్ వారలన్
జెంత న్జేరుచుఁ బిల్చి కౌఁగిటను జేర్చెన్ దద్గుణ శ్లాఘతో
నెంతేని న్సమయోచితంబు క్రియతో నింద్రుఁడు వచ్చెం దయన్. 48

యాదవ : దేవర్షులవలన మిత్రులవలన కృష్ణ మహిమము విని అహంకార ముడిగి వాన పెల్లు ఉడిపి ఇంద్రుడు కృష్ణు దర్శించి ఉచితాలాపములుసల్పి గౌరవించెను.

పాండవ : విజయుని విజయము ఆలించి ఇంద్రుడు సంతోషించి ధర్మజుని గౌరవించుపొంటె ద్రుపదునగరమునకు వచ్చి పాండవులను ప్రశంసించెను.

రాఘవ : పరశురాము గర్వభంగము రామునివలన కాగా భూ భారము తీరును, రావణాది రాక్షస సంహారము నిశ్చయమని తలంచి ఇంద్రుడు రాముని దర్శించి శ్లాఘించి యేగెను.

తే. గీ. అతఁడు నిజరాజ భాగంబు నందు నిలువ
నరుగ నెలవియ్యగురు యుక్తి ననుజనులకు

తోడ రా విశ్వకర్మ ని స్తులముఁగాఁగ
రచన సేయఁగ విలసిల్లు రాజధాని. 49

యాదవ : ఇంద్రుడు కృష్ణాదులను అప్పటికి బృందావనమున కేగి అనంతరము కాలయవనాదుల ఉపద్రవము రాగలదని తెల్పి విశ్వకర్మచే సముద్ర మధ్యమున ద్వారకను నిర్మాణము చేయించి అట నివాసముండ నుపదేశించి తన ధామమున కేగెను.

పాండవ : గురుయుక్తి = ధృతరాష్ట్ర వాక్యానుసారము ద్రౌపదీస్వయంవరా నంతరము హస్తిపురి వదలి ఇంద్రప్రస్థమును రాజధానిగా తన రాజ్య భాగము పాలించు చుండ ఇంద్రు డిచ్చిన మయసభ నలంకరించిరి.

రాఘవ : రాముడు బంధు జనముతో జననీ జనకులతో అనుజులతో అయోధ్య కేగి సుఖముగ నుండెను.

వ. చేరి, పద్మరాగ వైడూర్య మరకత నీల పుష్యరాగ గోమేధికా ఖ్యాఖండైక మణి వినిర్మిత సప్తప్రాకారాట్టాలక సౌధహర్మ్య గోపుర పరంపరా పరిశోభితంబును, విద్రుమస్తంభ సంభాసమాన, మధ్యశాలా కూటాగార ముఖ నిలయనివహ నిరుపమంబును, చంద్రకాంతోపలబద్ధ కుట్టిమస్థలంబును, స్ఫటికోపల పరికల్పిత ద్వారబంధ సోపాన రాజీ విరాజితంబును, కనక మయ కవాటపటలీ విభాసితంబును, అభ్రంకష వైజయంతి పతాకా పటపటాత్కార పటహరవ శంకాకరంబును, మేరు మంథరనిభ కనకమణి మయ విమానస్యందన సందోహ బంధు రంబును, ఐరావణ విరాజమాన దంతావళ రాజ మండితంబును, ఉచ్చైశ్శ్రవో విఖ్యాత తురంగ రంగంబును, బ్రహ్మర్షి దేవర్షి రాజర్షి పరిపూర్ణంబును, మహోహార సముద్భటభట సమాకీర్ణంబును, సుధర్మా సమాన సభాభిరామంబును, సురసాల ముఖానేకానోకహ కిసాలదళ ముకుళీకుసుమ శలాటు ఫలభర భరితామోదకర నందనాతిశయ వనోప వనంబును, పుణ్య తరంగిణీ సంగతంబును నగు పురవరంబున నధి వసించి లోకులు తన్ను వైభవంబున దేవేంద్రుడన, నేక వాక్యంబున రామచంద్రుండన, ధర్మశీలత ధర్మరాజన, జగతీ పరిపాలన యత్నం బున నుత్సుకుండై యుండె, నయ్యవసరంబున.

యాదవ : ఇంద్రుని సుధర్మయే యన ద్వారకాపురము రచియింపబడెను. యాదవులకు కాబోవు రాజధాని.

పాండవ : ఆవర్ణనతో విలసిల్లు మయసభ నలంకరించి అందలి విశేషములు శిక్షించి ఆనందించుచు ధర్మజుడు అనుజులతో రాజ్య పాలన దక్షుడాయెను.

రాఘవ : భూలోకస్వర్గమనదగు అయోధ్యలో రాముడు సుఖముగ కాలము గడుపుచుండెను.

మ. సురశత్రూప హితాధికార గతిన స్తోకంబుగా వచ్చునా
గురు పీడల్ హరియించుచున్ సుజన పం క్తుల్మెచ్చఁ బెంపొందనా
సరసీజానన పుత్రనీతిని యతా చారంబు లన్నిత్యమున్
దరుణీ రత్నని క్లిప్త యోగముల నా నందాప్తిఁ గ్రీడించఁగన్. 50

యాదవ : రాక్షసుల వలన నయిన పీడలు హరించుచు బుధులు నుతిసేయ నారద శుక్ర పరాశరాది నీతి శాస్త్రముల ననుసరించి రాజనీతి వెలయించుచు గోపికలతో గోప కుమారులతో రామకృష్ణులు కూడి ఆడి ఆనందించుచుండిరి.

పాండవ : ధర్మరాజు అనుజులతో గూడి వనితాజనముతో నిరీతిగ రాజ్యపాలనము చేయుచు ఆనందించెను.

రాఘవ : శ్రీరామచంద్రుడు సోదరులతో తరుణీజనముతో అయోధ్య విహారాదుల ఆనందించుచుండెను.

శా. సౌర ద్వీపవతీల సత్తమసకం జస్వాదుతోయంబులం
దీరోద్యద్వ్రమి సారవోరు వనపం క్తిన్గోప కాంతాదృతిన్
వారాలోల తరంగ కేళిసికతా ప్రాంతాగ్రహల్లీస క
స్వైరస్ఫార విహార వైఖరులన శ్రాంతంబు రంజిల్లఁగన్. 51

యాదవ : తమస = యమున; యమునాతీర విహారముల రాసక్రీడాదు లొనరించుచు విహరించెను.

పాండవ : సౌర + ద్వీపవతి = సురగంగ: లసత్తమ + సకంజ = నిర్మలము, తామరలతో కూడినది.

రాఘవ : సరయూ తీరమున అనుజులతో కాంతాజనముతో విహరించెను.

క. ఆనందాత్మజకేళి క
కా నూత్న విలాస మమర లాలిత మయ్యెన్
సూనాంబక జనక కటా
క్షానూనతఁ గోపగించి రలపతు లెపుడున్. 52

యాదవ : ఆ + నంద + ఆత్మజ = నందకుమారుడు గోపాల కృష్ణమూర్తి. ఈతని కేలా విలాసములు; అమర + లాలితమయ్యెన్ = దేవతలకు, ఆనందదాయక మయ్యెను. సూన + అంబక = మన్మథుని వలన; జనక = పుట్టిన కటాక్ష + అనూనత = సాటిలేని క్రీగంటి ప్రసారముల వలన; ప్రియులు విఘనస్కులగుచుందురు.

పాండవ : ఆనందముతో కూడిన; ఆత్మజ + కేళి = కుమారుల విలాసములు దేవతల ప్రసన్నతకు ఆకరమయ్యెను; సూన—జనక = కృష్ణుని యొక్క కటాక్షము నూన + తక్కువయిన; పాండవులు దీను లగుచుందురు; అది అలవడిన ఆనందింతురు.

రాఘవ : రామాదుల విలాసములు దివ్యులకు ఆనంద దాయక మయ్యెను.

వ. వర్ధమాను లగుచున్న వారిని గాంచి దేవత లానందించిరి.

తే. గీ. గోప్రవరదస్యు బలశక్తిఁ గూల్చివైచి
ధరణి దేవవరనిజ గో ధనము నిల్పు
నపుడు ధర్మభృతి యొనర్చ నగ్ర జన్మ
శరణ గతిఁ జెంద నిజసమా చరణనియతి. 53

యాదవ : గో—దస్యు = గోకులము వారి శత్రువులను, స్వీయ పౌరుషమున తిరస్కరించి; ధరణి—గోధనము = భూసురులను, గోగోపకులను రక్షించునపుడును; ధర్మ—ఒనర్చ = ధర్మమును రక్షించునపుడును; అగ్రజన్మ = బలరాముని సహాయము కలిమి; శరణ—నియతి = దీనులను రక్షించుచు కృష్ణుడు చరించుచుండెను.

పాండవ : గో—దస్యు = ఒక బ్రాహ్మణుని గోవును హరించి కొనిపోవు దొంగను శిక్షించు నిమిత్తము అనుజ్ఞ లేక ధనుర్బాణములకయి అన్నగారి ఆగారము ప్రవేశించి ప్రాయశ్చిత్తముగా కార్యము చక్కబెట్టిన అనంతరము తీర్థయాత్రలు చేయ అర్జునుడు నిశ్చయించెను. (ఇది నారదాను శాసనము).

రాఘవ : రామచంద్రుడు తండ్రి ఆనతి వడసి తీర్థయాత్రలకై సోదరులతో పో తలంచి ఆ నెపమున ప్రజలను పరికింప నిశ్చయించెను.

క. సలుపఁ దలఁచుట పెద్దల
కలరన్దెలియంగఁ జేసె నపుడా కృష్ణుం
డల ఘుతర కాంతి భరతుం
డెలమి సుమిత్రాత్మజాతి హిత సహితుండై. 54

యాదవ : కృష్ణుడును అన్నతో అనుజనులతో నందాదుల ననుమతించిరి_
పాండవ : అర్జునుడు ధర్మజు ననుమతి వడసి_
రాఘవ : రాముడు సోదరత్రయముతో.

శా. ఆ గోపాధిపు నాజ్ఞతోడఁజని య య్యాత్రోత్సవ శ్రీతగం
గాగుర్వాప్తిని నాగభద్రగతి వే గంబెంచుచుఁ గృష్ణుఁ డా
యోగంబంది సుదర్శనాఖ్యతగు ది వ్యంగాంచి మోదించి త
ద్వాగా కర్ణన సంభ్రమాప్తిఁ దదిరా వంతుండు మోహించగఁ. 55

యాదవ : సుదర్శను డను గంధర్వుడు శాపవశమున అజగరమయి యున్న వాడు వనముల విహరించు గోగోపకులను మ్రింగ కృష్ణుడు వానిని చీల్చివైచి తన వారిని గోగణమును రక్షించెను. శాపము తీరి గంధర్వుడు కృష్ణుని నుతించి నిజనగరమున కేగెను. అనంతరము కోసలపతికి వృషభముల వలన కలిగిన ఆపద తొలగించి అతని తనయ నాగ్నజితిని పరిణయ మయ్యెను.

పాండవ : యాత్రలను సేవించు అర్జును డొకనాడు గంగా జలముల స్నానము చేయుచుండ ఉలీచి యను నాగకన్య ఆతనిని తన లోకమునకు కొనిపోయి ఇష్టము తీర్చుకొని ఇరావంతుడను సుతుని గని తిరిగి ప్రియుని భూలోకమునకు తెచ్చి విడిచెను.

రాఘవ : యాత్ర నెపమున రామాదులు సామంతులు ప్రజలు తమ్ము చూచి ఆనందించ కాశీ మొదలయిన క్షేత్రములు దర్శించెను.

వ. అంత—.

సీ. యాత్రా సమాప్తిఁ జి త్రాంగదా నామ ల
తాంగికృత సురతా వాప్తి పరహి
తాత్ములఁ బెద్దల నానంద నీనంద
న ప్రాప్తిఁ గోరుద న్మాతృజనకు

లనభీష్మ సత్క్రతు లను మోద మొనరించి
తత్పుర స్థితిఁ దాను దనర నిలిచె
నతఁడిలకుసదా కు లాంగ నామకరిక
లాపాకృతులు బెంచ లలిత వృత్తి.

తే. గీ. నమరు నబ్జారి కరుఁడు వి ఖ్యాతి చిత్ర
వాహన నృపాలకు ననుజ్ఞ వచ్చి చెంతఁ
గొనకొనిన వాటిఁ గొనుచున్న గోప దస్యు
శత్రునబ్జ చూడు గనిత క్షత్రమంది. 56

యాదవ : అబ్జ చూడు = శంఖ చూడుడను యక్షుడు వ్యాఘ్రరూపమున ఒక రేయి గోపికలతో రాసక్రీడ జరుగుచున్న చోటికి వచ్చి గోపికలను హింసింప బోవ వానిని కృష్ణుడు చంపి అతని చూడామణిని అన్న బలరాముని కిచ్చెను.

పాండవ : అర్జునుడు సౌభద్ర తీర్థమున అందు మొసళ్ళు అయి ఉన్న పంచ అప్సరసలను తీరమున బడవైచి శాపమోక్ష మొనరించెను. వారాతనిని కొనియాడి దేవలోకమున కేగిరి. సమీపమున గల మణిపూరు రాజు చిత్రవాహన నృపాలు తనయ చిత్రాంగదను వివాహమాడి బభ్రువాహనుడను సుతుని గని సంతులేని రాజున కాసుతు నెప్పించి అట గదలి చనియెను.

రాఘవ : ఈతి బాధలు లేని ప్రజలను గాంచి రాముడు సంతసించెను.

తే. గీ. డాయు తద్దుష్ట పాప ఖం డన మొనర్చి
నిఖిల లోకోపకారియై నెగడె నంత
మాతులావాసమునఁ జేరి భూతి నమర
నియమి యగు నాతఁడును నయ నియతి నున్న. 57

యాదవ : రామకృష్ణులు తమ్ము హింసింప వచ్చిన పలురూపులు గొన్న రాక్షసులను ఖండించివైచి దివ్యులకు లోకులకు ఆనందము కూర్చిరి. మధురలో కంసుడు దేవకంటకుడయి యజ్ఞ మొకటి తలపెట్టెను.

పాండవ : అర్జునుడు యాత్ర సమాప్తిచేసి యతి వేషమున కృష్ణ మధుర ప్రవేశించి కృష్ణునకు మాత్రము తన్నెరింగించ అతడు బలరామునికీ యతిని చూపి

ఆతని అనుజ్ఞ పొంది అంతిపురి పరిచర్యలకై సుభద్రను నియోగించి పుష్పోద్యానమున అతిథికి వసతి కల్పించెను. భూతిన్ = సౌందర్యాతిశయమున: అమరని + యమి = పొసగని యతి వేషము.

రాఘవ : రామచంద్రుడు; అమర + నియమి = సురరాజు ఇంద్రునికన్న మిన్న అయిన; మా + అతుల = సాటిలేని వైభవంబున తులతూగు; ఆవాసము = అయోధ్య యందు సుఖముగ నుండెను.

వ. అయ్యెడ నాత్మభవోదయ కలనాయత్త చిత్తుండగు నమ్మహీవిభుండు
క్రూరాశ్రిత వేదనా కృతాభిలాషణుండై తదవసరంబున.

యాదవ : నందుడు తనయుల వలన అసుర బాధలు తొలగి సుఖ ముండెను.

పాండవ : అంతిపురి ఉపవనమున అర్జునుడు నిశ్చింతగ కాలము గడుపు చుండెను.

రాఘవ : దశరథుడు తన మనోరథము సఫలమగు సమయ మాసన్నమయిన దని తలంచెను. (రాముని పట్టాభిషిక్తుని చేయు కోరిక)

ఆ. వె. కని దరి యువరాజు. గనువేట్క సేయఁగ
పంపమది మహోత్స వం బొనర్ప
గను సుభద్ర మహిత గతి నయ్యధిపు నాజ్ఞ
మెలఁగ నియ్యకొనియె మిత్రజనము. 58

యాదవ : సు + భద్ర + మహితగతి + ఆ + అధిపుని + ఆజ్ఞ = కంసుని ఆజ్ఞ క్రూరగర్భితమయ్యు భద్రములు రాగల వని అనుయాయులు అక్రూరాదులు ఆశించిరి. యజ్ఞము చూడిరమ్మని నందాదులకు ఆహ్వానము పంపించెను.

పాండవ : బలరాముని ఆనతి శిరసావహించి సుభద్ర యతివేషధారి అర్జునుని పరిచర్యలో నిమగ్నమయ్యెను.

రాఘవ : తన కనులకు అమృతప్రాయుడైన శ్రీరామచంద్రునికి యువరాజుగా అభిషిక్తుని చేయు తన తలంపు మంత్రులకును, మిత్రులకును ఆనందదాయకమాయెను.

మ. పురి నక్రూర జనంబు నుత్సవము పెంపుం జేయఁగా దాన మం
దర సామోదత నాత్మలో నెఱిఁగి చెం తజ్జేరి లోకైక సుం

దర మూ ర్తి నగని కొంచఁబోయి వినుతి నద్ద్విఘ్ను పాపక్రియల్
బెఱుఁగఁజేయుచుఁ దద్వరోక్తి గతి దెల్పెన్ గౌతుకం బేర్పడన్. 59

యాదవ : అక్రూరుడు కంసుపంపున నందాదులను ఆహ్వానించి రామకృష్ణులను వెంటకొని రానేగెను.

పాండవ : మథురలో యాదవులు గిర్యుత్సవమున మునిగియుండ కృష్ణుడు యతివేషధారితో నటకేగి వారలచే ఆతనికి పూజలందించెను. ఆతని మహిమలు వర్ణించి చెప్పెను.

రాఘవ : రామపట్టాభిషేక వార్త సర్వులకును ఆనందదాయకము, కాని దైవ నిర్ణయమున; మందర కైక, సా + మోదత = ఆనందము తన కింపుగామి ఆమె దరి జేరి విఘ్నకార్య మారంభించెను. పూర్వము దశరథు డిచ్చిన రెండు వరముల జ్ఞాపకముచేసి రాము వనవాసము, భరతుని పట్టము సంపాదించ మని బోధించెను.

వ. అట్లు తద్వృత్తాంతంబు దెలియంబలికి తత్పరిగ్రహోద్వృతి తద్గురు మానసంబు ప్రమోదంబలర నుండు నవసరంబున.

సమము — సుగమము.

చ. గురువిబుధాగ్ర జన్మ జన కోటులు మెచ్చఁ బ్రనాశ్యమాన మం
దిర తలకయ్యెఁజేరి కమ నీయ సుభద్రగతిం జెలంగ వే
మరురణ కేళిఁదేల నభి మన్యు మహోన్నతిఁ గాంచె నప్పు త
త్పరవర మానసాంబురుహ భంగము మోఁచె నవార్య వైఖరిన్. 60

యాదవ : కంసుడు రేయి తన మృతికి కారకుడగు కృష్ణునే స్మరించుచు; వేమరు + రణకేళి = మాటిమాటికి యుద్ధమునే తలంచుచు, కోపము తీవరించ (మన్యు + మహోన్నతి) నిదుర కలతజెంది శాంతి లేక గడపెను..

పాండవ : వే + మరు + రణకేళి = సుభద్రతో కలసి అభిమన్యుని సుతుని అర్జునుడు కనెను.

రాఘవ : రాము పట్టాభిషేక వార్తకు ప్రజలును దేవతలును సంతసించిరి. రాముడు రాజ్యభార చింతావ్యగ్రుడయ్యెను.

క. మఱిఁ గృష్ణవిలాసాంబక
వరసంగతి నాత్మజాత వైభవముగన
ద్వరుసనె దత్కాంతాశలు
పరిపూర్తిని జెంది యుండి పరమ ప్రీతిన్. 61

యాదవ : కంస మధురలో నాగర కాంతలు కృష్ణ దర్శన లాలసులయిరి.

పాండవ : సుభద్ర సుతుని క్రీడా విలాసములకు ఆనందించెను.

రాఘవ : దశరథుని కాంతలు కౌసల్యా సుమిత్రలు సంతసించిరి. కైకయు తన ఆశలు పూర్తికాగలవని ఊహించుచుండెను.

సీ. అంత శౌర్యాద్యృతి నతిఘన కాంతియా
నరవిభుఁడు తనరు చిరశుచిప్ర
తాపహేలి ప్రవర్తనముల నేకము
ఖాండవరమ గ్రాల ఖ్యాతి వెలుఁగ
నింద్రారి జయమున హెచ్చిన మేటియ
క్షయ ధర్మకాండ సం కలనఁ దనరు
సుమనోరథా వాప్తి నమరి నయమున న
నల సమానసు కేశి నిలనుగూడ

తే. గీ. నచ్యుత ముదముఁ జేయుచు నద్వితీయ
నిలయమంది ప్రియోప జీవులను నిలిపి
గురువరోక్తి మను క్రియాచరణ నిపుణ
గతినిఁ గాంచఁ దదుక్తుల గలయఁదెలుప. 62

యాదవ : కంసుడు కృష్ణుడు మరణించుట కగు యుపాయములనే చింతించుచు వికల మనస్కుడై యుండెను.

పాండవ : కృష్ణుడు యాదవులకు అర్జును పరాక్రమాదు లభివర్ణించి తెల్పెను. వారి కాతనియందాదరములు నిలువ జూచెను.

రాఘవ : రాజ గురువు వశిష్ఠుడు దశరథునకు రాముని భావిచరిత్రము సూచించి ఆనందము కల్పించెను. పట్టాభిషేకమునకు ముందు ఆచరించవలసిన నియమము లుపదేశించి అందా రాముని నిల్పెను.

వ. అజాత శత్రుం డవ్విభుండు ఇవ్విధంబున జాయమాన శుభ సమగ్రం
బులును, నిర్జరానందంబులును, నిరుపమ గుణ వ్రజ వధూ సుకుమార
జన మహోవన విహారంబులు నగు జతురాశా విజయంబులం
దెలిపిన.

సుమము, సుగమము.

చ. గురువర వాణిఁ గాంచి వ్రజ కుందఁ బ్రియాత్మను రాజసూయ మా
నరవిభుఁ డాత్మజాత శుభ నైపుణి మాయఁగఁ దుష్టవృత్తిఁ దు
ష్కరముగఁ దత్ప్రయత్నమున సమ్మతి నొందుట కష్టమంచు భూ
వరులు మనంబులం దలఁపఁ బ్రౌఢి వెలుంగగఁ జేసె నట్టులన్. 63

యాదవ : కంసుని ప్రయత్నము కొనసాగదని స్వీయ వృద్ధ జనము తలంపు. అయినను కంసుడు రామకృష్ణుల రాక నిరీక్షించుచుండెను.

పాండవ : కృష్ణాది యాదవులు గిరి ప్రాంతమున ఉత్సవమున నిమగ్ను లయిరి.

రాఘవ : విఘ్న భయమున దశరథుడు మంత్రులను వేగిరించెను.

సీ. గురువరాగ్రజు మహో గుణగణాకర చిత్తు
గోత్రవర్ధన శీలు గొంచ పఱచి
నుద్ధతౌన్నత్యంబు నోర్వఁగాఁ జాలక
వంచన జూదంబు వన్నె జెఱచి
తద్రాజ్యమెల్లను దానె గైకొననెంచి
యాత్మ లోకైక వి ఖ్యాత వృత్తి
గనఁ జక్రి రాజ రాజనుమతి లేకనె
పిలువఁజేరు నతని పెం పణంచి

తే. గీ. బంధువృద్ధ ప్రియాత్ముల పలుకు వినక
గోరినట్లనె తనకు న క్కోర్కె నిండఁ
జేయనాతఁడు తన తల్లిఁ బాయలేక
జేయునది లేకఁ బలవింపఁ జెంతఁజేరి. 64

యాదవ : రామకృష్ణులు నంద యశోదలకు అభయము తెల్పి అక్రూరునితో ప్రయనించిరి. లోకైక + విఖ్యాతి = గొప్ప కీర్తి.

పాండవ : ధర్మజుని జూదమునకు పిలువనంపి దుర్యోధనుడు శకుని మాయ వలన ఆ ధర్మజు వంచించి రాజ్యము హరించి వనవాస నియమము చేసెను. ధర్మజాదులు కుంతి నోదార్చిరి.

రాఘవ : ఆత్మలో + కైక + విఖ్యాతవృత్తి = కైక కోరిన వరములు. రాముడు వనవాసమున కనుమతించి తల్లి నూరడించెను.

తే. గీ. ద్వాదశైక సమావని వర నివాస
విఖ్యాతి మఱి పురస్థిర నద్ది వేళ మెలఁగి
గుప్త భావంబు మీఱఁగా గుతిల మతుల
నరులఁ గెలువఁగ దలపోయు టాత్మనిలుప. 65

యాదవ : కంసుని గెలుచు తలంపున రామకృష్ణులు పయనించిరి. బృందావన వాసము పదియును రెండు సంవత్సరములు. కంసవధానంతరము మధురలో నివాసము ఏర్పడగలయది.

పాండవ : పదియు రెండేండ్లు వనవాసము, ఒక ఏడు అజ్ఞాతవాసము. తల్లిని విదురునింట ఉండ నొప్పించిరి.

రాఘవ : పదియుమూడేండ్లరణ్యవాసము ఒక సంవత్సరము రావణ వధకైన యత్నమునను అనంతరమునను గడచెను.

మ. తెలియం బల్కుచు తల్లి నిల్పి దృఢబుద్ధిం బూని యక్రూర బం
ధులతో నగ్రగ భవ ప్రియానుజనులం దోరా రథారూఢులై
విలసద్ఘోష పురస్థిరోరువనులన్ వేదాటి దాటోయి ముం
గల సౌర తరంగిణిం గనియె రంగద్భృంగ సంగాంబుజన్. 66

యాదవ : తల్లిదండ్రుల నంగీకరింప చేసి రామకృష్ణులు, అక్రూరుడు రథ చోదకుడుగా ఆతనితో పయనించి యమునానదిని చూచిరి.

పాండవ : వలదన్నను వినక తమ్ము వెన్నంటి వచ్చు పౌర బృందముతో బ్రాహ్మణ కుటుంబములతో పాండవులు గంగాతీరము చేరిరి.

రాఘవ : రాముడు సీతాలక్ష్మణులతో నేగువాడు, వెన్నంటి వచ్చు పురజనముతో సుమంత్రుడు రథము నడుప సరయూతీరము చేరెను.

చ. జలములఁ గ్రుంకి యందు రవి చంద్ర వివర్ధన భూరితేజు ను
జ్జ్వలుని ననంతు నచ్యుతునిఁ బద్మ మనోహరుఁ గాంచి వేడ్క నం
జలిఘటియించ నాశ్రితుల సన్నిజ భావము సంతసిల్లఁగా
నలహరి గోత్రభర్తఁ గనె నక్షయపాత్ర నవార్య వైఖరిన్. 67

యాదవ : యమున ఒడ్డున రథము నిలిపి తా నొక్కడే యమునలో స్నానము చేయుటలో ఒక మునక వేసి ఆ నీట హరిని గాంచి అచ్చెరువున లేచి రథమునందే యున్న కృష్ణుని గాంచి మరల మునిగి ఆ హరినే గాంచి తాను కృతకృత్యు డయినట్లు తలంచి సంతసించి రథ మధిరోహించి ముందునకు పయనించెను. పద్మమనోహరుడు = హరి.

పాండవ : ధర్మజుడు తన్ను వెనుకొనివచ్చు ప్రజకు బ్రాహ్మణులకు అన్న పానీయములు కొదువలేకుండుటకై వ్యాసుని తలంచి ఆయన ఉపదేశానుసారము సూర్యు నారాధించి అక్షయ పాత్ర వరముగా వడసి సుఖముగ వారితో కాలము గడపుచు వనవాసము గడపెను. పద్మమనోహరుడు = సూర్యుడు.

రాఘవ : రాముడు సరయువున స్నానముచేసి సూర్యున కర్ఘ్యమిచ్చుచు ఆ అంజలి నీటి ప్రతిఫలించిన తన వంశ కర్తను గాంచి ధ్యానించి సంతసించెను.

ఉ. అంత సుమంత్రయుక్తి నతఁ డందఱుఁ దద్వనసీమ నిల్పి దు
ర్దాంత గుహాతిశాయి బల ధాముఁడు దారజనాంత కార్యుఁ డై
సంతత సౌధయోగ్యగతి చంద్రభనీరదృతి గ్రహించి ని
శ్చింతత సజ్జటాభరణ శీలతఁ బొల్చె మహానుభావతన్. 68

యాదవ : సాయం సమయమునకు మధుర సమీపించి దక్షిణ ద్వారమున కావల తాము నిలిచి తమ కృత్యము నిశ్చయించుకొని, అక్రూరుని పంపివైచిరి. ఉదయము పురము ప్రవేశింతు మని ఆతనికి తెల్పిరి.

పాండవ : పాండవులు జటావల్కలములు ధరించి మునివృత్తి ననుసరించిరి.

రాఘవ : రాముడు సుమంత్రుని తన్ననుసరించిన ప్రజలను గుహుని పట్టణ బాహ్య ప్రదేశమున నుండ ప్రార్థించి కొంత దవ్వుగ వటమూలము చేరి భూతల శయ్య నుండిరి. రామలక్ష్మణులు జటాధారణచేసిరి.

క. తగు దివ్య మౌని లీలలు
వగవఁ గలుగుదనర దివ్య వాహిని చెంతన్
మిగుల వనౌఘము దాటిం
పగు భారద్వాజ ముఖ కుభా లోకములన్. 69

యాదవ : కృష్ణుడు అన్నతో ఆ రేయి భరద్వాజ = ఏట్రింత పక్షుల విలాసములు కనుచు యమున తలపించు దివ్యఋషుల లీలలు తెల్పుకొనుచు గడపెను.

పాండవ : ఆ గంగాతీరమున భరద్వాజాది ఋష్యాశ్రమముల సమీపమున ఆశ్రమము నిర్మించుకొని కాలము గడపుచుండిరి.

రాఘవ : గుహుని సహాయమున తెలవారకమున్నే సుమంత్రుని కొక్కనికి తెల్పి సరయువు దాటి రాముడు సీతా లక్ష్మణులతో భరద్వాజు నాశ్రమ ప్రాంతమున కేగెను.

మ. బలియస్ప్రీతిఁ దదాప్త వాక్యగతిఁ ద త్ప్రాంతస్థలీ చిత్రకూ
ట లసద్వ్యాస విలాసవృత్తి మధురా ట్టాలోజ్జ్వలత్సాల ని
ర్మల వీథీ విలసత్సరోరుహ సరో రాజీవిరాజత్తటాం
చల చక్రాళి మరాళ సారస వల త్సంచారము ల్గాంచుచున్. 70

యాదవ : ఆ రేయి రామకృష్ణులు ప్రాకారమునకు బయటనుండియే మధురా నగర ఉన్నత సౌధములయు, విచిత్ర మండపములయు సౌందర్యమును తిలకించుచు, పురబాహ్యోద్యాన సరోవరముల విహరించు చక్రవాకాది జలవిహంగముల క్రీడలకు సంతసించుచు గడపిరి.

పాండవ: పాండవులును వనముల పై విధమునసే ప్రకృతి సౌందర్య లాలసు లయిరి.

రాఘవ: రామచంద్రుడు సీతాలక్ష్మణులతో చిత్రకూట పర్వత ప్రాంతమున ఆశ్రమము కల్పించుకొని వనుల విహారముల ప్రొద్దుల పుచ్చుచుండెను.

మ. పురుష వ్యాఘ్రముల స్త్రీజావళుల సద్వ్యామి సురేంద్రాది మేల్
హరులం దంతుల గాంచి చూసి గతి వి ల్క్రన్ మైత్రి వక్రత్వ సం
హరణోదారత గంధమాల్యోద్ధృతి ది వ్యాప్చ నిర్భేద ల
క్ష్మరిరం సాధ్వృతి సందు బొల్చెన విశం కన్ ధైర్య శౌర్యోన్నతిన్. 71

యాదవ: తెలతెల వారుచుండ రామకృష్ణులు నగరము వెనువైపు దక్షిణ ద్వారము భేదించి పురప్రవేశ మొనరించి గజాశ్వాధులు ఎదురురా నిర్భయముగ రాజ వీధి నేగుచు కుబ్జమైత్రి నాదరించి, అరిలక్ష్మి గంధమాల్యాదుల యందుడును గనుక ఆ ద్రవ్యములు కంసునకై కొనిపోవు వారినుండి బలాత్కారముగ ఆహరించి పూసి ధరించి రాజ ద్వారము దరియ ముందునకేగు వారు. (ముందుకన్వయము)

పాండవ: పాండవులు విల్లమ్ములు చే ధరియించి వనముల క్రూర మృగములను హింసించుచు బ్రాహ్మణ సమాజముతో సుఖముండిరి.

రాఘవ: రాముడు ధనుర్బాణములు ధరించి ఏ అపాయము రాకుండ చూచు కొనుచు చిత్రకూట ప్రాంతారణ్యమున నుండెను.

శా. అంతం దజ్జనకుండు సద్విదుర గర్వాల్యాని మన్యున్నతి
న్జింతల్మించఁగ నాతఁ డేగి విబుధ శ్రీ మీఱ స్వస్థానము
న్వింతై జెందిన వేగ దత్కువలయా పీడోన్నతిన్మాన్పఁ దాఁ
జెంతం దత్పర శౌర్యకారి యగుచున్ జేరన్దగన్ బిల్వఁగన్. 72

యాదవ: కంసుడు రామకృష్ణుల రాక చారుల వలన వినియు వారి పౌరుష కృత్యము లాలించియు కువలయా పీడమను గజమును వారి పైకి త్రోల గజపాలకుని కాజ్ఞాపించెను. వాడట్లు చేయ తొండముచే దానిని బలిమిమై ఆచి కృష్ణుడు దానిని నేల వినరి కొట్టి మడియించెను.

పాండవ: మాయా దురోదరమున ఓడి వనముల నవయుచున్న పాండవుల గతి చింతించియు వృద్ధరాజు ధృతరాష్ట్రుడు విదురు డాది సజ్జనులు తన్ను నిందించ

తండ్రిని వేదవ్యాసుని తలంచుకొనెను. కులనాశమగు ననియు భయపడెను. వ్యాసుడు సాక్షాత్కరించి తనయుని శాంతి కొఱకు సంజయుని కథా కుశలుని తన శిష్యుని పంపుదు నని ఊఱడించి యేగెను.

రాఘవ : రాముని తండ్రి దశరథుడు విచారసాగరమున మునిగి అచిరకాలము ననే; (స్వస్థానము = స్వర్గము) మరణించెను. వశిష్ఠు నుపదేశానుసారము మంత్రులు అంతకుమున్ను మేనమామ కేకయరాజు పిలుపనంప నటకేగిన భరత శత్రుఘ్నులను శీఘ్రము కొనిరా, వలయు వారిని పంపించిరి.

వ. అట్లు జేరిన వరసంజయాభిఖ్యా నానంద జనకునకు సదాశుభరతుఁగని స్వపరత్రాణ ధురీణశీలుఁగా నతనిం దెలియంబలికి వద్దనుండఁ దదను జనుల సదుక్తిఁ బంపించి కామ్యకవన వినుతగతిఁ దనరియుండ.

యాదవ : తమయందే ప్రాణము లుంచిన నందాదులకు తమ క్షేమవార్త తెలుప సంజయుడను మిత్రుని గోకులమునకు రామకృష్ణులు పంపించుచు తమ కే ఆపదయును రాదని వారికి ధైర్యము కొఱకు పంపిరి.

పాండవ : పాండవులను మరలించి వారి రాజ్యము వారి కిత్తును రమ్మనమని వృద్ధరాజు వార్త నంప, ప్రతిన నెరవేర్చిగాని రాజాలమని ధర్మజుడు సమాధానించి, తమ నమస్కారములు తండ్రి కందించమని సంజయుని పాండవులు పంపివైచి కామ్యకవనమున కేగిరి.

రాఘవ : భరత శత్రుఘ్నులు అయోధ్యకు వచ్చి జనకునికి అంత్య క్రియలు నిర్వర్తించి రాముని తిరిగి రాజ్యమునకు కొనిరా సముచిత పరివారముతో చిత్రకూట మున రాముడున్న వార్త విని అటకు పయనించిరి. రాముడు భరతుని తావచ్చు వఱకు రాజ్యభారము వహించ కోరి యుక్తి యుక్తముగ పాదుక లిచ్చి పంపించి వైచెను.

మ. దండకావన చారి సొంపు లుదాత్తతఁ జని కాంచ ను
ద్దండచండ బలోద్ధ తాద్భుత దారుణోక్తులు మించఁగా
ఖండనాతిథి భావ భాసుర భంగి నుద్భట మల్లుఁడా
ఖండలారి మహో ప్రదేహుఁ డొకండుపైఁబడి వచ్చినన్. 73

యాదవ : ఆ పుర వీథుల విహరించు రామకృష్ణులను చాణూరుడను జకదేక మల్లు డెదిరించరా వానిని కృష్ణుడు మల్ల చలచి చంపివైచెను.

పాండవ : ఆ కామ్యకవనమున కేగు పాండవులను కిమ్మీరుడను రాక్షసుడు హింసింప నెదురాయెను.

రాఘవ : భరతుని పురికి పంపివైచి సీతా లక్ష్మణులతో దండకారణ్యము ప్రవేశించి యేగుచుండ దారిలో విరాధుడను రాక్షసుడు వారి నరికట్టెను.

స్ర. రంగ ద్వేషావరోధిన్ రణకరతల జాగ్రద్ధ్వమ న్ముష్టికున్ బ్రో
త్తుంగున్ దేవారి మల్లున్ దురితమతి విరాధున్వలన్నేత్ర కిమ్మీ
రుంగూల్చె న్రాముఁ డుగ్ర కృదరి కరివిదారుండు భీముండు వేమ
స్సంగో ద్వృత్కాంసు దుష్టుం జయయుతి నటులం జంపి విఖ్యాతిఁ
జెందెన్. 74

యాదవ : అనంతరము తమ్ము ఎదిరించిన ముష్టికుడను మల్లుని బలరాముడు కూల్చిచంపెను. అనంతరము రంగస్థలమునకు వచ్చి పలువురు తన వారిని చంపిన కృష్ణుని కెదురుగా వచ్చి కంసుడు చిరము పోరి కృష్ణునిచే మడిసెను.

పాండవ : కిమ్మీరుని తమ్మెదిరించిన వానిని భీముడు చంపెను,

రాఘవ : మార్గము నరికట్టిన విరాధుని రాముడు వధించెను.

సీ. సత్యాశ్రితుని యోగి శౌరి నికారాని
బద్ధా నసూయైక భావ నిరతు
నత్రి బరమ పురుషాత్మ భూ విఖ్యాతుఁ
జేరఁగాఁ బిలువనిం పారు భక్తి
మును దల్లిఁ దండ్రి నా కని బ్రోఁచు వారల
భయ వినయాత్ములఁ బ్రణుతిఁ జేసి
తన్మన్యు విభవము ల్దగఁ బరికింపుచుఁ
దాల్మి యూరడిలచే తను వసింప.

తే. గీ. సాధు సూక్తి నానందాత్మ జనుల వీడు
కొని మధుర గతిఁ బొల్చి సత్కులముఁ బ్రోవ
నవల నుగ్ర సేనాధిపత్యమున మీఱ
వరల పుణ్య జనులఁ బెంపఁ బ్రతిన నిలిపి. 75

యాదవ : కంసుని వధియించి చెఱసాల నున్న తలిదండ్రులు దేవకీ వసుదేవు లను, కంసుని తండ్రి ఉగ్రసేనుని విడిపించెను. తలిదండ్రులకు రామ కృష్ణులు నమస్కరించి వారి అనుమతిని ఉగ్రసేనుని మధురా రాజ్యమున నిల్పిరి. ఈ రీతిని కృష్ణుడు దుష్టశిక్షణ శిష్ట రక్షణ బిరుదము నిల్పుకొనెను.

పాండవ : అరణ్యవాస క్లేశ మనుభవించు పాండవుల నొకనాడు కృష్ణుడు చూడనేగి భావికార్య ముత్సాహ జనకమని సూచించి ఊఱట బల్కి తిరిగి మధుర కేగెను.

రాఘవ : రాముడు సీతా లక్ష్మణులతో దండకావని ముందున కేగుచు అత్రి ఆశ్రమము ప్రవేశించి అత్రి అనసూయలచే పూజితుడయి భావి రాక్షస సంహారాదికము వారు సూచించ వారికి ప్రణతు లర్పించి ముందున కేగెను.

తే. గీ. గురు ముని జనోప నీతులై గోప వరులు
వ్యాస మంత్రోపదేశి విద్యాత్ము లగుచు
సూను దక్షిణ యుక్తిని దాను బ్రియయు
గురులు ముదమందఁ గనుపుర స్థిరను జేరి. 76

యాదవ : రామ కృష్ణులు సంతానవంతులయి గురు ముఖమున వారలకు పనయన ములు గావించి దక్షిణలచే గురులను పూజించి మధురలో సుఖముగ నుండిరి.

పాండవ : వనముల నున్న పాండవుల కడకు వ్యాసుడు వచ్చి అర్జునునకు దివ్యాస్త్రములు సంపాదించుట కుపాయ ముపదేశించి యేగెను.

రాఘవ : అత్రి అనసూయలను వీడ్కొని వారి యుపదేశమున రాముడు సీతా లక్ష్మణులతో దక్షిణ దిక్కుగ పయనించెను.

తే. గీ. ఉద్ధవ విజయాప్తి సతి వరోచిత పద
భజన తృప్తినై శాస్త్ర సంప్రాప్తిఁ దనర
దుష్ట శరభంగ గతిఁగాంచ తోసుతీక్ష
వృత్తిఁ గని మించ నాత్మలో వేట్కమీఱ. 77

యాదవ : కృష్ణునకు బద్ధవైరి జరాసంధుడు మరల మరల మధురపై దండెత్తి వచ్చును.

పాండవ : దివ్యాస్త్ర సంపాదనమునకు అర్జునుడు తరుణము వేచి యుండెను

రాఘవ : వనుల శరభంగు నాశ్రమము మాట విని రాముడా ఋషిని గాంచ వేడుక కీవరించ ముందునకు సాగిపోయెను.

వ. అరివర కరుండగు నతండు వ్యాస మంత్ర యుక్తి విధి విహిత గతిం
బ్రజ్ఞాచక్షుం దేర్చి జిష్ణు నక్రూరుం బంపిన—

యాదవ : ఓటమినంది చనిన జరాసంధుడు మరల మధురపై దండయాత్ర కాయత్త మాయెను. మరలిపో నుపదేశించ అక్రూరుని కృష్ణుడు జరాసంధునికి వార్త పంపెను.

పాండవ : ధర్మజుడు శివుని మెప్పించి పాశుపతము సంపాదించ అర్జునుని కనుజ్ఞ యొసంగెను.

రాఘవ : పలు ఋష్యాశ్రమములు దాటి రామ సీతా లక్ష్మణు లేగిరి.

సీ. కీలాలితోగ్ర నగేంద్ర కీలాద్రి వి
శేష స్థలంబునఁ జేర నరిగి
ధరణీ సురేంద్రు నాతనిఁ గాంచి యాత్మ ని
శ్చల భయ భక్తుల నిలిపి మ్రొక్కి
నుతిఁ జేయఁ దత్ప్రసన్నత విహితోప దే
శమను రత్నంబంది సన్నుతించ
దలఁచ సర్వజ్ఞుఁ డతండు దారాధ్య గ
తిన లబ్ధ భావాప్తిఁ దనదు నెలవు.

తే. గీ. జేర భూదార భాసురుఁ జేరువాని
దెలుప విని యంత నాత్మజా తి ప్రకాశ
తాగత శరభంగము నీశు నంబకంబు
డాసి పైఁగూడ విగ్రహో దయము గాంచ. 78

యాదవ : ఇందలి గాథ హరి వంశమున గలదు. జరాసంధుడు కృష్ణ సందేశము వినకపోగా తమ వారిని పురమునందేయుండ నియమించి బలరామ కృష్ణులు గోమద పర్వతముపైపు వడివడి నేగసాగిరి. ససైన్యులై జరాసంధుడును రాజలోకమును వారివి వెంబడించిరి. రామకృష్ణులు గోమద పర్వతగుహ నున్న పరశురాముని సేవించి

ప్రీతుంజేసి ఆతని యుపదేశము గ్రహించి పర్వత శిఖర మధిరోహించిరి. జరాసంధా దులు పర్వతమును చుట్టుముట్టి ప్రాంతారణ్యమునకు చిచ్చు ముట్టించిరి. దవానలము దిక్కు లలమగా రామకృష్ణులు సేనా సముద్ర మధ్యమున కుఱికి క్షణములో సేనను ధ్వంసము చేసి జరాసంధునితో తలపడి ఘోరముగ పోరి ఆతనిని విరథుని గావించి మూర్ఛితు నొనరించిరి. కొదువ రాజలోకము వారి కోడి పారిపోవ సైన్యము దిక్కా మొగమాయెను. నవ్వుకొనుచు రామకృష్ణులు మధురలో ప్రవేశించి తమ వారికి తమ చర్య విన్పించి ఆశ్చర్య చకితులుగా జేసిరి.

పాండవ : అర్జునుడు ఇంద్రకీల పర్వతమున తపము చేయుచుండ కిరాత వేషధారియయి శివు డాతనిని పరీక్షించును. అడవిపంది నిమిత్తముగ కిరాతు డర్జునునితో యుద్ధము చేయును.

రాఘవ : రాముడు శరభంగముని ఆశ్రమమున కేగి ఆతనిచే పూజలంది తిరిగి ఆ ఋషిని తాను పూజించును.

వ. అప్పుడు

ఉ. జాతియు భావముగ్గళయు సత్యమునాత్మ పరత్వతత్త్వ వి
ఖ్యాతి నెఱింగి బొంగినము దంచితరీతిఁ బరస్పరాంగ వి
ద్యోతితమై పరస్పర సముచ్చలి తోజ్వల దంబకంబు లా
వీతములై జెలంగఁ దగి రిద్దఱు సంగర సోత్సవంబునన్. 79

యాదవ : సంగర + సోత్సవము. ఓడియు మత్సరము విడువక జరాసంధుడు మధురను ముట్టడించును.

పాండవ : అర్జునుడు శివునితో చలము విడువక పోరును.

రాఘవ : సంగ + రస + ఉత్సవము = శరభంగమౌని మహాభక్తుడు. ఆతనితో కలయిక రాముడు చిరము అనుభవించును.

వ. ఎంతయుం బ్రొద్దు నట్టమర మెఱసి——

యాదవ : పాండవ: కృష్ణ జరాసంధులు కిరాతార్జునులు చిరము పోరిరి.

రాఘవ : రామ శరభంగ మునీశులు ఒండొరుల ఆశ్లేషములు చిర మనుభ వించిరి.

సీ. అన్యోన్యము చిత్రక్రియాలాప సందర్భ
విభ్రమప్రౌఢిని వెలసిరవల
స్వవరమహాశర భంగ మునీశోన్న
తిని గాంచి ధృతి వీడు కొనఁగ నంత
నవ్యమనోజ రా నందనుం డుగ్రసే
నా పూర్వభట పంక్తిఁ బ్రాపుమీఱ
సన్మధురాశ్రమ సాలమండలి చుట్టి
తేజోభి వృద్ధి సు తీక్ష్ణ వృత్తి.

తే. గీ. బరగఁ గనుపట్టి నిలువఁ ద త్ప్రబలరేఖ
గనుఁగొని చపలతాహీన కాండమంది
పరువడిని బ్రేయమును దలఁ పడి మరుగఁగఁ
జింతఁ బెఱుఁగ సుమతి బలుఁ జేరె నొకట. 80

యాదవ : ఉగ్రసేనాదులు రామకృష్ణులను గూడుకొని జరాసంధాది వైరి రాజ లోకముతో తలపడి పోర పోరు ఘోరంబయ్యెను.

పాండవ : ఎంతకును కిరాతుడు లొంగకున్న తుద కాతని తలపై గాండీవముతో అర్జునుడు చావమోదెను. అదియును నిష్ఫలముకా ఆతడు దివ్యు డెవడో అని నిశ్చలుడై నిమిషము పోరు చాలించి నిలువ కిరాతు డదృశ్యు డయ్యెను. వనవాసులు పోరు చూచువారును అర్జునుడును ఆశ్చర్యమున మునిగిరి.

రాఘవ : తుదకు తృప్తుడయి శరభంగముని ముందు సుతీక్ష్ణు ఆశ్రమము కల దట కేగుమని రాముని కుపదేశించి తనువు వీడెను.

ఉ. కౌఁగిటఁ బట్టి కౌతుకము గాభ్రమ కృద్వచనంబులన్ మహో
రాగత నొండొరుల్గదిసి రౌద్రము మించఁగ నుండు వేళన
బ్రాగురు చిహ్న ముల్గనఁగ రామమనీష సముత్సుకంబుగా
వేగ తలంగి పోయిరట విస్మయమంద మహావనీచరుల్. 81

యాదవ : రామకృష్ణులు హర్యంశజులని గ్రహించి యాదవులు సదా పోరిలో వారి నంటియుండ మాటిమాటికి జరాసంధు డోడి వెనుదిరిగి పోవుచుండెను. (ముప్పైడు మారులు-ఇరువది యొక్కసారి ఇటుల జరాసంధుడు మధురపై దండెత్తి వచ్చుచుపోగా లెక్కకు మిక్కిలి రాక్షసులు మరణించిరి).

పాండవ : చేతులు కలిపి పోరి కొంత వడికి కిరాతుడు కానరాక పోయెను. పోరుచూచు ఆటవికులు ఆశ్చర్యమందిరి.

రాఘవ : సుతీక్ష్ణుని ఆశ్రమము చేరిన రాముని ఆ ఋషి సాక్షాత్తు వైకుంఠునిగా గుర్తించి పూజించి కౌగిలించి ఆనందించ సమీపవర్తు లయిన ఋషులు ఆశ్చర్యమగ్న మానసు లయిరి.

వ. అయ్యవసరంబున—

సీ. భద్రాసన నివాసుఁ బరమ తేజోవాసు
నిందు కళోల్లా సు మందహాసు
నార్యాశ్రిత శరీరుఁ బర్యాప్త మహిమోరు
సర్వజ్ఞతాధారు శైల ధీరుఁ
జతురాస్య బుధభాషు సతత పావనశేషు
నదహీన గుణభూషు సరసభాషుఁ
బ్రణతార్తి పరిహారుఁ బ్రతిభట సంహారుఁ
బరమ హంస విచారుఁ బాపదూరుఁ.

తే. గీ. గుతల శంకరు గురుకృత కుంభ భవుని
విజిత దుష్టోగ్ర సేనుని వినుతశీలు
నెదుటఁ గనుఁగొని సంతస మెసఁగఁ జేరి
యుచిత సత్క్రియ వందన మొనరఁ జేసి. 82

యాదవ : యాదవు లెల్లరు కృష్ణుడు సర్వదేవతా స్వరూపుడని గ్రహించి నుతించి ఆతనింజేరి ఆనందించిరి.

పాండవ : అదృశ్యుడయిన కిరాత రూపధారి శంకరుడు తిరిగి స్వీయరూపము ధరించి పార్వతితో కూడి అర్జునునకు ప్రత్యక్షమయ్యెను. అర్జునుడు శంకరుని నతుల నుతుల ప్రసన్నునిగా చేసికొనెను.

రాఘవ : కుంభ భవుని = అగస్త్యుని, రాముడు సుతీక్ష్ణుని వీడ్కొని అతని యుపదేశానుసారము అగస్త్యాశ్రమమున కేగి ఆయనకు పూజ లర్పించి నమస్కరించి నిలచెను.

తే. గీ. ఆత్మగతి విపక్ష విహిత యాత్ర విధముఁ
దెలుపఁ దత్స్పృహావాసత మెలఁగు నంత
ధరణి దేవతానుగ్రహ కరుణ వలనఁ
గామ్య సుమనోరథావాప్తి గలిగెనపుడు. 83

యాదవ : బంధు మిత్రులను గూడి బ్రాహ్మణా శీస్సులంది రామకృష్ణుల మధుర ప్రవేశించి సుఖములు గనిరి.

పాండవ : శంకరుడు అర్జునుని భక్తికి సాహసమునకు సంతసించి అర్జునని మెంచి ప్రయోగోప సంహారముల విధివిధానములు తెల్పి పాశుపత దివ్యాస్త్ర మిచ్చెను.

రాఘవ : అగస్త్యునిచే రాముడు సత్కృతుడయి ఆతని అనుగ్రహమున వైష్ణవ మగు ధనువును అక్షయతూణీర లాభమును పొంది ఆతని యుపదేశానుసారము గోదావరీ తీరమున పంచవటియందు ఆశ్రమము కల్పించుకొని సీతా లక్ష్మణులతో నివసించ నిశ్చయించుకొనెను.

చ. అటుల మహోగ్రసాయక సమంచిత యుక్తిని నక్షయాంబకో
త్కట పటుచాప లబ్ధవర కంకట ఖేటధృతి గ్రహించుచుఁ
బటుతర శంఖచక్రహల పాణిపదోజ్జ్వల చిహ్న లెన్నను
ధృతిత దదాప్త వాక్యగతి వందనము ల్ఘటియించి వీడ్కొనెఁ. 84

యాదవ : యాదవు లెల్లరు రామకృష్ణులను నుతించినతు లొనరించి తమతమ గృహముల కేగిరి.

పాండవ : నమస్కరించి నిలచిన అర్జునుని వీడ్కొని పార్వతీ పరమేశ్వరులు అనుచరవర్గముతో తమ నివాసమున కేగిరి.

రాఘవ : అగస్త్యు ననుమతి వడసి రామాదులు పంచవటి మార్గము ననుస రించిరి.

వ. అవ్విధంబున—

చ. ధరణి సురేశ దత్త నిజ తత్సమనోరథ యుక్తిఁ దత్ బుధు
ల్సరసతఁ జేరి మెచ్చనల సౌరనదీ తట విస్ఫురత్పుర
స్థిర పరికల్పితాలయము జేరి వసించెను దోడఁ బుట్టు త
ద్వర విహిత ప్రియోద్ధృతి విధానము లన్ప్రియమంద నయ్యెడన్. 85

యాదవ : బలరామునితో కృష్ణుడు యమునాతీర విహారముల మధుర సుఖ నివాస ముండెను.

పాండవ : కుమారుని పాశుపత లాభము విని ఇంద్రుడు వచ్చి కొంత కాలము తనతో అర్ధాసనమున నుండి సుఖములు గాంచుమని తెల్పి ప్రియమున ఆతనిని స్వర్గమునకు కొనిపోయెను.

రాఘవ : పంచవటి లక్ష్మణుడు నిర్మించిన పర్ణశాలయందు సీతతో ప్రవేశించి రాముడు కాలము గడపుచుండెను.

మ. కల గంధర్వ పికోక్తి రాగగతి దిక్పాలాంబకాప్త్యుత్సవా
కల నంద ద్వర సత్సహాసనట వేట్కాల్ నిండఁగా నుండఁగా
బల ఖిద్విట్వర భీకరానుజ సముద్భ్రం గాప్తిగా నెంచె ను
జ్జ్వల కాంతాకృతి దానవోత్తమ జరాసంధాను బద్ధేచ్ఛచే. 86

యాదవ : జరాసంధుడు మరల మధురపై దండు విడిసెను.

పాండవ : స్వర్గమున తండ్రి అర్ధాసనమున నుండి అర్జునుడు భోగముల ననుభవించుచుండెను.

రాఘవ : శూర్పనఖ తనయులు ఖరుడు దూషణుడును సహోదరులు శూర్పనఖ కామరూపిణియయి, తనవారి బలమెంచి, రాము సన్నిధి నడయాడసాగెను.

సీ. తత్పుర స్థిరరాజు తగు నుత్తమ నవాత్మ
జాకృతి గాంచి మోహమ్ము మించ
నుర్వశీల సదుక్తిఁ ప్రోద్యోగ విజయుని
నవ్యతేజో జరా నందనునిఁగని

యాత్మప్రియాలాప మమరఁగా ననురాగ
ముగను దెల్పిన సముద్భోగ కృతిని
ఁన మదిరోషించి తమ్ము నెదుర నుండు
దారమతి గనుము దారిననిన

తే. గీ. వినను బొమ్మన నాతని విడిచి షోక
మరుల కొన మదనను దగ మగుడి మగుడి
నిలువ నంత కోపమున ఘా నేత డాసి
పౌరుష మడంగు నేడాది పరులననుచు. 87

యాదవ : కృష్ణుడు జరాసంధునికి గత ఓటములు తెల్పి మగిడి పొమ్మని వార్త నంప నాతడు తిరస్కరించి ముట్టడి నిలుపక తీవరించెను.

పాండవ : ఊర్వసి = అప్సరస అర్జునుని కామించి ఆతనిచే తిరస్కృతయయి పౌరుషము ఆనాటినుండ అడగి పేడి వగుమని శపించెను. ఇంద్రు డాయుదంతము విని అది మేలయ్యే ముందు కార్యకారి కాగలదు. ఒక ఏడాది నీవు కోరిన యపుడా పేడితనము నిన్నాశ్రయించి అనంతరము లేకపోవునని నియమము తెల్పి సంతోషపెట్టి అర్జునుని సుఖ స్వరూపుని గావించెను.

రాఘవ : రాముని సమీపించి ఆతడెంత వలదన్నను వినకపోగా లక్ష్మణునకు సన్నచేసి ఆ శూర్పనఖను ఆతని కడకు పంపించెను.

ఆ. వె. అన్నగారి సన్న నాత్మ నెఱింగియా
లక్ష్మణుండు విజయ లాంఛనుండు
డాసి విశ్రుతిగన నాసికా గతి జేయ
దాన విఖ్యాతి త్ర్యష్టఁ బూని సనియె. 88

యాదవ : అంతరామ కృష్ణులు యుద్ధ సన్నద్ధులయిరి.

పాండవ : అ + నగారి = ఇంద్రుడు; ఆతని సన్న గ్రహించి అర్జునుడు చింత లేక యుండెను.

రాఘవ : లక్ష్మణుడు రాముని ఆశయము గ్రహించి చలము విడువక తన్ను కైకొనుమని నిర్బంధించు శూర్పనఖను; విశ్రుతి + అ + నాసికా = చెవులు ముక్కు లేని దానివిగా చేసి పంపివైచెను. అంత పగపూని శూర్పనఖ లంకకేగెను.

సీ. అంతఁ దత్ప్రేరణ నమితోగ్ర బలభద్ర
రమ్యహయేంద్ర సారథిరథాప్తి
దివ్యమహాపూర్వ దేవ దత్తాఖిల
శంఖ సారాస్యస్త్ర చాప ధృతిని
మహేంద్రమణి హేమ మకుట భూషావాప్తిఁ
బ్రబలభుజాబలో ద్భట నిరూఢి
మత్త దంతావళ మహనీయ గతిమీఱ
మిత్ర రాజాదులు మెచ్చి కనఁగఁ
తే. గీ. బర భయంకర శౌర్యాప్తి ఖరుఁడు విమత
దూషణ హితుండు విజయుండు దోహృతారి
వత్త వనరాశి సాలాది పృథివిఁ గడచి
శంఖనాదంబు నించె వి శృంఖలముగ. 89

యాదవ : రామకృష్ణులు పురము వెల్వడి తలచిన మాత్రన వచ్చిన దివ్యరథ మధిరోహించి శంఖధ్వానములు చేయ అరుల వీనులు బ్రద్ద లాయెను.

పాండవ : ఇంద్రుని పనుపున అర్జునుడు సముద్ర మధ్యమున డాగిన కాలకేయాది రాక్షస సంహారమునకు పూనుకొనెను. సముద్ర తీరముచేరి శంఖనాద మొనరించెను.

రాఘవ : ఖర దూషణులు తల్లి ప్రేరణమున తమ పదునాలుగువేల రాక్షస సైన్యముతో పంచవటిచేరి రాము నెదురించ నిల్చిరి.

వ. అప్పుడు సరభస సంరంభమాణ రథగజ భటసముద్భట నిర్ఘోషబృంహిత
ఘోషాట్టహాస కిలకిలార్భట హుంకార ఘోరకోలాహల బహుళభేరీ
ముఖారావ బధిరీ భూతరోధోంత రాళంబుగాఁ ద్రిభువన భయంకర
కీలికీలోత్తాల మహోగ్ర శస్త్రాస్త్రంబులఁ బ్రయోగింపుచుఁ బరభాసుర
వాహినీ సందోహంబులఁ జుట్టుముట్టి యార్చి పేర్చిన—

సమము —రామకృష్ణులు జరాసంధాది యోధ వర్గమును—అర్జునుడు కాలకేయనివాత కవచాది అరువదివేల రాక్షస మూకను రాముడు ఖరదూషణాది పదునాలుగువేల నిశాచర సంఘమును ఎదిరించి నిలువ పోరు ఘోరంబయ్యె.

చ. అరికృత జైత్రయాత్రఁ గని యా బలశాలి సుమిత్రసూను స
త్కరుణఁ బ్రియోత్త మాజనము దారనుతిన్దర యుక్తిఁ గాంచఁగా
వరబల చాప ముక్త శర వారము లందివియెల్ల నిండఁగాఁ
బఱపె నమిత్ర కాండములు భగ్నములై తెగి పిండిపిండిగాన్. 90

యాదవ : రామ కృష్ణుల కెదుర నిలువలేక అరిసైన్యము ఓడి దిక్కా మొగమై పర్విదెను.

పాండవ : అర్జునుండు జ్యా నినాదము చేసి క్షణములో సముద్ర జలముల నెగజిమ్మ శరపరంపర వెల్లి విరియించెను.

రాఘవ : ఖరదూషణులును వారి సైన్యము రాము బాణ హతికి క్షణములో వివశులయిరి.

స్ర. కర్ణాంతా కృష్ట చాపగ్రథిత శరత మూత్రాక్రాంతి దిక్చక్రవాళా
భ్యర్ణో న్నిద్రాద్రి గండోపల తలప తన ప్రజ్వల త్కీలికీలా
పూర్ణ బ్రహ్మాండ భాండ స్ఫుట చటుల పరిస్ఫోటనా పాతిబాహ్యో
దీర్ణార్ణోరాశి పాథస్తిమిత భువనభీతి ప్రభావంబుఁ జూపెన్. 91

యాదవ : వీగిపోవు సేనను కూడ గట్టుకొని జరాసంధుడు ప్రయోగించిన శస్త్రాస్త్ర జ్వాలలు లోక భీకరము లాయెను.

పాండవ : అర్జును డేసిన దివ్యశర పరంపరల అగ్ని జ్వాలలు భూనభోంత రాళములఁ గప్పి వైచినవి.

రాఘవ : రాక్షసుల నుపేక్షించ రాదని రాముడు విల్లెక్కిడి బాణము సంధించ భువనములు భీతిలెను.

తే. గీ. అపుడు కోదండ శస్త్రాస్త్ర నిపుణరూఢి
నుభయ భాగాగ్రదేశ మహోగ్రరణక
రణ మహాశర శూరశీర్షత్రయంబు
నొకఁట ఖండించె వైచిత్రి ప్రకటముగను. 92

యాదవ : కృష్ణుడు అరిసైన్యమును దునుమాడి జరాసంధు డవధ్యుడుగాన ఆతవి విడిచిపుచ్చెను.

పాండవ : త్రిశిరాది రాక్షసులు తన్నెదిరించ అర్జునుడు వారలను యమపురి కనిపెను.

రాఘవ : క్షణములో రాము డొక్క బాణమున ఖరదూషణాదులను వారి సైన్యము పదునాలుగు వేలు నిశాచరులను హతమార్చెను.

తే. గీ. బలము లెల్లను దెగటారఁ బాఱిపోయి
మగుడి మగుడియుఁ జనుదేర మదమణంచె
నటు నివాత కవచసుమ హోళరోగ్ర
వీరవరులను దునుమాడె విజయుఁడంత. 93

యాదవ : ఇటుల జరాసంధుడు పదునెనిమిది మారులు సైన్యమును సేకరించి మధురపై దండెత్తెను. మధుర విడువకయే కృష్ణుడు అరి సైన్యమును మంటకలుపుచు జరాసంధుని విడిచివేయుచుండెను. ఈ తీరున భూ భారము చాలవఱకు తగ్గించెను.

పాండవ : సముద్రమధ్యమున డాగిన కాలకేయాదులను వెడలించి అర్జునుడు వారిని కసిమసగు చుండెను.

రాఘవ : ఆ విధముగ రాము బాణమునకు ఖరదూషణాదులు ఆహుతి అయిరి.

సీ. అచట మహాకాల యవన నాగాకృతి
మధుర ఘూర్ణ్యరుసాల మండలంబు
చుట్టిమేటగు సేన నట్టిట్టుపైఁబడి
తఱుము దూషణమూర్తి ధరను గూల్చి
కలన నముచకుందుఁ గడఁకనుగతిఁ దేర్చ
భయదమహాబల ప్రౌఢి మెఱసి
నిఖిలాయుధంబుల నేర్పునఁ బోరాడు
ఖరబలంబటునేలఁ గలపి తేర్చి

తే. గీ. యెదిరిఁ బరులఁదాబౌలోమ హితహిరణ్య
పుర పురుషుల సద్గతులను బరఁగ దలఁచి
నట్లు నిల్పె రౌద్రాస్త్ర నిహతిని కాల
కేయవని నిల్పునేయన మాయఁ జేయ. 94

యాదవ : కాలయవనుడు కృష్ణునకు శత్రువు. జరాసంధుని సంరంభము విను చున్నవాడు పదునెనిమిదవ ముట్టడిలో జరాసంధునితో చేయి కలిపి కృష్ణుని జయింప తలంపున వచ్చెను. భావి తెలిసిన కృష్ణుడు తన వారిని సైన్యమును నిలువరింప నియమించి కాలయవనుడు చూచుచుండ వడివడి ఉత్తర దిక్కుగ పర్విడెను. తనవారి నటనేయుండి యుద్ధము సేయ నాజ్ఞాపించి కాలయవనుడు కృష్ణుని వెన్నంటి పర్విడెను. ముచకుందుడు తపము చేసికొనుచున్న యొకానొక గిరి గుహలో కాలయవనుడు చూచుచుండ చొరబడెను. ఆ గుహ అంతయు చీకటి మయము. వెనుబడి గుహదూరిన కాలయవనునకు కృష్ణుడు కనుపడలేదు తపముచేయు ఋషి కంటబడెను. కృష్ణుడే అటుల నుండెనని ఆ ఋషి నదలించి మేల్కొల్ప ఆతడు కనులు తెరచెను. అక్షణమున ఋషి కంటి మంటకు కాలయవనుడు కాలిపోయెను. ఆవలి క్షణమున కృష్ణుడు ముచ కుందు నెదుట నిలువ ఆతడు హరి యని గ్రహించి కృతార్థత నంది నతుల నుతుల కృష్ణుని ప్రసన్నుగా నొనరించి శేషజీవితము తపము చేసి ముక్తినంద ముచకుందు డాతావు విడిచి ఒండొక చోటికేగెను. ఇట యాదవులచే సేనావారము నశించెను. కృష్ణుడు తిరిగి వచ్చి మధురలో తనవారిని కలుసుకొని కాలయవను మరణ విధానము వారికి తెల్పి సంతోషపెట్టెను.

పాండవ : కాలకేయాదులు అర్జునుని చేబడి మరణించిరి.

రాఘవ : సైన్యమును హతమార్చి రాముడు ఖరదూషణులను చంపెను.

వ. అంత పరజయంబుఁ బ్రతిష్ఠించి మగుడి—

క. గిరి పొడవు కట్టి మూపులఁ
బరుషతఁ బతిచుట్టు నిల్చు పరుల మహోగ్రుల్
గుటిమీఁదఁ దాడి వచ్చెను
హరి విక్రమశాలి యాతఁ డమరులు బొగడన్. 95

పదము

హరి = కృష్ణుడు, అర్జునుడు, రాముడు ఇటుల అరిమూకను ఖండించ దేవతలు హర్షించిరి.

తే. గీ. అమరలోకవరనియంత యతఁడు జిష్ణుఁ
డలఘుఁ డభిరాముఁ డలకృష్ణుఁ డసమ బలుఁడు
దారగతి సుమిత్రోదయ ధర్మయుక్తిఁ
గలసి యాత్మల ముదమంది యలరుసంత 96

సమము

కృష్ణుడు తన వారిని కలసియు—
అర్జునుడు స్వర్గమునకు మాతలితోనేగి ఇంద్రునర్ధాసమున నుండియు—
రాముడు సీతాలక్ష్మణులతో పర్ణశాలయందును సుఖముగనుండిరి.

వ. అది ముందఱ మహాయత్న ప్రేరిత విశ్వకర్మ నిర్మితంబై వనరాశి నగ విరాజితాంతరాళ సమున్నత విగ్రహ పుణ్యజన విలసితంబై, లంకా పురంబన స్వర్ణలాలితగతిన్నగవర సదానందన వన సురసాల మందార ప్రముఖతరుకుసుమ సురభి మహిమాస్పదంబై, అమరావతీ నగ రంబనఁ గమలాకరసర్వతోముఖ వీధీవిస్ఫురిత విచిత్రోజ్వల మార్గరాజ రాజితంబై, ద్వారవతి యన పుష్పక ప్రతిభాసమాన విమానోన్నత సౌధగోపుర పరంపరా పరిభాసితంబును, మహాంభోరాశి విహిత పరి ఖాపరివృత సప్తప్రాకార విశాలాట్టాలక నానావిధాయుధ యంత్రభీక రంబును, దిగ్గజకులాభ్యుదయ మనోజవసిత దంతావళమండితంబును, ఉచ్చైశ్రవోతిశయ విమల మయూర కంఠవర్ణ వర్ణనీయ తురంగ రంగంబును, కాంచన ప్రభాయుతార్వ సముజ్వల స్యందన సందోహ బంధురంబును, మణిమయామల భావసుధర్మా సమాన సభాభి రామంబును, నిజాజ్ఞప్తి విహిత మహిమధురాకర సకల స్వజన నివేశ భాసురంబును, సకలవిభవాస్పదంబును, అనుపమానంబును నగు, మహనీయ రాజధానిం బేరోలగంబుజేరి, విమలమణిమయ సింహాసనంబున నధివసించి, యఖిలలోక పరిపాలనోత్సవ దశాననోదిత చమత్క్రియాలాప మధురిమ ధురీణుం డగు నా సురప్రముఖ సముఖంబంది పాదంబుల వ్రాలిమొక్కిన—

యాదవ : కృష్ణుడు ఇంద్రనారదుల వచనానుసారము మధుర విడచి సముద్ర మధ్యమున విశ్వకర్మ నిర్మితమయిన ద్వారక నిండు పేరోలగంబున్న సమయమున ఒక బ్రాహ్మణుడు వచ్చి స్వస్తి చెప్పి ఆశీర్వదించి నిలువ ఆతనిని పూజించి మన్నించెను.

పాండవ : శ్రమవాయ అర్జునుండు స్వర్గమున కొండొక కాలముండి ఇంద్రుడు జనకుని యనుజ్ఞ వడసి అన్నదమ్ములను జూడ భూలోకమునకు వచ్చెను.

రాఘవ : లంకాపురి మహావైభవమున నిండు కొలువున్న అన్న రావణుని కడకు శూర్పనఖ వచ్చి రోదించుచు ఆతని పాదముల వ్రాలెను.

తే. గీ. కర్ణనాసాముఖాంగ గాప్తిఁ గాయములను
రక్తమొలుకఁగ రాగను రాగ మొదవ
నమ్రత నయాత్మస్వానుజ నవ్యవస్థ
చిత్తచలన మందఁగఁ జూచి యెత్తి చేర్చె. 97

యాదవ : ఆ బ్రాహ్మణుడు తెచ్చిన రుక్మిణీ సందేశము విని కుండిన పురికేగు నిశ్చయము తన వారికి తెల్పి, తన పోకకు చలించు స్వజనమునకు ప్రీతి వచనములు తెల్పి కూడ వత్తునన్న బలరామాది సోదరవర్గమును వెనుక నుండి రమ్మని తాను బ్రాహ్మణుని రథస్థుని చేసి పయనించెను.

పాండవ : సోదరులున్న వనము సమీపించి దూరమున వచ్చు అన్నను యములు = నకులసహదేవులు చూచి పర్విడిరి. వారినెత్తి కౌగిలించి చిరవియోగదుఃఖ మాపుకొని లాలించెను.

రాఘవ : అనుజను = చెలియలు శూర్పనఖను రావణు డోదార్చి ఆమె విన్పించిన వార్త విని, పగదీర్తునని ఆశ్వాసించి అంతిపురికి పంపివైచెను.

సీ. గోపతి యాజిరు కుఱ్ఱుండిన ప్రభునగ్ర
భవును క్రిందత్తన యవిజయాప్త
తనుదార రాజిత తరుగావ్యముదిత వృ
త్తిని దెల్ప మహోన్నతిఁ దనుఁజేరఁ

దత్ప్రమదాగమో త్సవ పరిగ్రహసిద్ధి
నఁటఁగోరిసుమనోర థాప్తియాత్ర
దానుండు వనరాశి దాఁటి సత్సాహాయ్య
రచనాను గతినాసుర ప్రభుండు.

తే. గీ. ధర్మభూతి యమల భీమ తతమహౌఘ
గాప్తిఁ జనియె దానావిదర్భాద్యతిశయ
దేశ వన నదీనద పుణ్య తీర్థ మునిజ
నాశ్రమాదులఁగని విస్మయంబుగాఁగ. 98

యాదవ : కృష్ణుడు బ్రాహ్మణుని వెంటగొని నదీనదములు గిరులు వనులు దాటి శరవేగమున కుండిన పురము సమీపించెను.

పాండవ : అర్జునుడు నకుల సహదేవులను బొదివికొని యేగి అన్నలకు నమస్కరించి తన వృత్తాంతమంతయు వివరించి వారల నానందమున నోలలాడించెను.

రాఘవ : రావణుడు లంక విడిచి మారీచుని సహాయముకని ఆతనిని బంగరు లేడి అయి రాముని ఆశ్రమమునకు సుదూరముకొనిపోయి చిరము తడయు యుక్తిపన్ని నియోగించి సముద్రముదాటి యతివేషధారియయి తన్ను చూచువారాశ్చర్య మగ్నులుకా పంచవటి సమీపించెను.

తే. గీ. అతఁడు దానవ వరవర్ణి నితగఁ జేరు
వానిద్విజుఁ డనుమతి నిల్పి మానితోక్తి
దాఁటనేయుఁడు వాడని తత్పరతను
దెలుప సూక్తి తన పనులఁ ద్రిప్పెనతని. 99

యాదవ : కృష్ణుడు బ్రాహ్మణునకు తానొనరించబోవు కార్యము వివరించి, రుక్మిణికి ముందుగా తెలుప నాతనిని పంపివైచి అలంకృతమయిన పురవీథి నొకచో నిలచెను.

పాండవ : ఆ వనముల వేటాడవచ్చిన సైంధవుడు పర్ణకుటీరమున ధౌమ్యమాత్ర సహాయయయి యున్న ద్రౌపదిని చూచి (పాండవ పంచకము వేటకై వనమున సంచరించ నేగిరి). ధౌమ్యు ననుమతి వడసి ఆమెను సమీపించెను.

రాఘవ : మారీచుడు బంగరు మాయలేడి అయి పర్ణశాల ముందర గంతులు వేయుచుండెను.

అ. వె. సారవంతుఁ డతఁడు సారంగపరగతిఁ;
దత్పురస్థుఁడగుచుఁ దగఁజరించి
ప్రమదజనక తనయ భరితవిస్మయవృత్తిఁ
గనఁ దనుజన వరుల ననుసరింప. 100

యాదవ : రథస్థుడైయున్న కృష్ణుని చెలులతో ఆలయమున దేవి నర్చించ నేగు రుక్మిణి కని ఆతనినే స్మరించుచు నేగెను.

పాండవ : సైంధవుడు ద్రౌపదిని సమీపించి పలుకరించ పూర్వపు బాంధవ్యము తలచి (దుర్యోధనుని చెలియలు దుస్సలకు భర్త సైంధవుడు) అతిథి సత్కారము లొనరించెను. ఆతడు అవినీతుడయి సరసములాడ ఆమె తిరస్కరించి తూలనాడెను.

రాఘవ : మాయా మృగమని గ్రహించలేక సీతరాముని తనకా బంగరు లేడిని పట్టి తెమ్మని కోర మహాప్రతాపశాలి రాముడు లేడి వెంట నేగెను. సుదూర మేగి మాయామృగమని బాణమేయ హా లక్ష్మణా యనుచు మారీచుడు స్వీయరూపు ధరించి మరణించెను. వడివడి రాముడు పర్ణశాలకు వచ్చుచుండ సీత వేగిరమునకు లొంగి లక్ష్మణుడు పర్ణశాల నొంటరిగా సీతను విడచి రామున కెదురు పోయి నడచిన వృత్తము తెల్పెను. ఈ లోగా రావణుడు యతి వేషమున "భిక్షాందేహి" అని పర్ణశాల వాకిట నిలువ సీత భిక్ష కొనితెచ్చెను. రావణుడు స్వీయరూపము దశ ముఖములు ప్రదర్శించి మూర్ఛ పోయిన సీతను రథమున నిడుకొని లంక దిక్కుగ దక్షిణముగ నేగసాగెను.

క. పావని యార్యార్చనకై
పోవఁగని సమయ మపుడు పుణ్యజనేశుం
డీవంకవచ్చి యతిపతి
భా వాశ్చర్యోరురూప పటిమన్గవిసెన్. 101

యాదవ : ఆర్యా మహాదేవిని పూజించి చెలులతో గృహోన్ముఖి యయిన రుక్మిణిని రాజలోకము కనుచుండ మెఱుపుమెఱసినట్లు రథస్థుడైన కృష్ణు డామెను సమీపించెను.

పాండవ : ధౌమ్యుడు పూజాదికమున నిమగ్ను డయ్యెను. పతులు దరినిలేరు. అట్టి సమయమున సైంధవుడు ద్రౌపదిని సమీపించి ప్రతిమాలి విఫలు డయ్యెను.

రాఘవ : రాముని దూరముగ లేడి కొనిపోవ యతియయి రావణుడు వచ్చెను.

చ. మతిని యతిభ్రమన్ విమల మానసపూజ యొనర్పలేచిత
త్సతిని బలాత్కృతిన్గొనియ ధర్మభవాప్తిగ ఖండితామర
ప్రతిభలు పంక్తికంఠుడు ని రంకుశవృత్తిన శంకఁదేరిపై ।
ధృతినిడికొంచుఁ బోవన్నృప తిప్రవరోద్ధతి నెంచకేమియున్॥ 102

యాదవ : కృష్ణుడు మనసా తన్నే ధ్యానించుచున్న రుక్మిణిని రథమున చేయిచ్చి చేర్చుకొని రాజలోకము చూచుచుండ తన పురము దారి బట్టెను.

పాండవ : అరిభీకరు లయిన పాండవులను తలంపక సైంధవుడు దుర్వినీతు డయి ద్రౌపదిని రథమున నిడుకొని దూరమున నున్న తన సేనావారము దిక్కుగ పోసాగెను. వెనుబడి ఆక్రోశించుచు ఆతనిని నిందించుచు ధౌమ్యుడు పర్విడుచుండెను.

రాఘవ : నిజమయిన యతి యని సీత భిక్షకొనిరా తన నిజరూపుచూచి మూర్ఛమునిగిన సీతను రథమున నిడుకొని లంక దిక్కుగ పోసాగెను.

వ. అప్పుడు తదీయదీనాలాపంబు లాలకించి —

యాదవ : రుక్మిణి ఆ విధము పోకకు రాజలోకము కోపించి కృష్ణు నెదిరించిరి. ఆమెయు తొలుత భీతిల్లి అనంతరము తేరుకొనెను.

పాండవ : రాఘవ : ద్రౌపది యొక్కయు, సీత యొక్కయు దీనాలాపము లాలకించి.

ఉ. పావనికాంచఁ బోవఁగని పక్షిధృతిజ్ఞని భైరవార్భటి
న్బోవకు మంచునడ్డుపడ భూరిబలంబు పొగడ్త కెక్కఁ దాఁ
బై వడి జుట్టుముట్టుకొని పక్షిపదోన్ముఖరేఖ నెంచఁ గా
వావిరి దద్బలోన్నతిని భగ్నములయ్యె నిజాంగ సంగతుల్. 103

యాదవ : అంతకు పూర్వము రుక్మి తన చెలియలిని శిశుపాలున కిత్తునని బాసచేసి యుండె. ఆతడును శిశుపాలుడును రాజలోకముతో గలిసి కృష్ణు మార్గము పరికట్టి పోరున కాయిత మయిరి. తృటిలో వారిని చెల్లాచెదరొనరించి కృష్ణు డేగసాగెను.

పాండవ : లోగా పాండవులు వాటకు వచ్చి ధౌమ్యునికవలను అన్న ధర్మజుని ఆట విలిపి భీమార్జునులు క్షణములో సైంధవుని కూడ ముట్టి రథము నుండి లాగి ఆతనిని నేలవైచి, ద్రౌపది నూరార్చుచు వచ్చి, సైంధవుని ధర్మజు ముందు కట్టి పడవైచిరి. అనుకంప చూపి ధర్మజు డాతని విడిపించి నీతులు తెల్పి పంపివైచెను.

రాఘవ : పక్షి = జటాయువు. రావణు నెదిరించి చిరము పోరి రెక్కలు నఱుకబడి నేలబడి యుండెను. సీతతో రావణుడు లంక ప్రవేశించెను.

మ. తఱితోఁ బుట్టుమహోగ్రకోపమునను ద్యద్భీషణాకారుఁడై
యరితోనోహరి సాహరిన్భైనఁగఁగే శాక్రృష్టిఁ జేయంగ నే
పఱిపోనాహరి విక్రమోద్ధతిఁ బతం గాభీల తత్తేజ మ
ట్లురుభీష్మోదయ భాకరోజ్వల జటా యు స్థైర్యముల్మాయఁగాఁ. 104

యాదవ : ఎదురించిన రాజలోకమును భంగపఱచి రుక్మిని ఇంచుక అవమానించి పంపి రుక్మిణితో ద్వారక కేగెను.

పాండవ : సైంధవుడు భీమార్జునులచే పరాభవించబడి తన దారి నేగెను.

రాఘవ : జటాయు పక్షములు ఖండించి ఆతనిని నేల గూల్చి సీతతో రావణుడు లంక చేరెను.

క. అరిదర కరుఁ డతడు పుర
స్థిరఁ జేరఁ ప్రబల భీమ సేనాదృతియై
పరమోన్నతి భీష్మతనయ
పరిగ్రహంబుగ మహోత్స వంబున నెగడెఁ. 105

యాదవ : ఆ విధముగ కృష్ణుడు రాజ లోకమును తిరస్కరించి ఉన్నతుడయి రుక్మిణిని చేపట్టి ద్వారకలో సుఖముగ నుండెను.

పాండవ : భీమార్జునులా విధమున సైంధవుని గోలకు తెచ్చి ధర్మజు కనుసన్న నాతనిని విడిచిపుచ్చి ద్రౌపదితో పర్ణశాలచేరి సుఖముగ నుండిరి.

రాఘవ : రావణుడు అట్లు భీకరవృత్తి సీతను హరించికొనిపోయి లంకలో అశోకవనమున రాక్షస స్త్రీ గణము రక్షణలో ఆమె నుంచి తన వారితో ఉత్సాహముగ నుండెను.

సీ. సత్యాశయ ప్రాప్తి సంతోషియై పోయి
కమలరాగంబు సంగతిగఁ గూర్చ
వదనదీకాంతార నగగుహాంతరములు
దూఱుచు హరిగజా దులను గడచి
ఋక్షప్రముఖుఁడా యెడ హరివిభుఁడుండ
వనచర మృగమని వద్దఁ జేరి
భేదింపఁ దలఁచుట బెదరంది పోవఁ ద
దనునయ సంప్రాప్తి నవలగదిసి

తే. గీ. ప్రదరగతిఁ బూన్చి తద్యక్ష రాక్షస ప్ర
భాసమాన బలంబెల్ల ప్రౌఢినణఁచి
తగినపౌలస్త్యభటహారి తన్మహోక్తి
దత్తనయమణియుక్తినిఁ దారకృతిని. 106

యాదవ : ఇందు సూచితమయిన వృత్తము కృష్ణునికి జాంబవంతునితో మణి నిమిత్తమయిన పోరు. ఆతనితో ఇరువదియేడు దినములు పోరి మణిని జాంబవతీ కన్యను వడసి తిరిగి వచ్చి మణిని బలరామునకు చూపి సుఖముగ నుండెను. ప్రసేనజిత్తును చంపి సింహము దానిని చంపి మణిని జాంబవంతుడు కొనిపోయి కూతురు జాంబవతి తొట్టె కలంకారముగా చేసెను.

పాండవ : సౌగంధిక కమలములను హరించికొని రానేగిన భీముని వృత్తము సూచితము. ఆ సరస్సు యక్షరాజు కుబేరునిది. దారిలో వాయుతనయుడు హరి - ఆంజనేయులు తమ్ముని బలము పరీక్షించి మార్గ ముపదేశించి పంపును. అనంతరము భీముడు కుబేరానుచరులు యక్షులను నిర్జించి సౌగంధిక కమలములు ప్రభూతముగా సంపాదించెను.

రాఘవ : హరి విభుడు = మారుతి. ఈతని సహాయమున రామలక్ష్మణులకు సుగ్రీవ సఖ్యము - వాలి సంహారము - ఋష్యమూకాద్రి నివాసము సూచితము.

తే. గీ. భ్రాతృజనమంద విహ్వాల భావమణఁగఁ
దామరలు గొంచు చిత్ర పత్ర నిలయవిల

సిత పురస్థిరఁ దగఁగాంచి శీతలాళి
తగతి పావని నిలుచున్న దావులరసి. 107

యాదవ : కృష్ణుడు జాంబవతితో మణితో వచ్చి అన్న బలరాముని విహ్వల భావముపోజేసి ఆనందము కూర్చి ద్వారక సుఖములు గనెను.

పాండవ : భీముడు, తామరలు = సౌగంధిక కమలములు సంపాదించి తెచ్చి ద్రౌపది కిచ్చి ఆనందపఱచెను.

రాఘవ : ఋష్యమూకాద్రి నెలవుగా గొని చలికాలము గడపువారు, ఋక్ష వానర సహాయమున రావణ సంహారము అయినట్లే తలంచుచు ఎట్లో కాలము గడపిరి.

సీ. సంహృతమాయోగ్ర శంబరుం డొకరుండు
వనరాశిఁ గూర్చుట ననిమిషగతిఁ
బెఱుఁగుటఁ దనమూర్తి బరికించి తన సతి
గతినేర్పు బలిమినిఁ గడకఁజెంది
తగు జటాయుర్వినే తయనఁ దగు మహా
హీనాసురక్రూర కృత్యము విని
దక్షిణోద్ధతిఁ బోయి తతబలయోజనా
యుతభుజాంగ కబంధహృతినెటింగి

తే. గీ. తద్విదితగతి స్వాకృతి దత్ప్రభావ
శాపహతియుఁ బ్రశ్నోత్తర సంగతులను
గానఁ బడఁజేయఁ దరి విజసూను తద్వి
ముక్తిఁ దద్విజయాగమమునను నలరె. 108

యాదవ : కృష్ణుడు శంబరాసురుని సంహరించి ప్రద్యుమ్న కుమారుని విడిపించి తెచ్చిన గాధ ఇందు సూచితము. ప్రద్యుమ్నుడు మన్మధు నవతారము. శంకరు కంటి మంట కాముడు కాలిపోయి ప్రద్యుమ్నుడగుట రతికి దేవతలు తెల్పిరి. పుట్టిన ప్రద్యుమ్ను మాయెల నుంచి దాదులు కార్యాంతరముననుండ శంబరు డాకాశమున పోవువాడు ఆ బాలుని సౌందర్యమున కచ్చెరువడి ఎత్తుకొని పోయెను. రతికృతక

రూపమున శంబరు నింట దాదియై బాలుని పెంచెను. ఇంతలో కృష్ణుడు శంబరు డొనరించిన కార్యము తెలుసుకొని ఆతనిని సంహరించి రతితో ప్రద్యుమ్నుని కొనివచ్చి నారదు వచనమున నిరువురకు వివాహ మొనరించెను.

పాండవ : వనవాస కాలమున అజగరము భీముని మింగగా ధర్మజుడు దాని ప్రశ్నలకు సమాధానించి భీముని విడిపించుటయు, అజగర శాపమోచనము; వేటకు పోయిన నల్వురు సోదరులు యక్షుని మాట వినక హ్రదములోని నీరు త్రావి మృతి నొందిన వారివలె కాగా యక్షప్రశ్నలకు సమాధానమిచ్చి వారిని ధర్మజుడే విడిపించుట సూచితము.

రాఘవ : జటాయువు వలన కబంధుని వలన రావణు డొనరించిన సీతాహరణ వార్తవిని దక్షిణముగ పోయి అనంతరము సాధించిన సుగ్రీవ సఖ్యము వాలి సంహారము, ఇత్యాదికము సూచితము

వ. అట్లతండు భ్రాతృయుతుండై ముందఱి సన్నిజ స్థానంబుఁ జేరి వసించియుండెనంత —

వ. ఆ విధముగ

| | |
|---|---|
| శ్రీకృష్ణుడు<br>ధర్మరాజు<br>రాముడు | సోదరులతోగూడి ద్వారకలో వనమున ఋష్యమూకమున క్రమముగా నివసించి యుండిరి. అనంతరము. |

ముక్తపదగ్రస్త మత్తేభవృత్తము

ఖగరాజధ్వజకాండ కాండముఖరిం ఖత్కీలికీలాకులా
పగతాంభోనిధికాండకాండవిల సద్బాహాగదాఘాత సా
శుగదోషాచరకాండకాండభవ భూసోమేంద్ర దిక్పాల ము
ఖ్యగణప్రార్థిత కాండకాండ నిచ యో ద్యద్రోమ కూపాంతరా. 1

పాదాంతోదస్త పాదాద్యంత యమక సింహావలోకన ముక్తపదగ్రస్తకందము

క. కమలాప్త హతా కమలా
కమలాకర ధీరవినుత కరధృతకమలా
కమలాప్త తేజ కమలా
కమలాసన హృదయనాభి గతఘన కమలా. 2

పంచచామరము

కులాకులాకులాన్య లబ్ధ కుండకుండ లిన్యుమా
కలాకలాకలావతీశ కాంతకాంత సన్నుతీ
చలాచలాచలాంతరంగ సారసారసాకృతీ
తలాతలాతలాది పూర్ణ తారతారకాయశా. 3

ఆ. 2-సంపూర్తి.



నెల్లూరి రాఘవకృతి

# యాదవ రాఘవ పాండవీయము

## ౩, ౪ ఆశ్వాసములు

ఆనందజ్యోత్స్నా టీకావిలసితము



టీకాకర్త, ప్రకాశకులు :


విద్వాన్ సరిపెల్ల విశ్వనాథశాస్త్రి, ఎం.ఎ.పి.ఓ.ఎల్.

హైదరాబాదు.

# కృతజ్ఞత

ఈ నా యాదవ రాఘవ పాండవీయ టీక ఆరంభించి పదునారు సంవత్సరము లయినది. కొంత ఆర్థిక ఇబ్బందులకులోనయి ఒకటి రెండాశ్వాసములు పూర్తిచేయ గలిగితిని. మొదటి ఆశ్వాసం గౌ॥ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారి పలుకుబడి ద్వారా వేములవాడ శ్రీ రాజరాజేశ్వరస్వామి కమిటీవారి ఆర్థికసహాయము లభించి పూర్తి చేయగలిగితిని. ఈ సందర్భమున శ్రీయుతులు పరచా వెంకటేశ్వరరావుగారు, కీర్తిశేషులు ఇల్లెందుల రామచంద్రరావుగారు నా కమూల్యమయిన సహాయమొనరించిరి.

రెండవ ఆశ్వాసమునకు మద్రాసున మిత్రులు డాక్టరు రాజమన్నారు, డాక్టరు చిట్టూరి సత్యనారాయణగారు వారి మిత్రులకు నన్ను పరిచయ మొనరించి చేదోడు వాదోడు కాగా సమకూర్చుకొన్న ధనసహాయముతో పూర్తి చేయవలనయినది.

మూడు, నాలుగు ఆశ్వాసములకు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు సహాయ మొనరించిరి.

పై వారలెల్లరకు నా కృతజ్ఞతలు తెల్పుకొనుచున్నాను.

ఇట్లు బుధజనవిధేయుడు,

నరిపెల్ల విశ్వనాథశాస్త్రి.

శ్రీ శ్రీధరాయనమః

# యాదవ రాఘవ పాండవీయము

[స టీ క]

## తృతీయాశ్వాసము

క. శ్రీరామ నామ సారా
సారస దళ నయన సర్వ జగదా ధారా
ధారా జమద విదారా
దారాయిత కమల మిత్ర తనయా శ్రీరా.

ఈ కావ్యము గోపాలకృష్ణ పరబ్రహ్మమునకు అంకితము. కృష్ణపరమాత్మ లీలా మానుషవిగ్రహము చేకొని రుక్మిణీ, సత్యభామలతోపాటు, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర మొదలగు కాంతలను వివాహమాడినట్లు శ్రీమద్భాగవతమున కలదు.

కమలమిత్ర తనయ = సూర్యుని కుమార్తె కాళింది (యమున) దారాయిత = భార్యగా గ్రహించినవాడు. శ్రీ + రా = లక్ష్మీ విభుడు.

వ. అవధరింపుము - వినుమనుట.

## కథా ప్రారంభము

తే. గీ. శాబరోచిత కృత్యముల్ చాలఁగనుచు
నంత నద్వైత వనమార్గ మంది వెలయు
ధర్మభూతి చెంతకు మరు త్ప్రభుఁడు హరి వి
భుండు వన్యాకృతి మెఱయఁ బూనివచ్చి. 1

యాదవ : మరుత్ + ప్రభుడు = దేవతలకు ప్రభువు - హరి - విష్ణువు; హరి విభుడు = కృష్ణపరమాత్మ; వన్యాకృతి = గొల్లడయి-నెమిలి పింఛము, వేణువు,

వనమాల ఇత్యాది అలంకారములు. ధర్మభూతి = ధర్మరాజు (యమధర్మరాజు తనయుడు.) ఆతని కడకు - పాండవుల పాలికి కృష్ణుడేగెననుట.

పాండవ : ద్వైతవనములో ఆటవికుల చర్యలు కనుచు పాండవులున్నారనుట - వారివద్దకు కృష్ణుడేగెను.

రాఘవ : మరుత్ప్రియుడు = వాయు తనయుడు - ఆంజనేయులు. సీతా వియోగ చింతాపరులయిన రామలక్ష్మణుల కడకు వచ్చెను. ధర్మభూతి = ధర్మ స్వరూపుడు - రామోవిగ్రహవాన్ ధర్మః.

మ. నిజ పూర్వోత్తర వృత్తమా హరిసమున్నిద్రాకృతిన్వేడఁ ద
ద్ద్విజసీమోజ్జ్వల వాక్య నైపుణులకున్ జ్ఞానాబు సంతోష వీ
చిఁ జెలంగ న్రవి పుత్రుమైత్రి బల వై చిత్రిన్రిపున్గెల్వఁ ద
ద్విజయాధిక్యత నెంచు రాజవరు హృద్వృత్తిన్దగన్దెల్పినన్. 2

యాదవ : హరి = కృష్ణుడు; పాండవులను వారి అరణ్యవాస విశేషములు తెలుపగోర. ధర్మరాజు రారాజు కర్ణుని బలము చూచుకుని (రవి పుత్రుడు = కర్ణుడు) తమ్ము గెలువ నిశ్చయించినాడని తెల్పెను.

పాండవ : తమ వద్దకు వచ్చిన కృష్ణుని ఆదరమునకు పాండవులు సంతసించిరి.

రాఘవ : వచ్చిన హనుమ ప్రసంగము విని రాముడు ఆ కపి సామాన్యుడు కాడని గ్రహించును. సీతావియోగము, దాన తమకు కలిగిన చింత వివరించి రాముడు ఆంజనేయుని రాకకు కారణమడుగును. తమ రాజు సుగ్రీవుడు అన్న అయిన వాలిచే పరిభవింపబడి వారితో సమానమైన దుఃఖమున మునిగియున్నాడని తెల్పి - రామ సుగ్రీవుల సఖ్యము ఉభయులకు శ్రేయోదాయకమని హెచ్చరించును.

ఉ. లక్ష్మణ వాక్యము ల్విని యలక్ష్యమి దెంతని మిత్ర పుత్రుతో
సూక్ష్మగతిఁ దదీయ రిపు చొప్పుఁ ణచన్ విజయ ప్రతిజ్ఞ నా
లక్ష్మతఁ గూర్చ మిత్రతఁ జెలంగ విభావసు సంగతిన్ సము
ల్లక్ష్మిరహించఁగా నెరపి లాలితరీతి ధరాధరుండటన్. 3

యాదవ : కృష్ణుడు ధర్మరాజుతో కర్ణార్జునుల తారతమ్యము వివరించి రారాజు తలంపు స్వప్నతుల్యమని తెల్పి తనవారితో ద్వారకకు పోవును.

విజయ ప్రతిజ్ఞ = అర్జునుని ప్రతిన, విభావసు = ఖాండవ వన దహన సమయంలో అగ్ని ఇచ్చిన గాండీవాదు (అగ్ని) లుగ్గడించి విజయము పాండవులదేనని తెల్పి యేగెను.

పాండవ : కృష్ణుని వచనము లాలించి ధర్మరాజు ఊఱట చెందును.

రాఘవ : విభావసు సంగతి = అగ్నిసాక్షిగ; హనుమ సందేశము ఆదరించి తమ్ముడు లక్ష్మణునితో హనుమ వెంటనేగి ఋష్యమూకాద్రినున్న సుగ్రీవునితో సఖ్యము నెఱపును.

వాలిని సంహరించి కపిరాజ్యము సుగ్రీవుని కిత్తునని రాముడు బాస చేయును. సీతాన్వేషణ మొనర్చి రామునికి తన సేనలతో సహాయమొనర్తునని సుగ్రీవుని ప్రతిన.

క. మఱి యాదిత్య వర తనయ
గురుమైత్రిన్ జెంది వాలి కుధరచర మృగా
హారణంబున రచనాగతిఁ
దఱితోడ ననయముఁ దెలిపి తగఁ జే కొనియెన్. 4

యాదవ : కృష్ణుడు పాండవులతో కలిసియుండి ఒకనాడు అర్జునునితో వేటకేగును. అలసి నదీతీరమున విశ్రమించియుండ దూరాన నదినీట ఒక కన్నియ కన్పించెను. ఆమె తనకై తపించు సూర్యపుత్రి కాళింది అని తెలిసి ఆమెను వివాహమాడును.

ఆదిత్య + వర + తనయ = సూర్యుని కుమార్తె; శ్లేష = ఆదిత్య + వరుడు = దేవతలలో శ్రేష్ఠుడు-ఇంద్రుడు = అతని కుమారుడు అర్జునుడు-కృష్ణుని కాతనియందతిప్రీతి (గురు మైత్రి).

పాండవ : రారాజు, ఆదిత్య - గురుమైత్రి = కర్ణునితోడి స్నేహబలము చూచుకుని: ఘోషయాత్రకని వేటకని తండ్రి ఆజ్ఞ చేకొని ఆతని సంశయముతీర నీతిమాలి ప్రవర్తించనని నచ్చచెప్పి పాండవులున్న అడవిచేరును. అంతఃపుర

జనము వీరవర్గము సైన్యము వెంట నుండును. అట గంధర్వుల ఆధీనములో ఉన్న ప్రాదము - లోతైన మడుగు - దాని సమీపములో డేరాలు వేయించెను. దానికి అనతిదూరమున పాండవులు ఆశ్రమము కల్పించుకొని యుండిరి. రారాజు తలంపు తన వైభవముచూపి పాండవులను అవమానించుటయే.

రాఘవ : సమయము అనుకూలమయినపుడు వాలిని సంహరింతునని ప్రతిన చేసి లక్ష్మణునితో రాముడు ఋష్యమూకాద్రి సుగ్రీవునితో చెలిమిమై మెలగుచు నుండెను.

వాలి = సుగ్రీవుని అన్న; కుధరచరమృగము = కొండకోనల తిరుగు మృగము - కపి, తటితోడన = మంచి సమయమున - అనుకూల సమయమున; నయము = నీతి.

సీ. తన బల లక్ష్మి నం తయుఁ జూపి యుడుకార్చు
  నుద్యుక్తి వైరి దు ర్యోధనుండు
స్వకళత్ర గతి సోద రకృతిఁ దన్మంత్రి బాం
  ధవ మిత్ర విబుధ వైభవహితాప్తిఁ
దత్పుర స్థితిఁ జెంది దౌర్జన్యములు బెంప
  దుందుభిరణన మి న్నంది జేయ
వసుధాతలేశ ము ఖ్య సుత సుదంతరు
  చి విలాస హాసనాప్తిఁ జెలువు నవని

తే. గీ. లీలఁ గొన సప్తగిరి వర సాలదివ్య
  భద్రమూర్తుల నా రవి ప్రభుడు జూపఁ
ప్రబల బాహా బలప్రౌఢిఁ బ్రణుతి కెక్కఁ
  జటుల సంగర సంభ్రమ చాప లతను. 5

యాదవ : సప్త-భద్రమూర్తులు = ఏడు ఆబోతులు - పర్వతాకారము కలవి. వానిని సంహరించిన వానికి తన కూతు నాగ్నజితి నిత్తునని కోసలాధిపతి చాటించును. కృష్ణుడు పాండవులను వీడ్కొని ద్వారకకు పోవువాడు నాగ్నజితిని వివాహమాడు తన తలపు వారికి తెల్పి తనవారితో కోసలపతి నగరు చేరును. అంతకుమున్ను రాజవీరలోకము ఆ ప్రయత్నమున విఫలమైనది.

పాండవ. దుర్యోధనుడు హ్రదమున జలక్రీడసలుప నుద్యమించును. ఆ హ్రదము చిత్రరథుడను గంధర్వునిది. కాపరు లాటంకపఱుప అరణ్యములు హ్రదములు సామాన్యములని ధిక్కరించ గంధర్వులతో కురురాజసేనకు పోరాన గూడెను. కొందఱేగి గంధర్వున కీవార్త తెలుప అతడు కోపించి వచ్చి కౌర వులతో పోరున కాయిత మాయెను.

రాఘవ: సుగ్రీవుడు రామచంద్రుని బలము తెలియనెంచి సప్త సాల ములు – ఏడు తాడిచెట్లు – ఒక్క బాణమున కూలనేయ గోరెను.

వ. చేతుల కలవి యగునంతయుం బెనంగ.

యాదవ: బాహుబలము చూపి కృష్ణుడు ఆఁబోతులతో పోరదొడంగెను.

పాండవ: బలియుడు గంధర్వుడు. పోరిలో కర్ణాదులు ఓడిరి.

రాఘవ: లీలగా ఒకేఒక బాణమును రాముడు వింట సంధించెను.

ఉ. శృంగ శిఖాగ్రముల్ బలిమిఁ జేవడిఁ బట్టుకకట్టి యీడ్చి త
త్సాంగ పరిగ్రహోప్తిని మహాబల వైఖరిఁ బోవనప్పుడు
త్తుంగ ధరాధరోపల సుదుస్సహఘోర తరుల్మహోన్నతిన్
సంగతి నడ్డమైన గురు సార శరాహతి మాయఁ జేయఁగన్. 6

యాదవ: కృష్ణ పరమాత్మ ఏడు రూపములుదాల్చి ఒకేమారు ఏడు వృష భములను కొమ్ములుపట్టి యీడ్చి నేలపై మోది చంపెను.

పాండవ: మహాబలుడు చిత్రసేనుడు ఆ గంధర్వుడు కౌరవసేనను గగ్గోలుపఱచి దుర్యోధనుని పట్టి కట్టి తనయానముననుంచి కొనిపోవుచుండెను.

రాఘవ: ఏకబాణ ప్రయోగమున శ్రీరామచంద్రుడు సప్తశాఖములను ఖండించివైచెను.

సీ. మది సమ్మతించ ధర్మప్రభుండంఁ పద
దుర్బుద్ధియమల భీమ భూరిబాహు
బలయుక్తి నాదిత్య వర పుత్రుఁ డటు సని
సింహా నా దార్భటిఁ జేరఁ బిలువ

వాలి వేగంబున వచ్చి తన్నొదివిన
నా చిత్రసేనాగ్రహంబు మాన
ప్రదర యుక్తిని నభః ప్రతి దిశల్గ్రంపింప
నతి ఘోరముగ యుద్ధ మాచరింప
తే. గీ. నపుడు సురరాజ సుతుడు ని జాంబకోగ్ర
గతులు మెఱయంగ బఱపియు ద్దతిని మిత్ర
పుత్ర కర్ణవ్యాచ్ఛేదన స్ఫూర్తిఁ బేర్చ
నార్చి తఱమెను బలమెల్ల నణఁచి గెలిచె. 7

యాదవ: వృషభములను చంపి కోసలరాజదుహిత నాగ్నజితిని పరిణయమై తనవారితో ద్వారక కేగు కృష్ణుని అంతకుమున్ను పణము నిర్వహించలేక ఓడిపోయిన రాజులు ఏకమయి ఈతడు క్షత్రియుడు కానివానికి కన్నెనిడెనని తిరస్కారభావమున కృష్ణు దారినడ్డగట్టి ఎదిరించిరి. ఈ వార్త చూచాయగా విని ధర్మరాజు పంప అర్జునుడు కృష్ణునికి చేయూతగా నిల్చి అరులను క్షణములో పరాజితులనుచేసి పాదాక్రాంతులుగా నొనరించెను. అనంతరము కృష్ణుడనుప అర్జునుడు వెనుదిరిగిపోయి తనవారిని చేరుకొనెను. కాంతతో తనవారితో కృష్ణుడు ద్వారక కేగెను.

పాండవ: చిత్రసేనుడు రారాజును కట్టికొనిపోవుచుండ కురుసైన్యమున కొందఱు సమీపమున పాండవులుండుట తెలిసినవారుగాన ధర్మరాజువద్దకుపోయి రారాజును విడిపించ ప్రార్థించిరి. వెంటనే భీమార్జునులనుపంపె చిత్రసేను విజితుని చేయించి ఒప్పించి అతనితో మైత్రి పాటించి ధర్మజుడు రారాజును విడిపించి నీతులుగఱపి పంపివైచెను.

రాఘవ: రాముడు వాలిని యుద్ధమున కాహ్వానించ సుగ్రీవుని ప్రోత్సహించును. సుగ్రీవుడు కిష్కింధ సమీపమున కేగి సింహనాదమొనరింప వాలి పురికెపిలివచ్చి బాహాబాహి యుద్ధమొనరించి సుగ్రీవుని చాల నొప్పించి తఱిమివైచెను. సమయము చిక్కక రాముడు అప్పటికి ఏమియును చేయలేదు.

వ. అవ్విధంబున మిత్రప్రియాత్మజ సోదర యుక్తిఁ దద్దుర్యోధన విముక్తిఁగూర్చి యా ధర్మప్రభునకు సమ్మదంబు మించ నిజస్థానంబు చేరె నంత.

యాదవ : అనంతరము కృష్ణుడు. (మిత్ర + ప్రియ + ఆత్మజ = మిత్ర వింద అను కన్య) మిత్రవిందను వివాహ మొనరించు కొనెను.

పాండవ : అర్జునుడు దుర్యోధనుని విడిపించి ధర్మజునకు సంతసము కూర్చెను.

రాఘవ : సుగ్రీవుడు వాలికోడితిరిగిరా రాముడాతని సాశ్వాసించి రెండవ మారు యుద్ధమునకు ఆహ్వానించుము. తప్పక వాలిని సంహరింతును అని ఊఱ డించెను.

మ. జయసేనోద్భవ భద్ర లక్షణతనుఀ జాయాగతి జ్జెంద దు
ర్జయమింకేమి దలంపనున్న దనుచున్ జర్చించి తత్ జ్ఞాతిని
ర్ణయవృత్తిఀ రిపు నాగరాజ హరికి న్కల్ మాని పోయె న్నిజా
లయ సీమావనిఃజేర లక్ష్మణ నృపు ల్తనున్ భజింపఀ వడిన్. 8

యాదవ : కృష్ణుడు అనంతరము భద్ర, లక్షణ అను కన్యలను వివాహ మాడెను. ఈ తీరున రుక్మిణి మొదలు అష్టభార్యలను చేకొనెను.

పాండవ : రారాజు సిగ్గుపడి ప్రాయోపవేశమొనరించ పాతాళవాసులు ఆతనిని కొనిపోయి ఆతని జన్మవృత్తాంతముతెల్పి హస్తిపురి చేర్చిరి. జయసేన. భద్ర లక్షణ = విజయలక్ష్మికి విశేషణములు. జయముకాంతువని ప్రోత్సహించిరి.

రాఘవ : అన్నదమ్ములు వాలిసుగ్రీవులకు ఇంచుకయు భేదములేకపోగా వారిని.గుర్తించు ఉపాయముపన్ని మరునాడు వాలిని ఆహ్వానించ నిశ్చయించి రాముడు ఋష్యమూకాద్రి సుగ్రీవాదులతో గడపెను.

సీ. ఘన పత్ర రథ వర గతిధృతి సింధు ప
తి హరిరాజిత సుబుద్ధి మితి మీఱి
చని హిత ద్రుపద రా జతనయ సత్యసం
గతిగాంచి నిర్భయ మతినిఁ జేర
వాఁడి చాపలతను వడి జేతఁ బట్టుక
ప్రదరయుక్తినిఁ గూర్చ గదిమిపోవ
నవ్వార్తవిని జేరి యమల భీమ విజయ
ధర్మరాజుల గతిఁ దగ నెఱింగి

తే. గీ. ప్రజల మురుగతి సహాకృతిఁ బ్రాప్తరాజ
నరక భేదన గర్జాప్తి భరము గెలువ
సత్యధర్మ యుద్ధకృతి దుస్సహముగాఁగ
వారలొండొరులొరసెట వీడ్వడక గడిసి. 9

యాదవ: నరకాసురుని దుష్టచేష్టలు ఋషులతో ఇంద్రుడు ద్వారకకేగి కృష్ణునకు నివేదించి ఆతనిబాధ తొలగించ ప్రార్థించును. సత్యభామ తనవెంటరా కృష్ణుడు నరకుని చంపనేగును-సత్యా + ధర్మ + కృతి = సత్యభామ యొనర్చిన విలుయుద్ధము.

పాండవ: సింధుపతి = సైంధవుడు. ఒంటిగానున్న ద్రౌపదిని బలిమికొని పోవ సైంధవు వెనుకరించిరి. (భీమార్జునులు ఆతనినికట్టి ద్రౌపదిని విడిపించుకొని ధర్మజుపాలికితెచ్చిరి. నిర్బంధముననున్న సైంధవుని విడిచిపుచ్చి బుద్ధులుచెప్పి ధర్మజుడు పంపివైచును-పర్యవసానమిది.)

రాఘ: సుగ్రీవుడు రామునిచే ప్రేరేపించబడి రెండవమారు వాలిని యుద్ధమునకు ఆహ్వానించును.

మత్తకోకిల

చేరి కమ్మరు వేగమెన్నఁగఁ జేరి సారబలోద్ధతిన్
ధీరధర్మజ శౌర్యవైఖరి దివ్యత ద్విజయోన్నతిఁ
మీఱి భీమరణోగ్రతఁ దను మెచ్చఁబో కెదురించి తత్
భూరి భూసుర తేజమెంచ న పూర్వయుద్ధము సేయగాన్. 10

యాదవ: కృష్ణునకు నరకాసురునితో పొసగినపోరు వర్ణితము.
పాండవ: సైంధవునితో భీమునకయిన పోరు వర్ణితము.
రాఘవ: వాలిసుగ్రీవుల సమరము వర్ణితము.

మత్తకోకిల

చంపజాలక నెంతలేదని । జాలుబాటుగ నుండినన్
పెంపునన్వడి మీఱిమైఁ జను దేరఁ జూచెద వింకనిన్
ద్రుంపకేనిక మానమానర । త్రుళ్లుమానుమటన్నకఁ
గెంపుమించఁగ నెంచకించుక కిన్కముక్కున నెక్కొనఁ. 11

యాదవ : నరకాసురుడు భూదేవికుమారుడు. వరహావతారమున జల మగ్నమయిన భూమిని లేవనెత్తి నపుడు ఆనాటిసంసర్గమున నరకుడుదయించెను- కనుక కృష్ణునకు కుమారుడు. త్రుళ్ళుమాని సుఖముగానుండుమని యుపదేశించ అతడు కోపించి రణమునకాయితమగును.

పాండవ : భీముడు సైంధవుని క్రిందవైచియు చంపలేకపోవును. వరుసకు సైంధవుడు బావమఱది. ధృతరాష్ట్రుని కూతురు దుస్సల పెనిమిటి సైంధవుడు. సైంధవుడు రణముపేడక పెనగును.

రాఘవ : వాలి సుగ్రీవునితో అనినమాటలు. జాలిగొని ఎన్నిమారులు చంపక ఓడిచినను మాటిమాటికి పోరికి పిలుతువని ఆక్షేపించును. సుగ్రీవుడు రణము విడువక పోరును.

మహాస్రగ్ధర

ఘనకోదండోగ్ర మౌర్వీక్వణన దళదిశా
ఖండ రోధోంతరాళో
జ్జని తోద్యద్ధ్వాన దీర్ణ శ్రవణ హృదయ వ
జ్జంతు నిశ్చేష్టతాతత్
పునరుజ్జ్వ్యత్ ప్రభావాంబుజజ మదన జి
త్పుండరీకాక్ష వీక్షా
జనక స్ఫారోగ్ర బాణాసమవహతి నణఁచెఁ
శాత్రవు న్వాలి వేగఁ. 12

యాదవ : వాలి అతిశయించి; కృష్ణపరమాత్మచేత నరకుడు సంహరింప బడును.

పాండవ : సైంధవుని గర్వమడచి విడిచిపుచ్చి ద్రౌపదినితోడ్కొని పాండవులు తమఆశ్రమము చేరుకొనిరి.

రాఘవ : రాముబాణముచే వాలి హతుడయ్యెను.

వ. అట్లు క్షితినిజాత్మజ వార్తయణంగ సారగతిని రిపుంగెలిచి తత్ గృహీత సుందర సుషమాయుత సుగుణ సహస్రగణ్యా రాజకన్యా పరిగ్రహప్రాప్తి కృతమహోత్సవంబమరఁ దన్నిజపతి స్థానంబు జెంది

మిత్రసూను దత్తస్వీత్రాభ్యుదయామోద కార్యకారణంబున వారు
రంజిల్ల రుచిర వనగత సమున్నతవాసంబున సుఖంబుండు నంత —

యాదవ : కృష్ణుడు నరకుని సంహరించి ఆతని నిర్బంధమునయున్న పదునారువేల రాజకన్యలను, తన్నే వలచినవారిని పరిగ్రహించి, సత్యభామతో ద్వారకప్రవేశించి సుఖముండెను. నరకుని బాధలకు తొలగి దేవతలు ఋషులు సంతసించిరి.

పాండవ : కామ్యకవనమున పాండవులు దుష్టసంహారమొనరించుచు, కంటకములకు తొలగి విఘ్నములు లేక నివసించుచుండిరి.

రాఘవ : వాలినిసంహారించి రాజ్యముతోపాటు తారను సుగ్రీవునికిచ్చి ఋష్యమూకముననే రామలక్ష్మణులు కాలముగడపుచుండిరి.

తే. గీ. ధరణిభాస్వత్తనూజ జాత ప్రమోద
దత్తకవచ కుండలవ్యాతి దగ నిజ ప్రి
యాత్మ జాతేష్ట సంప్రాప్తి నమరసాల
వరవిహారియై యటు బిల్చె సురవిభుండు. 13

యాదవ : నరకాసురుడు అదితికుండలములు హరించికొనిపోయెను. భూదేవి దేవతాసంబంధమయిన ఉత్తమవస్తువులు కృష్ణునకిచ్చి సంతసపెట్ట కృష్ణుడు నరకునికుమారుడు భగదత్తునకు రాజ్యమిచ్చి వెడలిపోయెను. అదితిదేవిని సందర్శించి ఆమెకుండలములు ఆమెకిచ్చి ఆనందపఱచెను.

పాండవ : ఇంద్రుడు తన కొడుకు విజయు జయముకాంక్షించి బ్రాహ్మణవేషధారియై కర్ణునియాచించి ఆతనికవచకుండలములుగ్రహించి ఏకవీరునిచంపే ఒక శక్తిని ఆతనికిచ్చి అరణ్యావాసక్లేశమునయున్న పాండవులకడకేగి భావివిజయమువారికితెల్పి దివ్యాస్త్రసంపాదనమునకై ఒక ఏడాది తనఅర్ధాసనము నలంకరించ కొడుకు అర్జునుని ధర్మజుననుమతివడసి స్వర్గమునకు పిలుచుకొనిపోయెను.

రాఘవ : వాలి రాముచే హతుడయి స్వర్గసుఖములందెను.

వ. అంత — అనంతరము.

సీ. దీప్తారి పుండ్ర భూ తిమఁ దరణితనుత
రమఁ గైకొనుచు శంబ ర పరతనుఁడు
రహి లక్ష్మణుఁడు ధర్మ ! రాజిత మహిముండు
వనచర వరయుక్తి వాస మంద
భయనిర్గతజ్వలత్ ప్రవరు బురస్థితుల్
మొఱయిడ నాలించి హరి పరాక్ర
మాప్తి ధర్మప్రభు డనుపఁగాఁ దత్కృతి
శరగతి సూనూక్తి మఱగిపోవ

తే. గీ. స్వప్రియోచిత తారాభి భాషణములఁ
జేరి తత్కృతప్రశ్నోత్త రా రచనల
శమన జనకత విదిత నిస్తార వృత్తి
సారమాఖ్యా సమావాప్తిఁ జారుగతుల. 14

యాదవ: పుండ్రభూతి = పౌండ్రకవాసుదేవుడు. మద + రణిత = మదించి తనకన్న వాసుదేవుడింకొక డుండరాదని కారులఱచి దూతను కృష్ణు పాలికి పంపును - వాసుదేవాది చిహ్నములు తీసి వేయుమని సందేశము - కృష్ణుడు కోపించి యాదవసైన్యముతో కాశీపురి ముట్టడించి తన్నెదిరించిన పౌండ్రకు శిరము ఖండించి నగరిద్వార భూమిపడవైచి ద్వారకకు మరలిపోయిన వృత్త మిందు సూచితము.

పాండవ: యమాకృతిగొని ధర్ముడు ధర్మరాజును పరిశీలించుకత. కొల నుకుపోయి యముని నిరాకరించి నీరాని నలువురు భీమాదులు మృతులవలె పడి పోవుదురు. తుదకు ధర్మరాజేగి యమునివాక్యము ఆదరించి అతని ప్రశ్నలకు సమాధానమిచ్చి తమ్ములను బ్రదికించుకొనును. యముడు -ధర్ముడు - సంతసించి అజ్ఞాతవాససమయ మాసన్నమయినది. నాటికి మీమీ తలంపులకు తగిన వేషము- పరికరములు తలంపున సిద్ధమగునని వరమిచ్చి అంతర్హితుండగును.

రాఘవ: వర్ష ఋతువు గడచినను సుగ్రీవుడు సీతను వెదకించు ప్రయ త్నమున లేడనికోపించి రాముడు లక్ష్మణుని కిష్కింధకు పంపును. ద్వారపాలకు లావార్త తారకందించిన ఆమె ప్రియవచనములుపల్కి తనభర్త రాముకార్యము

మరువలేము. తక్షణమే అందుకై యత్నించునని శాంతిపఱచి లక్ష్మణుని పంపి వేయును. లక్ష్మణుని వెంట సుగ్రీవుడు రామదర్శనమున కేగును.

క. జని లక్ష్మణ సూనుయుతఁ
గని తద్గురు నగ్రజన్ము గౌతూహాలియై
వినయాభి వాద పూర్వక
మనువుగ వృత్తాంతమెల్ల నతనికి దెలిపెన్. 15

యాదవ : పౌండ్రకుని కుమారుడు సుదక్షిణుడు. పురోహితుని సహాయమున తండ్రికి ఉత్తర క్రియలు నిర్వర్తించి కృష్ణునికి ప్రతీకారముచేయు తలంపున శివునిగూర్చి తపముచేసి ఆతని ప్రసాదమున ఒక కృత్యను (ఘోరరూపి) సంపాదించి దానిని కృష్ణునిపై ప్రయోగించెను. అది జ్వాలలు కక్కుచు యదు పురి జనముపైబడి హింసించనేగెను.

పాండవ : పాండవులు ద్రౌపదీసహితులై ఆశ్రమమునకేగి పురోహితుడైన ధౌమ్యునికి జరిగిన వృత్తాంతముతెల్పి శాంతముగ నుండిరి.

రాఘవ : సుగ్రీవుడు లక్ష్మణుని వెనువెంటనేగి రామునకు నమస్కరించి తాను సీతాన్వేషణతత్పరత చేయబోవు ప్రయత్నములు వివరించి రామలక్ష్మణులను సంతసపెట్టి తన పురికేగెను.

తే. గీ. తత్సుమిత్రాత్మజుండు సుదక్షిణుండు
మారణ మొనర్పఁ దత్కృత్య మహిమనణఁచి
తత్పురిని వెలిగించ సు దర్శనుండు
భూసురేంద్ర జగద్గురు శాసనమున. 16

యాదవ : మారణహోమముచేసి సుదక్షిణుడు కృష్ణుని లక్షించి కృత్యను ప్రయోగించ కృష్ణుడు తనవారిని కాపాడి పరుకార్యము ధ్వంసముచేయ చక్రమును ప్రయోగించెను. హరిచేతి చక్రము స్మరణమాత్రమున కృత్యను హతమార్చి పురమును పురజనులను మంటగలిపెను.

పాండవ : పాండవులు గురుని ధౌమ్యుని ఆతని తావునకు పంపివైచి అజ్ఞాతవాసము నిర్వహించి తాము బయల్పడినపుడు పునర్దర్శనమగుగాక యని వేడి ఆతడు వెడలిపోగా ముందు యత్నమున నుండిరి.

రాఘవ : సుగ్రీవాజ్ఞ అందుము. అంగద హనుమదాదులు ఋక్ష, వానర వీరులు సైన్యములు సర్వులు కిష్కింధకు రావలయునని ఆజ్ఞ అందించిరి.

వ. ఆ సుభాషణంబుల సంతోషం బమరనుండి, యనంతరంబున హరి విభుండు మంత్రాలోచన పూర్వకంబుగ నిజానుచరుల ఘనపత్ర రక్ష వరగతులః దత్తదంచిత స్థానంబున కనిచినఁ దదాజ్ఞ శిరసావహించి రనంతరంబున —

యాదవ : కృత్య ఆగడములణచి కృష్ణుకు తమవారిని వారివారి స్థానముల సుఖ శాంతులతోనుండ నాజ్ఞయిడెను. వా రావిధము ననుసరించిరి.

పాండవ : హరి విభుండు = ధర్మరాజు తమ్ములయు ద్రౌపదియు చిత్త వృత్తులు తెలిసికొని ఉచిత వేషభాషలు సంతరించుకొని అజ్ఞాతవాసము విరటు నగరున గడుప ఆలోచన పూర్వకముగ నిర్ణయించుకొని పయనమయిరి.

రాఘవ : ఋక్ష వానర సైన్యములను తక్షణమే కిష్కింధకు రా నాజ్ఞాపించి హనుమదాదులతో చేయవలసిన కార్యవిధానము ఆలోచించుచు సుగ్రీవుడుండెను. హరివిభుండు = సుగ్రీవుడు, వానరరాజు (హరి = కోతి, విష్ణువు. రాజు)

మ. హరిమూర్తుల్ శతకోటికోట్యమితనా గాధిక్యబాహాబలా
భరణుల్ కామగులచ్యుతామరవర ప్రాంశోజ్వల ద్దివ్యసుం
దరకాంతా ప్రభవుల్ నవాతను ముఖ్యుల్ తద్భీమభీభత్సుఖా
సురతాభిఖ్యులు పుట్టినట్లు నెదుటఁ శోభిల్లిరత్యున్నతిఁ. 17

యాదవ : యాదవులెల్లరును పైన వర్ణించిన విధమున దివ్యాంశ సంభవులు, మహాబలులు, సుందరులు, తేజోమూర్తులు, వారలెల్లరు కొలువ ఒకనాడు రామకృష్ణులు మధురానగరమున కొలువుండిరి.

పాండవ : ధర్మువు వరప్రసాదమున ఉచితవేషధారులయి, ప్రకాశించుచు విరటునగరు గూర్చి పోసాగిరి. (ఆ వరప్రసాదముననే వారు పాండవులని ఎవ్వరును గుర్తించలేకపోయిరి.)

రాఘవ : ఋక్షవానరవీర ముఖ్యులెల్లరు తమ ఉనికిపట్టులయిన గుహలు గిరులు నదీనదతీరప్రదేశములు వీడి ఆకాశగమనమున క్షణములో నేలయీనినట్లు

కిష్కింధకుబోయి కోటానుకోట్లు రాజును దర్శించి అతని ఆజ్ఞవిని తక్షణమే నల్ నాలుగు దిక్కులకు పిలకలుగా విడిపోయి సీతాన్వేషణ తత్పరులయిరి.

తే. గీ. ధరణివర తనూజాలోక సరణిబుద్ధి
నరయుమని పల్క ననుజను లరసి యొండు
గానకను దక్షిణోజ్జ్వల గతినిబోవ
మత్స్యనేత్రాద్భృతిగన త న్మహిని వెలుప. 18

యాదవ : కొలువుతీర్చియున్న కృష్ణుని యొద్దకు బ్రాహ్మణు డొకడు వచ్చి ఉచిత సత్కృతులందె అడుగబడి తన వచ్చిన కార్యము రుక్మిణి సందేశము విన్పించి వల్లె యనిపించుకొని మరునాడు పయనించ నిశ్చయించెను. బ్రాహ్మణుని వెంటగొనుచునే కృష్ణుడు దివ్యరథారూఢుడై కుండినపురమునకు బయలుదేరను.

పాండవ : తమ నిర్ణయము ననుసరించి (మత్స్యనేత్రాద్భృతి = విరటు నగరము - మత్స్యదేశమున కలదు) విరటునగరు సమీపించిరి.

రాఘవ : ధరణి + వర + తనూజ = సీత - ఋక్షవానర సైన్యములు ప్రాక్పశ్చిమోత్తర దిశలకేగినవారు సీతను కానరైరి. వారు తిరిగి నిర్ణీత ప్రదేశమునకు వచ్చి సర్వులు ఏకమై దక్షిణదిశగా తమ అన్వేషణము ఆరంభించిరి.

మ. అతను ప్రోజ్వలమూర్తి పావని మహో హాంభావభావాప్తి యు
ద్ధతితో నాగ మహోగ్రయాయి జలధి ద్వ్యాశాలిలో జొచ్చి రు
ణ్మతి భూభృత్తతిఁ గూల భీష్మతనయా త్మప్రోద్భవన్గాంచఁ ద
ద్గతిరాకుండ స్వయంప్రభాత్మ గురువాక్య శ్రీజనన్ మేలుగాన్. 19

యాదవ : అచిరమున కుండినసగరము బ్రాహ్మణునితో కృష్ణుడు సమీపించి రుక్మిణిని చూచు కాంక్షమీర ఉత్సాహియై యుండెను.

పాండవ : ధర్మరాజు భీముడు (పావని-కొమరు ఆతనికి విశేషణములు) పరుని కొలువెట్లు చేయునా అని సంశయించుచు విఘ్నములు రాకుండ ఆతని నొక కంటకని పెట్టి ధర్మువును మనసా ధ్యానించును. క్రమముగా ద్రౌపదీ సహితు లయి పాండవులు విరటునగరు సమీపింతురు.

రాఘవ : కపులు దక్షిణమున కేగువారు వింధ్యాద్రి గుహచొచ్చి స్వయం ప్రభ ఉపదేశము కాంచి దక్షిణ సముద్రతీరము చేరిరి. (స్వయంప్రభ కపులకు

ఆతిథ్యమిచ్చి పంపును. ఆమె యోగిని. రాముని కుపకారముగా కపులకు దారి చూపును.)

క. చనిచని యలసిన వేసరి
ఘనవర శంపాతి శకున కలితోక్తుల నె
మ్మనములలరఁ జని గుమికొని
వనరాశింగాంచి యవల వసియించిరటన్. 20

యాదవ : కృష్ణుని వెనువెంట నేగిన బలరామాది యాదవ వీరవర్గము శంఖధ్వానము విని కృష్ణుడు నగరు చొచ్చెనని సంతసించి. (శం + పా = శంఖధ్వని మంగళ వాయిద్యములు) కుండిన నగరమున కనతిదూరముననున్న (వన + రాశి = వృక్షసముదాయము, అరణ్యము) పురబాహ్యోద్యానమున విడిసి యుండిరి.

పాండవ : విరటు నగరము గూర్చియేగు పాండవులు శుభశకునములు గని అలరి పయనము సాగించిరి.

రాఘవ : శంపాతి = జటాయువు సోదరుడు సంపాతి. ఆతని వలన రావణుడు సీతను హరించికొనిపోయి లంకలో దాచెనని తెలిసికొని వానరులు కార్యసాదన ఎట్లని ఆలోచనలో మునిగిరి

క. వనిలోని ఖరాయుధ గో
పన మమరగను వనరాశి వడిదాఁటుచుఁ బా
వని ముఖ్యాయుక్తిఁ జేరెను
నెనరెన్నఁగ నతఁడు మత్స్య నేత్రాయనుచున్. 21

యాదవ : వచ్చిన తనవారిని రహస్యముగ ఆ ఉద్యానవనముననే యుండ నియమించి, తన ప్రభావము దివ్యఆయుధములు ప్రకటించక రుక్మిణినే తలంచుచు (మత్స్యనేత్ర), ముఖ్యాయుక్తి = సందేశము తెచ్చిన బ్రాహ్మణునితో నగరు ప్రవేశించెను; పావని = దివ్యుడు–పూతచరితుడు.

పాండవ : పాండవులు విరటునగరబాహ్య అరణ్యప్రదేశమున ఒక జమ్మి వృక్షమందు - ఖరాయుధగోపనము = తమ ఆయుధములు - దివ్యములు - దాచి యుంచి; నగరు ప్రవేశించిరి.

రాఘవ : పావని = వాయుతనయుడు ఆంజనేయులు-సీతను స్మరించుచు తాను తిరిగివచ్చు వఱకు అందరిని సముద్రతీరముననే కాచియుండమనెడి రామనామస్మరణ చేయుచు వాయువేగమున సముద్రమధిగమించి లంకచేర నేగెను.

వ. అట్లు లంకాద్వీపంబునం జన నప్పురంబుఁ జేరి ప్రమదజనకుండిన ప్రభుండును, భీష్మాభిఖ్యుండు నగు నమ్మహారాజు ముద్రికా నిహితాజ్ఞఁ గైకొని నిర్భీతిగ లంక నణఁచి ప్రవేశించి –

యాదవ : నగరు ప్రవేశించుట కాటంకము లేకుండ రుక్మిణి పంపిన రాజ ముద్రికా పత్రముచూపిన బ్రాహ్మణునితో కృష్ణుడు కుండినపుర ప్రవేశ మొనరించెను. (కలంక + నణంచి = శంక లేక: నిర్భీతి = భయము ఇంచుకయులేక - ఒరులవలనను నగర రక్షకులవలనను అనుట.) —కుండిన ప్రభుడు = భీష్మకుడు.

పాండవ : ప్రమద + జనకుండు + ఇన ప్రభుడు = విరటరాజు; అతని సభ ప్రవేశించుటకు - దర్శనమునకు అనుమతిపడసి పాండవు లొక్కొక్కరుగా అతని దర్శనము చేయుదురు.

రాఘవ : లంకన్ + అణచి = లంకిణిని (లంకాపురి దేవతను పురశక్తి) నిర్జించి; హనుమ (ప్రమద ..... ...కైకొని = రామునకు విశేషణములు, రాము డిచ్చిన ముద్రికను భద్రపఱచుకొని; శంకలేక లంక ప్రవేశించెను.

సీ. సరసగోష్ఠి జ్యోతి పరతంత్ర నయశాస్త్ర
హితసత్ప్రసంగ సంగతుల నిలచి
వారివర శార్దూల వరమల్ల యుద్ధ ప
ద్రసపాచకోద్యోగ రాజి నిలచి
రాజకన్యాభ్యస్త రసల సత్సంగీత
నటనాధి నయ కార్య ఘటన నిలచి
చారులక్షణ దివ్య జాత్యశ్వశిక్షా ప
రిక్షాధికార సువృత్తి నిలచి

తే. గీ. రమ్యసుందర వర్ణాభిరామ సాధు
విమల నయధేను పోషణ విధుల నిలచి
వరుసఁ గాంచుచు నరయుచు బంచ జనుల
నచట మహిమను దెలియలే నట్టులుండ. 22

యాదవ : కుండినపురము స్వయంవరమునకై అలంకృతమయి వినోదార్థము వివిధములైన వేడుకలు శాస్త్రార్థములు మల్లయుద్ధము కత్యాదులు ప్రవర్తితములయినవి. వానిని తిలకించుచు కృష్ణుడు నగరవీధుల పర్యటించుచు కాలము గడపెను.

పాండవ : విరటు కొల్వుఁజేరిన పంచపాండవులు వారే యేకార్యములు నిర్వర్తింప అంగీకరించిరో ఈ పద్యమున వర్ణితము. ఆవివరము సువిదితము - సులభము.

రాఘవ : లంక ప్రవేశించిన హనుమంతుడు సీతాన్వేషణ తత్పరుడయి సంచరించువాడు ఆ యావినోదకార్యములు చూచి చూడనట్లు గమనించుచు రావణాంతఃపుర ప్రదేశములు పరికీలించుచుండెను.

తే. గీ. రాజగృహమాది యావక ణాజిరములు
దాఁటి ప్రమద జనక రాజ తనయ కృష్ణ
మృగవిలోచన తత్కాంత మృదులసూక్తిఁ
గాంచ నచట వసించి హర్షించె మదిని. 23

యాదవ : ప్రమదజనకి = ఆనందమునుకూర్చునది; రాజతనయ = రుక్మిణి; కృష్ణమృగవిలోచన = నల్లలేడి కనులవంటి కనులుగలది; విరాజంకముగ కృష్ణుడు రాజనగరుఁజొచ్చి రుక్మిణి మధుర వాగ్విలాసములు వినుచు ఆనందించుచుండెను.

పాండవ : వెనుకటి పద్యమున పంచపాండవులు విరటుకొలువున కుదిరి నట్లే ఇట కృష్ణ = ద్రౌపది (ద్రుపదరాజు తనయ) విరటు భార్య సుధేష్ణచే ఆహూతురాలై ఆమెవద్ద సైరంధ్రీ కార్యమున నిలచెను.

రాఘవ : హనుమ ఆ రేయి తిరుగాడుచు క్రమముగా అశోకవనము ప్రవేశించి అట రాక్షసీ గణపరివృతయయిన, జనకరాజతనయ సీతను చూచి ఆమెకు గాని ఆ రాక్షస స్త్రీలకుగాని కన్పించక వృక్షమున సూక్ష్మరూపియై యుండి ఆ సీతతో ప్రసంగించు సమయమునకై నిరీక్షించెను.

వ. అప్పుడు - ఆ సమయమున.

మ. అనిరుద్ధుం డతినీతి సింహబలుడు ద్యద్వైరి వ్యాద్రావణుం
డనవద్యాకృతిఁ దన్నృపాల సతిమా న్యగ్గాంచఁగా బోయి సీ
తను జూచెఁ శుభమూర్తి రామకులకాం తన్నాథ చింతాకులా
నన వైవర్ణ్యయుతన్ వలచ్చెఁదనూ న్ప్రేమ వీక్షోన్నతిన్. 24

యాదవ : అ + నిరుద్ధుండు = ఎదిరిలేనివాడు; అతి + నీతి = గొప్పను నీతిలో; సింహబలుడు + సింహపరాక్రముడు; ఉద్యత్ ........ రావణుండు = శత్రువులకు రావణునివంటివాడు–అజేయుడనుట; ఇత్యాదులు కృష్ణునకువిశేషణములు; కొదువ కాంతావిశేణములు రుక్మిణికి చెల్లును, సీత = సీతవంటి పతివ్రత; ఆ రుక్మిణిని తన్నే ధ్యానించుదానిని చూచెను.

పాండవ : సైరంధ్రియై పనులొనర్చు ద్రౌపదిని సింహబలుడు = కీచకుడు చూచి ప్రేమించెను. కొదువ విశేషణములు కీచకునకును, ద్రౌపదికిని సందర్భానుసారము చెల్లును;

రాఘవ : హనుమ సూక్ష్మరూపియై సమయము నిరీక్షించుచు అశోక వృక్షముపై కొమ్మలపై నుండగా, రావణుండు కాంతాసహితుడై ఆడంబరముగ సీతను చూడవచ్చెను. రామునే ధ్యానించుచు ఆహార నిద్రలుమాని వివర్ణయై యున్న సీతను పల్కరించవచ్చెను - ప్రియాలాపములాడును.

క. కని మోహాకరమతి లో
ననె మీటినయట్టి వాక్య నయగతిఁ జూపక
గొన కొనమె ఘనశిలీ ముఖ
వినిహతిఁ దనమేనునుదిత వృత్తిఁ దెలియకన్. 25

యాదవ : ఇటనుండి అసభ్యవర్తనకు రావణుని శిశుపాలుని లక్షింపవలెను- సభ్యవర్తనకు కృష్ణుని లక్షించవలెను. దుర్గగుడికేగి తిరిగివచ్చునపుడే తన్ను పరిగ్రహించునట్లుపాయము కృష్ణునకు రుక్మిణి తెలియజేయును. రుక్మి (రుక్మిణి అన్న) చెలియలిని తన కిత్తునని (శిశుపాలునకు) అనుటచే జరాసంధాది

మిత్రులతో ఆతడు వచ్చి రుక్మిణీ సౌందర్యమున కన్నెళ్లాడుచు విహరించుచుండెను. ఆతని ప్రవర్తన అసభ్యము – కృష్ణుని చర్య నీతియుతము.

పాండవ : సింహబలుడు ఒడలు తెలియని వికారములకులోనయి ద్రౌపది సమీపమున వర్తించుచు ప్రేమ వెలిబుచ్చును.

రాఘవ : రావణుడు తన్ను చేపట్టుమని సీతను ప్రార్థించుచు ఒడలుమఱచి ఏదేదో ప్రసంగించును.

చ. అలకుల బాలికా తిలక నాన్నృపకన్యకనాథ సన్నిధిన్
జలనమడంగఁ గ్రొంజెమట చాలఁగఁ దోచఁ దిరస్కరించి త
త్కులపతి బాహువీర్యము న కుంఠిత శౌర్యము పాడిసెన్నుచో
వలపునఁ బై కొనన్బలిమిఁ బట్టఁగఁ జేష్టలు బుట్టె గట్టిగన్. 26

యాదవ : సుగమము; కందనుచిత తలంపులు శిశుపాలునిపట్లను, ఔచిత్యమగునవి కృష్ణుని పరముగను ఎంచవలెను. రుక్మిణి మర్గగుడి కేగునపు కృష్ణుని చూచెను. క్రొంజెమటలిత్యాది సాత్త్వికభావము లామెకుదయించెను. కృష్ణునకును అట్లే. కాని శిశుపాలాది రాజవర్గమునకు నవి తిరస్కృతములు కావలెను.

పాండవ : సింహబలుని తలంపులు ద్రౌపదిని కాంచుచున్నపుడు తిరస్కృతములు.

రాఘవ : రావణుడు తన్ను తృణీకరించిన సీతకు రోషించి అనుచితములగు తలపోతలకు మనసున తావిడును.

క. కలరే గురు గంధర్వులు
కులవరులు మహానుభావ కోవిదు లెవ్వా
రలు వినుతాతను విభ వో
జ్జ్వలతత్సుమనోభిరామ సంఖ్యాస్పదమై. 27

యాదవ : రుక్మిణి సౌందర్యమునకు సాటి నరసుర గంధర్వులలో నేవారును లేరు.

పాండవ : కీచకునికి కోపించి ద్రౌపది తనకు ఏవురు గంధర్వులు బలియులు పతులున్నారని, తన జోలికి రావలదని జంకించును.

రాఘవ : సీత తన పాతివ్రత్యమే తనకు రక్ష యనుచు రావణుని తృణీకరించి పోమ్మనును.

వ. ఆ విధంబు వితర్కించి —

యాదవ : కృష్ణుడును శిశుపాలుడును తమ మనోవృత్తి కనుకూలమగు తలపుల నల్లుకొనిరి.

పాండవ : కీచకుడు ఆలోచించి ప్రతివచన మిచ్చును. (ముందున కన్వయము).

రాఘవ : రావణుడును కొంతవితర్కించి సీతకు సమాధానమిచ్చును.

క. తెలియం బలికితి నా యు
జ్వల బాహాబలము నా ప్రభావము నా ని
ర్మల సౌంద్యము నేరికిఁ
గలదే సురవరులు నెదురు గలరే మహిమన్. 28

యాదవ : విశేషణములు నాయకపరము = కృష్ణపరముగ నవి సత్య విలసితములు, శిశుపాల పరముగ సత్యదూరములు.

పాండవ : సింహబలుడు ద్రౌపదితో ననిన విధము.

రాఘవ : రావణుడు సీతతో పల్కిన పలుకుల తీరు.

వ. మఱియు నతండు

ముప్పురు నాయకులు (కృష్ణుడిందు తలపింపడు)
శిశుపాలుడు, కీచకుడు, రావణుడును.

క. పలువలుగల మదన సుమశర
కలిత వికారములు మిగుల గనుపింపఁగ ను
త్తలపడ నవనిజ చాతురి
నలుక గడలుకొనఁగ బలుక నవలన్ జనియెన్. 29

యాదవ : సమీపమున చరించుచు నసభ్యముగ వర్తించు శిశుపాలునకు రుక్మిణి చెలులు కోపించ నతడు దూరముగ వెడలిపోయెను.

పాండవ: ద్రౌపది కోపించి తిరస్కరించ అప్పటికామెను విడచి కీచకుడు తన మందిరమున కేగెను.

రాఘవ: తృణము ముందుకువైచి తిరస్కారముగ నిందించ నించుక జంకి రావణుడు దూరమున కేగి ఆలోచనా మగ్నుండయ్యెను.

క. అక్కట జముకై వడి గురు
డొక్కట శరనిహతి నొంచ నొగిఁ బ్రోవుమనన్
మక్కువ దైవమ నీ వని
మ్రొక్కవెఱనొనర్చెఁ జెలువ మునుకొని దెలుపన్. 30

యాదవ: రుక్మిణి సఖీముఖమున అన్న రుక్మి ప్రతిబంధకము తెలిపి భీతిల భయపడవలదని కృష్ణుడు ఊరటలు ఆ సఖీముఖముననే తెల్పెను.

పాండవ: ద్రౌపది తన భంగపాటు రహస్యమున భీమసేనునికి తెలుప ఉపాయముపదేశించి భయముతీర్చి ద్రౌపదిని పంపివైచెను.

రావణ: దూరమున యమునివలె నిలచి ఆలోచనలో నున్న రావణుని గని సీత దైవమునే రామునే మనసా శరణువేడెను.

క. చీర నవనిజ విభాసుర
మారుత సాయకహతిఁ దునుమనురాగాద
న్నారీమణి తగనడ్డము
బోరున జనుదెంచి కాచె బుద్ధిబలాప్తిన్. 31

యాదవ: రుక్మి వచ్చి రుక్మిణిని అలంకృతనుచేసి అవసరకార్యములు నిర్వర్తింపచేయ సఖుల నాజ్ఞాపించ ఆతని మాట వినుచునే రుక్మిణి మూర్ఛపోయెను. కృష్ణుడొసంగిన అభయము తెల్పి సఖులామెను సేదదేర్చిరి.

పాండవ: ఒకనాడు వెన్నంటి వచ్చు కీచకునికి భయపడి ద్రౌపది పరిగెడుచుండ నగరున సఖీజన మడ్డురా నాతడు వెనుదిరిగెను. అప్పటికి తప్పించుకొని ద్రౌపది నగరు చేరుకొనెను.

రాఘవ: రావణుడు సీత తిరస్కారమునకు కోపించి చంద్రహాస మెత్తి

ఆమెను ఖండింపఁబోవ మండోదరి అతని కడ్డము నిలిచి పొదివికొని నగరునకు గొనిపోయెను.

వ. అంత సద్బుద్ధి ఋతుకాల సముచిత కృతులకు శుభవర సత్కర సంగతి కొడంబడక సద్భుని యుక్తి నయిత అసమాన యత్నంబునం దొలంగియుండ నచటి నా రాజతనయా పాణిగ్రహణాప్తి నతఁడు తన వీడుపట్టులం జేరియుండు నవసరంబున —

యాదవ : స్వయంవరమునకు వచ్చిన రాజలోకము వారివారి విడుదలలో నుండిరి.

పాండవ : ఎప్పటికైనను ద్రౌపది తనదియని సుఖస్వప్నములు కనుచు కీచకుడు తన నగరులో నుండెను.

రాఘవ : మండోదరిచే అట్లు నివారితుడయి రావణుండు రాక్షస స్త్రీ జనముతో సీతను తనవైపు త్రిప్పు నుపాయములుచేయ నాజ్ఞాపించి ఒక మాసము గడువిచ్చి అంతఃపురమునకు కాంతాజనముతో మరలిపోయెను.

సీ. సూపకార కృతియై సొంపొంది తన్మిత్ర
వృత్తిఁ దనరిన మరుత్తనయుఁ డో
కఁడు నున్నతజ్ఞతఁ గని తత్సమీపంబు
రుక్మిరాజ తనయ రుచిరగతిని
జేరి తత్సన్నిధి సార సద్భయభక్తి
వినయావనతిఁ జేసి వేడ్కఁ దొలుక
దనపూర్వ వృత్తాంత మొనరఁగా దెల్పుచు
ముందఱ జేసిన మొఱకుతనము

తే. గీ. పరిభవం బెల్లఁ దీర్చును సరసయుక్తి
మెచ్చ బలిమియుం గరము న మ్మికనొసంగఁ
గైకొనుచు రాజసుత నుత । కౌతుకమున
జూదమునఁ జనవెఱతునె చూడుమేను. 32

యాదవ : సందేశము అందజేసిన బ్రాహ్మణుడు రుక్మిణిని సమీపించి కృష్ణుడు తప్పక రాజలోకమును తిరస్కరించి ఆమెకరము కైకొనునని యుత్సాహము కూర్చెను.

బలిమియుక్ + కరమునమ్మిక = ఆతని పౌరుషమును విశ్వసించుమని రుక్మిణికి తెల్పును. స + ఉప + కార + వృత్తి = సూపకారవృత్తి = సందేశముకొని పోయి మేలొనరించినవాడు; మిత్రుడు, బ్రాహ్మణుడు (మరుత్తనయుడు = మరుత్తులు దేవతలు భూసురులు.

పాండవ : సూపకారవృత్తి = వంటలవాడుగానున్న భీముడు; ఆతని యుపదేశము అర్ధరాత్రి నాట్యశాలకు ఒంటరిగా రమ్మని కీచకునితో ద్రౌపది తెల్పును. ఆతడు సంతసించి ఆ సాంకేతిక మంగీకరించెను. ఆతనిని అంతమొందించే ప్రయత్నము ద్రౌపదియు భీముడును ఆలోచించుకొనిరి.

రాఘవ : స + ఉపకారవృత్తి = రాముని కుపకారము చేయుకార్యము కైకొన్నవాడు మిత్రుడు; మరుత్తనయుడు = వాయుపుత్రుడు; హనుమంతుడు; ఏకాంతముగనున్న సీతను రాత్రి సమీపించును. రాక్షసస్త్రీలు నిదురనుండిరి. రామముద్రిక (ఉంగరము) దానిని చూపి విశ్వాసము పుట్టబల్కును, వియోగమందలి రాముని మనస్తత్వము వర్ణించును. సీత ఆనందపరవశురాలాయెను. కాని కొంత సంశయించ తన దివ్యరూపు చూపించి నమ్మబల్కును. చూడు + మేను = పర్వతమువలె దేహము పెంచి చూపును.

వ. అనుచున్న పలుకు విని —

యాదవ : బ్రాహ్మణుని వాక్యము లాలించి రుక్మిణి ఊఅట వహించెను.

పాండవ : సంకేత ప్రకారము కీచకుడు రేయి నాట్యశాలకు పయనమయ్యెను.

రాఘవ : సీత హనుమ పలుకులు విని ఆనందించి ఇంకను ఆతనిని పరీక్షింప నెంచును.

ఉ. కౌతుక మాత్మనేర్పడఁ ద గన్గనకీశ మహాబలాప్తి వి
ఖ్యాత చరిత్రు సింహబలు గన్గొని యీవిధమెల్లఁదెల్పి సం
ప్రీతిగ రాముని నీకడకుఁ వేగమె దెత్తునటంచు దత్సమా
హూతి సుదృక్ఛిరోమణి ద దుక్తిని గైకొని పోయి యచ్చటన్. 33

యాదవ : రుక్మిణి సత్పాహపజని బ్రాహ్మణుడు ఇంటికిపోక (చనక) కృష్ణుని కలిసికొని; (ఈశ.........బలు = కృష్ణునకు విశేషణములు) ; రాజమార్గమున నొక ప్రదేశము నిర్దేశించి చూపి దుర్గాలయమున పూజాదికము పూర్తిచేసి అచటికి సఖులతో రుక్మిణిని తెత్తుననియు నట నిలిచి ఆమెను హరించికొని పొమ్మని యుపాయముతెల్పి యేగును; (సుదృక్ + శిరోమణి = దివ్యుడు, దేవతల కధీశ్వరుడు; కృష్ణుడు.)

పాండవ : ద్రౌపదితో కలయికనే ఊహించుకొనుచు కీచకుడు రేయి నాట్యశాల చేరబోవును.

రాఘవ : సీత వచ్చిన కపిరూప హనుమ మహిమాన్వితుడని గ్రహించి తన శిరోరత్నమును రామున కిమ్మని హనుమంతున కిచ్చెను. ఇంతలో రాముని దెత్తు ధైర్యమున నుండుమని సీతకుతెల్పి హనుమంతుడు కొంత ఆవలకేగి ఆలోచనలో పడెను. ముందేమి చేయవలెననుకొనుచు ధ్యానించును. తన రాక రావణునకు తెలిపి రాముబలము సహాయసంపత్తి చవిచూప నెంచును.

చ. అలయక నెవ్వరుం దెలియనట్టులు జూదమువన్ని యుక్తుల
న్మెలపుననాడఁ గావలయు మెచ్చులఁ గేళినిదేలఁ గావలెన్
వలనుగనంటి యుక్తమె య వార్యమహాబల రూఢిశత్రుల
న్గెలువక నూరకే తనదు నేర్పున సౌఖ్యముఁ జెంద నొప్పదే. 34

యాదవ : కృష్ణుడు తానొనరించు కార్యము నిశ్చయించుకొని పురోహితుడు చూపిన తావున రథస్థుడై నిలచియుండెను.

పాండవ : అర్ధమ రేయి యుక్తిగ ప్రియురాలితో సుఖముగ కేళినలుప సమకూడెనని ఆనందించుచు రాజమందిరము ప్రవేశించి నాట్యశాల చేరబోయెను.

రాఘవ : రావణునకు ప్రియమైన అశోకవనము ధ్వంసముచేసి తన లావు చూపిపోవ హనుమంతుడు నిశ్చయించుకొనెను.

వ. అను విధంబు వితర్కించి యాత్మనిశ్చయించి విజితారి సింహాబలుండు
మహోత్సాహమున —

యాదవ : విజిత........బలుడు = అరెని జయించి సదావిజయశీలి యయిన మహాబలుడు-కృష్ణుడు-తనకొక నిశ్చయము రా ఉత్సాహియై యుండెను.

పాండవ : మనసులోనాట్యశాలకు పోనిశ్చయించి యేగువాడు ఉత్సాహియై కీచకుడు; సింహాబలుడు;

రాఘవ : విజిత-బలుడు = హనుమంతుడు అశోకవనము నాశనముచేయ నిశ్చయించి ఉత్సాహియై —

క. అస్వల్పతఁ దగు కార్యము
దాస్వయ మొనరించఁ దలచి తమినొక్కఁడు గా
నస్వావ బోధ గాఢ త
మ స్వాగతిఁ బోవన ప్ర మథన స్ఫూర్తిఁ. 35

యాదవ : అ + స్వల్పత = రాజలోకమంతటిని జయించుట స్వల్పమయిన పనికాదు. ఆ ఘనకార్యము తానొంటియై నిర్వహించ నిశ్చయించుకొనెను. అ + ప్రమథన + స్ఫూర్తిఁ = వారు లేకుండ రణమైపలువురు చూడకుండ పోవుటకు నిశ్చయించెను. మెఱపువలె రుక్మిణిని కొనిపోయి పురము వెలుపల రణము చేయ తలచెను.

పాండవ : గాఢ + తమ + స్వాగతి = నిశీధి కాఱుచీకటిలో (కమము = చీకటి) ద్రౌపది అంగీకారమే ఘనకార్యముగా అతడనుకొనును. చీకటిలో ఒంటి నేగుటయు ఒక ఘనకార్యమనుకొనుచు నేగును.

రాఘవ : అశోకవనము రావణునికి ప్రియమైనది. దానివి నాశముచేసి రావణుని కోపమునకాహుతియై తప్పించుకొని సముద్రముదాటి ఆవలికేగుటయు మహత్కార్యమే అని హనుమ జంకక వన + ప్రమథన + స్ఫూర్తి = అశోకవనము ధ్వంసముచేయు తలంపు నిల్పెను. అంత ఉత్సహించి ఆ ప్రయత్నమునకు ఆరంభించెను.

సీ. వ్యసనమోహాతి ని ద్రావాప్తిఁ దెలియక
మునుపున్నదద్భీమ మూర్తిఁదడవి

యుత్తరోత్తర లాస్య యుక్తిధామోద్వృత్తిఁ
గనుమహాశరమణి మనుచుఁజేరి
రుక్మివాసాప్తిఁద ద్రుచిరకేళీగతిఁ
బెంచఁ దద్వరయుక్తి నంచితాత్మ
ముఖ్యబలప్రౌఢి మునుకొని తను గెల్వఁ
దా గెల్వ సరియుద్ధ తతరసాప్తి

తే. గీ. నొండొరులఁజేర్చు చలమున నొడ్డికొనుచు
సారెసారెను బొడువ మా సరియెయనుచు
నొడెనని నవ్వఁబండ్లెల్ల నూడఁగొట్టి
తత్సముదయము నిర్మూల తగ నడంచె. 36

యాదవ : దుర్గగుడి నుండి మరలి సఖజనముతో అంతిపురికేగు రుక్మిణికి కేలిచ్చి కృష్ణుడు రథముపైకి దివిచికొని ద్వారవతి మార్గముపట్టి పోసాగెను. పురముదాటి పోవునాతనిని నీతినిపుణులు సంతసించి తమతమ తావులకు పోవ జరాసంధాది మిత్రవర్గమును కలుపుకొని శిశుపాలుడు క్షత్రియుడు కాడు కృష్ణుడు రాజులసాటివాడుగా సంచరించుచుండెను అని కోపించి ఎల్లరాతని మార్గము నరికట్టిరి. వారితో రుక్మికూడ కలిసెను. కృష్ణునకీమూక యొక లెక్కా. సైన్యమును చెల్లాచెదరుచేసి పోవుచుండ కారులుప్రేలు శిశుపాలాదులను పండ్లూడిపడ బాణప్రయోగముచేసి ఎవ్వరును తన్ను దరియరాకుండునట్లు వీర విహారమొనర్చి దారిచేసుకొని తనవారిని కలిసెను. ఇంకనుపోక శిశుపాలాదులు రుక్మి జరాసంధులును వెన్నంటిరి.

పాండవ : రుక్మి + వాస = బంగారు కంబములతో నొప్పు నాట్యమందిరము; చీకటిలో తడుముకొనుచు మంచము సమీపించి ద్రౌపదియని యొడలు నిముర కరికి లంఘించు సింహమువలె భీముడు సింహబలుని అదిమిపట్టి కాలు చేతులు పొట్టలోద్రుక్కి ద్రుక్కిన పేనువలె నాతనిని - కీచకుని-చంపివైచెను.

రాఘవ : హనుమ అశోకవనము ధ్వంసము చేసెనను వార్తవిని గొప్ప సేననిచ్చి కపిని పట్టితెమ్మని అక్షయకుమారుని రావణుడు పంపెను. హనుమ ముందుగనే వనరక్షకుల నెల్లరచంపి సింహద్వారము చెంతనున్న మందిరమునగల

పెద్ద లోహకంబమును పెరికి ఆ ఆయుధముతో అట కంక ఎవరు వత్తురో అని నిరీక్షించుచు నిలచెను.

క. అటరాజసుతా ప్రియగతి
కటురథ గజఘోట కీచ క చకచకితు లో
క్కటగా దానవిశత మరి
యటు సంఖ్య విఖ్యాతిగఁగూల్చె నశాంతముగన్. 37

యాదవ : అ+అశ+అంతము = అశేషము, తన్నెదిరిన వారి నెల్లరను నిర్జించి రుక్మినవమానించి పంపి తనవారితో కృష్ణుడు విజయి అయి ద్వారక కేగెను.

పాండవ : కీచకుని చావుకు ద్రౌపది కారణమని ఆతని తమ్ములు శత = నూర్వురు, ఉపకీచకులు కోపించి ఆమెను అన్నతో కట్టికొనిపోవ మారువేషమున రాక్షసునివలె అగుపించుచు భీముడు వారినెల్లరను చంపి ద్రౌపదిని విడిపించి తెలియనట్లు సూపగృహము చేరెను.

రాఘవ : హనుమ తన్ను పట్టవచ్చిన రాక్షసులనందఱిని లోహకంబముతో మోదిచంపెను. రావణుని కుమారుడు అక్షయుడు = అక్షయకుమారుడు - ఆతనితో సహా సేననంతను చంపివైచెను. నిమీలితాక్షుడై తోరణముననుండ మిగిలినవారు పర్విడి రావణునకావార్త అందించిరి.

ఉ. వత్సరమాతివృత్తి నతి వైభవ వైఖరిఁ దత్ప్రజల్మహో
వత్సముదాయ ముల్వెరుగ వావిరినేడుగడం బడంగఁదా
యుత్సవ వృత్తినా వినిత దుక్తిగురూదయుఁడా సురప్రభుం
డుత్సుక లీలమీఱఁ దన యున్నత వాసవరాజతస్థితిన్. 38

యాదవ : రుక్మిణిని వివాహమాడి ఒక వత్సరము గడచినది. ద్వారక సర్వము సుభిక్షముగా ఇంద్రవైభవమున కృష్ణుడుండెను.

పాండవ : ఏడు+కడన్ బడన్ = అజ్ఞాతవాస వత్సరము ఇంచుమించు పూర్తికానున్నది. పాండవుల యునికివలన మత్స్యదేశము సుభిక్షముగానుండి ప్రజలు ఆనందముగనుండిరి.

రాఘవ : రావణుడు - అసురప్రభుడు - కపివిజృంభణము విని మంత్రులను రావించి మంతనముం జేసెను.

వ. నిలిచియుండు నవసరంబు ధర్మరాజిత విద్యాబలశాలి సుశర్మోన్న
తాభిఖ్యులన్ స్వీకరించి తనమన్యు క్రియారంభంబును ప్రతిపక్ష బలాని
వార్య పరాక్రమ క్రమంబును సమయోచిత కార్యంబునుం దెలి
యంబలికి పంచిన నతండు.

యాదవ : కృష్ణుడు తనవారితో నాలోచించి జరాసంధాదులు నిత్య వైరులగుట ఏమరుపాటులేక కనుగలిగియుండ నుపదేశించెను.

పాండవ : చారముఖమున పాండవులు విరటునగరముననుండి యుండ వచ్చునని విని రారాజు ముఖ్యులను రావించి ఆలోచనచేయ అందు సుశర్మ - త్రిగర్తాధిపతి - తాను తన సైన్యముతో విరటునగర దక్షిణభాగము ముట్టడించి గోవులను హరింతుననియు, ఉత్తరభాగమునకు కొదువ వీరులతో రారాజు ముట్టడించి గోహరణముచేయ నుపదేశించును. ఈ కార్యమువలన పాండవులట నున్న బయల్పడుదురనెను. సుశర్మ ఉపదేశము రారాజు అంగీకరించి ఆ ప్రకారము కార్యక్రమము నడిపించెను.

రాఘవ : రావణుడు తనవారిని కపిని పట్టితెమ్మని పంపించెను.

సీ. విజయేష్టగతి మహాభీమోద్భటాధిక
బలసహాయాప్తి నిర్భయతఁబోయి
తత్పురస్థిరఁ జేరి తనదు క్షమాయుక్తి
వేఁడిఁజూపఁ దదగ్ర విధముఁదెలిసి
నవ్యయౌవనజరా నందనుండా రాజ
హరి మత్స్యరాజితాం కరిపుహారి
తేజస్సముదయుండు దీప్తమహాబల
భూతితోరణము నొప్పుగనుఁజేరి.

తే. గీ. భయద గతిమించఁ దద్బల ప్రౌఢినణఁచఁ
బరకృతి విధిప్రదరయుక్తిఁ బట్టుఁబడఁగ

బంధముక్తియుఁ దద్భీమ వరబలాప్తిఁ
గాఁగ జయతఁ జేసికొని పురి వేగఁజేర. 39

యాదవ : జరానందనుడు - జరాసంధుడు - పూర్వవైరము తలచి మధురముట్టడించెను. — ఇటనుండి అయిదు పద్యములు కృష్ణాది యదువీరులు జరాసంధాది అరిసైన్యముతో; రణము = యుద్ధమున కేగుట వర్ణితము;

పాండవ : ఇటనుండి అయిదు పద్యములు దక్షిణోత్తర గోగ్రహణముల వృత్తాంతము - సుశర్మ దక్షిణముగ విరటునగరము ముట్టడించ ప్రచ్ఛన్నులయి యున్న ధర్మజ భీమ నకుల సహదేవులు వెంటరా విరటుడు ససైన్యుడై సుశర్మ నెదుర్కొనెను.

రాఘవ : మహాబలభూతి = వాయుసుతుడు; తోరణము = ద్వారమున; రావణుడు ఇంద్రజిత్తును పంపించెను. విధిప్రదరయుక్తి = బ్రహ్మాస్త్రము ఇంద్రజిత్తు ప్రయోగించి హనుమను బంధించికొనిపోయి తండ్రి ముందుంచెను.

సీ. అప్పుడా హరివిభుఁ డారాజరాజాను
జనికృతోత్తరగోగ్ర హానిపుణతను
తన్మన్యురూఢిని తగనే నదేర్పంగ
సుమనోరథాప్తిఁజే ర్చుటను దెలుప
నుత్తర సంగతి నుచితపూజితగతి
శిశుపాల బలమాది చిడిముడిపడ
నోర్వని పలుమాట లుగ్గడించఁగఁబేర్చ
సారబలోద్ధతిఁ జక్కఁజేయ.

తే. గీ. నంతనావాసగతి నిజ మాయబొల్చు
చిత్రభాను చాపలతా వి శిఖల సద్గు
ణములు గూర్చి చేకొని యాబ లముకనంగ
నంప వేగిర మరుగంగఁ బెంపుమీఱ. 40

యాదవ : బలరామాది వీరవర్గమును యాదవసైన్యమునంతను నగరిలోనేయుండ నియమించి తానొక్కడే పురివెడలి దివ్యరథారూఢుడై దివ్యాస్త్ర

సంచయ సహాయుడై జరాసంధాది యోధవర్గము నెదిరించి ఆగ్నేయాది మహాస్త్రంబులు ప్రయోగించి పరవీరభయంకరుండై కృష్ణుడు పరిహార మొనరించెను.

పాండవ : సుశర్మను దక్షిణగోగ్రహణమునకు పంపి రారాజు భీష్మ ద్రోణకర్ణాదివీరులతో మహాసైన్యముతో ఉత్తరదిక్కుగా చని విరటునగరు ముట్టడించి గోవులను హరించి తన పురిదిక్కు పంపుచు ఎదిరిపైకి వీక్షించుచు సేనతో తన వారితో నిలచియుండెను. ఉత్తరకుమారునకు సారథియై అర్జునుడు కురుయోధుల నిరోధించ నేగెను.

రాఘవ : బ్రహ్మాస్త్రమునకు ఒక ఘడియకట్టు బడియుండు హనుమను చూచి రావణుడాతని నవమానించ తలంచి కపులకు తోకయందు ప్రీతి కనుక బట్టలు చుట్టి తోక కాల్చుమని ఆజ్ఞాపించెను. రాక్షసులట్లుచేయ కాలిన తోక త్రిప్పుచు జ్వాలలుపఅపి నలుదిక్కులకు లంఘించుచు హనుమ లంకలోని ఇండ్లను కాల్చ నారంభించెను.

వ. అంత నవనిజోక్తి విలాపంబులఁ దత్పర కరవాల కృత ప్రతాపాగ్నులవేడిఁ మాన్పుటఁ దెలియంబడ.

యాదవ : నవ + నిజ + ఉక్తి + విలాసంబులు = అంతంతకు ఉత్సాహపూరితవాక్యముల ఒండొరులు పురికొల్పుకొనుచు కృష్ణుని కోర్కెలకు నొచ్చియు ఉత్సహించి జరాసంధాది యోధవర్గము కృష్ణునెదురించి నిల్చిరి.

పాండవ : కలవరపడి రథికుడైన ఉత్తరకుమారుడు-విరటుని కొడుకు - రథము ఇంటికి పోనిమ్మన తన నిజస్థితి తెల్పి ఆతనిని సారథికమ్మని తాను రథికుడయి అర్జునుడు కురుసేన నెదురించును.

రాఘవ : కాపరులయిన రాక్షసస్త్రీలవలన హనుమ పట్టుపడుటయు అతని తోక కాల్చుటయు విని; అంత - అవనిజ = సీత అగ్నిదేవుని ప్రార్థించ ఆతని ప్రతాపము ఒరులకు తెలియరాక చల్లబడి కపికి హాని చేయలేదు. ప్రకటముగ జ్వాలలు చెలరేగుచునే యున్నవి.

సీ. చనిచని తన్మార్గ ఘనవిస్మయప్రద
వ్యాపారకృతులను వరుసఁగాంచ

నవ్వువారణ యోర్చి చివ్వపై కొనువారు
గురుకర్ణ భీష్మసం గరవరోక్తి
స్వమహోగ్రతను గాంచి సమయమామితిమీఱ
సమయమౌనను చారు సారయుక్తి
నెఱుఁగ వానరవిభుం డిదెవచ్చె నెవఁడోపు
నొక్కనికొక్కండ యోర్తునవెడుఁ.

తే. గీ. బలుదెఱంగులఁ బలుకులఁ గలియవినుచు
కోటిగుణములు రూఢించి ఘూర్ణితముగఁ
బైకి లంఘించి యుద్భట ప్రదరయుక్తిఁ
గూర్చి భాసురారులనెల్ల గుంపుఁజేసి. 41

యాదవ : కృష్ణుడు-గురు + కర్ణ + భీష్మ + సంగర + వరోక్తి = గొప్పది చెవులు బ్రద్దలగునది కఠోరమయినది యుద్ధసంబంధమయిన సింహనాద మొనరించి, వచ్చెవచ్చె కృష్ణుడనుచు (పురుషోత్తముడు = నరవిభుడు) భయభ్రాంతులు కా కోటానుకోట్లు గుప్పిట బాణప్రసారముచేయ వైరివర్గము గుదియలు గ్రుచ్చినట్లు నేలత్రెళ్ల వీరవిహారం మొనరించుచు కృష్ణుడు చెలరేగెను.

పాండవ : గురు = ద్రోణాచార్యులు; భీష్మాచార్యులు, కర్ణుడు వచ్చిన అర్జునుని వీరవిహారముకని ఆతడే, నరుడే అని నిశ్చయించిరి. రారాజుతో మాట కలిపి కర్ణుడు అజ్ఞాతవాస సమయము పూర్తికాలేదు - మరల పాండవులు వన వాసమున కేగవలెనన భీష్మాచార్యులు, ద్రోణుడు గతదినముతోనే అజ్ఞాతవాసము పదమూడు సంవత్సరములు నిండినవని నిష్కర్షగా తెలుప ఇక రణమే కర్తవ్య మని- దానికి కురుసేన ఆయత్తమై నిలచినది. (అర్జునుడు దుర్నిరీక్ష్యుడై సమ్మో హనము ప్రయోగించి గోవులను మరలించుకొని విరటునగరు మరలిపోయెను. దక్షిణదిక్కున సుశర్మ యోడి వెడలిపోవ విరటుడు భీమాదులతో (తెలియబడని వారు) వారి పరాక్రమము మెచ్చుకొనుచు నగరు చేరుకొనెను- (సారాంశమిది- వివరములు ముందు కలవు.)

రాఘవ : ఎఱుఁగ + వానరవిభుండు = రాక్షసులు లంకలోనివారు నలు మూలలకు దుముకుచు ప్రాసాదములకు అగ్నిపెట్టి కాల్చు హనుమకు భయపడి,

కాపెవచ్చె కాపెవచ్చెనని కలవరపడుచుండ దొరికినవారిని తన్నిరక్కి హింసించుచు హనుమ లంకాదహనము చేయసాగెను.

తే. గీ. తీక్ష్ణకరవాల దీప్తులు దీటుకొనఁగఁ
జరబలం బెల్లనొక్కటఁ బాఱఁదోలి
గోవులను ద్రిప్పి భైరవ క్రూరసింహ
నాద మొనరించె దిక్కులు భేదిలంగ. 42

యాదవ : కరవాలము = ఖడ్గము, చక్రము - కృష్ణుడు దివ్యసాధనములు ప్రయోగించి జరాసంధాది వీరయోధవర్గమును చెల్చిచెండాడి సింహనాదముచేసి ఆ నాదముతో దశదిశలు నిండించెను. అరులహృదయములు భేదిల్లెను.

పాండవ : అర్జునుడు ముందు గోవులను మరలించి కురుబలముతో పోర తలపడెను.

రాఘవ : తీక్ష్ణకర + వాల + దీప్తులు = మండుచున్న తోక సంబంధమయిన మంటలు; లంకాపురి నగళ్లు అంటించుచు సింహనాద మొనరించెను.

ఉ. కర్ణకఠోరఘోషచెడ గౌరవహంసవరాజతోన్నతుల్
చూర్ణముగాఁ గురుప్రజయు స్రుక్క ధనుర్గురు వైభవంబులున్
శీర్ణముగా మహోశర వి శేషబలోజ్వల భీష్మవిక్రమో
దీర్ణతమాయవాల శుభ తేజముమించ హరించె నెంచఁగన్. 43

యాదవ : మాయ = జరాసంధుడు మాయావి - ఆతని మాయ - వాల = క్రిందపడ: వైరుల తేజము హరించి కృష్ణుడు చాలప్రకాశించెను.

పాండవ : అర్జునుడు :— కర్ణుడు, కురురాజు, కురుసేన, ద్రోణాచార్యుడు, భీష్ముడు—వీరినెల్లరను నిర్జించి మహాతేజమున మించెను.

రాఘవ : హనుమ వాల + శుభ + తేజము = వాల సంబంధమయిన జ్వాలలు వ్యాపింపచేసి సింహనాదార్భటులచే రాక్షసవీరులను దీనులను గావించి మించెను.

సీ. దై నందినయుగాంత దండధరోద్దండ
దండంబు జనములఁ జెండురీతి
హాలాహలకరాళ కీలాకుల విషాగ్ని
జేర్చి జగమ్ములు ద్రేల్చురూఢి
గల్పాంతవాతోగ్ర ఘనవహ్నికీలలో
క్కటఁ జరాచరములు కాల్చురేఖఁ
బ్రళయకాలాఖిల ఫాలదృక్ శిఖిశిఖ
లఖిలాండకోటుల నణచుభంగి

తే. గీ. మించియాశుగజాతి సారాంచితాప్తి
నేర్చియెటఁజూడఁ దానయై యేపురేగి
పరబలంబులు జెండాడి నెటిమిమెటిమి
దఱమి చిఱునుగ్గుఁజేసి గీట్పుఱచిగాల్చె. 44

యాదవ : కృష్ణప్రతాపాగ్ని వర్ణనము :— ప్రలయకాల రుద్రదండము విధమున, సముద్రమదన సమయమునపుట్టిన హాలాహల విషాగ్నిజ్వాలలవడువున-కల్పావసాన సమయమున ప్రలయాగ్ని శిఖలు సృష్టినంతను కాల్చురీతి, ప్రలయ కాలరుద్రుని కంటిమంటలు బ్రహ్మాండములను మాడ్చునట్లు, కృష్ణునిచే ప్రయోగింపబడిన దివ్యాస్త్రజ్వాలలు వైరివర్గమును మాడ్చివైచెను.

పాండవ : ఆ విధమయిన విజృంభణముననే అర్జునిచే వడి కురువీరవర్గము ఓడి మరలిపోయినది.

రాఘవ : పై విధముననే హనుమచే లంక కాలి రాక్షసబలము గోలకు వచ్చెను.

వ. ఇట్లు మహార్ణవంబు ఘూర్ణాయమానంబుగా జిరజిరం దిరుగు మందర ధరాధరంబు చందంబునఁ, బరబలంబులం గలయంబడ దిరిగి, వాలమ్ము లివలు హెచ్చు చిచ్చులం దటికొలిపి, జాటి సమరి కనుపుఁ గొట్టిన నదియు విచ్చియుఁ జచ్చియుఁ గూడుకొనియు బెండువడియుఁ జిందఱవందఱయై చెల్లాచెదరై యోడ్చుఁగొన్న

యునికి స్థానంబులు నిర్మూలంబులయిన, ఛత్రచామరాది బిరుదులు, చీనాంబరములు గోలుపోయి భయసమ్మోహంబులఁ దలలుమఱచి నలునలుగడలంజఱవ నప్పుడు ప్రళయ భైరవఘోరాట్టహాస బధిరీ భూత రోధోంతరాళుడై యా హరివిభుండంటం దఱిమి, యెద్దుగా నున్న నివేశస్థానంబు నాళుగాగ్ని దఱికొనిన, నచటనిలువక దూరం బునకరుగు విబుధహృద్రావణుంగూరిచి యోరివైరి దుర్యోధనా సిగ్గువిడిచి పాఱిపోకు, నీచైద్యుమనః ప్రజ్ఞాకలిత కిరీటుని, నిజంబు మాలి దూషణంబు లాడువాని, మిత్రోదయు, సాయకోజ్వల ప్రహస్తభూతి నణంచ భీష్మచాపగురు ముఖ్యుల బాణవిద్యాది ప్రపంచసేనాగ్రచరుల సురుచితీవ్రగతికలిత సప్తభాస్వన్మంత్రిసూనుల ననేకకింకరుల నఘాంతంబుగా బలరిపుల నేలంగలపి గెల్తుమనియెలుం గవా, సాల్వనిహతి చిత్రసేనోగ్రవిహృతి యుక్తింబొందించుటఁ దలంచవా, నాబలిమియునికిలేదని సమయంబు ప్రతీక్షించి మత్ప్రర స్థిర ప్రతాపంబు జూపవచ్చితివని తదీయులందఱు వినఁబలికి యంతఁ జనక జాత ప్రీతి శంకించి తెలిసి యవ్వైరివీరవరు బలంబులు బొల్చెనట్లు దంతవక్త్రాశుగ హరినఖర ముఖభల్ల ప్రహారమ్ముల వాల మ్ముచిచ్చు నెదిరిన వానిజీరియందఱు గెలిచి తన్మహీ రమణులదఱిమి పోయెదనని ప్రబలతేజోమహా కరవాలాశుగ కలితాగ్నుల సత్వరగతి నిశాంతజలనిధిం జల్లార్చి తిరిగి చని.

యాదవ : వైరి + దుర్యోధనా = జరాసంధ, శిశుపాల, దంతవక్త్రాదు లను కృష్ణుడుసంబోధించి ధిక్కరించును. నేనులేని సమయముచూచి దొంగలవలె పురిపై బడవత్తురా మిమ్ము ఊఱకవిడతునా - అనుచు వైరులను నిలువనీయక పాఱదోలి: శాంతజలధి = శాంతించుట అనే సముద్రంలో కోపాగ్ని చల్లార్చి తన వారిని కలియ నగరి కేగెను - అరులు తమదారిం బోయిరి.

పాండవ : కృష్ణునివలెనే అర్జునుడు రారాజుని కర్ణుని తిరస్కరించుచు నధిక్షేపించి (చీనాంబరము' సమ్మోహనాస్త్రమువైచి ఉత్తర బొమ్మపొత్తికలకు

గాను ఉత్తరునిచే రారాజ కర్ణ దుశ్శాసనాదుల తలచీరలు కోయించి పట్టించుకొని శాంతించి నగరుకు మరలిపోయెను.

రాఘవ: హనుమంతుడు రేయియెల్ల లంకనుకాల్చి; నిశాంతజలధి = తెల్లవారుచుండ సముద్రతీరమున కేగి తోక అందుముంచి చల్లార్చికొని, రాక్షస వీరులనేరిని తలయెత్తకుండ చేసి; జనక + జాత + ప్రీతి + శంకించి = లంకంతా కాలిపోయినది. అశోకవనమున సీత ఏమయినదని భయపడి, తన్ను నిందించు కొనుచు అటకేగి ఆమె సుఖముగానుండుటను గాంచి సంతసించి తన్మహీరమణు లను తలిమిపోయెదనని = వచ్చినపని అయినది. ఇక రామలక్ష్మణులను కనపోయె దనని నిశ్చయించి సముద్రము దాటి తనవారిని అంగదాదులను చేరుకొనును. సీతను చూచితినని తెల్పి వారల నానందమగ్నుల నొనరించును.

క. ఉత్తరకృతి జన్మభవా
త్యుత్తమ సమ్మోదమాద రోన్నతిఁగనుచున్
హత్తికొ నిజమహిమాకృతు
లత్తఱిఁ దెలియఁగ మెలంగ హరివిభుడంతన్. 45

యాదవ: పుట్టినదాది వచ్చిన ఆపదలను తొలగద్రోసి తమ్ము రక్షించి నాడని అతివిశ్వాసముతో ఆదరముతో యాదవులు కృష్ణుని కొలుచుచు సుఖ ముండిరి.

పాండవ: దక్షిణోత్తర గోగ్రహణములు విజయవంతములగుటకు కారణ భూతులయిన వీరులు పాండవులని తెలిసి విరటుడు ఆ మహామహులను క్రిందు పఱచినందుకు ప్రతిగ ఉత్తరను అభిమన్యునికొసంగి వివాహ మొనరించెను. దానికి కృష్ణుడాహూతుడయి కొలది యాదవ వీరులతో విరటునగరుకు వచ్చి వేడుకలు కని ఆనందించెను. ద్రుపదుడాది బాంధవులును వచ్చిరి. వివాహమునకై వచ్చిన వారినెల్లరను ఆపి పాండవులు ఉపప్లావ్యమున శిబిరమేర్పఱచుకొని ముందుచేయ వలసిన కార్యమునుగూర్చి వారలతో నాలోచించసాగిరి.

రాఘవ: కపులు హనుమనుబొదివికొని ఋష్యమూకాద్రి రామలక్ష్మణుల చెంతనున్న తమ రాజు సుగ్రీవుని సమీపించి వారల కభివాదనములు చేయుచునే హనుమసీతను చూచివచ్చెనని విన్పించి రామలక్ష్మణులనానందపఱచి, అనంతరము

హనుమ లంకలో నొనర్చిన కార్యకలాపము విన్పించి ముందుచేయవలసిన కార్యము మునుగూర్చి ఆలోచన చేయగోరిరి.

సీ. పరఁగ నుపప్లావ్య పురమునఁ దదనుజ్ఞ
వసియించి వనవాస వనధిదాట
ననుజను ల్బంధువు లందఱుతో వచ్చి
మత్స్యనేత్రాకృతి మహిమఁ దెలియ
శరకృత్యఖాసుర శతధన్వరిపు బల
సంతతి మాదువృత్తాంత మెల్ల
వినుపించెఁ దద్రాజ వీరోది తోత్తరో
త్తమ హర్షగతిమాఱె సముదయంబు

ఆ. వె. ఆనరవరసుతున క్రూరునకు శుభగ
కార్యమొనరనీయ కౌతుకమున
నా పరిగ్రహమున నాబహుళోభిరా
ముండు దనరె మదికి పండువుగను॥ 46

యాదవ : శ్రీకృష్ణుడు అభిమన్యు వివాహానంతరము ద్వారకకు మరలి పోయి అక్రూరుని హస్తిపురికిని ఉపప్లావ్యమునకును పోయి వారివారి ఆశయాలు కనుగొని రమ్మని పంపెను. ఆతడు కురుపాండవులను కలసి వారి అభిప్రాయములు ప్రయత్నములు తెలిసికొని పోయి కృష్ణునకు వివరించెను.

పాండవ : అభిమన్యు వివాహమునకై వచ్చిన బంధువర్గముతో సంప్రతించి కురురాజుపాలికి రాయబారము పంప ధర్మరాజు నిశ్చయించెను.

రాఘవ : ఉపప్లావ్యము = కిష్కింధ సమీపభూమి ఋష్యమూకాద్రి శతధన్వ + రిపు + బలము = ఇంద్రుని శత్రువులు రాక్షసులు—వారి సేనబలము. కపి సేనతో లంక కేగి రావణుని సంహరించి అయినా - సామవాక్యాలకు వినక పోతే - సీతను తే నిశ్చయించి రాముడు సుగ్రీవునితో ఆ ప్రయత్నము చేయమని తెల్పెను.

సీ. హారి విభుండురుశక్తి సాంబయాఖ్యుండును
దుశ్శాసనుండతి దుర్మదుండు
మహిత నయోత్తమ మాన్యలక్షణ రాజ
కన్యక గజరాజ గమనకృష్ణ
సారసనేత్ర పీ క్షణఁజన సత్వర
మతిచేతఁ గోకను పట్టియాడ్వ
నెగడు దోర్బలరూఢి నిగుడనియ్యకనాచ
గురుకృపోన్నతి వారి కుటిలవృత్తి

తే. గీ. గని ధృతిబలుండు దానిత గంగఁద్రోయఁ
గడఁక నాపురి పూనవే గమరనక్ష
య గతి నంబరప్రాప్తిగా నమరనెత్తి
మునుపు విడుపించుకొనె నాగ వినుచునపుడు. 47

యాదవ: ఈ పద్యమున జాంబవతి సుతుడు (కృష్ణుకుమారుడు) దుర్యోధనుని కుమార్తె లక్షణను ప్రేమించి హరించికొనిపోగా కురుబలము ఆతనిని పట్టి బంధించినది. యదువుల కావార్త తెలిసి యుద్ధసన్నద్ధులగుచుండ బలరాముడు వారిని వారించి తానొక్కడు కొలది పరివారముతోపోయి కార్యము సాధింతునని యేగె. హస్తిపురి సమీపించి సాంబునొప్పించమని దుర్యోధనుని వద్దకు వార్త పంపినను ఆయన వినకపోగా హలమెత్తి పురిగంగలో కలిపివైవ గడ్డ పెల్లగించబోగా కౌరవులు భయపడి అరి అర్పణలిచ్చి పెచ్చుకాన్కలతో లక్ష్మణను సాంబునితోకూర్చి తెచ్చి క్షమించవేడి బలరామున కిచ్చిరి. ఈ గాథ ఇందు కలదు. నేటికిని హస్తిపురి (ఢిల్లీ) గంగవంక వాలి ఉన్నది. లక్షణ = రాజకన్య - దుర్యోధనుని కుమార్తె; గంగ + త్రోయ = గంగలో కలుపుపూన్కి; బలుడు = బలరాముడు.

పాండవ: దుశ్శాసనుడు ద్రౌపది చీరలొలుచు నపుడు అక్షయమని ఆమె మానము కాపాడిన కృష్ణుని ఆతని అన్న బలరాముని ఉపప్లావ్యమునుండి ధర్మజుడు తలంచుకొనెను.

రాఘవ : అంగదాదులచే ప్రోత్సహించబడి హనుమలంకలో అక్షయకుమారునితోపాటు లెక్కకు మిక్కిలి రాక్షసులను తానెట్లు సంహరించినదియు, రావణునాజ్ఞ చీరలుతెచ్చి తోకకు చుట్టుచుండ వాలము పెంచుటచే ఎన్ని చీరలు తెచ్చినను చాలకపోగా సీతకోక చించితెమ్మన వెంటనే తోకముడుచుకొని కాల్పించుకొని దూకుచు లంకలోని మందిరము లన్నియు నిశ్శేషముగ కాల్చి తెలవారుచుండ సముద్రమున తోకముంచి ఆర్పుకొనుటయు, లంక కాలుచుండ రాక్షసస్త్రీల ఏడుపులు పెడబొబ్బలు ఇత్యాది వర్ణించి రామలక్ష్మణులను సుగ్రీవాదులను నవ్వించును. తానొంటి ఇటువంటి కార్యమొనర్చి సుఖముగా తిరిగి వచ్చుటయన కపులకు రామునకు అమితమయిన ఉత్సాహము కల్పించుటకే ఆ వివరములు వర్ణించి చెప్పెను.

క. అనిరుద్ధ మార్గమేమియుఁ
గనకను తత్కార్యసిద్ధి ఘటనకును నెంతే
మనమురియాడగ నాలో
చనసేయుచు నాతడుండు సమయము నందున్. 48

యాదవ : అనిరుద్ధుడు ప్రద్యుమ్నకుమారుడు, కృష్ణుని మనమడు. అకస్మాత్తుగా ఆతడు కన్పించలేదు. ఆతని యునికి తెలియక యాదవులు చింతాక్రాంతులై యుండ (ముందున కన్వయము).

పాండవ : అని + రుద్ధ + మార్గము = నిరోధములేని తెరువు; యుద్ధములేని మార్గము: శాంతియుత మార్గమునకై ధర్మజుడు ఆలోచన చేయసాగెను - ఆ సమయమున.

రాఘవ : ఏ ఆటంకములులేని మార్గము కార్యసాధనకై వెదకుచు కపులతో రాముడాలోచనలో నుండ.

చ. ద్రుపద సమాశ్రితుండు స్వపు రోహితుఁడాయతి నీతిశాస్త్రకా
ర్యపటు సుబుద్ధి నారద సమాఖ్యుఁడు యోగి మరుత్ప్రభుండు త
ద్రిపుపురమందిరానడుగఁ దెల్పెను దావర సంజయాప్తిగా
నపుడరుదెంచుటన్వివర మంతఁదదుక్తుల భావమేర్పడన్. 49

యాదవ : ద్రు + పద + సమ + ఆశ్రితుడు = అతివేగముగా - మనోవేగమున త్రిలోకములు సంచరించు దేవర్షి నారదుడు, స్వ + పుర + ఈహితుడు = తానై జనముల హితము కోరువాడు; కృష్ణుని దర్శించవచ్చెను.

పాండవ : తలపులోననే కృష్ణుడుపప్లావ్యమునకు వచ్చెను. అట నిర్ణయము ననుసరించి ద్రుపదుని పురోహితుని రాయబారిగా రారాజు పాలికి పంపిరి. ఆతడు పోయి సంజయుని - ప్రతి రాయబారి - వెంటనిడుకొని తిరిగి వచ్చెను.

రాఘవ : రిపుపురమందిరా = లంక కేగి తిరిగి వచ్చెను కనుక హనుమంతుని అట విశేషములు తెలుపమని రాముడడుగును.

తే. గీ. మీ సుఖస్థితి శుభవార్త నాసదాసు
దృక్శిరోమణి యాధృతి దెలియ మొదటఁ
గలయ మిమ్ము నడిగెద యా కలితమతిని
ననిన శుభమని పలికిన వినియె నపుడు 50

యాదవ : కృష్ణునిచే నడుగబడి వచ్చిన నారదుడు అనిరుద్ధుని వృత్తాంతము తెలుపసాగును.

పాండవ ; వచ్చిన సంజయుడు పాండవులతో నిట్లనును.

రాఘవ : హనుమ చెప్పుచున్నాడు. రామా, సీతామహాదేవి మీ ముద్రిక చూడగానే శిరమున హృదయమున నుంచుకొని హత్తుకొని ముద్దిడి మీ కిమ్మని, తన శిరోరత్న మిచ్చెనని మీ కందించితిని కదా. ఇపుడు లంకలోని వివరములు తెల్పెద వినుడని తెలుపసాగెను.

వ. వెండియు నతండు తదీయాభిప్రాయంబు తెలియంబడ నిట్లనియె—

యాదవ : అనిరుద్ధుని ఉనికి తెలుపుటకై నారదుడు బాణాసురుని వృత్తాంతము తెలుపనారంభించును.

పాండవ : సంజయుడు హస్తిపురి రారాజు వృత్తము తెలుపనారంభించును.

రాఘవ : హనుమ రావణుని విభవము వివరించసాగును.

శా. లంకా ద్వీపమునన్మణీంద్ర సుషమా లంకాప్తి శోణాఖ్యస్వా
లంకారోన్నత రూఢినాగపురి చె ల్వంబందునం దొప్పు ని
శ్శంకన్బాణ సమాఖ్య నీశ్వరుఁడు సా క్షాత్కారతందోఁ పరా
జాంకాప్తి న్జితవైరి పంక్తిముఖుడు ద్యద్రాజరాజాఖ్యుఁడై॥ 51

యాదవ: నారదుడు కృష్ణునితో చెప్పుచున్నాడు. పాతాళమున శోణ పురమునేలు బాణుడను రాక్షసుడు కలడు. ఆతడీశ్వర భక్తుడు. వరప్రసాద ఫలముగా ఈశ్వరుడు సదా అతని వాకిట రక్షకుడై నిలచెను. బాణుడు బలిచక్ర వర్తి తనయుడు.

పాండవ: పాండవుల ముందు సంజయుడు రారాజు మహిమాదులు బల ప్రతాపములు వర్ణించును.

రాఘవ: లంకానగరమునకు రాజు రావణుడు ఈశ్వరభక్తుడు. వరగర్వమున దేవతల నందఱను జయించెను.

శా. వానిన్ గెల్వఁగలేరు లోకముల నెవ్వారుః మహోవిక్రమా
నూనస్ఫారబలంబు భీష్మధను రన్యూనాస్త్రశస్త్రాది వి
ద్యానైపుణ్యసమన్వితంబు సురమర్త్యాభేద్యమప్రాప్యము
న్నానావస్తుసమగ్రమా మహిమ నెన్నన్ జేరగా శక్యమే. 52

యాదవ: నారదు డనుచున్నాడు. ఆ బాణుని జయించ నేరికిని శక్యము కాదు; భీష్మ + ధనుః + అ + న్యూన = సాటిలేని ధనుర్విద్యావిశారదుడు.

పాండవ: సంజయుని వాక్యము. భీష్మాది వీరరక్షితుడు రారాజును జయించ శక్యముకాదు.

రాఘవ: ఆ రావణు డసాధ్యుడు. మహామహిమాన్వితుడు అని రాముని తో హనుమంతు డనుచున్నాడు.

ఉ. ఆవసుధావరాత్మజ నియాకలలోన నిరుద్ధచింతచేఁ
దావగనీయపోవుటలె దందగలేదని యెంచిచూచి వీ
డావిదితాకృతిన్ దెలువ గాంచె మహిందగదే వశంబుగా
భావజకేళి దేలనటు పట్టుఁబడె న్బలుమాటలేటికిన్॥ 53

యాదవ: బాణుని కూతురు ఉష కలలో ఒక సుందరునితో కలిసి ఆనందించెను. ఆమె చెలి చిత్రరేఖ చిత్తరువులు వ్రాసి చూపి ఆ అందగాడు అనిరుద్ధుడని తెలిసి తెలిసి మాయావి అనిరుద్ధుని హరించికొనిపోయి అంతిపురి ఉషతో చేర్చెను. క్రమముగా ఆ వార్త బాణునకు తెలియరా నాతడు అనిరుద్ధుని నాగపాశబద్ధునిచేసి చెఱలో నుంచెను.

పాండవ : రారాజు ఇంతయేని భూభాగ మీయడు. ఎంతయు నహంకరించి యున్నాడు. అతని బలసహాయములు గొప్పవి. ఆ మాటలు విని ధర్మజుడు పోరు తప్పదనుకొనెను.

రాఘవ : అవసు–జని = సీత; ఆమెను రామున కిచ్చి శరణు వేడుమని సోదరుడు విభీషణుడు తెల్పినను వినలేదు. కాన యుద్ధప్రయత్నమే చేయవలె నని హనుమ రామ సుగ్రీవులతో ననును.

క. అని తెలిపి బోవనప్పుడె
వినుతగతిన్ జైత్రయాత్ర వెడలఁగఁ దెలుపన్
జనపతి హరి విభుఁదోడ్కొని
ఘనరోషము మెఱయబలము గ్రక్కున గూర్చెఁ. 54

యాదవ : కృష్ణుడు నారదు వాక్యములు విని బాణు పురముపై దాడి చేయ నిశ్చయించి యాదవ బలమును సిద్ధముకా నాజ్ఞాపించెను.

పాండవ : హస్తిపురమున రారాజు, ఉపప్లావ్యమున పాండవులు యుద్ధ సన్నాహములు, ఆరంభించిరి.

రాఘవ : సుగ్రీవాజ్ఞ కాగా క్షణములో ఋక్షవానర సైన్యములు కోటానకోట్లు కిష్కింధకు వచ్చి వ్రాలినవి. వారెల్లరు దేవాంశసంభవులు, కామరూపులు; కామగమనము కలవారు.

సీ. కమ్మారు నొక్కటై దుమ్మొఱయుగతి న
యక్షౌహిణుల సంఖ్య యశముగనఁగ
హరికుంజరభట శతాంగసంగతిఁ జేర్చి
వాహినీవరయుక్తి వ్యూహకలనఁ
జేరి భజింపగా వారాశియన యట్లు
సర్వతోముఖముల శక్తియణఁగ
నటనడ్డగొట్టమ హానలతేజంబు
మహిమయంతట మారిమసఁగి మించ

తే. గీ. దత్సమీప భూమిని దుర్గ దైర్ఘ్య వితత
శిబిర మేర్పఱచి యట వసించి మెఱయ

మునుపె యావార్త విని తత్పుర నరపతియు
మంత్రి బంధులతోఁ జేసె మంత్రయుక్తి. 55

యాదవ : సైన్యములు శోణపుర బాహ్యప్రదేశమున శిబిరములు ఏర్పఱచుకొని పురిలోనికి బయటకు రాకపోకలు లేకుండ నరికట్ట బాణుడు మంత్రాలోచన సేయసాగెను.

పాండవ : కురుపాండవులు కురుక్షేత్రరంగమున ఎదురెదుర శిబిరము లేర్పఱచుకొని రణమున కాయితమైరి.

రాఘవ : రాముడు కపిసైన్యముతో దక్షిణ సముద్రతీరము చేరి విడిసి యుండ రావణు డాలోచనా మందిరమున మంత్రులతో నుండెను.

వ. అప్పుడు పలువురు పలు పలుచందంబులు నేర్పులు పలుకరించు సమయంబున.

యాదవ : బాణునకు మంత్రులు అనేక రీతుల ఆలోచనలు తెల్పిరి.

పాండవ : రారాజును సంధి కొప్పించ భీష్మాదులు ప్రయత్నించి విఫలు లయిరి. విదురుడు నీతులుపన్యసించి నిష్ఫలుడయ్యెను.

రాఘవ : మంత్రుల యాలోచనలు తలకొకరీతి నుండె. విభీషణు డన్నకు బోధ సేయును.

చ. తదనుజనుండు నాప్తుఁడుఁ బ్రధానియు వైరి విభీషణాఖ్యుడున్
విదురుడతండు నీతిని వివేకముగాఁదగఁ దెల్పనవ్విభుం
డదలిచి పొమ్మనన్మఱియు నాతఁడు దెల్పినిన ప్రభల్ తుదిన్
పదరిన నెంతలేదనుచు బాలిశవృత్తులు నిందసేయగన్. 56

యాదవ : కృష్ణునితోడ వైరము మంచిదికాదని మంత్రులెంతగ తెల్పినను ఆతని పక్షము వహించినవారు కొందఱుండుటవలన బాణుడు సర్వులనుయుద్ధము నకు ఆయితము కమ్మని ఆజ్ఞాపించును.

పాండవ : రారాజు విదురాదులను తూలనాడి సంధి కారాదని యుద్ధమే విశ్చయించెను.

రాఘవ : రావణుడు తమ్ముడు విభీషణుడు తెల్పిన నీతిమార్గము కాదని ఆతనిని దూషించి సభ విడిచి పొమ్మని పంపివైచెను. యుద్ధమునకు సిద్ధము కమ్మని మంత్రులను సేనానులను ఆజ్ఞాపించెను.

ఉ. భూవరకన్యకన్ విమల బుద్ధియొసంగ నరుండు గాఁడు స
త్సేవధియాది విష్ణువె యు దీర్ణత నీపయివచ్చినాడు సు
మీ్మ వినునాదు బుద్ధిచెడు మేలగునేకుల నాశమొప్పునే
నీవిలసత్తనూజ రుచి నేలనణంగగఁ చూడనేర్తునే. 57

యాదవ : భూవర = రాజా, ఓబాణ. కన్యకన్ = ఉషను. కృష్ణుడు సాక్షాద్విష్ణువు కన్యనిచ్చి అనిరుద్ధుని విడిచి ఆతనిని శరణందుము. లేనిచో కుల నాశమగునని సన్మంత్రుల యుపదేశము. కాని బాణుడు వినలేదు.

పాండవ : భూ + వర + కన్యక = రాజ్యలక్ష్మి—వారి భాగము వారికిచ్చి సుఖములందుమని అన్న ధృతరాష్ట్రునితో విదురుడనును. నీ సుతులతో నీకుల నాశమగు తలంపు విడుమన్నను దుర్యోధనుడు విదురుని దూషించుచు భాగ మీయననును.

రాఘవ : రాముడు సాక్షాద్విష్ణువు, భూ + వర + కన్యకఁ = భూపుత్రి సీతను ఇచ్చి శరణందుము. లేకున్న కులనాశమగునని విభీషణుడు వేడుకొన్నను రావణుడు వినడాయెను.

చ. అనవుడు నాగ్రహంబున మహాహవకేళిని దేలఁగోరవే
ట్కను నది రామహేశ్వర క టాక్షమునన్ దుదిమాననేర్తునే
చెనటికి బుద్ధులన్ విడువు చెప్పకఁ బొమ్మని త్రోయఁ బోయెనే
ర్పున మఱి యాతఁడాశరణ మున్మనఁ దత్పదసీమఁ జేరఁగన్। 58

యాదవ : బాణుడు మంత్రుల మాటకాదనును. మహేశ్వరుని వరము ఈ నాటికి సమకూర రణము మాననని, తన నిర్ణయము తెల్పును,

పాండవ : రారాజు తూలనాడ విదురుడు సభ విడిచి వెడలిపోవును. వృద్ధరాజు ఖిన్నుడయి వ్యాసుని తలచుకొన ఆతడు వచ్చి భావితప్పింప వశముకాదని యుద్ధవార్త ఎప్పటికప్పుడు విన్పింప సంజయుని ఆతనికడ విడిచి యేగెను.

రాఘవ : రావణునిచే నవమానితుఁడయి విభీషణుడు లంక విడిచి సముద్రము లంఘించి కపులనుచేరి రాముని శరణంది యాతని ఆదరమునకు పాత్రుడై వారితోనుండెను.

చ. నృపతి విభీషణుఁడు వినయ వృత్తిని మిత్రవిభుం గ్రహించి త
ద్వీపుల సమస్త రాజ్యము భ విష్ణుత నేలుదునా నిజాత్మ త
త్కృత గురు భీష్మబాహుబల ఖేలన నమ్మికఁ జేరెనంచు రా
నపుడె సదాశిమార్గమున నద్దరిఁ జేరిన యట్లైనార్పఁగఁ. 59

యాదవ : బాణుడు తన సహస్రకరములతోపాటు శివుని అండకలదని అహంకరించి రణమే నిశ్చయించును.

పాండవ : రారాజు భీష్మద్రోణకృపాదులు రణవిశారదులు తనయండ యని నమ్మి రణమే నిశ్చయించును.

రాఘవ : రాముడు శరణందిన విభీషణు నాదరించి లంకారాజ్యమాతని కిత్తునని ప్రతినయొనర్చి తమ్మునివలె చూచుకొనును. వాలిని సంహరించి సుగ్రీవునికి కపిరాజ్యమిచ్చిన రాము సత్యప్రతిజ్ఞ సర్వులకు విదితమే.

వ. వడిగల వేగరుల వలనవృత్తాంతంబంతయు సవిస్తారంబుగాఁ దెలిసి యెదఱఁ గట్టాయితంబై యున్న యవసరంబున —

యాదవ : కృష్ణుడు బాణుని నిర్ణయము తెలిసికొని రాయబారిని పంపును.

పాండవ : కృష్ణుడు రాయబారిగా, పాండవపక్షమునుండి యేగి, రారాజు సభ ప్రవేశించును.

రాఘవ : రాముడు అంగదుని రాయబారిగా రావణుని కడకు పంపును,

సీ. హరివిభుఁ డుగ్రుఁడు నయ్యహీన విభూష
ణాంగదుఁడురు శక్తి యంపవేగ
మునఁబోయి తత్సభ వినుతింపఁగాఁ జేరి
బలితనూజున సదృ గ్బలుని ఘనుని
విబుధవ్యాద్రావణు బ్రబలుని తగఁగాంచి
యుచితోక్తులను నీతి నొనరఁ దెలిపి

మహితనయోత్తమ మాన్య సద్గుణమణి
విడువనిరుద్ధాప్తి విపులబుద్ధి
తే. గీ. నరుఁడు మాత్రముగాదు మ ద్వరసహాయ
బలముగలుగంగ నేవారు గెలువలేరు
భీమబలయుక్తి ధర్మజ విమలశక్తి
యమల విక్రమ ప్రకియ సమయ మరయ. 6

యాదవ : కృష్ణుని రాయబారి బాణు సభ ప్రవేశించి "కృష్ణుడు నరుడ కాడు, రాక్షస సంహారి శ్రీహరి; కాన అనిరుద్ధుని విడిచిపుచ్చి బ్రదికి సుఖముల వడయుము" అని యుపదేశించును.

పాండవ : శ్రీకృష్ణుడు రారాజుతో రణము మానుమనియు లేకున్న త సహాయముకల విజయుని ఎవ్వరును గెలువలేరు — ధర్మజ భీమార్జున నకు సహదేవులు (యములు = నకుల సహదేవులు) ఏకమయిన త్రిలోకము లే మైనను జయము వారిదే నిశ్చయమని నిష్కర్షగా తెల్పును.

రాఘవ : రాముని సందేశముకొని అంగదుడు రావణుని సభ ప్రవేశిం ఆతని కిట్లనును. రాముడు నరుడుకాడు శ్రీహరియే. కపుల సహాయము కలదు మహాశక్తి సంపన్నుడు. సీతనిచ్చి శరణందుమని యుపదేశించును.

చ. కులము బలమ్ము నందనులు కొమ్మలు రాజ్యము భోగభాగ్యముల్
సలలితలీలఁ గల్గ న విచారతఁ బోకడబెట్ట నూరకే
తలచెదవేల వద్దు వినుతాతల దండ్రుల మంచికీర్తులన్
నిలుపుము పిమ్మటన్ నిరయ నిందలు దుఃఖమువచ్చుఁ జెప్పినన్. 61

యాదవ : కృష్ణురాయబారి బాణ సభనాతనితో నన్న విధము.

పాండవ : కృష్ణుడు రారాజు సభలో నుడివిన వాక్యములు.

రాఘవ : అంగదుడు రావణు సభలో నాతనితో పల్కిన పల్కులు.

చ. అనిన విభుండహంకృతి మ హామహవాంఛను మీఱిగిట్టి నె
ట్టన వడిగెల్వ నిన్నుఁ బ్రక టంబుగఁ గొట్టఁ దలంపనేర్తు నా

ఘనతర రోషభీషణతఁ గన్నుల నిప్పులురాల వేగ నొ
ప్పెనుబెరుగన్ జరాచరము విశ్వము దేహమయంబుగాఁగనున్.

యాదవ: బాణుడు దూత వాక్యము తిరస్కరించి పోరున కాయితమై యిదె వచ్చుచుంటినని పంపివైచెను. దూతకాగ్రహించి ఆతనిని కట్ట యత్నించ నాతడు ప్రతాపము చూపి ఎల్లరను ధిక్కరించి కృష్ణుచెంతకేగును.

పాండవ: రారాజు శ్రీకృష్ణుని కట్ట యత్నించ విశ్వరూపము ప్రదర్శించి వారిని చేతకానివారిగా నొనర్చి వెడలిపోయెను.

రాఘవ: అంగదుడు రావణు ననుచరులు తన్ను కట్టరా సభలో రావణుని కిరీటము పడదన్ని ఎల్లరిని నిస్సహాయులనుచేసి సముద్రము లంఘించి రాముని చేరెను.

వ. ఇట్లు ప్రళయ భైరవభీకర మహాట్టహాస సంరంభ విజృంభితుండయి
వేర్చి నిజతేజో జాలమహిమఁ దత్సభామంటప కలిత తదీయులు
పరవశులై పడఁగను, మూఢహృదయ, నిష్కారణంబున భవ
ద్వైరుదు పతాకాల యనిపాత పూర్వంబుగా బలసముదయంబు
నిర్మూలంబగునని మరలివచ్చె నంత నింత వృత్తాంతంబు విని—

యాదవ: బాణునితో దూత ఇట్లనుచు వెడలిపోయెను.

పాండవ: కృష్ణుడు రారాజుతో ఇట్లని, పాండవుల పాలికేగెను.

రాఘవ: అంగదుడు రావణునితో పుత్రమిత్రకళత్ర బాంధవ యుతంబుగ లంకనిశ్శేషము నశించునని తెల్పి రాము పాలికేగును.

ఆ. వె. స్వప్రియానుజుని బలభద్రునాప్త స్వ
భావుదానభిఖ్య బరిగ తాంబ
రుని యనల సముదయ రూఢి తనదుసేన
గావ నిలిపె దుష్ట భూ విభుండు. 63

యాదవ: తుష్ట + భూ + విభుడు = తృప్తినందిన కృష్ణుడు (సామము కాకపోగా దండమే శరణ్యము) తన అన్న బలరాముని సేనకు రక్షకునిగా - నాయకునిగా - నిలిపెను.

పాండవ : దుష్ట+భూవిభుండు = దుర్మార్గుడైన దుర్యోధనుడు-రారాజు-భీష్మాచార్యుని సేనానాయకునిగా నియమించెను.

తుష్టభూవిభుడు = రాముడు తన సేనను సుగ్రీవనాయకత్వమున నుంచెను. దుష్టభూవిభుడు = రావణుడు ప్రహస్తుని రక్షణలో తన సేనావారము నుంచెను.

వ. అంత — తర్వాత

సీ. విపులభేరీనాద భీతిఁ దలంకఁ గు
రుక్షేత్రతలమున రోషరూఢిఁ
జేరి జుట్టును తన సేనను గటకాప్తి
విడియించి యెదురను ద్వృత్తిఁ జేర్చి
గోధాంగుళి త్రాణ గుప్తిఁ బ్రహస్తుండు
భీష్మసేనాని యా భీమమూర్తి
రాఘోరబాణుండు రాజరాజనుజుండు
దుశ్శాసనుడు సూను దుష్టయుక్తి
తే. గీ. బంధుమిత్రాప్త భాసుర భరళతాంగ
కరితురంగమయుక్తి నే కగతినొకట
బూనియుగ్ర దశాక్షౌహిణీ నికరము
లనికి మునుకొనఁ బనిచితా నచటనిలిచె. 64

యాదవ : యాదవులును బాణుసేనయు నెదురెదురై నిలచిరి.

పాండవ : కురుపాండవ బలములు కురుక్షేత్ర రంగమున వ్యూహములు పన్ని అనికి సన్నద్ధములైనవి.

రాఘవ : రాక్షస సేనయు ఋక్షసైన్యములును రణమున కెదురెదురై నిలచినవి.

మ. అనిరుద్ధుండు రవి ప్రభుండగునె యు ద్యద్వైరిహృద్రావణుఁ
ఘువబాఖున్మను భీష్మునిఁ దొడరిగి న్కల్కైకుృదుర్భాషలేఁ
పునమించన్గలవాం బొనర్చి మదిఁ బెం పుఁ జేవయుఁ మీఱఁ దా
[illegible] 65

యాదవ : కృష్ణబాణులు ఉభయసేనలు కొంత పోరి యలసి నిలిచి మరల పోరు సాగించుచుండిరి.

పాండవ : భీష్ముని ప్రతాపమునకు ఆగలేక పాండవులు అలసియు కొంత విశ్రాంతికని మరల అనికి చొచ్చుచు వచ్చిరి.

రాఘవ : రామరావణులు సుగ్రీవాదులు రావణుని సేనానులు పోరుచు, అలసి నిలుపుచు, దురము సాగించిరి.

చ. జలజ యశోభిరాముఁడు సు సంస్థితిఁ గృష్ణుఁడు జిష్ణుఁడాజిలో
పలజనకాత్మజానుజులు బంధులునుండఁగఁ జూచి చంపఁగాఁ
దలకొనలేక సత్కరుణఁ దల్లడిలెన్ హరి బుద్ధిసేయఁగా
వలసిన కార్యమౌట బల వైఖరిఁ జేర్చి యెదిర్చె నుగ్రతన్. 66

యాదవ : తనభక్తుడు ప్రహ్లాదుని మనుమడు అని బాణుని అలయించి కరుణించి పలుసారులు కృష్ణుడు విడిచిపుచ్చును. ఆజి+లోపల+చనక=సర్వాత్మనాకినిసి అని సేయజాలక —

పాండవ : అర్జునుడు జాలిగొని అని చేయనన; హరిబుద్ధిసేయ=కృష్ణుని యుపదేశము అంగీకరించి; వలసిన కార్యమౌట=క్షత్రధర్మము కాదనలేక విధిలేక రణమొనర్చును; ఉభయ పక్షముల అందఱును బంధుగులు, మిత్రులును.

రాఘవ : కరుణాసముద్రుడు రాముడు - రావణుడు పట్టువిడువక పోగా విధిగ దురమొనరించును.

వ॥ అంత ధర్మప్రభుండుఁ గురువృద్ధ ప్రముఖాభివందనంబుగాఁ దత్సమ్మతంబున కుత్సాహియై ద్రోఁచి నడచెనపుడు —

యాదవ : కృష్ణుడు తన్ననుసరించిన వృద్ధులను అన్న బలరాముని పొనరిపించి తీవ్రముగ యుద్ధమునకు సంసిద్ధుడయ్యెను.

పాండవ : ధర్మజుడు భీష్మద్రోణ కృపాదులకు వందనమాచరించి యనుమతి వడసి యుద్ధమునకు కడంగును.

రాఘవ : రాముడు సుగ్రీవాది మిత్రవర్గమును రణమునకు పురికొల్పును.

తీవ్రముగ, కృష్ణబాణులకు, కురుపాండవులకు ముఖ్యముగా భీష్మార్జునులకు, రామరావణులకు ఉభయపక్షముల వీరనికాయమునకు రణమారంభమయినది.

ఆ క్రమము ముందు ఆశ్వాసమున చూతము.

## ఆశ్వాసాంత పద్యములు

### ముక్తపదగ్రస్త చంపకమాలావృత్తము.

చ. సమసమదాంత దాంత సుర సాలరసాలలనాపనా పదా
గమగమనాగనాగ లయ కాలయకాలయ నాశనాశవి
భ్రమభ్రమ వారివారి దవి భాకవిభాకరవాసవాస వి
ప్రమప్రమదారిదారిత ధ రాజధరాజ నవంద్యవంద్యజా॥ 1

### ముక్తపదగ్రస్త కందము.

క. నాగాధిప శయనాగా
నాగా సురహారి వినుత నతివృతి నాగా
నాగారివాహనాగా
నాగాహితవదన భక్త నగవహనాగా. 2

### పంచ చామరము.

సురాసురాసురాభి దాన సోమసోమ విగ్రహా
కరాకరాకరాశిధూత కాండకాండశాత్రవా
పరాపరాపరాక్రమోగ్ర భావభావజాకృతీ
ధరాధరాధరా సురేంద్ర ధర్మధర్మశర్మదా॥

## మాలినీ వృత్తము.

వరగుణమణి పేటీ వాజిరాజోరుధాటీ
భరితముని వధూటీ ప్రాంశుసౌవర్ణ శాటీ
ధరగిరి శతకోటీ దారితారాతికోటీ
పరిచరిత కిరీటీ భక్తసంతానవాటీ॥ 4

పై నాలుగు పద్యములు గోపాల పరబ్రహ్మమునకు విశేషణములు - కృతిపతి గుణ విశేషణములు.

తృతీయాశ్వాసము సంపూర్ణము.

# యాదవ రాఘవ పాండవీయము

## చతుర్థాశ్వాసము

క॥ శ్రీరాజిత నతవారా
వారాశి ఫణీశభోగ భాగవిహారా
హారాబ్జయశస్సారా
సారావ గజేంద్రవరద జగదాధారా॥

కృతికర్త గోపాలకృష్ణ పరబ్రహ్మమునకు సంబోధనలు —

వ. అవధరింపుము — వినుము.

సీ. శరభర్షభ గజకేసరి శతబలిమహా
బలజాత బలశౌర్య పటిమఁగనుచు
దరియంగదోద్ధతిఁ దద్గురు గతిమీఱి
యమలోగ్ర విక్రమ క్రమముఁ గనుచు
ననలకుమారక ఘనశక్తిచే వానిఁ
ప్రబలప్రతాప విభ్రమముఁ గనుచుఁ
బరమేశ్వర సహాయ వరబాణ భాసుర
విజయ పరాక్రమోద్వృత్తిఁ గనుచు

గీ. శౌర్యజయ శోభిరాముండు ధైర్యశాలి
హరి విభుండతి మహిత దివ్యాస్త్రవితతిఁ
బఱపి పరమహాశరబల ప్రతతి నొకటఁ
దఱిమి చెండాడి రక్తనిర్ఝరులొనర్చె. 1

యాదవ : బలరాముడు గదాయుద్ధమున నసమానబలుడు. దరియన్ = గదోద్ధతి; ఈశ్వరుడు తదనుయాయులు బాణునకు సహాయులు కాన; అనల +

కుమారుడు = అగ్నికొడుకు; కుమారస్వామి, దేవసేనాని; శివుని వీర్యము అగ్ని ముఖమునబడి క్రమముగా రెల్లులో వృద్ధిబొంది షణ్ముఖుడయి. అగ్నిభార్యలు షట్కృత్తికలుసాక పెరిగినవాడు కాన కుమారస్వామి అగ్నిజాతు డగును, కుమారునట్లే పరమేశ్వరుడును బాణునకు బాసటయగును.

బల-రాముడు = బలరాముడు; హరివిభుండు = కృష్ణుండు వీరలు బాణు నితో నాతని సహాయులు ఈశ్వరునితో నీశ్వరు గణములతో తలపడి వారి యస్త్ర శస్త్రములు ఖండించి రాక్షసులను పెక్కురమడియించి రణరంగము రక్తప్రవా హములు ప్రవహింపచేసి మించిరి.

పాండవ : శతబలి = ఇంద్రుడు; మహాబలి = వాయువు = వీరి కుమారులు అర్జునుడు భీముడును. యమలు = కవలు-నకుల సహదేవులు. (యమళము)

అనల + కుమారక + ఘన + శక్తి = ఆగ్నేయమయినదియు, కుచ్చితులను చంపునదియు నగు శక్తి ప్రయోగించ దానిచే కురుసైన్యమున పెక్కురు చని పోవుదురు; విజయుడు ఈశ్వర వరమున పాశుపతాది మహాస్త్రములు సంపా దించెను. ఖాండవ వన దాహమునకు సంతసించి అగ్ని అక్షయతూణీరము గాండీ వము ఇచ్చెను, ఇట్టి కలిమికల అర్జునుండు, హరివిభుండు, కౌరవబలమును హత మార్చ కదనరంగము తృటిలో భీభత్సమయి రక్తప్రవాహ సంకులమయ్యెను.

రాఘవ : మహాబలజాత = మరుత్తనయుడు మారుతి అంగద + ఉద్దంతి = వాలికొడుకు అంగదుపరాక్రమము రాముడు + హరివిభుండు = శ్రీరామచంద్రుడు సాక్షాద్వైకుంఠుడు. వీరెల్లరు దివ్యులు. దివ్యాస్త్ర సంపత్తి కలవారు; రావణుడు తదనుయాయులును మాయావులు. రామరావణయుద్ధమున రాక్షస సంహారము అగుట రక్తప్రవాహములు కదనరంగమున ప్రవహించినవి.

సీ. తవిలి బుధపరహ్రాదావణ భీష్ముండు
బహుబల దుర్గాతి పతి కణంగ
నంగద హరివిభు నరుదైన వాలమ్ము
హతులను భీమసేనాతి విహ్రాతి
నజబాణ బలశతాం గజవమ్ములణఁగిన
మిన్నంది రోషాన మేనుబేర్చి

యెదిరి వారలనెల్ల నేకోద్ధతిని మీఱి
దివ్యాస్త్రజాలమ్ము దీటుకొలిపి
తే. గీ. యెచటఁ జూచిన దానయై యేపురేగి
యెగిచి మాయమైనట్టె దా నేరికేనిఁ
దేఱి చూడంగ రాకను దీప్తభంగి
నొంచి చెండాడి నురిమెను మించినణఁచి. 2

యాదవ : బుధ + పర + హృత్ = దేవతా సంబంధమయిన హృదయ ములు, వానిని విదారించుటలో ద్రావణుడు రావణుడు = బాణుడు భేదించువాడు; బుధ + పర = దేవతలు కానివారు అసురులు, వారియొక్క హృత్ + ద్రావణ + భీష్ముడు = హృదయ విదారకుడు, భయంకర పరాక్రముడు, రాక్షససంహారి - హరి. ఆతని అస్త్రశస్త్రములు బ్రహ్మాస్త్రాదులు అసురుల ప్రాణములు హరించునవి. బాణుని రాక్షసమూక నడంచి హరి మించెను. బలరాముడు నట్లే రాక్షస సంహార మునుచేసి మించెను.

పాండవ : భీష్మ పరాక్రమము అసహ్యమయినది పాండవ వీరులకు. అటుల భీమార్జునుల పరాక్రమము కురువీరుల కసమహ్యమయినది. కాని భీష్ముడు ఎట చూచిన తానయై పాండవులకు తేరిచూడ శక్యము కానియట్లు పరాక్రమించి అరులను మించి నొప్పించెను.

రాఘవ : బుధ......రావణుడు = దేవతారి రావణుడు. అంగద + హరి విభు + వాలమ్ము = కపిముఖ్యుడు అంగదుడు; ఆతని వాలమే తీవ్రశరముఃకాగా రాక్షసమూకను చుట్టగాచుట్టి త్రిప్పి నేలగొట్టుచుండెను. మేను + బేర్చి = కాయ ములుపెంచి కపులు రాక్షసులను హింసించి చంపుచుండిరి. రాక్షసులకు రామ లక్ష్మణులయు కపులయు పరాక్రమము అసహ్యమయినది.

క॥ హరివరచక్రము నుద్ధతిఁ
బరగఁగఁ బైకుటికి యతనిఁ బ్రదరగతి వడిన్
ధరఁ బడఁజేయఁగ వలవని ।
హరివిభు యత్నము మఱల్చె నాపర శక్తిన్. 3

యాదవ : బాణుడు మృతినందువాడుకాడు. కాగా కృష్ణుడు ప్రయోగించిన చక్రశేషమును శక్తి ప్రయోగించి మరల్చెను. అట్లే బాణుడు ప్రయోగించిన అస్త్రములన్నెల్ల చక్రధారల హరి ఖండించివైచెను.

పాండవ : భీష్ముఁ డిట్లెంతకు నసంహార్యముకాగా కృష్ణుడు భీష్ముని చంపుద మని చక్రము చేతఁగొని రథముదిగి భీష్మునిపై కేఁగుయత్నమును అర్జును డాతని వెనుకకు దిగిచి ప్రార్థించి చక్రముపట్టనన్న యాతని ప్రతిన జ్ఞాపకముచేసి ప్రార్థించి మరల రథమున నిల్పుకొని భీష్మునెదురించి అర్జునుడు నిల్చెను.

రాఘవ : రామరావణుల యుద్ధమున మహాస్త్రముల ప్రయోగోప సంహారములు సూచితములు.

తే. గీ. రుమనిజయ యుద్ధదశ దినాం తమున నపుడు
దనుఁగదసి వేడిచూపున య్యానువుమించఁ
బరశరాహిహారి శిఖండి బిరుదహారి వి
భుండువైరి హ్మృద్రావణుఁ బూని పేర్చి. 4

యాదవ : కృష్ణుడు బాణునితోనయిన యుద్ధదశ + దినాంతమున = పగ లంతయు అనిచేసి సంధ్యాసమయమున ప్రతినిత్యము బాణుని తరిమి పురిలోనికి పర్విడచేయుచుండును. దశ + దిన = పది దినములు గడచిన యనంతరము. పర + శర + అహి + హారి + శిఖండి = పర శరములను పాములను హరించుటలో శిఖండి = నెమిలివంటివాడు కృష్ణుడు, బలరామాదులును బాణుని గురిచేసి నిశితాస్త్రములు ప్రయోగింతురు.

పాండవ : పదియవరోజు యుద్ధమున తొలినాటిరాత్రి పాండవులు భీష్ముని ప్రార్థించ శిఖండిని ముందిడుకొని యర్జునుడు బాణమేయ తా నస్త్రసన్యాస మొనరింతునని యుపాయము తెలిపెను. ఆ విధముననే శిఖండిని ముందుంచికొని అర్జునుడు బాణమేయ అస్త్రము విడచి అంపశయ్య మేనువాల్చెను. భీష్మపర్వము ముగిసినది.

రాఘవ : రాముడును అరిశరములు హరించుటలో నెమిలివలె నయిన వాడు. రాక్షసాస్త్రములను అవలీల ఖండించి రామాదులు మించిరి.

చ. పటుతర దివ్యబాణముల పారముగాఁ బరగించిమించి యొ
క్కటఁ నిజసైన్యముల్వెఱిగి గ్రక్కున నల్లడఁ బాఱ భీష్ము నం
తట బహుశోభిరాము శివనాముని జేరి నిరూఢిశౌర్యవో
త్కటగురు తత్ప్రియుక్తబర కాండముల న్నురుమాడి యుద్ధతిన్. 5

యాదవ: కృష్ణుడు బాణుని తరిమి యెదిరించిన శివునిదాకి అరులను చిందరవందర యొనరించెను.

పాండవ: భీష్ముని యుద్ధతిమాన్పి కౌరవులను దిక్కు మొగము కాచేసి పాండవులు మించిరి.

రాఘవ: అనంతముగా దివ్యబాణములు ప్రయోగించి రాముడు రావణు సైన్యమును దిక్కుమొగముగునట్లు చేసెను.

చ॥ సలలిత దివ్యబాణబల చాతురి నప్పుడు సర్వతోముఖా
కలనగతిన్ దదుగ్రశర ఘట్టన భీష్మనిక్లిప్తదావదా
హాలలితవృత్తి నార్చి మెఱ యన్ దలలెత్తి దిశల్గనె న్ మహో
జ్వల వరవాహినీశబల సంతతి భీతమతిన్గలంగగ॥ 6

యాదవ: బాణునిచే ప్రయోగింపబడి దవానలమువలె యాదవ సైన్యమును చిక్కుపఱచు ఆగ్నేయాస్త్రజ్వాలలు కృష్ణుడు ప్రత్యస్త్రప్రయోగంబున శాంతింపచేసి పుంఖానుపుంఖములుగ బాణుసైన్యమును దివ్యబాణాసారమున ముంచ వారు భీతిలిరి.

పాండవ: భీష్ముడు యుద్ధము చాలించ కృష్ణుడు అర్జునుని రథము దిగుమని యుపదేశించి యనంతరము తానును దిగినవెంటనే భీష్మునిచే ప్రయోగించబడిన దివ్యాస్త్ర జాలజ్వాలలు భూమ్యాకాశములు నిండి పర్వతనమహిమ నాజ్వాలలు శాంతింపజేసి భీతికలగిన పాండవబలమును రక్షించెను. కృష్ణుడా పదిదినముల యుద్ధమున భీష్మ దివ్యబాణాసారమును తనకాలిక్రింద నణచియుంచెను. పాండవులు సుఖులయిరి.

రాఘవ: రాక్షసులు ప్రయోగించిన బాణాగ్ని చల్లార్చి కపులను రాముడు రక్షించుచుండెను. కాని ఇంద్రజిత్తు నాగబాణము ప్రయోగించ రామ

లక్ష్మణులు కోమక వానరబలము నాగపాశబద్ధులయి రణరంగంబున మూర్ఛ పోయిరి.

తే. గీ. అపుడు గురు పక్షిరాజు దా నటకువచ్చి
బలము సమ్మదమందఁ ద త్ప్రదరవృత్తి
నాగపీడలు వాపనా నర విభుండు
చండబాణుండు ధర్మగు రుండుచేరి॥ 7

యాదవ : బాణుడు యాదవులపై నాగాస్త్రము ప్రయోగించి వారిని బాధించనెంచ, పక్షిరాజు = గరుడుడు దాని ప్రభావము తన యునికి వలన నిష్ఫలముచేయ యాదవులు పీడలేక యుద్ధమున ప్రవర్తిల్లిరి.

పాండవ : నాగపీడ = భగదత్తుని గజము సుప్రతీకము దానివలన పాండవ బలము హింసకు పాల్పడ, నరుడు = అర్జునుఁడు సంశప్తకులను నిర్జించి బలము సొచ్చి భగదత్తుని సుప్రతీకముతోపాటు చంపివేయును. అంతవఱకును సుప్రతీకము పాండవబలమును చాల పీడించెను. భీమసేనునితోపాటు పలువురు తలపడి దాని సంరంభము కొంత ఆగిరి. ఆ విధముగ కృష్ణురక్షణమున పాండవులు పీడలువాసి యుద్ధసన్నద్ధులు కాగా, ధర్మగురుడు = ధనుర్విద్యాగురుడు ద్రోణాచార్యులు రారాజు ప్రార్థన నంగీకరించి సైన్యాధిపత్యము వహించ యుద్ధమారంభ మయ్యెను. ద్రోణపర్వము మొదలయినది. ఈతడు అయిదు దినములు యుద్ధ మొనరించెను.

రాఘవ : గరుడుడు యుద్ధరంగమునకు వచ్చి నాగపీడలు తొలగించి యేగ రామలక్ష్మణులును కపులును పీడలు తొలగ తిరిగి యుద్ధోన్ముఖులయిరి.

వ. సముచిత వృత్తిన్ బ్రవర్తిల్లునంత నా నరవిభుండు.

యాదవ . కృష్ణుడు;
పాండవ : ధర్మరాజు;
రాఘవ : రాముడు.

క. వినయాదర భాషణమున్
వినుపించి నిజాంగబలము వృద్ధిగఁ గావన్

మనవిఁ దగగెల్చి వీడ్కొని
ఘన సమరారంభ కుతుక కలితుండయ్యెఁ. 8

సమము. ఉభయపక్షములు తిరిగి యుద్ధసన్నద్ధములయినవి.

ఉ. అంతట వేగయుద్ధమున కాయతమయ్యెడ హీనబాణ దు
ర్దాంతమతవ్యాపక్షి గురు రక్షిత రాజకుమార సంతతిన్
జెంతనుగాంచి విస్మయము జెందుచు దానవకార్య మెచ్చనా
క్రాంతమతిన్ హరిప్రభుడు కాండములుఁ జతురంగ సేనలఁ. 9

సమము — ఆ తీరున గరుడునిచే నరుచే నాగపీడ తొలగ నిరుపక్షము
లని కెదురెదురై పోర దొడంగినవి.

క. భీకరగతిఁ దునుమాడఁగఁ
బైకొని పరభాసురోగ్ర బలముఉకుగతిన్
వీఁకమెయిఁ బోరవడి తన
మూఁకలఁ బురికొల్పసమరము ఘనమయ్యెన్. 10

యాదవ : కృష్ణాదులవలన పీడింపబడు బాణుని దేవరాక్షస సమూహము (దేవ = శివు పక్షమువారు బాణునకు సహాయమున నున్నవారు) పర్విడుచుండ బాణుడు వారిని పురికొల్పుచు అని మొన నిల్పెను. ఉభయపక్షములు తలపడ పోరు ఘోరమయ్యెను.

పాండవ : ద్రోణాచార్యుడు సేవలను నడుప సమరము దుర్నిరీక్ష్య మయ్యెను.

రాఘవ : రామ రావణ బలము ఉత్సహించి మించి పోరసాగినవి.

వ. అప్పుడు — ఆ సమయమున.

తే. గీ. బహుబల జయశోభగదత్త వరసమాఖ్యుఁ
డవనిజాతి సంభవరూఢి హరిదధగతి
సుప్రతీక భద్రారూఢి సురుచిబాణుఁ
డాప్తబల ధూళి ధూమ్రాతుఁ డలుకఁబేర్చి. 11

యాదవ : బాణుడు ఆగ్రహించి కనుఱ్ఱవడ విజృంభించి వైరివర్గము శరాసన తెక్కకు మిక్కిలి అశ్వములను ఏనుగులను వీరవర్గమును పసిమి యుద్ధరంగమును బాణపరంపరచే కప్పివైచి అరులను కలంచెను.

బహు + బల + జ + యశో + భగ = సూర్యుడని, ఈశ్వరవర ప్రసాది సుప్రతీక + భద్ర + ఆరూఢ = భద్రగజ మధిరోహించి........ఇత్యాదిబాణునకు విశేషణములు: ఆప్త + బల + దూళి + అసంఖ్యాకమయిన తన సైన్యవిజృంభణమున లేచిన ధూళి; ధూమ్రాక్షుడు = కనులను గప్పగాననుటయు; కోపించి కనుఱ్ఱబడ ననియు;

పాండవ : ద్రోణాచార్యుడస్త్రగురువు చూచు వారాశ్చర్యపడ విజృంభించి పెక్కురథ, అశ్వ,పదాతి, వీరవర్గమును యమాలయమునకు పంపి మేఘుడు వర్ష ధారలచే కొండనుకప్పినట్లు పాండవసైన్యమును బాణాసారముచే గప్పివైచెను. భగదత్తుడు = సూర్యదత్తుడు ద్రోణునిచే చచ్చుట. భగ + దత్త = సూర్య వరప్రసాది = కర్ణుడు; అర్జునుడు సంశప్తకులమును నిర్జించి తిరిగివచ్చి కర్ణునితో పోరి యీతనిని పలాయితుని జేయును. సుప్రతీకముగజముతోపాటు భగదత్తుని చంపెను.

రాఘవ : నాగపాశబంధములు వీడ్వడ రామాదులు సుఖులుకాగా తిరిగి వానరబలము విజృంభించి లంకలోని రాక్షసులను గగ్గోలుపఱుప రావణుడు ధూమ్రాక్షుని సేనకూర్చుకొని యుద్ధమునకుపో నాజ్ఞాపించెను. ధూమ్రాక్షుడు వరబలమున నహంకరించి కోపించి వానరబలముపై విజృంభించెను.

క. సుమహితబాణ పరంపర
విమతులు బొగడంగఁజొచ్చి విక్రమగతిఁ దా
నమితహారి కుంజరశతాం
గములఁ దునిమి సమరభూమి గప్పెఁ జెలుచన్. 12

యాదవ : అలుకమెయి బాణుడు అసంఖ్యాకములయిన రథగజతురగ పదాతుల నడంచి రణరంగమును మహాస్త్రప్రయోగమున బాణాసారమున కప్పెను.

పాండవ : సూర్య-భగదత్తుని చంపి ధర్మరాజును పట్టియిత్తునని రారాజునకు తానిచ్చిన ప్రతిజ్ఞను తలచి ద్రోణాచార్యులు పాండవ సైన్యముపై విజృంభించెను. పాండవ బలము ఉత్సహించి గురు నెదిరించిరి. కాని గురునిధాటి కేరును చాలరైరి.

రాఘవ : ధూమ్రాక్షుడు కపిసైన్యమును కలచి విజృంభించెను.

చ. హరిబలహారిదోర్బల వి హారి జితారి మరుద్వర ప్రభుం
డొఱిగిత దత్యుతాంశు మహి తోగ్రగళ రాహతి నోర్వ రామిఁగా
నరిధృతి నిల్వ నడ్డమయి యాతని నాశుగయుక్తిచే వడిఁ
ధరఁబడఁగూల్చి వాహనయుతంబుగఁ దద్బలమెల్ల మెచ్చఁగన్. 13

యాదవ : కృష్ణుడు బాణుడు చావడని తెలిసినవాడు కనుక హరి........

రామిగా = కృష్ణునకు విశేషణములు. ధైర్యమున తన్నెదిరి నిల్చిన బాణుని వాహనములు చంపి బాణములనొంచి వానిని నేలబడ మూర్ఛితు నొనరించెను.

పాండవ : మరుత్ + వర + ప్రభుడు + భీముడు విజృంభించి ద్రోణుని నెదురించ గురుడాతనిని మూర్ఛమొందెను.

రా॥ మరుద్వరప్రభుండు = హనుమంతుడు పరాక్రమించి ధూమ్రాక్షుని హతమార్చెను.

సీ. చటుల మహాశర సంధాన లఘుబంధు
రత్నప్రహస్తుడ య్యతుయూాస్త్ర
చాపగురుండు క లాపిరథుండు సే
నాని మహోద్ధతిఁ బూనివచ్చి
కడఁగి పద్మవ్యూహ గతి నిజబలముల
నిలిపి యెదిరి సైన్య ములఁ గలంచ
నతను మూర్తిధనంజ యకుమారుఁ గని హరి
విభుఁడంప నాతఁడు వేగఁ బేర్చి

తే. గీ. గడఁగి ఘనపత్ర రథవర గతినిజొచ్చి
భీమరక్షోర్జిత వ్యూహ వితత బలము
తన బలమ్ముల యుక్తి నుత్తాలరేఖఁ
జించి చెండాడి నురుమాడి నొంచిగెల్చె. 14

యాదవ : కలాపి.... సేనాని = కుమారస్వామి బాణాసురుని పక్షము ధనంజయుడు = అగ్ని - ఆతని తనయుడు కుమారస్వామి ఈతని నెదుర్కొన హరి మన్మథు నపరావతారము ప్రద్యుమ్నకుమారుని పంపించ నాతడు కుమారు నెదుర్కొని క్షణములో గరుడునివలె మహోరభసము సేనావారమున ప్రవేశించి కుమారుని నొప్పించి విజయియయ్యె.

పాండవ : సంశప్తకబల మర్జునుని దూరము కొనిపోయె. ద్రోణుడు పద్మ వ్యూహముపన్ని సైంధవుని ద్వారమందుంచి పాండవుల నెదురించెను. ఒరుల కేరికిని నలవికాని యా వ్యూహభేదన మొనరించ అభిమన్యుని ధర్మరాజు ప్రోత్స హించి ఆతనివెంట భీమాదులు రాగలరని పంపును. అర్జునుడు వినా ఎవ్వనినైన నొక్కదినము తానాపగల వరము ఈశ్వరుని వలన శిశుపాలుడు సంపాదించెను. అభిమన్యుడు మెఱపుమెఱసినట్లు వ్యూహభేదనముచేసి లోన ప్రవేశించి మార్తాం డునివలె అరిదుర్నిరీక్షుండయి విజృంభించి కౌరవులను కలంచెను.

రాఘవ : రావణుడు ధూమ్రాక్షు వధ విని చింతాక్రాంతుడై ప్రహ స్తుని రణమున కనిచెను. సుగ్రీవుడు ప్రత్యేకించి నీలుని పురికొల్పెను. ఆతనివెంట అంగదాదు లేగిరి. నీలునితో ప్రహస్తుడు తలపడెను.

చ. అతుల ధనంజయాత్మజుఁ డహంకృతిమీఱఁగ బాణపంక్తి నొ
క్కట గురుకర్ణశల్యగతి గాను సుయోధను తమ్ములన్నము
త్కటభటకోటి ఘోటరథ దంతి సమూహములోలిఁ గూల్చియు
ద్భటగతినార్చెఁ దద్బలము ప్రౌఢి యణంగి చలించెనెంతయున్. 15

యాదవ : కుమారస్వామి ప్రతాపమునకు యాదవబలము దైన్యమునకు వచ్చినది.

పాండవ : అభిమన్యు నెదుట ద్రోణ, కర్ణ, శల్యాదులును దుర్యోధను సోదరులు దుశ్శాసనాదులును కురుకుమారులును చేతకాని వారయిరి. కురు బలము ధైర్యములు చెడి దీనత్వమునందినది.

రాఘవ : కపులలో నీలుని ప్రతాపమునకు కొంత చలించియు ప్రహస్తుడు ఎదిరించినిలువ నీలుడాతని రథమునడంచి మించ ఇలకు దిగి యాతడు నీలునితో పోరసాగెను.

వ. అట్టి సంకుల సమరంబున —

సమము — వీరునితో వీరుడు- గజముతో గజము ఇత్యాదిగా దొమ్మి యుద్ధమయినది.

తే. గీ. లలి ధనంజయ తనయుండు లక్ష్మణాత్మ
హారి దుశ్శాసన ప్రభు డతను మూర్తి
బంధురక్షప్రహస్తుండు ప్రౌఢిఁగదల
నెదిరి చెడఁగొట్టి పడవేయ నేపుదఱగె॥ 16

యాదవ : కృష్ణు తనయుడు ప్రద్యుమ్నునకు కుమారస్వామి యోడె.

పాండవ : పలువురేకమై అభిమన్యు నెదిరి అలయించి పర్యవసానమున దుర్యోధను తనయు లక్షణ కుమారునంప అభిమన్యుడు వానింజంపె. అనంతరము దుశ్శాసన సుతుడు తలపడ ఉభయులు పోరి ఒకేసారి చనిపోయిరి.

రాఘవ : నీలునిచేత ప్రహస్తుడు మరణించెను. రాక్షస బలము రణరంగము విడచి లంకలోనికి పర్వి తెను.

చ. హరివిభుడా సుశర్మయుతి నాసహాక్ష్మల్లస దుగ్రసేను వే
దటిమి జయించిరానటుల ధర్మరణంబున నొంచినట్టి త
త్పరకృతిఁగాంచి యాత్మభవ । భంగము నగ్గడు దుఃఖమంది దు
ర్భరధృతి సింధురాజు పర పంక్తులఁ జంపఁగృత ప్రతిజ్ఞుడై॥ 17

యాదవ : ప్రద్యుమ్నుడు కుమారస్వామిని రణము విడిచి యేగునట్లు చేసి తండ్రికి ముదము చేకూర్చ బాణుడు జయమో మరణమో యనుచు కదనమునకేగును. ధర్మ + రణంబున = విలుయుద్ధము.

పాండవ : అటుల్ + అధర్మయుద్ధమున = అధర్మముగ అభిమన్యుని కౌరవ వీరులు చంప ఆ సందర్భమున సైంధవుని వలన హెచ్చు అపకారము కలిగెనని గ్రహించి ఆతనిని చంప ప్రతిన పట్టెను. - అర్జునుడు

రాఘవ : నీలునిచే ప్రహస్తుడు మరణించ తన సేనలు రణమువీడి లంకలో తలదాచుకొనరా రావణుడు దుఃఖించి అరులను నిర్జించ కృతనిశ్చయుడయ్యెను.

ధర్మయుద్ధమున నే నీలుడు ప్రహస్తుని చంపెను.

క॥ అరిదరకరుఁడా విజయుఁడు
పరహ్యాద్రావణుఁడు జేరి బహుబాణములన్
బరిపంథిఁ గురువ్యూహము
లటిముటిఁగావించి చీల్చి యణఁచె నురువడిన్॥ 18

యాదవ : విజయుడు = జయశీలి ప్రద్యుమ్నుడు కృష్ణుడు తత్పక్షము వారు బాణసేనావారమును తద్వేగమును నడంచిరి.

పాండవ : విజయుడు = అర్జునుడు; కురు + వ్యూహము = అరులయిన కురుసైన్యమును చీల్చిచెండాడ మొదలిడెను.

రాఘవ : రావణుడు వానర సైన్యమును దీనతకు తెచ్చెను.

తే॥గీ॥ అపుడు జితవైరి నా సత్యా కాత్మజుండు
భూషిత సువర్ణ భూరిశ్ర వునిన విభుని
విజయబాణ సముద్ధతి వేగఁ గరము
బడఁగ నణగించి బలమును గెడపి సనియె॥ 19

యాదవ : బాణునితో యాదవవీరులు తలపడి రాక్షస సైన్యమును కలంచిరి. సాత్యకి తన లావుచూపి పరబలమును పారదోలెను — సత్యక + ఆత్మజుడు = సాత్యకి.

పాండవ : విజయ + బాణ + సముద్ధతి + వేగ + కరము + పడగ = పలువీరులతో పోరి అలసిన సమయమున భూరిశ్రవు డాతనితో తలపడి చేయిమీరి సాత్యకిని క్రిందవైచి ఖడ్గమెత్తి యాతనిని ఖండించపోగా దూరమున విజయు డాతని కరమొక బాణమున నఱకి క్రింద పడవైచెను. సాత్యకి లేచి కోపమాగక భూరిశ్రవుని శిరము ఖండించివైచెను.

రాఘవ : రాముని బాణవేగమునకు రావణుడు నాతని సైన్యము నిలువ లేక యప్పటికి రణము వెడలిపోయెను.

ఉ॥ పావని తద్బలాధిపుని పైఁబడఁగూల్చి సుమిత్రసూను బా
హావిభవాప్తిమీఱి తను నందిన భీమునిగాంచి కృష్ణుఁడా

శావిజయాభిరాముఁడు ల సద్ధృతి సింధు వరో్గ్రతద్భలం
బావలదుగ్రబాణముల నార్చుచుఁగూల్చె సురులున్నతింపఁగన్॥ 20

యాదవ: దేవతలు నుతించ కృష్ణుడు సింహనాద మొనరించి బాణు బలమును చాలమట్టుకు హతమార్చి బలమునతిక్రమించి బాణుని పలువిధముల మహాస్త్రప్రయోగముల నలయించ నాతడు రణము తొలగిపోయెను.

పాండవ: విజయుడు చిల్లరమూక నతిక్రమించి సైంధవుని పొదివికొని రక్షించుచున్న కౌరవవీరులను ఉగ్రబాణ ప్రయోగంబుల చీకాకుపఱచి పలువు రను చంపి సైంధవుని సమీపమునకు రథమును దోలుమని కృష్ణుని కోరెను.

రాఘవ: లక్ష్మణుడు రాక్షసులతో తలపడి పోరుచుండ అతనిపై కుఱుకు రాక్షసవీరులను పెక్కండ్రను మారుతి చంపెను. లక్ష్మణు బాణములకు పలువురు రక్కసులు ఆహుతులయిరి.

సీ॥ ఎదిరించి ప్రదరంబు లేయ జయద్రథు
నాప్తోగ్రబాణుని హాత విరోధిఁ
బంక్తికంధరుఁ గని బలజయశోభి రా
ముండు గృష్ణుండు జిష్ణుండు జేరి
పటుబాణపంక్తులఁ బైఁ బరగించిన
శరజాలములు వేయ శరములందు
చాపముల్ మెఱయంగ సంధించియేసిన
నవియటఁ దునుమాడి యాగ్రహమున

తే॥ గీ॥ పవనజ వనచర మహిత వాహనంబుఁ
బఱపిపైఁబడి బహుదివ్య బాణములను
శరశరాసన రథరథ్య సమితిఁ దునిమి
గదిసి సర్వాంగములు నిండ గుదులుగ్రుచ్చె. 21

యాదవ: బాణుడదరి కృష్ణునిపై మహాస్త్ర ప్రయోగంబులు సేయ కృష్ణుడు ప్రత్యస్త్రప్రయోగంబున వాని నన్నింటిని నడుమనే ఖండించి యాతని

తురంగములను చంపి రథము నుగ్గుసేసి విల్లును ఖండించి నిశితబాణ పరంపరల నాతని శరీరము తూట్లుపడచేసెను.

పాండవ : సైంధవుని రక్షించు యోధవరులను పలువురి నొక్కసారి విజయుడు పెక్కు బాణము లొక్కుమ్మడిపఱపి సర్వుల దేహములను గుదులు గ్రుచ్చినట్లు నేలబడున ట్లొనరించి మించెను.

రాఘవ : రాముడు దివ్యబాణ ప్రయోగంబున రావణుని శరీరము తూట్లుపడున ట్లొనరించెను. రావణుడు హనుమంతునితో తలపడును

చ॥ ధనువులు వేఱొకటి కొని యు దగ్రత నాప్తబలంబుతోడ వీఁ
కను దనమీద ఘోరతర కాండములన్వడిమించ హెచ్చి గ
ప్పినఁగని యంతఁ దమ్ముఁడరి భీముడు లక్ష్మణుఁడుఁ బలమ్ములఁ
దునుమ నతండు దగ్రబల దోర్గతిఁ గప్పెను బాణపంక్తులన్॥ 22

యాదవ : బాణుడు వేఱువిల్లు చేకొని తనవారిని పురికొల్పి కృష్ణుమీద భీకరబాణ పరంపరలేయ సాత్యకి బలరాము లుత్సహించి బాణుబలంబుపై నడరి వారి నురుమాడ వెనుతివియక బాణుడు ఎదిరిసెదిరి నిలచిపోరుచు తన చే బలిమి మెయి అస్త్రప్రయోగ మొనరించెను.

పాండవ : కౌరవవీరులు భీమార్జునుల ప్రతాపాగ్నికి నిలువలేకపోయియు నోపినకొలది పోరుచు సైంధవు దెస నరుడురాకుండ యత్నించుచుండిరి.

రాఘవ : రావణుడు రాము బాణాహతినొచ్చియు కపులపై నిశితబాణము లేయుచుండ హనుమదాదులును లక్ష్మణుడును రావణునకెదురై పోరుచు నాతని నలయించిరి. రావణుడు లక్ష్మణునితో తలపడును.

తే॥ గీ॥ తద్ధనుర్గురు జాభీల తరశరములఁ
గర్ణ కఠినత్వరూఢి వి శీర్ణ హృదయ
శల్యగతినిఁ బ్రదరయుః క్తిఁ జక్కఁజేసి
వితథముగఁ జేసెఁ దద్బల వేగమపుడు॥ 23

యాదవ : కృష్ణుడును యాదవవీరులును బాణునితోఁ బాటాతని మిత్ర వర్గమును హింసించి వారియేపు నణంచిరి.

పాండవ : విజయుడు ద్రోణ, కర్ణ, శల్యాది కురువీరుల పొంకము విజ యస్త్రవేగమున నిష్ఫలముగా నొనరించెను.

రాఘవ : రామలక్ష్మణులయు కపివీరులయు పరాక్రమ క్రమము రావణు నకు హృదయశల్యముగ పరిణమించెను.

మహాస్రగ్ధర

ఘనకోదండోగ్ర మౌర్వీక్వణనదశదిశా క్రాంతమై నిండియుండన్
ఘననీరంధ్రాంధకార క్రమము నిఖిల భాగంబులన్గప్పియుండన్
ధ్వనితోద్యద్బాణ వేణీపటుగతి శరధి క్షోభఁ బ్రహ్మాండమొప్పన్
గినుకన్ దద్వైరిఁగూల్చెన్ గృతిహితదినా క్లిప్తిసారాప్తిమెచ్చన్. 24

యాదవ : కృష్ణుడు బాణుని దాకి పింఛివారి మోత దశదిక్కుల నిండ, బాణపరంపర సూర్యుని చాటుచేసి అంధకారముగా బాణవేగములు బ్రహ్మాండ ములు దాక బాణుని నేలకు వ్రాలచేసెను.

పాండవ : విజయుడు కురువీరుల కనులు బాణాసారాంధకారమున గప్ప సూర్యాస్తమయ మాయెననుకొని సైంధవుడు వ్యూహమధ్యమునుండి తలయెత్తి చూడ నాక్షణమ యాతని శిరము త్రుంచి ప్రతిన నిలుపుకొనెను.

రాఘవ : రాముడు రావణుని అవసునిచేసి నేల కొఱగచేసెను.

తే॥ గీ॥ కలఁగనిన నరుఁడు మహోగ్ర కాండయుక్తిఁ
దత్ప్రిమద జనకాంకయు క్షతఁ దలపడఁ
గూల్చెఁ బరశక్తి పటుగని బెల్చవిటిగి
యశము జెడఁగ లంకఁజొరఁగ నరిగె వైరి॥ 25

యాదవ : బాణుడు ఓడి సిగ్గున పురిలోని కేగెను.

పాండవ : తల + పడగ + కూల్చె = విజయుడు సింధురాజు తల నేలపడ చేసెను. వైరి కౌరవవర్గము మనసులు చెడన్ + కలంక. చెదరి పోరువీడి శిబిర ములకేగిరి.

రాఘవ : రావణుడు కదనరంగమునకు తొలగి లంకలోని కేగెను. చెడగ + లంక + చొరగన్ అరిగె + వైరి.

చ॥ అరుదుగ సైన్యమధ్యమున । నంబకచిత్రత సన్ముఖోన్నతిన్
సరసిరుహాకరంబు మన సంగరసీమ నొనర్చి వేట్క భా
సురభువన ప్రకాండములు సొంపగు మెచ్చులుదెచ్చి సన్మనో
హారులకు దప్పిఁదీర్చెనరి నస్తమయావధిఁగూల్చె హెచ్చుగన్. 26

యాదవ : సంధ్యాసమయముకా బాణుడు పురి కేగ కృష్ణుడు సత్పురుషుల హృదములకు దేవతలకు సంతసమొప్పచేసి (సత్ + మనః + హారులు = సత్పురుషుల హృదములు హింసించినవారు రాక్షసులు; అట్టివారి హృదముల కానందముగూర్చిన వాడు రాక్షస సంహారి-హరి = సత్పదము దేవతలకు నన్వయించును.

పాండవ : సింధురాజును చంపి సైన్యమధ్యమున దేవతల నుతులందుచు నరుడు హయములకు విశ్రాంతి కల్పించుచు అరి నస్తమింపచేసెను. అనంతరము సూర్యుడస్తమించెను.

రాఘవ : రావణుడు కలంక లంక కేగ కపులు విశ్రాంతి గైకొనిరి. హరి = కపి.

క॥ అనుచున్బొగడెడి నులివులు
వినువీధిని ధరణి నిండి విలసిల్లఁ గదా
వినకురు నరవిభుఁ డప్పుడు
తనవదనముఁ గొంతవంచి తాలిమి నుండెన్॥ 27

యాదవ : కృష్ణు చర్యకు దేవతలు నుతులు సేయుచుండ: వినక + ఉరు + నరవిభుడు = చెవిని పెట్టక బాణుడు సిగ్గిలి తలవంచుకొని నగరున కొంతచింత సేయ దొడంగెను.

పాండవ : విజయు విజయము దివ్యులు నరులు కొనియాడ వినన్ = వినుచున్న; కురునరవిభుడు = రారాజు చింతాక్రాంతుడయి దీనవదనుడయ్యెను.

రాఘవ : రావణుడు దివ్యుల నుతులాలించలేక దీనుడయి లంకలో ఆలోచన చేయసాగెను.

వ॥ అప్పుడవ్వైరి దుర్యోధనుఁ దుశ్శాసనుండ సమబాణుండగు నాతఁ డాత్మగతంబున

యాదవ : సాటిలేని పరాక్రమముకల బాణుడు తనలో —

పాండవ : దుర్యోధనుడు ముందుచేయ వలసిన కార్యమాలోచనము చేయుచు నుండెను.

రాఘవ : రావణుడును తనలో నిట్లాలోచన చేయసాగెను.

మ॥ దరదివ్యాతిశయాస్త్రశస్త్రశర సర్వస్వైక విజ్ఞానముల్
శరసంధాన విశేష చిత్రలఘు వాస్త్రప్రౌఢి మాయాఢి బం
ధురసర్వంకష సర్వతోముఖ రిపూ ద్ధూతాఖిలాస్త్రాళియు ధా
ద్యరి నిర్భేదన పాండితీగరిమ ధైర్యస్థైర్య శౌర్యోన్నతిన్॥ 28

యాదవ : కృష్ణునిచే పరిభవింపబడిన బాణుడు జన్మతః రాక్షసుడయ్యు శంకర భక్తుడు కృష్ణు పరాక్రమము తనలోతా నుతించసాగెను.

పాండవ : ద్రోణాది కురువీరులు విజయు ప్రతాపాదికము దివ్యత తమలో కొనియాడసాగిరి.

రాఘవ : రావణుడును రాముని ప్రతాపము దివ్యతయు తనలో కొని యాడసాగెను.

మ॥ కొనియాడన్ వరమే తదీయ మహిమల్ కోదండ దీక్షాగురుం
డని జిష్ణుండభిరాముఁడు జ్వలగుణైకాంబాది కృష్ణుండు స
జ్జన చింతామణి లోకరక్షణ కళా శశ్వద్దయాశాలి పా
వన సర్వాగమ శాస్త్రనీత్యుప నిష త్ప్రాంగతుం డెంతయున్॥ 29

సమము — కృష్ణార్జున శ్రీరామచంద్రుల మహిమాదికము బాణ, కురువీర, రావణులు నుతించుట.

తే. గీ. అని నుతింపుచుఁ గురుముఖ్యు లను బలంబు
నగ్రగతిఁజేరి రిపులకు నుగ్రశక్తిఁ
బోరొనర్పంగఁ దద్భీమ భూతి బలము
నణపఁ దలపోసి యాత్మలో ననువుఁగాంచి॥ 30

యాదవ : బాణుడు ఎట్లయిన పోరు తప్పదనుకొని తన మంత్రిముఖ్యు లను ఆరావించి లోచించి ఉపాయము కనెను.

పాండవ : భీమ + భూతి = ఘటోత్కచుడు. ఆతని ప్రతాపము సహించ లేక కురురాజు తమ్ము రక్షించ (ముందు కన్వయము)

రాఘవ : రావణుడును మంత్రులతో నాలోచనచేసి ఒక ఉపాయము పొడగట్ట (ముందున కన్వయము).

క. వర తేజ స్సిందూర
స్ఫురిత యశశ్చామర ప్ర భూషితగురు ది
క్కరి కుంభకర్ణు నుగ్రున్
జిరవినుతిన్మేలు కొనఁగ జేసివి నీతిన్॥ 31

యాదవ : ఉపాయము శివుని నుతించి యుద్ధమునకు పంపెను. వర.... కుంభ = ఈశ్వరుడు తన తేజస్సిందూరముచే దిగ్గజకుంభముల నలంకరింపచేయు వాడు అని బాణుడు నుతించెను.

పాండవ : కురురాజు-కర్ణుని ప్రార్థించి ఘటోత్కచుని చంప ప్రోత్సహించును. కర్ణుడు నట్టివాడని కురురాజు నుతించును.

రాఘవ : రావణుని యుపాయము కుంభకర్ణుని నిద్రలేపి ప్రార్థించి అనికి పంపును. కుంభకర్ణుడు స్వీయతేజ సిందూరముచే దిగ్గముల కలంకారము కూర్చువాడు.

ఉ. ఖ్యాతిగ నిల్పు భీమవిజ యాగతి నీషద పాంగరాగమా
త్రాతివిభూషణీకృత దిగబ్జ ముఖీకుచకుంభకర్ణ నీ
వీతఱి నూరకుండనగు నే నిను నమ్మితి నిట్టి కార్యమే
నీతి దొఱంగఁ జేసితివి నిద్రగతిన్నముఁ గావుమియ్యెడన్॥ 32

యాదవ : బాణుడు తన్ను కాపాడుమని ఈశ్వరుని ప్రార్థించును. ఈషత్ + కుంభ = అపాంగదీక్షణమున దిక్కాంత కుచకుంభముల కలంకారము కూర్చినవాడు; కర్ణ = చుక్కానివంటివాడా = మంచియో చెడో కృష్ణు మనుమని బందిగాచేసితి. వినిద్రగతిన్ = ఉపేక్షించక రాక్షసకుల ముద్ధరించుమని వేడు కొనును. కుంభాండాది మంత్రులను ఈశ్వరునికి బాసటగానుండ నియమించును.

పాండవ : కురురాజు కర్ణుని అనికి వెడలి తమ్ము రక్షించమని వేడును. ఈషత్ —కుచకుంభము కలవాడా: కర్ణ = సూతపుత్ర, సూర్యతనయా అని.

రాఘవ : రావణుడు కుంభకర్ణుని నిద్రలేపి సీతిమాలి సీతను తెచ్చితి. ఇపుడు యుద్ధమే కర్తవ్యము. నీవులేచి రణమున కేగి తన్ను కులమును కాపాడ ప్రార్థించును.

అబ్జముఖికుచ = అపాంగవీక్షణముల దిక్కాంత కుచముల కలంకారము కూర్చినవాడు.

చ. తెలివి వినిద్రుఁజేయుచుఁ ద దీయ మహోగ్రతఁ దత్పరజ్వరం
బలుకును బుట్టఁజేయనతఁ డంపఁగ నాపతిఁజేరి భీకరా
రులబలుశక్తిఁ దూల్చఁగని రోషమునన్ విభుడంపఁ దద్బలుం
డలరుచు భీమభూతి తెలి యన్ హరిరాజితశక్తిపై బడన్॥ 33

యాదవ : బాణు పక్షమున శివు జ్వరము ప్రయోగించబడగా విష్ణు జ్వర ప్రయోగము యాదవ పక్షమున హరిచే ప్రయోగింపబడినది. విష్ణుజ్వరము చేయి పైఅయినది. బాణు పక్షమును మిగుల హింసించసాగినది.

పాండవ : రారాజు పక్షమున కర్ణుడు అని మొననిలచి పాండవ బలమును కసిమసంగుచుండ పాండవ పక్షమున తనవారి కుత్సాహముగా భీముని కొడుకు (భీమ + భూతి = ఘటోత్కచుడు - హైడింబి) ఘటోత్కచుడు మహాబలుడు కర్ణునిపై గవిసెను.

రాఘవ : కుంభకర్ణుడు తనవారి కుత్సాహము కల్పించి కపిబలము నెది రించెను. మారుతి కుంభకర్ణు నెదుర్కొనెను. (భీమ + భూతి = మహాబల తనయుడు - హనుమ)

తే. గీ. భీమసేనోదయోద్ధతి పేర్చనటులు
తాఁకి తలమీటిపైఁబడఁ దద్దదోగ్ర
హతిని హరియించ నయ్యెడ నచలముసల
మూనివైచినఁ జెదరక నుగ్రరేఖ॥ 34

యాదవ : శివ విష్ణు జ్వరము లొండొంటదాకి తృటిలో శివజ్వరము వీగిపోవ విష్ణుజ్వరము దానిని వెంటాడెను, కొదువ బలములు సంకుల సమరమున పోరుచుండ (ముందున కన్వయము)

పాండవ : భీమసేన + ఉదయ + ఉద్ధతి = ఘటోత్కచుని పరాక్రమము అతడు పరాక్రమించి గదను కర్ణుపై విసర నాతడు దాని వేగమడంచిన, వెంటనే ముసలమెత్తి వైచిన కర్ణుడు చలించక (ముందున కన్వయము)

రాఘవ: కుంభకర్ణుడు తన్ను ముట్టిన కపివీరుల కందఱకొక్కడై మహా బలుండగుట వారలనెల్లరను హింసించుచుండె. కపులు భీతిలిరి. ఆతని కెదురై నిలువలేకుండిరి.

తే. గీ. పటుకర విభూతి బలముష్టి బ్రదరయుక్తి
మేనునొప్పించఁ దలఁచ న మ్మేటి వీఁక
దప్పె నాగెలునెత్తి యు ద్ధతుల వలన
గతుల మెఱయంగ బాణ వే గమున నొంచె॥ 35

యాదవ : బలరాముడు విజృంభించి చేతి హలమున (నాగెలు.) అరులను మడియించుచు విజృంభించెను.

పాండవ : పటుక = ధైర్యమున ; రవిభూతి = సూర్యపుత్రు కర్ణుడు పలు బాణపాతముల ఘటోత్కచుని మేను చిల్లులుపడునట్లుచేయ ఆతడు వెనుదివియక మాయావి సింహనాదములుచేసి యార్వ మరల మరల బాణప్రయోగమున కర్ణుడాతని నొప్పించెను.

రాఘవ: రవిభూతి = సుగ్రీవుడు ధీరుడై కుంభకర్ణుని తాకెను. ముష్టి ఘాతముల సుగ్రీవుడు కుంభకర్ణుని నొంచ నాతడు బాణపాతముల నాతని నొంచెను.

క. శూలంబారిపుఁ డేసినఁ
దాళఁగ లెండనుచుఁ దోఁచఁ దలకక నడుమఁ
వ్రాలఁగ నాళుగ సంతతి
లీలంగొని త్రుంచియార్చె । లేఖులు మెచ్చన్॥ 36

యాదవ : ఈశ్వరుడు శూలప్రయోగముచేయ బలియుడు బలరాముడు దానిని బాణప్రయోగమున నడుమనే ముక్కలుగ చేసెను. దివ్యులు నుతించిరి.

పాండవ : ఘటోత్కచుడు కర్ణుపై శూలము విసర కర్ణుడు ఏక బాణమున దానిని వమ్ముచేసెను.

రాఘవ: కుంభకర్ణుడు శూలమును సుగ్రీవునిపై విసర నతడు దానిని కరమునబట్టి విఱిచెను.

తే. గీ. కరతల విభూతి నవియంగ గ్రావశిఖర
ముగ్రగతినే యమూర్ఛమే నొరఁగిసోల
వైరిజయితిఁ జేకొనిపోవఁ దేఱియతఁడు
మోసమాయె నటంచును రోసమునను॥ 37

యాదవ: హరి శివు నతిక్రమించి బాణునెదిరి నొప్పించెను.

పాండవ: ఘటోత్కచుడు కొండశిఖరము విసరికొట్ట కర్ణుడు నేల కొఱిగె. ఘటోత్కచుడు తొలగిపోవుచుండ మూర్ఛదేఱి పటుబాణము లేసి అర్చి అతని మరల్చి నొప్పించి మించెను.

రాఘవ: సుగ్రీవుడొక కొండశిఖరము కుంభకర్ణుపై విసరెను. దానినే తిరిగి కుంభకర్ణుడు సుగ్రీవునిపై వేసి మూర్ఛమునుగవేసి ఆ దశలో అతనిని తన మూపున వైచుకొని లంకలోనికి కొనిపోవుచుండెను. కొంతవడికి సుగ్రీవుడు తెలివంది ఆగ్రహించి (ముందున కన్వయము.)

క. కరమున ముక్కునఁ జెవులను
గురురదముల నోటఁబుట్టు కొని రుధిరంబుల్
దొఱఁగగఁ జలియించఁగఁ ద
ద్గురు దేహము ప్రదరగతిని ద్రుంచెనొంచెన్॥ 38

యాదవ: హరి పలునారాచముల బాణుని నొప్పించ యాతని దేహము రక్తసిక్తము కాగా(ముందున కన్వయము)

పాండవ: ఘటోత్కచుడును మాయాబలమున మెఱసి కర్ణుని గోలకు తెచ్చెను.

రాఘవ: సుగ్రీవుడు మూర్ఛదేఱి సంగతి గ్రహించి కోపమున నఖాయుధములచే కుంభకర్ణు ముక్కు చెవులూడదీసి ముఖముగీఱి ఆతని దేహము రక్త[illegible]

తే. గీ. మిన్నుముట్టార్చు నటుతోన మిత్రుపట్టి
బలిమిఁ జేకొని కరభూతిఁ బడఁగ(ద్రోయఁ
దప్పికొని వచ్చి స్వబలమ ధ్యమునఁ జేరెఁ
దనదు విగ్రహాభంగంబు మనముఁ గలఁచ॥ 39

యాదవ : బాణుడును ఖిన్నుడయి తన నగరి కేగెను.

పాండవ : ఇంతలో కర్ణుడు ధీరుడయి అలుక బాణపరంపర ప్రయోగించి ఘటోత్కచుని రణమువీడి సేనామధ్యమునకు తొలగిపో నొనర్చెను. కర్ణుడును రక్తసిక్తగాత్రుడయి తనవారి మధ్యమున కేగెను.

రాఘవ : ముక్కు చెవులూడ దీసినొంచిన కపిని బలవంతమున విడిపించుకొని కుంభకర్ణుడు బలిమినాతనిని విదలించి త్రోయ అతడు వడినేగి తనవారిని జేరుకొనెను. కుంభకర్ణుడు చెలియలి శూర్పనఖ గతి తలపునకు రా సిగ్గిలి తిరిగి అనిమొనప్రవేశించి విజృంభించెను.

క. పరభద్ర ఘటోత్కచ లస
దురుకేసరి యుగ్రగద స ముద్ధతి సుభయం
కర దశముఖానుజుని యం
బర మొఱయుచునుద్ద విడిని బలమదమణచ౯. 40

యాదవ : శివజ్వరము యాదవ బలమున ప్రవేశించి వారల హింసించ (బాణుడు రణమువీడి చని శివుని అని కేగ ప్రేరేచును.) శివుడు వచ్చి కొంత పోరి పాశుపతము కృష్ణుపై ప్రయోగించెను.

పాండవ : ఘటోత్కడను సింహాము తిరిగి అనికి వచ్చి కురుబలముపై బడి దాని యుత్సాహము నణంచెను.

రాఘవ : సుగ్రీవుడు గదను ప్రయోగించి కుంభకర్ణుని వేగము కొంత నిలువరించెను. కపులు మహాదేహులయి యాతనిని దాకియు నిలువరించ లేక పోయిరి.

క. అరిదర కరుఁడగు రాముఁడు
తరణి ప్రభుఁ డపుడుజేరి తగబల భద్ర

స్థిరమోదముఁ జేయుచుఁ ద
త్పరి పంథిని నేర్చి నొంచె బహుబాణములన్. 41

యాదవ: బలరాముడు బాణు పక్షమువారితో పోరి తనవారికి ముదమును పరులకు దుఃఖమును కలిగించెను.

పాండవ: కర్ణుడు ఘటోత్కచుని పెక్కు బాణములు ప్రయోగించి నొప్పించి తనవారికి ముదము చేకూర్చెను.

రాఘవ: శ్రీరామచంద్రుడు (తరణి ప్రభుడు = ఇనకుల తిలకుడు) కపులు హర్షించ కుంభకర్ణుని పటుబాణముల నొప్పించెను.

తే. గీ. అపుడు తద్వైరిలోఁ జొచ్చి యాత్మఁగలఁప
నెదిరి జ్వరముఁ బుట్టించి వే వెదుగఁజేయఁ
దిరిగి తిరిగియుఁ దనుఁజేరఁ గరుణమించఁ
బరఁగఁ దద్వర్ధనమొనర్పఁ బ్రౌఢి మెఱయ. 42

యాదవ: ఎదిరి + జ్వరము = కృష్ణుడు నారాయణాస్త్రము పాశుపతముపై ప్రయోగించెను. కృష్ణుడు శివజ్వరముపై వైష్ణవజ్వరము ప్రయోగించిన నది యేగి శివజ్వరము పెంపడచ తిరిగి తిరిగి యది కృష్ణునే శరణన కాపాడి తన జ్వరవేగము తగ్గించి ఉభయము సుఖమున మన లోకమున వాటికి కొంత నియమమేర్పఱచి పంపివైచెను. శివుడు రణమున మూర్ఛమునుగ వృషభేంద్రు డాతనిననికి తొలగ కొనిపోయెను.

పాండవ: తుదకు ఘటోత్కచుని యేపునడంచ కర్ణుడు చిరకాలము అర్జునుని కొఱకు దాచిన శక్తిని విధిలేక యాతనిపై ప్రయోగించెను. లేకున్న ఘటోత్కచుని ప్రతాపమునకు కురుబలము దీనతనందెను.

రాఘవ: రాము బాణ పరంపరం కుంభకర్ణుని తాకి అతని కాయాసము కల్పించి తిరిగి రాముని శరపంజరమున ప్రవేశించి మించెను.

క. తనుతను భంగంబే వెర
వునఁ దప్పించుకొనలేకఁ బోయి కడువడిఁ
ఘనతరతద్వర శక్తిని
తనుబంధం బణఁగఁజేసె ధైర్యము పేర్మిఁ. 43

యాదవ: ఆ విధముగ జ్వరద్వయము శాంతించ బాణుడు తన దీనతకు చింతించుచు పురినుండి బలియులను పురికొల్పి పంప నాలోచనలో నుండెను.

పాండవ: శక్తి వేగమును తప్పించుకొనలేక ఘటోత్కచుడు మరణించెను.

రాఘవ: రాముని వేడిశరములకు నిలువలేక కుంభకర్ణుడు ఆహుతి యయ్యెను—చచ్చెను.

వ॥ అట్లు గదాధికుండును, ఘటోత్కచుండును, కుంభకర్ణుండు ననందగు నవ్వైరి యణంగిచనిన. నది కనియు వినియు, నుగ్రదశముఖ తనయ ముఖ్యులు, తదుగ్రదనుజ సైన్యాధిపతులు బలమ్ములతో నంప వేగిరమ్మునం జనుదెంచి పైఁబడిన నెదిరి సకల సైన్యంబులు, హరిబలముఖ్యులు తఱిమి కదియంబడిన, సంకులసమరంబయ్యె, నప్పుడిందలి యందలి యోధులు కలియంబడిన ద్వంద్వయుద్ధంబైన రక్తప్రవాహంబయ్యె నయ్యెడన్ గోపాటోపంబున నంగద మహాబలనందన హరిభవాచ్ఛ భల్లరాజ బలరాములు నా పత్యకతనయ ముఖ్యులు విజృంభించి నరాంతక దేవాంతక త్రిశిరమహోదర మహాపార్శ్వ కూపకర్ణాలంబ సహాలాయుధ ఘోరధైర్య బలంబుల నణఁగించి రయ్యెడ॥

యాదవ: బలరాముని గదాఘాటి కోడి బాణుడు రణము విడచి యేగి తనవారిని ప్రోత్సహించి పంపును. బలియుడు సేనాపతి మంత్రి ముఖ్యుడయిన కుంభాండుని పంపించును. బలరామ సాత్యకులు బాణు పక్షమువారి నెదిరించి నిలచిరి. (సత్యక తనయుడు = సాత్యకి; హలాయుదుడు = హలి; బలరాముడు. సాత్యకి బలరాములు బాణుసైన్యము నెదిరించి నిలచి పోరిరి.

పాండవ: మహాబలుడు = వాయువు-వాయునందనుడు భీముడు; గద + మహాబలనందన = గద చేతగొని భీముడు కురుబలముపై విజృంభించెను. సాత్యకియు (నాసత్యక తనయులు = నకుల సహదేవులును) మొగ్గరము ప్రవేశించును. అలంబసుడు ముందుగా ఘటోత్కనిచే చచ్చును. అలాయుధాసురుడును ఘటోత్కచుని చేతనే మరణించును. అనంతరము కర్ణుడు వైచిన శక్తిచే ఘటోత్కచుడు చనిపోవును.

వలదనుచున్నను) ఖండించివైచెను. గురు+భావ+మణంగ = ద్రోణుడు గతించ రారాజు కడుంగడు దుఃఖించెను.

రాఘవ : లక్ష్మణుని వేగమునకు నిలువలేక చిరముపోరి అతికాయుడు మరణించెను. రావణుడు కొడుకు గతికి విలపించెను.

చ. గురుని కుమారు శక్తి నధి కున్నిజ సోదర దుఃఖయుక్తి సం
గరమొనరింపఁ బంపిన ద గన్ గురురాజు ప్రియఁబుగూర్ప ను
ద్ధురమహితోగ్రమన్యుకృతిఁ దోఁచఁగలాపి రథంబు నెక్కి యం
బరముననుండి దివ్యులు ప్ర భల్ జెడి దూలఁగ ఘోరవైఖరిన్. 46

యాదవ : గురుని + కుమారుడు = శివకుమారుడు బాణునకు శివుడు గురుడు = పూజనీయుడు; కుమారస్వామిని ప్రార్థించి బాణుడనికి పంపించెను. ప్రద్యుమ్న కుమారు డాతని నెదిరించెను. తొలుదొల్త కుమారుని చేయిమీర దివ్యులు దీనులైరి. బాణుని విజయము వారికి భయప్రదము.

పాండవ: గురుని + కుమారుడు = ద్రోణాచార్యుని తనయుడు అశ్వత్థామ. రారాజు ప్రార్థనమున అశ్వత్థామ పరాక్రమించి కురుబలమున కుత్సాహము కల్పించి పాండవ బలము నెదిరించనేగెను. తండ్రి మృతికి మిక్కిలిగ కోపించి పాండవులను హింసించ నుపాయ మాలోచించుచు ననికేగెను.

రాఘవ. గురుని = మహాత్ముని - బలియుడు, కుమారు + శక్తిన్ + అధికున్ = ఇట్టి వాడు రావణుని తనయుడు, ఇంద్రజిత్తు. ఇంద్రజిత్తు తండ్రి పంపున యుద్ధమునకు వచ్చుట — కలాపి = భూషణాలంకృతుడై తన బలముతో కూడుకొని — మేఘనాధుడు గాన ఉప్పరమున కెగసి కపులకు కానరాకుండగనే బాణాసారమున రాముబలము నొప్పించి అని యొనరించసాగెను. పోరుఘోరము కా దివ్యులు భయపడిరి.

సీ. పోరొనర్పఁగ వచ్చి నారాయణ గురున్న
తమహితదివ్యాస్త్ర ధామ మేర్చ
నవినిగుడించంగ నఖిల దిక్కులనుండి
తజ్జాంబరాగ్నులం తటనుగప్ప

ననిధృతిరితగతి నా నృపులందఱు
నాయుధంబులు వైచి యణఁగ బడఁగ
నాశుగసంతతి హారివిభుఁ డొకడుండ
ననివార్యమిది తప్పు నను పుఁజూడు
తే. గీ. మనిన నటుసేయ సంజీవ నిసటకపుడు
దెచ్చినట్లనె నంటలు దేటి తన్న
హిమ పరాగల మయశరో పేతబాధ
లణఁపఁ బొగడిరి హారివిభు సమరజనులు 47

యాదవ : నారాయణుడు = కృష్ణుడు అతనికి గురు = అన్న బలరాముడు. కుమారస్వామి యుద్ధసన్నద్ధుండై రణరంగమున నిలిచి ఆగ్నేయాది దివ్యాస్త్ర సంచయములు పైవ నారాయణ + గురు + బలరాముడు కుమారు నెదిరించి యాతని అనుయాయి వీరుల ననేకులను మడియించెను. కుమారుని బాణాగ్ని జ్వాలలు బలరాముని యాదవవీరులను చుట్టుముట్టె. సంజీవనియగు మహాస్త్ర ప్రయోగమున బలరాముడు కుమారు నస్త్రజ్వాలలు శాంతింపజేసి తనవారిని కాపాడి తన్ను కాపాడుకొనెను.

పాండవ : అశ్వత్థామ కోపించి నారాయణాస్త్రము పాండవ బలముపై ప్రయోగించ దాని మహిమ తెలిసిన కృష్ణుడు అర్జునుడు దానికి నమస్కరించి బాణబాణాసనములు విడిచి రథములు దిగి నిలువ నయ్యది వమ్మయిపోయెను. కాని భీముడు దిగనని పట్టుపట్టి అర్జునుడాతని బలవంతమున రథము దిగువకులాగి ఇలనిలువ నతనిని బాధించక అస్త్రము చల్లారెను. హరి — విభుడు = భీముడు — ఇట్లు నమస్కరించి నారాయణాస్త్రజ్వాలలు శాంతింపజేయు శ్రీకృష్ణుని పాండవులు తద్బలము పొగడిరి. అటులవారు మన గాంచిరి.

రాఘవ : ఇంద్రజిత్తు మేఘముల చాటుననుండి వానర సైన్యమును కలంచసాగెను. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము రామబలముపై ప్రయోగించ సర్వ సేనా మూర్ఛయయినది. సంతసమున ఇంద్రజిత్తు లంకలోనికేగెను. మంత్ర జపము చేయుచు విభీషణుండొక్కడు దానికి తప్పి తిరుగుచు కంచుక చలనముతో నున్న జాంబవంతుని కడకేగ అతడు హనుమను రావించుకొని సంజీవనితే నియ

మించెను. అది యొక్కటియే యుపాయమని యుపదేశించెను. హనుమ లవణ సముద్రము దాటి సంజీవని నతిత్వరితముగ తేగా రామలక్ష్మణులతో పాటు ఋక్షవానర బలములు కట్లువిడి స్వస్థులయి లేచిరి.

వ. అంత — అనంతరము

చ. హరివిభుఁ డంతకీర్తినుత సాంబసమాఖ్యుఁడు వైరికర్ణ భీ
కరవిజనామ్ముఁ డాబలము గావఁగఁ బూని తదగ్రయాయియై
మఱిదమి వేగనచ్చటి క మందగతిన్ జనియాగ లంకలోఁ
జొరఁబడి గాల్ప సైన్యములఁ జూర్ణముఁ జేసెను దాతదున్నతిన్॥

యాదవ : కృష్ణు కుమారుడు సాంబుడు బలరాముడును యాదవబలమును కడచి అనికి ముందు నిలచి రాక్షసులను దాకి ధీరత పరబలమును కాల్చి మసి చేసిరి.

పాండవ : రారాజు కర్ణునకు సర్వసేనాధిపత్య మిచ్చి పాండవబలమున కుద్దిగా ప్రార్థించి పంపించెను. (ద్రోణు మరణానంతర మీకార్యము). కర్ణునకు విశేషణములు. రారాజు పంపున కర్ణుడు పాండవ బలమును కవిసి తనలావు చూపెను.

రాఘవ : విభీషణుని యుపదేశము విని రాముడును సుగ్రీవుడును కపులను రాత్రి సమయమున లంకకాల్చ నాజ్ఞాపించిరి. లంక చీకటులలమ పురెఇండ్లు, కోటలు, మేడలు కాల్చుచు వెల్గించుచు జనమును మంటలోవైచి కాల్చివేయ సాగిరి.

చ. అరుదుగ ఘోరయుద్ధమపు డయ్యె సురాసుర సంగరోన్నతిన్
హరులు గలంగెస్యందన గ జాదులు రూపరెనంత వీర కుం
జరగతిఁబోరు చోఁదదను జ ప్రభుహృద్గత దివ్యకామినీ
గురుకుచ కుంభుచే బలిమిఁ గూలఁగనేసె హరిప్రభుండనిన్॥ 49

యాదవ : యాదవ బలమునకు బాణుబలమునకు ఘోరముగ పోరొన గూడెను. ఆ దొమ్మియుద్ధమున సాంబుడు పరాక్రమించి కుంభుడను వానిని చంపివైచెను.

రామసాంబాంది యదువీరులు శంఖములొత్తి తీవ్రబాణ ప్రయోగమున రాక్షసులను తూలించి వారి శిబిరములకు పోవునట్లు చేసిరి. ధర్మరాజు = ధర్మమూర్తి: కృష్ణుడు: ఉత్తమ విలుకాడు సాంబుడును.

పాండ : కర్ణుడు తన్నెదిరించిన, నలుని తీవ్రబాణములేసి ధీరతపోచేసి అవశునిచేయ ధర్మరాజాతనిని తన శిబిరమునకు కొనిపోయెను.

రాఘవ : కుంభ నికుంభులను సంహరించిన, ఇనకుల+రక్షకుల = రాముని కంగరక్షకులయిన వారిని, కపులను. ఇంద్రజిత్తు నిశితబాణ ప్రయోగముల హింసించ వారు శిబిరమునకు తొలగిపోయిరి. ధర్మ + రాజు = ధన్వి: రాముడు. ఇంద్రజిత్తు ముదమున లంకలోని కరిగెను.

మ. అరి భీముం డభిరాముఁ డాతఁడెదురై యస్త్రంబులం గప్పి యు
ద్ధురలీలన్ మెయినొంచఁగాంచి యపుడా దుశ్శాసనుం డడ్డమై
శరజాలంబులు నించి చేర్చఁగినుకన్ జ్వాలోగ్రకాండాహతిన్
వెరజెందన్ బడనేసి నెత్తురులు ద్రావెన్భూమి ఘోరంబుగన్. 52

యాదవ : బలరాముడు రాక్షససేనాగ్రగ్రాముల నురుబాణంబుల గదాఘాతంబుల నొప్పించి మించ, బాణుడు నాతని పక్షమున కుమారాదులు నాతని నడ్డగించ పోరు ఘోరమయి రణభూమి రక్తపునదులు ప్రవహించినవి.

పాండవ : భీముడు కురుబలముపై గవిసి యెదిరి లేక విహరించుచుండ దుశ్శాసనుండు తన బలముల మీరి యాతనికడ్డమై నిలచి పోరదొడంగెను. భీమునిపై దుశ్శాసనుండు తీవ్రబాణములు ప్రయోగించ బాణాగ్నిజ్వాలల నాతనిని గప్పివేయ భీముడు గదాఘాతమున నాతని యొడలు చిదుగకొట్టి నేల బడవైచి నలిపివేయ నోటనెత్తురులు గ్రక్కుచు నా దుశ్శాసనుడు మరణించెను.

రాఘవ : రామున కెదురై రావణుడు పోర దొడంగెను. తనకడ్డమై నిలచిన రావణుని శరజాలములు పఱపి రాముడు మూర్ఛమునుగచేసి శరీరము తూట్లువడి రక్తము లొలుకునట్లుచేయ నాతని ననికి తొలగించి లంకకు సారథి కొనిపోయెను.

బేర్చిమించఁ గాంచి భీమసేనుఁడు హారి
విభుఁడు బాణవహ్ని వేగఁగూల్చె. 55

యాదవ. (చిత్రభానుభుడు = అగ్నికుమారుడు, సేనాని, కార్తికేయుడు) కుమారస్వామి బాణాగ్నిజ్వాలలు పర్వచేయ హరివిభుడు; సాంబ, బలరామాదులు కృష్ణుడును ప్రతిబాణముల నా బాణాగ్నిజ్వాలలు చల్లార్చిరి.

పాండవ: సూర్యుడు చిత్రబానుడు ఆతని తనయుడు కర్ణుడు శల్యుడు తనకు సారథిగా నర్జును దాకి నిశితబాణ ప్రయోగము లొనరించి మించ నరుడు ప్రతిబాణముల నాతని బాణవేగమును శాంతింపచేసెను.

రాఘవ: ఇంద్రజిత్తు ఉత్సహించి మించ సూర్యకులజుడు లక్ష్మణుడు ఆతని బాణవేగమును క్షణములో శాంతింపచేసెను. (ఇంద్రజిత్తుకూడ, చిత్రభానుడు = అగ్నిసమానుడు తేజమున సూర్యుని మించినవాడు.)

మ. అరిభీముం డభిరాముఁ డయ్యనుజుఁ డా నంపించ ధర్మోదయ
స్థిరభవ్యస్థితిఁ గాంచి యాతని వచ శ్శ్రీఁ జేరియద్వైరిపై
శరజాలంబులు నించె బిల్వనతడు న్జంచద్ధనుర్ముక్తా భీ
కరబాణౌఘములంబరంబు దిశలు న్గప్పన్వడిన్దాకినన్. 56

యాదవ: బాణుని కుమారస్వామిని, సాంబుడు, బలరాముడును నెదిరించి తాకిరి. కృష్ణుని పంపున బలరామ సాంబులు కుమారుని, బాణుని శరజాలములు పఱపి రణమున కాహ్వానించ బాణుడు, కుమారుడును బాణాసారమున దిశలు కప్పుచు వచ్చి ఎదిరించిరి.

పాండవ: ధర్మరాజు పంపున నర్జును డనికేగి కర్ణు సంగరమున కాహ్వానించ నిరువురకును పోరు ఘోరంబయ్యెను.

రాఘవ: లక్ష్మణుడు ఇంద్రజిత్తుతో పోర దొడంగును.

మ. అభిరాముండటునేయ వాలి యతఁడొ య్యన్పోబ్రయె నేడించి త
ద్విభుఁడంపన్మగుడంగ వచ్చి జయయు క్తిన్భిమమన్యు క్రియా
ప్రభమాయాజనకాత్మ భూతివిదిత ప్రౌఢిస్ఫ్భూర్తి కాశింపఁగా
రథసోదగ్రతఁ బూనఁ గాంచి విజయ ప్రారంభసంరంభియై. 57

శరనిధి ఘనఘోష జాగ్రద్ధ నుర్గుణ
నినదముల్ రోదసి నిండిచెలఁగ
నరిదర కరధీర వరశల్యసారథి
రథగతివై చిత్రి గతులు గలఁపఁ
బుంఖానుపుంఖ ప్రభూతబాణశ్రేణు
లంధకార మెలర్ప నర్కుఁగప్ప
తే. గీ. భయద హుంకారములు భుజా స్ఫాలనములు
రోషభీషణ ఘూర్ణిత రూక్షవీక్ష
ణాననములును భృకుటి భంగాట్టహాస
పరుషభాషలు మించఁబొ ఱిరి చెలంగి. 59

యాదవ: యాదవు లుత్సహించి రాక్షసవీరులను హింసించ నొండొరు లతో కలియబడ నా సంకుల సమరమున కదనరంగము పై విధమున నుండెను.

పాండవ: శల్యుడు రథము నడుప రథియైన కర్ణుఁడు అర్జునుపై గవిసి ఘోరముగ ననిచేయ నొండొరుల సంరంభమున కురుపాండవ బలములు కురు క్షేత్రరంగమున పై విధమున నుండెను.

రాఘవ: ఇంద్రజిత్తు మాయావియై విజృంభించ రాము దివ్యాస్త్రముల నాతని మాయయడంగ హనుమ సుగ్రీవాదులును, లక్ష్మణుడును రావణ బలమును దాక రామరావణ పక్షబలములును నా లంకానగర రణరంగము పై విధమున నుండెను.

వ॥ అప్పుడు నతండు

| | | |
|---|---|---|
| సమము యాదవ: | కృష్ణాదులును | కుమార బాణాదులును. |
| పాండవ: | అర్జునుడు | కర్ణుడును |
| రాఘవ: | లక్ష్మణుడు | ఇంద్రజిత్తును. |

మ॥ కని నాగాంబక మేయజిష్ణునక పాం గప్రాంత ఘోరాప్తి రా
ఘనదివ్యోన్నతిఁ గాంచి యంతమహిఁగ్రుంగగన్ యానముల్ద్రొక్కువీ
కనెమౌళి స్థిరరత్నముల్ద్రొరుగఁ జక్కన్చెక్కు బాణంబులన్
దునిమెఁ దాని రిపుల్గలంచననఁచె న్నొంచెన్మరాంచద్గతిన్॥ 60

బఱచె నప్పుడట్టులని కు మారు మేఘనాథు దు
ష్టరణ కర్ణ కఠిననామ శాత్రవుం డణంచుటన్॥ 62

యాద : కృష్ణుచే తూలిపోయి కుమారుండు రణమువీడి పురిలోనికేగ కోదువరాక్షసబలము బాణునితో సహా నగరులోనికి పారిపోయెను.

పాండవ : నరునిచే కర్ణుడు మృతినంద రథము విడచి శల్యుడు శిబిరమున కేగెను. పాండవుల హృదయశల్యమయిన కర్ణుడు మరణించ కౌరవబలము రణము వీడి చనియె.

రాఘవ ; ఇంద్రజిత్తు మరణించ రావణు బలము లంకలోనికి పారిపోయెను.

వ. తెలియన్వని విబుధ హృ్ద్రావణుడు, ఘన బాణాసురుండు, దుర్యో ధనుండనంజను నా రాజత్యంత దుఃఖంబునఁ బరజయ స్వపరాజయ ప్రాప్తిఁ జింతాక్రాంతుండై శోకరోషంబులు మనంబునం బెనఁ గొననయ్యెడన్.

యాదవ : ఈ విధముగ కుమారునితోపాటు తన బలము తానును పరాజయమునంద పరుల జయించుటకు ఉపాయము కానక చింతాక్రాంతుడై బాణుడుండెను. ఆ సమయంబున —

పాండవ : కర్ణుడీల్గ చింతాపరుండయి దుర్యోధనుండు —

రాఘవ : ఇంద్రజిత్తు మరణించ రావణుడు ....

ఉత్సాహ

నినుత మోద దననజాత విగ్రహంబడంచు నా
ఘనతరోగ్ర శోక కోపగతి పార్శ్వవృద్ధిని
త్యనునయంబుఁ జేతమాని యపుడు మూలబలముల
న్ననఁగనున్న వారి నృపులఁ జంవనంప తెంపునన్. 63

యాదవ : బాణుడు మూలబలములతో కదలి కదనరంగమున కేగును. తన పార్శ్వవర్తులను పంపుట మానెను.

పాండవ : రారాజు మూలబలముతో [illegible] రణమున కాయత్తముగా దలంచెను. [illegible] ఇంతలో శల్యుడు రారాజు నసుమతి యడిగి [illegible].

రాఘవ : రావణుడు మూలబలముతో [illegible] కేగును. తొలి [illegible]

క. పరహృదయ శల్యుఁ డాతఁడు
పరబలమును గావఁ బూని పంపినచోటన్
బరిపంథు లెదుర నొక్కఁట
గురుతరముగ యుద్ధమయ్యె గుతలం బదురన్। 64

యాదవ : [illegible] మూలబలములు [illegible] యాదవులకును [illegible] యుద్ధము [illegible] జరిగెను.

పాండవ : శల్యునకు సర్వసేనాధిపత్య మిచ్చి రారాజు [illegible] [illegible] నిరువాగులకు ఘోరముగ రణము జరిగెను.

రాఘవ : రావణునితో [illegible] యుద్ధమారంభమాయెను.

సీ. అప్పుడా హారివిభుఁ డభిరాముఁడన్ జిష్ణుఁ
డగు నరుండరులతో నడరి వేగఁ
. గడఁగి సమ్మోహన గాంధర్వ దివ్యాస్త్ర
శరములేసిన యట్లు చటులవృత్తి
నరుల కందటికిని యగు రూపములు దోఁచ
నెచటఁ జూచినఁ దానె యెదిరినట్లు
పరివేష భీషణ బాణాసనాంతర
భానుబింబస్ఫూర్తిఁ బరసుశర్మ

తే. కరులహారులను దేరులఁ గాల్బలంబులఁ
గెడపి దునుమాడి నురుమాడి బడలుపఱచ
మాంసమేదోస్థిమయతీర మహితమైన
రక్తసాగర మొనరించె రణతలంబు. 65

యాదవ: అందఱకన్ని దాపులయి కృష్ణుడు చతురంగబలములను దివ్యాస్త్రప్రయోగంబున ధ్వంసముచేసి రాక్షసులను నొప్పించి రణరంగమున రక్తపు కాలువలు ప్రవహింపచేసెను.

పాండవ: శల్యుని యాధిపత్యమున తమ్మెదిరిన కురుసేనను అర్జునుడు ఎక్కడ జూచిన తానెయై దివ్యాస్త్రములు ప్రయోగించి రణరంగమును రక్తసాగర మొనరించి భీభత్సంబుగ చేసెను.

రాఘవ: రాముడు కోపించి రావణుని నాతని బలమును దివ్యాస్త్ర ప్రయోగముల నొప్పించి అంతట తానెయై రణరంగమును రక్తసముద్ర మొనరించెను.

సీ. బంధుర పరిపంధి సంధిబంధంబులు
బెట్టుగ ఫెళఫెళ ఫెళని ప్రీల్చి
కుటిలారి చటులాస్థి పటలకపాలము
ల్పిండిగాఁ బెటబెట పెటనుకొటికి
నిరుపమ రిపుకంఠ నిర్గళ ద్రుధిరంబు
గావుగాఁగళగళ గళనుగ్రోలి
దుర్వార్యవైరిమే దోమాంస ఖండముల్
వసమర గసగస గసను మెసవి
తే. గీ. ప్రబలిరణరంగ ముఖములఁ బటుత దుగ్ర
జాగ్రదుగ్రభుజార్గళో దగ్రసాయ
కజ్వలన వీరభద్రుండు ప్రజ్వరిల్లె
నమరవర లోకభీకరా యత్తవృత్తి. 66

యాదవ: శివుని కుమారుడు దక్షాధ్వరధ్వంసి, వీరభద్రుడు ప్రలయకాల రుద్రుని భాతి యాదవుల నెదిరించెను.

పాండవ: దివ్యాస్త్రములు జ్వలించుచు రణరంగము నావరించి భయంకర లీల వ్యాపించినవి - ఇవి నరుడు ప్రయోగించినవి.

రాఘవ: రామ రావణు లొండొరులు ప్రయోగించిన ఆగ్నేయాది మహాస్త్రముల జ్వాలలు తీవ్రమయి రణరంగము నాక్రమించినవి.

యాదవ : హరివిభుడు = కృష్ణుడు: కోప . . . . . శల్య = బాణునకు విశేషణములు; అట్టివానిని అడఁప = అణగించ కృష్ణుడు: డీతాకై = ఎదిరై పోరనిలచెను. బాణుడా కృష్ణునితో పోరనిలువ రణము భయంకరమాయెను.

పాండవ : కోపకలన వికృతమైన ముఖముగల శల్యుని మదమణంచ పాండవులాతనిం దాకిరి. పోరు తీవ్రంబాయెను.

రాఘవ : రావణు పక్షమున విరూపాక్షుడు కపిబలముపై కలియరా సుగ్రీవుడాతని కెదురై రా (హరివిభుడు = సూర్యతనయుడు సుగ్రీవుడు) పోరు ఆఖీలమాయెను.

వ. వివిధ విశేషంబుల సంగర చిత్రగతులఁ బెద్దయుం బ్రొద్దు నయ్యో
ద్ధలు పోరిఁబోరి యనంతరంబున దేజోమహిమంబున మఱిఁజేరి
దోరహ్వాంబున — దోర్గర్వంబున.

యాదవ : కృష్ణబాణుల ద్వంద్వయుద్ధమున -

పాండవ : భీమ శల్యుల గదాయుద్ధమున.

రాఘవ : సుగ్రీవ విరూపాక్షుల ద్వంద్వయుద్ధమున.

క. సంగర మా హిమాతులుని
గ్గ్రింగ విరూపాక్షు శక్తిఁ గూలిచి యటులు
ప్పొంగి తదురు శల్య సము
త్తుంగ మహోదర వారణముఁ దోడ్తోఁజేసె॥ 70

యాదవ : కృష్ణుడును బలరామాది యాదవులును బాణుపక్షమున విరూపాక్ష, మహోదరాది పలువురు వీరులను చంపుదురు. (అ+హిమా + తులుడు = సూర్యసంకాశుడు = యుద్ధమున తేజమున సూర్యునివలె దుర్నిరీక్షులు కృష్ణాది యాదవులు.)

పాండవ : మాతులుడు = మేనమామ; శల్యుడు పాండవులకు మేనమామ. శల్యుడు మద్రదేశాధిపతి-పాండురాజపత్ని మాద్రికి సోదరుడు. ఆతనిని ధర్మరాజు రణమున చంపివేయును.

రాఘవ : విరూపాక్షుడు, ఉన్మత్తుడు మొదలయిన రాక్షసవీరులను సుగ్రీవుడు (సూర్యతనయుడు = సూర్యసముడు) చంపివేయును.

తే. గీ. అంతఁ దత్సోదర సుతని కాంతశక్తి
నిజమహాపార్శ్వ బలమెల్ల నేఁగలసె
ననికడంగనులూక శకునిపాత
మాత్మఁగలఁచ దుర్యోధనుం డా విభుండు. 71

యాదవ : తనవారు పలువురు కృష్ణాదియదువీరులచే మరణించ స్వయము యుద్ధమునకు బయలుదేర బాణుడుండ; (ఉలూక = గరుడి + నిపాతము = గద్ద గూబ కూత అపశకునము కాగా) మనసు కలతపడ బాణకీతనయుడు = బాణుడు.

పాండవ : అంతకుమున్ను ఆ విధమున ఆప్తవర్గము పాండవులచే మంట గలియ కౌరరాజు అనికి వెడలనుండ —దుశ్శకునములు కని చింతించి.

రాఘవ : ఆ విధముగ తన బలము, సోదరులు, సుతులు, గతింప రావణుడు అనికి సిద్ధమగుచుండ దుశ్శకునములు గాంచి కలతపడి —

క॥ అంతకు మును నిజ సోదర
సంతతి నెంతయును నుగ్ర సమరములోనన్
జెంత పర సుర మబల కృతి
నింతయు నిలలేక నణఁగు చేర్పడ గనుచున్. 72

యాదవ : బాణుడు తనవారి మృతికి చింతించుచు ఆలోచనామగ్నుడయి కొంత ధైర్యమవలంబించి రణమున కేగ —

పాండవ : దుర్యోధనుడు జలస్తంభన విద్యనాశ్రయించి ఖిన్నుడయి యొక హ్రదములో దాగియుండ తలంచెను.

రాఘవ : రావణుడును పరులచే తనవారు మృతులు కాగా ఎవరికి నిలువరించు వారెరును లేకుండుటకు విచారించి.

సీ. పరభయంకర లీలఁ బైవచ్చు నా సత్య
కాత్మజాదుల కను చపలజడిసి
తొలఁగఁగాఁ జనుదెంచి దోర్దండ బలయుక్తి
దేటి చూడఁగరాని తీవ్రరుచిని

నాశానుకూలాభి హితసర్వతోముఖా
శయవరతిఁ జేరఁ జనితదీయ
శరజాలములలోన జయ్యన మునిగియుఁ
దనమేను సోఁకని య్యనియమేయ

తే. గీ. ధర్మవిద్యాత్కాండముల సం స్తంభకరణ
మహిమ నిలిచియు ననుజ లక్ష్మణ విభీష
ణాత్త బలసమున్నతి వచ్చు నా నరేంద్రు
నకుఁ బ్రదరగతి సోఁకి ఖిన్నత నణంగి. 73

యాదవ: బాణుడు తిరిగి రణమునకు రాగా సాత్యకి బలరామాదులు సర్వతోముఖముగ ఆగ్నేయాది బాణములడరించి మించ మాయాబలమున వాటికి తప్పి బాణుడు కొంతకొంత పోరియు యాదవబలముచే పీడింపబడి ఖిన్నుడయియుండ —

పాండవ: తన్ను వెదకుచు పాండవులు రణరంగమును కలయ వెదకు చుండ భీతి. ఒంటరియయి జలస్తంభనవిద్య నాశ్రయించి రారాజు ద్వైపాయన హ్రదంబున డాగెను.

రాఘవ: రావణుడు రణరంగమున ప్రవేశించి కపులను విరజిమ్ముచు రామలక్ష్మణుల కెదురై నిలచి పోరుచు నొక శక్తివైచి లక్ష్మణుని మూర్ఛముం చగా రాముడు కోపించి యుగ్రబాణముల రావణు నొప్పించి మరల దీనునిచేసి పర్విడనొనరించి లక్ష్మణుని చూచి విచారించును.

వ. అవ్విధంబున — ఆ తీరున.

తే. గీ. చాపలత బాణ జనయిత్రి జాటికొప్ప
కట్టువిడిఁబడ వస్త్రంబు నష్టై తొలఁగ
నడ్డముగ నిల్వ బలశక్తి నవలఁబోవ
మడఁగి మదిఁ బరివడఁ జిక్కి మడుఁగుబట్టె. 74

యాదవ: బాణజనయిత్రి = బాణుని తల్లి కోటర యను పేరు గలది. కొడుకును రక్షించతలచి పురివెడలి రణరంగమును ప్రవేశించి వివస్త్రయయి

కురుల విరజిమ్ముకొని కొడుకు ముందుకు వచ్చినిలువ లజ్జించి కాంతుడు నగరము లోనికిపోయె. యదువీరులు మొగములు త్రిప్పుకొని మారము దాచిరి. కోసల తనయుడు పురికేగ తానును వెడలిపోయెను.

పాండవ: రారాజు మడుగులో దాగి ఖిన్నుడయి యుండెను.

రాఘవ: రావణుడును వీరుడయి లంకలో నుండెను. లక్ష్మణుడు మూర్ఛితుడయి నేలబడియుండెను. రాముడును ఖిన్నుడయియుండెను.

తే. గీ, విజితవైరి నా సత్యకాత్మజుని సనుజ
ముఖ్యుల సమాన పరశక్తి మొనట దూలి
యున్నఁగని నరవిభుఁడాత్మ ఖిన్నుడగుచు
నరసి రక్షించఁ దగు జన్మ మందెనపుడు. 75

యాదవ: పరులకు చిక్కి దీనుడయి బాణుడు పురిలో నుండిన వారితో శివునితో కుమారునితో నాలోచనచేసి వారి ధీరవచనములకు కొంత తేరుకొనును.

పాండవ: ఇదివరలో ననేక పర్యాయములు గదాయుద్ధమున భీమునితో గలియబడి రారాజు ఒకమారు తనచేయి పైదిగా మఱియొకమారు భీమునిది కోడి పోవుటయు తలంచికొనుచు నిట్లు పలుతలపులకు లోనయి మడుగున నుండె.

రాఘవ: రావణు శక్తికి నేలపడియున్న లక్ష్మణుని గని ఖిన్నుడయియున్న రామునికి విభీషణాదులు హనుమను పంపి సంజీవకరణి గొని రా బంప నుప దేశించిరి.

సీ. పరపద్మ బాణాగ్ర బాధానుభవమున
శ్చంద్రోరు హృదయ విశల్యకరణి
విషమాశుగ వియోగ వేదనానుభవ సు
తను వరచక్ర సంధాన కరణి
అసమశిలీముఖ హత్యనుభవ ముఖ
పద్మచక్రాంగ సౌవర్ణ్యకరణి
సతను శక్త్యాత్తమో హత మోను భవలీన
జీవాత్మ చక్రసంజీవకరణి

తే. గీ. నమ్మృత జలనిధి తరణి కీర్త్యబ్జ వృద్ధి
కరణి సత్ప్రితాప తరణి తరణిబాహు
బలిమిఁ దెచ్చి మరుద్వర ప్రభుఁడు హరి వి
భుండు తద్బంధు జీవిత ముల నమర్చె. 76

యాదవ : బాణుడు పురమున కృష్ణాది యదువీరుల దివ్యబాణములకు శరీరమున సంధిసంధులు తూట్లుపడ బాధపడుచునుండ శివుని కరుణ నాబాధలు తొలగ నుత్సహించి తిరిగి యుద్ధరంగమున కేగును.

పాండవ : జలస్తంభనాది విద్యలు నేర్చిన దుర్యోధనుని వెదకుచు పాండవులు ద్వైపాయన హ్రదము కృష్ణునితో సమీపింతురు. వేగుల వలన రారాజంచు డాగెనని తెలిసి యట్లు చేసిరి.

రాఘవ : ద్రోణపర్వతమున విశల్యకరణి. సంధానకరణి, సౌవర్ణకరణి, సంజీవకరణియను నోషధులు కలవని వివరించి జాంబవంతుడు తెలిపి సంజీవ కరణి తెమ్మని హనుమంతుని పంపించ వివరములు తెలియక ద్రోణపర్వతమునే పెకలించి ఫలమువలె హస్తమునముంచికొని తెచ్చి సేనామధ్యమున నుంచ చనిపోయిన కపులెల్లరు జీవింతురు. లోగా జాంబవదాదులు మరణించిన రాక్షసుల నెల్లరను సముద్రములో తిమితిమింగిలముల కాహారముగా బడవైచిరి. లక్ష్మణుడు నిదురనుండి లేచినట్లు మూర్ఛ తెలిసి లేవ రాముడు ముదమందెను. రావణుడు దుఃఖించెను.

మ. భువనస్తంభన శక్తిమోదయుతుఁడై పొల్పొంద నారాజును
న్కువిశేజ్జ్యతరోక్తులన్విధిఁ గడు న్గీర్ణద్రథారోహణా
హవ సన్నాహముల్దనర్చి నిజ సేనాహంక్రియాయుక్తి బాం
ధవసందోహము దోడరాగ వెడలె న్దర్పైక దుర్దాంతుఁడై. 77

యాదవ : లోకమువారిని-జనములను మూర్ఛలో ముంచుశక్తి (సమ్మోహనము వంటిది) బాణుడు భువనస్తంభన శక్తి ధరించి ముదమున శివగణములు నీశ్వరుడును రక్షగా కొలువ తన రాక్షసబలముతో ననికి వెడలి వచ్చెను.

పాండవ : భువన = జలము; స్తంభన = స్తంభింపచేయు శక్తి; దుర్యోధనునికి తెలియును. జలస్తంభన. ధర్మరాజు ననుజులు కృష్ణుడును రథారూఢులయి దుర్యోధను నునికి తెలిసి మడుగు దరిసిరి.

రాఘవ : రావణుకు మహాశక్తియుక్తుడై మిగిలిన బలగముతో రాము నెదురించ బయల్వెడలెను.

వ. అట్లుగ్రదశాననుండు, ఘోర బాణాసనుండు ధర్మభూతి రాజితశక్తి తద్బంధురక బంధాతి శయజన్య సమీప భూమి స్థలంబుఁ జేరంజని -

యాదవ : బాణాసురుడు తెగిన మొండెములతో నిండిన కదనరంగమును ప్రవేశించెను.

పాండవ : ధర్మరాజు చచ్చిన వీరుల శవములచే నిండిన రణభూమిని సమీపించి —

రాఘవ : రావణుడు రణభూమిని సమీపించెను.

చ. ఇపుడిటు డాఁగియున్న గతి యేమి పయింబడ రావు పెక్కు లీ
వపరిమితంబుగాఁ బలుకు దన్నియు నేఁడెటు బోయె రోసము
న్గపటము మత్సరంబు రణ కౌతుకము న్బలిమి న్నెడంగ సి
గ్గుపడితొ మానభంగమునఁ గుందక పౌరుషమున్నరమ్మొగిన్॥ 78

యాదవ : వచ్చి నిలచిన బాణు నీతీరమున కృష్ణుడు సంబోధించును.

పాండవ : ధర్మరాజు సోదరులతో కృష్ణునితో హ్రదము సమీపించి యీ తీరున రారాజును సంబోధించును.

రాఘవ : రాము డీతీరున రావణుని సంబోధించును.

వ. అనిన విని మహోగ్రాగ్రహంబున సర్వతోముఖాశయ వరశర స్తంభ నివారణ ధర్మవిద్యానిరూఢ గాఢ ధైర్యుఁ డభిరాముం డరిదర రుండుక దుర్యోధనుం డుద్దండగతి వెల్వడి ప్రళయాభ్రవిభ్రమాదభ్రా విర్భూత గర్జానిభతర్జనుం డగుచు నెదిరి నిలిచిన, నుగ్రదశాననుండు బలిసూనుండు భీమసేనుండగు నతఁడును నభంగసమర సముచిత సం రంభవిజృంభమాణ దోర్దండ చాప లతాఖిల దండమండితుండై వెట్టిన వైరి కట్టెదుట నట్టాయితంబై బెట్టుగట్టిగఁ బొడఁగట్టి నిలిచె నట్టి యెడ —

యాదవ : బలిసూనుండు = బాణాసురుడు ధైర్యము చిక్కబట్టుకొని కృష్ణున కెదురై నిలచెను,

పాండవ : ధర్మరాజు నుపాలంభమునకు కినిసి రారాజు హ్రదము వెల్వడి గదాదండ మండిత హస్తుడై నిలువ భీమసేనుండును ఆతీరున గదా దండ కలితుండై నిలచెను.

రాఘవ : రావణుడును అనిమొన రాముని కెదురై నిలచెను

మ॥ పరగన్నేఁడు గదా మహోగ్ర రణమొప్పన్గల్గెనాకంచు నే
డ్తెఱ దుర్యోధను డుగ్రబాణుఁడు సము ద్వేలాగ్రకాండ ప్రకాం
డరుచుల్దిక్కుల నిండి పర్వఁ గదియన్ డాసెన్సు రేంద్రాదులం
బరవీధిన్బరమాద్భుతోన్నతిగన న్బ్రారంభ దుర్వారుఁడై. 79

యాదవ : దేవతలోకసమున నిల్చి యాశ్చర్యమగ్న లగునట్లు బాణ కృష్ణులు పోరున కాయితమయిరి.

పాండవ : భీమసేన దుర్యోధనుల గదాయుద్ధము.

రాఘవ : రామరావణుల యుద్ధము.

సీ. నరసింహ యమళంబు శరనిధి ద్వంద్వంబు
కనకాద్రియుగము దిక్కరి యమంబు
తలపడు వీఁక ను ద్దండకాండ ప్రకాం
డ గతులు వారించి డగ్గరంగఁ
జఱచుచు సవ్యాప సవ్యవిక్రాంతుల
వలయిత గతులను వలను మీఱి
తెగి దివ్యకాండము ల్నిగుడించి కొట్టుచుఁ
దనువులు రక్త సి క్తములు గాఁగ

తే. గీ. సమరవర ఘన పత్రర ఘాతి గతులఁ
డాసి చెఱుచుచుఁ జేరి యుద్ధతిని నొంచి
మించి బడవేసి మూర్ఛలుం ముంచఁ దేఱఁ
బోరి రొక్కటి నిద్దఱ పూర్వలీల. 80

యాదవ : కృష్ణుడును బాణుడును సింహద్వయము, సముద్రద్వయము, మంధరగిరిద్వయము, దిగ్గజద్వయము తీరున బాహాబాహిపోరిరి. ఒకరినొకరు మించి యొకరయి చిరము పోరిరి.

పాండవ : భీమసేన దుర్యోధనులు గదా యుద్ధము చేయుచు పైవిధముగ నొప్పిరి.

రాఘవ : రామరావణులును ఆ విధమున నెసగిరి.

వ. అయ్యవసరమున నతిదుర్భరంబగు ఘోరసంగరంబు సకల జగద్భయంకరంబుగఁ బరఁగిన —

సమము — యాదవ : లోకభీకరముగ కృష్ణబాణులయు
పాండవ : ,, భీమదుర్యోధనులయు
రాఘవ : ,, రామరావణులయు పోరుపొసగెను.

క. వరమౌనీశ్వర వాగ్గతి
హరివిభు బుద్ధి నరసౌజ్ఞ నతఁడు దెలిసి దు
ర్భరమైనను రణమున న
త్తఱిఁగున రిపుఁ గూల్తుననుచు ధృతినెంచె వడిన్. 81

యాదవ : బాణుడు (వరమౌ + ఈశ్వర + వాగ్గతి = ఈశ్వరు వరము తనకు కలదని నమ్మి) యాదవులతో పోరు భారమనిపించినను గెల్తునను ధైర్యమున త్వరితగతి —

పాండవ : తొల్లి పలుమారులు భీష్మాదులును వ్యాసాది ఋషులును తన యధర్మప్రవృత్తిని నిందించుచు జయము ధర్మపక్షము అనగా ధర్మరాజుదేయని తెల్పినను భీముతో గదా యుద్ధమునకు తలపడుచు నాతనిని గూల్చగలనను ధైర్యముతో త్వరితగతి —

రాఘవ : రాముడు నరుడు కాడు సాక్షాత్తు వైకుంఠుడు హరియని తెలిసియు, నాతనితో రణము భరమని గ్రహించియు జయింతునను నుత్సాహమున రావణుడు రాము నెదుర్కొనును.

వ. అప్పుడు - ఆ సమయమున —

ఆ. వె. తిర్యగూర్ధ్వగతుల ధీరతఁ బ్రదరాప్తిఁ
బోరువైరి మనము పొక్కి పడఁగ
నెడఁగఁ దప్పులేక నెడఁగని దన్మహో
ర్వంగభంగ ముచ్చి పడఁగ వైచె॥ 82

యాదవ : ఉరు + అంగ + భంగము = మహాకాయము భగ్నముగా పడు నట్లొనరించెననుట — ఉత్సాహమున తిరిగి రణమున కాయత్తమై వచ్చిన బాణుని కృష్ణుడు బాణప్రయోగమున నలయించి పోనీయక మరల మూర్ఛమెయి పడునట్లొనరించెను.

పాండవ : గదాయుద్ధమున ననేకరీతుల తనతో పోరుచున్న దుర్యోధనుని భీమసేనుడు మిక్కిలి అలయించి ఒకతీరున దుర్యోధనుడు నేలవిడిచి గంతువైచి భీముని గదాఘాతమున కొట్టరా సమయము చూచి భీముడాతని తొడలు విరుగ గొట్టి నేలబడవైచెను.

రాఘవ : రాముడును రావణుని మహాకాయమును బలు బాణముల నొప్పించి నేలబడగ మూర్ఛాగతు నొనరించెను.

ఆ. వె. వజ్రకాండ నిహతి వైరినిఁ బడవైచి
శిరముఁ దన్నినట్టె చెలఁగియార్వ
నుబికివచ్చు జల సముద్ధతిఁ గనుఁగొని
హరివిభుడణంచి నడ్డమరిగి. 83

యాదవ : పటుబాణ ప్రహారముల బాణుని మూర్ఛముంచి కృష్ణుడు ముందు కార్యమున కెదురు చూచుచుండ యాదవులు బాణు పరివారమున శేషము తూలించి పారదోల కోపమున నత్యాచార మేదియు జరుగకుండ హరి తనవారికి కట్టడచేసెను.

పాండవ : తొడలు విరిగిపడిన దుర్యోధను తలదన్ని భీముడార్చెను. కోపమున నింకేమొచేయబోవ ధర్మరాజు, కృష్ణుడు భీముని వారించిరి.

రాఘవ : రావణుని మూర్ఛముంచి ముందు నిరీక్షించుచు రాముడుండ, కపుల నత్యాచారములకు పోనీయక నడుపుననుంచి సుగ్రీవుడును సమయము నిరీక్షించుచుండె.

వ. అంత నతడు మూర్ఛఁదెలిసి వైరిజనంబు తన్ను జయించి యశంబుఁ
 జేకొని పోవుటఁ దలంచి రోషించి —

యాదవ : పడిపోయిన బాణుడు కొంతవడికి మూర్ఛనుండి లేచి రోషించి — ·

పాండవ : పాండవులును కృష్ణుడును రణరంగమున తొడలు విఱిగి పడిన తన్ను విడచియేగ కోపించి రారాజు ..

రాఘవ : రావణుడు మూర్ఛమునిగి కొంతవడికి తెలివంది ఆగ్రహించి—

దే. గీ. అస్త్రగురు భూతి కృతవర్మ నయ్యహితుని
 ధర్మరాజింటికి బంపఁ దవిలి యతఁడు
 తమినివడిఁ జేరి ఘోర కృత్యంబనంగ
 సాయకోద్ధతి నొంచెను సరభసమున. 84

యాదవ : కృష్ణుడు బాణుని యౌద్ధత్యముమాన్ప దివ్యబాణప్రయోగ మునుచేసి నొప్పించి యనంతరము —

పాండవ : రణభూమినొంటి చరమావస్థలోనున్న దుర్యోధనుని వెదకుకొనుచు వచ్చి; అస్త్రగురుభూతి = ద్రోణుని కుమారుడు అశ్వత్థామ; కృతవర్మ: కృపాచార్యులు ముప్పురు నాతనికి వలగొని నమస్కరించి నిలువ తనకు సమయమాయె స్వర్గమున తనవారిని కలియుదుననుచు చేయగల కార్యమేమైనను న్న చూచుకొనుడన అశ్వత్థామ పాండవులువినా కౌరవ శిబిరమంతయు దగ్ధము చేయ ప్రతినవట్టి కృప కృతవర్మలతో పాండవ శిబిరము దిక్కుగ నేగెను. శివుని తలచి యాతడు ఖడ్గమీయ త్వరితగతి నానిశాసమయమున పాండవ శిబిరము ప్రవేశించుచు ద్వారమున కృపకృతవర్మలనుంచి. లోనికేగెను.

రాఘవ : రాముడు రావణ సంహారమునకు సమయమాసన్నమయినదని తలంచెను.మూర్ఛనుండిలేచి రావణుడు ధీరత రాముని బాణములనొంచెను.

సీ. గురుసూనుఁ డురుశక్తి నరవరుడుగ్రత
 సాయక దీప్తులు సకల దిశల
 మెఱయఁగా నిగుడించి పరతను ఖండము
 లౌసులై ధరఁబడ రక్తఝరులు

జేయుచు, దద్దివ్య శితకర సంఘము
లిలనుగ్గుఁ గావించి చేరిజేర్చి
పరశరాహి శిఖండి బలియు ధృష్టద్యుమ్ను
జ్వాలతాగతిఁ జుట్ట జడియనోంచి

తే. గీ. కృష్ణతనుభవ వరబల కీర్తిఁ గూల్చి
రాత్రిచర గోత్రవరశక్తి ప్రక్కలించి
అంబకోగ్ర చక్రిప్రియో గాగ్నిఁ దదమృ
తత్వ మహిమంబు నణగించి తడయకటుల. 85

యాదవ : బాణునికి వేయుచేతులు కలవు. ఒకనాడు శివుని నుతించి తన కరములు తీటతీరునట్లు సమరమున తన్నోర్చువాడు లేమికి వగవ శీఘ్రమున నట్లగునని శంకరు డోదార్చె. ఆ సమయ మిది. కృష్ణుడు బాణుని కరములు ఒక దాని తర్వాత నొకటిగా చక్రధారల ఖండించ నారంభించెను. ఆ బాణుని కరముల అమృతత్వ మహిమ నాశమొనరించి నాలుగు చేతులు మాత్రము మిగులు నట్లుగా, మిగిలినవన్నియు ఖండించివైచెను.

పాండవ : అశ్వత్థామ అర్ధమరేయి పాండవ శిబిరము ప్రవేశించి అశ్వము లను గజములను శివుడిచ్చిన వరఖడ్గముచే ఖండించుచు శిఖండిని, ధృష్టద్యుమ్నుని ద్రౌపది తనయులు ఉపపాండవుల నయిదుగురను చంపివైచెను. అంత శాంతించి శిబిరము విడచి కృపకృతవర్మలను కలసికొని దుర్యోధనునకు తనచేసిన కృత్యము విన్పించ నాతడసువులు వీడెను.

రాఘవ : రాముడుగ్రసాయక నిపాతముల రావణు ననేక విధముల హింసించి శిరములు ఖండిచ నారంభించెను. గుట్టలుగా శిరములు ఖండించివైచు చున్నను నవి మరల యుద్భవించుచునే యున్నవి. వరమహిమ కలదగుట యట్లగుచుండెను. క్రమముగా రహస్యము విభీషణుని వలన తెలిసికొని అమృ తత్వమహిమ = రావణుని దేహగతమయిన అమృతకలశమును దూరమునబడవేసి శిరములు తరుగ నారంభించెను.

చ॥ పరగఖగోత్తమాంగముల పారముఁగావడిఁ గొట్టికొట్టియే
పలువిధియుక్తిఁ దత్ప్రిదర వైఖరినేలను డొల్లఁగూల్చ ఖూ

సురులు నరుల్ దిగీశదివి జుల్విధి భాస్కర రుద్రవాసవుల్
దిరముగ నెంచ నీశ్వర ను తిస్రణమంతట నిల్పె మేటిమిః. ౮౬

యాదవ: ఆకాశము = ఖ; గ = గతి = ఆకాశము వంక పోవునవి విశాఖులు - శాఖలవంటివి బాణుని భుజములు సహస్రకరములు. ఖగ = బాణము; ఖ = కొట్టునదేదియయినను పూర్వపద్యమున యట్లు బాణు సహస్రకరములలో నాలుగు మిగిల్చి హింసించ ఈశ్వరుడు కృష్ణుని నుతించి మరణించువాడు కాడు గనుక. కరుణించి యంతకు విడువ ప్రార్థించ కృష్ణు డట్లంగీకరించి శరము విడిచి వైచెను.

పాండవ: ఖ + గ = ఘనులు, మంచిగతి ప్రకాశము కలవారు - పాండవ శిబిరమున వీరులు. ఇందు పారిపోవుచున్న అశ్వత్థామను పాండవులలో నర్జునుడు కృష్ణు సారథ్యమున రథస్థుడై వెంబడవిలి యేగుచుండ భయమున నాతడు బ్రహ్మాస్త్రము ప్రయోగించ ప్రత్యస్త్ర మర్జునుడు ప్రయోగించె. అస్త్రద్వయ జ్వాలలు లోకాలు కాల్చ బ్రహ్మ వచ్చి ఇరువురను అస్త్రము లుపసంహరించకోర అశ్వత్థామ తన కుపసంహరించు నేర్పులేదనెను. రెంటిని అర్జునుడే యుపసంహరించి అశ్వత్థామను కట్టితెచ్చి ధర్మజు ముందుంచ కనికరించి విడువ నాజ్ఞాపించ అతని శిరోరత్నమును కైకొని అసువులతో విడిచిరి. అంతటితో కురుపాండవ యుద్ధము ముగిసెను.

రాఘవ: రాముడును వీరుని రావణుని హృదయము నందలి అమృత కలశము హరించి ఆతని తలలు ఉత్తమాంగములు ఖండించివైచెను. నరులు దేవతలు కపులు రాముని నుతించిరి. రామరావణ యుద్ధమంతటితో సమాప్తమయినది.

ఆ. వె. బలిమి మైత్రిచతుర వాసరమాయుక్తి
నొకఁటనుగ్రదశ స మున్నతగతి
బహుళపక్షమెల్ల వడిఁబోవఁ బోరిరి
జగములెల్ల జూచి సంభ్రమించ. 87

యాదవ: బాణు నొక్కని మిగిల్చి కొదువ రాక్షసులలో చాలమంది నంత మొందించి విడచెను.

పాండవ : పదునెనిమిది దినములు పోరి కురుపాండవులు పోరు నిలువ పదునెనిమిది అక్షౌహిణుల బలముభయపక్షముల నశించినది. కౌరవులు నశించిరి. పాండవులు మిగిలిరి.

రాఘవ : రావణు సంహారము కాఁగా రావణు పక్షము రాక్షసులు మూల బలము నశించినది.

వ. అంతఁ దదనుజ్ఞ వడసి భీమసేనుండు విబయుండు విభీషణుం డుగ్ర
బాణుండు నిజనివాసంబునకుం జని యచ్చటఁ జేయ వలయు కార్యం
బులు సమగ్రంబులుగా నిర్వర్తించి సముచితగతిఁ జనుదెంచి —

యాదవ : కృష్ణు ననుమతిగొని బాణుండు తన పురికేగి చేయవలసిన కృత్యములు పూర్తిచేసి తిరిగి వచ్చి —

పాండవ : కృష్ణు ననుమతి వడసి భీమసేనుండును అర్జునుండును అనంతరము తీర్చు నేర్పాటులు చేసి తిరిగి వచ్చి —

రాఘవ : విభీషణుడు రాము ననుమతి వడసి లంకకేగి అన్నకు అపర క్రియలు నిర్వర్తించి తిరిగి వచ్చి —

ఆ. వె. ప్రమదజనక జాతి రమణీయ గురు సూతి
హారిమణిని గృష్ణ సారనేత్ర
నబల రాజతనయ ననిరుద్ధ గతిఁదెచ్చి
ధర్మవిభుని చెంతఁ దగను నిలిపె॥ 88

యాదవ ; బాణుడు తన కూతు నుషను అనిరుద్ధునితో తెచ్చి కృష్ణున కొప్పించెను ఆ నూతన దంపతుల కాతడనేకముగ అరణ మర్పించి సబహుమానముఁగ తెచ్చి కృష్ణు చెంత నిలిపెను.

పాండవ : భీమార్జునులు అనంతరము అశ్వత్థామ శిరమునుండి హరించి తెచ్చిన చూడామణిని ద్రౌపదికిచ్చి సంతసపెట్టిరి. అశ్వత్థామ దన పుత్రుల నయిదుగురను చంపి పర్విడిపోవ ఆతని నవమానించి చూడామణిని తెచ్చి చూపిరి. కనుక దుఃఖము శాంతించ నించుక ముదమందె ననుట—

రాఘవ : విభీషణుడు అనంతర కార్యములు తీర్చి జనక = జసీతను తెచ్చి సబహుమానముగా రాముని చెంత నిలిపెను.

తే. గీ. అప్పుడు యుయుత్సువరబాణు నవ్విభీష
ణుఁగని యాస్థానమందునఁ దగవసించి
అచటి జనముల రక్షింప నంపెఁ బ్రీతి.
నతఁడు నట్లనె జని నిల్పెఁ జతురవృత్తి. 89

యాదవ: కృష్ణుడు బాణుని పాతాళమున కేగి రాజ్యము శాసించుచు తన ప్రజలతో సుఖముగనుండ పంపించి తనవారితో అనిరుద్ధుని ఉషను వెంట కొనుచు ద్వారక కేగెను.

పాండవ: కృష్ణ ననుమతి పాండవులు రాజ్యపాలన [illegible].

రాఘవ: రాముడు విభీషణుని లంకలోనుండి రాజ్యమేలుచు సుఖముగ నుండ నియమించెను. అనంతరము.

ఆ. వె. జనకజాతి ముఖ్య సంస్కృతానలసర
సప్రదేశ కృతుల సకలచిత్త
కిల్బిషములఁ బాసి కృతకృత్యత విశుద్ధ
మతివధూటి నమతి నుతిని గనుచు. 90

యాదవ: బాణుడు; జనక + జాతి + ముఖ్య + సంస్కృత + అనల (శుద్ధ) సరస + ప్రదేశ + కృతుల = తన కులమువారితో శుభకృత్యము లొనరించుచు పాపములపొంతపోక తనవారి పూజలు స్తోత్రములు వినుచు —

పాండవ: పాండవులును ధర్మజు పాలనమున శుభకృత్యము లొనరించుచు ప్రజాదరము కనుచు —

రాఘవ: రాముడు ఆ తీరున తనకడకు వచ్చిన జానకిని - సీతనుచూచి చిరము వైరి ఇంటనుండుటచే (కలంకరహితనుగా చేయు తలంపున) తానొల్లను పొమ్మన సీత అగ్నిచొచ్చి తన విశుద్ధతను ప్రకటించుకొన సంతసించి రాముడు కృతకృత్యుడై సర్వుల నతులునుతులు నందుకొనుచు —

తే. గీ. దేవఋషి పితృ ముఖ్యుల దీవనలను
బ్రహ్మరుద్రేంద్ర ముఖ్యుల భద్రకృతుల
నలరి పుష్పకోజ్వల వర యానగతిని
వచ్చె నిజ వధూగతి నెల్ల వారురాగ. 91

యాదవ : శ్రీకృష్ణపరమాత్మ ఉషానిరుద్ధులను వెంటబెట్టుకొని బలరామ సాత్యక్యాది యాదవబలము తన్ను పరివేష్టించి కొలువ పుష్పకము = కృష్ణుని రథవాహములలో నొకటి) రథారూఢుండై దివిసురలు ఋషులు పితృగణములు నుతులు సేయ పయనమై ....

పాండవ : ధర్మజుడు కొలువుతీరియుండి నిత్య శుభకృత్యముల ప్రజల నానందపఱుప సురలు నరులు ఆతని దీవించుచు సుఖములు గనిరి —

రాఘవ : శ్రీరామచంద్రుడు అగ్నిపరీక్ష యనంతరము ముల్లోకముల వారి నతులునుతులు వినుచు పుష్పక విమాన మధిరోహించి (ఇయ్యది కుబేరునిది - రావణుడు హరించి తెచ్చి తనదిగా చేసికొన్నది విభీషణుడు తెచ్చి యిచ్చెను. ఆ విమానము ఎంతమందినైనను వహించగల యది) రాక్షసులు వానరులు ఆ విమానముననే యుండి రా క్రమముగ —

వ. ఇష్టభిరాముండు హరివిభుండు ధర్మభూతి రాజితయుక్తి సమస్త బంధు మిత్రాప్తవర్గంబు వెంటరాఁ జనిచని నిజపురంబుఁ గాంచి చెంగట.

యాదవ : కృష్ణుడు ద్వారకను ఎదుట కని -

పాండవ ధర్మజుడు హస్తిపురి నుండెను.

రాఘవ శ్రీరాముడు విమానమునుండి ఎదుట అయోధ్యానగరమును కని-

శా. భారద్వాజ ముఖావలోకనముచే భద్రంబులన్గాంచి యా
దారిన్మన్న హరిప్రభుండరుగ నం తన్గాంచ స న్మైత్రిచే
సారఖ్యాతి గుహున్సదా భరతు ని న్శత్రుఘ్నుతన్గురు
న్దీరున్దానసదృగ్బలున్స్వ జనయి త్రివ్రాతమున్పెద్దలన్. 92

యాదవ : కృష్ణుడు ద్వారక ప్రవేశించి ఉషానిరుద్ధులం గని సర్వులానం మునంద వృద్ధుల ఆశీస్సు లందుకొనుచు తలిదండ్రులకు ముదము కూర్చుచు —

పాండవ : ధర్మజుడట్లే సుఖముగ నుండెను.

రాఘవ : భారద్వాజు విందుకైకొని ముందుగా తన రాక గుహునకు ఆయోధ్యభరతాదులకు తల్లులకు గురునకు హనుమంతునిచే తెలియం బంపి —

సుగంధి వృత్తము :

కాంచియాసముద్దిగె న్నీ కాసమాత్మఁ దోఁచఁగా
నెంచదండముల్ఘటించె నెంతయున్ప్రియంబుఁ గా
మంచి మాటలాడి వారి మానసంబుఁ జల్లఁ గా
వించెఁ బౌరవృద్ధులెల్ల వేడ్కఁ దన్ను గాంచఁగా. 93

యాదవ: కృష్ణుడు వృద్ధులకు తలిదండ్రులకు నమస్కరించి పూర్ణ దంపతుల నక్షై కాపించించి సర్వుల క్షేమమరసి పౌరులు తన్నుకని ఆనందించ —

పాండవ: ధర్మజుడు వృద్ధుల యాశీషంబులు గొనుచు పౌరుల యభినంద నము లందుకొనుచు రాజ్యపాలన దక్షుండయ్యెను

రాఘవ: రాముడు అయోధ్య సమీపించి విమానమునుండి దిగి తన్ను కనవచ్చిన వృద్ధులకు గురునకు తల్లులకు నమస్కరించి వారి క్షేమ మరసి మధుర భాషణముల చిన్నల పెద్దల సోదరుల ఆనందపఱచగా —

సుగంధి వృత్తము :

అంతమాత్య ముఖ్యులం ద ఱాదరించి యెంచఁగాఁ
జెంతనుండి రాజ్యగసీమ సింహపీఠమందుఁ దాఁ
గాంతతో వసించి నిల్చి గౌరవంబెలర్పఁగా
సంతతోత్సవంబు మించ సర్వలోక సన్నుతిన్. 94

యాదవ: కృష్ణుడు తలిదండ్రుల యాదరమందుచు నిత్యోత్సవములు తిలకించుచు ద్వారక నుండెను.

పాండవ: ధర్మరాజుకూడ పైవిధముననే సుఖములు పడయుచు సోదరు లతోనుండి ప్రజాదరము వడసి యుండెను.

రాఘవ: రాముడు సీతతో సింహాసనమున నుండి నిత్యోత్సవములందుచు ముల్లోకములు తన్ను కొనియాడ —

మ॥ సురభిక్షీరములన్ హరిద్విపతర స్ఫూర్జద్ఘటానీత గాం
గరసాసారములున్న దీనద సమ గ్రక్షీరతోయాది సా
గర పూతాంబువు లన్నమస్త ఋషి సం ఘప్రోక్త వేదోక్త బం
ధురమంత్రౌఘముల న్నరేంద్రుఁ డభిషి క్తుండయ్యె నత్యున్నతిన్.

యాదవ : కృష్ణుడు ద్వారక ఉగ్రసేనుని రాజుగా నొనరించియే రాజ్యము సుఖతరము చేయుచు అరులకు దుర్నిరీక్షుడై యలరారెను.

పాండవ ధర్మజుడు ఆ తీరుననే ప్రకాశించెను.

రాఘవ : రాము పట్టాభిషేకము నిర్వర్తింపబడినది. సుగమము -

తే. గీ. భూమిదేవేంద్ర ముఖ్యుల పూజలమర
వారలిచ్చిన బహుమాన వర విభూష
లందుకొని మహాబలనంద నాదులకును
సత్కృతు లొనర్చి విలసిల్లె సంతసమున. 95

యాదవ : కృష్ణుడు ఇంద్రాద్యమరుల సమర్చలు బహుమానము లందుకొని (బాణుని నియమించి సురలకు ఆనందము కల్పించుట ఇత్యాది) బలరామాదుల కానందము కల్పించుచు సత్కార్యాచరణు డయ్యెను.

పాండవ : ధర్మరాజు కూడ (మహాబలనందన = భీముడు) భీమాది సోద రులసత్కృతులు కనుచు ప్రజలయభినందన పూజా బహుమానాదు లందుకొనుచు (సామంతులు సమర్పించినవి) సుఖముగనుండెను.

రాఘవ . రాముడు దివ్యులంపిన బహుమానములందు కొనుచు సుగ్రీవ హనుమదాది కపిముఖ్యులకును లంకాపతి విభీషణునకును బహుమతు లొసంగి సత్కరించి సంతస పడెను.

శా. శ్రీరంజిల్ల సమస్తలోక జనతా క్షేమంకరాయత్త వి
త్తారూఢిన్వలయాచలాంతరిత గోత్రాఖండ సామ్రాజ్యము
న్ధీరోదారత రక్షజేసె బలయుక్తిన్సోదరోపేతుఁడై
స్వైరక్రీడ నిజాంగనాకలితుఁడై సమ్మోదభావంబునన్॥ 97

యాదవ : కృష్ణుడు బలరామసహితుడై సామ్రాజ్య రక్షణమొనరించుచు కాంతలతో ముదమందుచు ....

పాండవ : ధర్మరాజు ప్రబలుడయి సోదరులండనుండ సామ్రాజ్యము రక్షించుకొనుచు కాంతతో సుఖము అందుచుండెను.

రాఘవ : రాముడును భరతాది సోదరులతో సామ్రాజ్యమును రక్షణ సేయుచు కాంత సీతతో ముదముననుండెను.

సీ. సర్వ సర్వంసహా చక్రంబు భరమేది
సర్వసస్యంబులు చాలఁ బండె
సర్వవర్ణాశ్రమా చారముల్ రహిమీఱ
ధర్మంబు నాల్గు పాదముల వెలసె
సకల బాధలు దీఱె సకల లోకంబులు
సకల సమృద్ధుల సంతసిల్లె
సకల యజ్ఞంబులు సకల ధర్మంబులు
సకల కృత్యంబులు సరవి నెగడె

తే. గీ. శౌర్య జయ శోభిరాముండు సద్గుణుండు
హరివిభుండరి దరకరుఁ డఖిలవేది
ధర్మరాజత యుక్తి శాంతనవబుద్ధి
జెలఁగి సామ్రాజ్యపాలన జేయునపుడు. 98

ఇది భరత వాక్యము - శాంతి పాఠము.

యాదవ : హరి విభుండు = కృష్ణుడు శాంత + నవ + బుద్ధి = నవనవమయి శాంతమయి యొసగు బుద్ధిబలమున — సుభిక్షము వెలసె.

సుగమము.

పాండవ : శాంతనవ + బుద్ధి = భీష్ముడు శయ్యాయుండ సమస్త ధర్మములు ధర్మరాజునకు బోధించెను. ఆ యుక్తి ననుసరించి ధర్మజు పాలన మెసగెను. సుభిక్షమాలరె —

రాఘవ : ధర్మమూర్తి శాంతుడు అరులఁ జేయుడు శ్రీరామచంద్రమూర్తి పాలనమున సర్వము సుభిక్షముగ నుండెను.

మ. చెలువొందెన్ భవదీయ సత్కరుణచే శ్రీరామకృష్ణార్జునో
జ్జ్వలచారిత్ర నిబంధమూర్జిత కథా వాక్ శ్లేష జార్థత్రయీ
విలసత్ శబ్దవిశేషచిత్ర కలనా విఖ్యాత సందర్భ ని
శ్చల భావంబు ప్రబంధముత్తమము కృష్ణారామ చేకొమ్మోగిన్. 99

కృతికర్త నెల్లూరి రాఘవుడు తన త్ర్యర్థి కావ్యము నిర్విఘ్నముగ కొన సాగించినందులకు కృతిభర్త శ్రీగోపాలకృష్ణబ్రహ్మము నభినందించుచు నుతించుచు కావ్యము చేకొమ్మని గోపాలకృష్ణుని ప్రార్థించును.

చ. వివిధబహుప్రయోగములు విశ్రుతమై విలసిల్లు లెస్సగాఁ
గవులు పరీక్షసేయుఁ డిది కాదనఁబోకుఁ డదెట్టులన్న నే
నవిరళ సాహితీ పరిక రాంబుధి పారఁగుడన్బుధాళి యు
న్నవిలి విచారసాధు గతిఁ దథ్యము జేసినదందు మీఁదటన్. 100

కృతికర్త నెల్లూరి రాఘవు వాక్యము. తన సాహితీ పరికర మపారము. కవులు లెస్సగ పరిశీలించి, ప్రశంసించిరి. ఒరులు కాదనరానిది. కనుక మీరును పరిశీలించినా పరిశ్రమ, విశుద్ధమని తెల్పి గ్రహించునది యనును.

చ. అలరుచు భక్తియుక్తి బర మాద్భుత మీకృతి నెవ్వరేనియుఁ
నలువుగ వ్రాసినన్ జదివినన్ వినినన్ వినిపించినన్ మహా
కలుషముఁబాయుఁ బుత్రులును గల్గుదు రయ్యణిమాది సిద్ధులు
న్గలుగును ధర్మమర్థమును గామము మోక్షముఁ గల్గువారికిన్. 101

నెల్లూరి రాఘవుడు కావ్యము చతుర్విధ పురుషార్థ ప్రదమగుట నా నాలుగు పురుషార్థములు పెక్కు శుభములు. కావ్యము చదివిన విన్న వ్రాసిన కల్గుననును

## * టీకాంత గద్య *

ఇది శ్రీషోడశాంత రాజరాజేశ్వరీ కలోపహిత శ్రీ సత్యానందనాథ గురుప్రసాద
లబ్ధ సరస కవితాదురంధర సుజనవిధేయ వాధూలసగోత్ర పవిత్ర శ్రీమదాప
స్తంబ సూత్ర మహోన్నప్రదాత నారాయణ ప్రపౌత్ర వేంకటచయన పౌత్ర
దత్తాత్రేయపుత్ర అన్నపూర్ణా గర్భశుక్తి ముక్తాఫలాయమాన వేంకట
లక్ష్మీసనాథ విద్వత్కవిరాజ కవికులశేఖర తంత్ర సాహిత్య కలా
ప్రపూర్ణ ప్రాచ్యసాహిత్య విద్యాప్రవీణ విద్వాన్ సరిపెల్ల
విశ్వనాథశాస్త్రి యం.యె. ప్రణీతంబైన ఆనందజోత్స్నా
వ్యాఖ్యాన సహిత యాదవ రాఘవ పాండవీయమున
చతుర్థాశ్వాసము సమాప్తము.

ఆశ్వాసాంత పద్యములు - కృతిపతికి సంబోధనములు.

1. ముక్తపదగ్రస్త మత్తేభవృత్తము :

మ. ధరణీపల్లవ పల్లవాధరధరా ద్వ్యవ్యూహావాహావ్యూహా వా
మరవేదావహదావహా ప్రభప్రభాం భసూస్యగ్రగాసూర్యగ్రగా
దరకృన్మాధవమాధవావ్యయవయ స్తార్క్ష్యప్రియాయ ప్రియా
శరభిత్సాయక సాయకాయితయుతా జగ్రధరా గ్రధరా.

గోవర్ధనధారీ; వేదోద్ధారకా; శంఖచక్రధారీ; గరుడవాహనా, ఒక బాణమున సముద్రుని గోలకు తెచ్చినవాడా, త్రిపురాసుర సంహారమున బాణమయిన హరీ —

పాదాంతోదస్త పాదాద్యంత యమక సింహావలోకన
ముక్తపదగ్రస్త కందము.

2. క. రామా జనవర కామా
కామాదివిరోధివర్గ గర్వవిరామా
రామాభిధాన సీమా
సీమాంతాగమ విహార స్థిత్యభిరామా.

సుగమము.

పంచచామరము.

3. ఘనాఘనాశన ప్రకామ కామ కామ సుందరా
ఘనాఘనాతిరుజ్ఞి కాయ కాయకాయ సోదరా
ఘనాఘనానుజాభకాంత కాంతకాంత శ్రీధరా
ఘనాఘనాధి పాపకార కారకారఖండనా॥

పాపౌఘనాశనా, కామకోటిసుందరా, మేఘశ్యామా, కాంతులకెల్ల కాంతినిచ్చువాడా, ఇంద్రునకు సోదరుడా, భవజలధితరణివంటివాడా, మేఘనాథుడుచేసిన కృతులన్నియు, ఖండించినవాడా —

4. మాలినీవృత్తము.

జలజశరవిలాసా చంద్రికాచంద్రహాసా
జలధిసృత విలాసా చారుచాంపేయనాసా
బలభిదరి నిరాసా భక్తరక్షాప్రయాసా
అలఘుగుణ విలాసా హారి సౌవర్ణవాసా॥

పుష్పబాణ విలాసా, వెన్నెల నవ్వులవాడా, మాత్స్యావతారా, చంపక నాసా, భలభిత్ = ఇంద్రుడు. ఆతనికి అరులు రాక్షసులు రాక్షస నిరాసా = సంహారా, పీతాంబరా - బంగరుపుట్టము ధరించినవాడా.

